ఓమ్



పరబ్రహ్మణే నమః

శ్రీమద్వేదవ్యాసమహర్షి ప్రణీతాష్టాదశ మహాపురాణరత్న
భూత శ్రీ స్కాందపురాణాంతర్వర్తి

# మాఘపురాణమ్.

నిఖిలమనీషిజనోపకారాయ

మచిలీపట్టణ వాస్తవ్యేన
చిల్లా నాగలింగశాస్త్రి పుత్రేణ
లక్ష్మీనృసింహశాస్త్రిణా

సాంధ్రతాత్పర్యసమేతమ్.

బ్రహ్మశ్రీ ఇంగువ వేంకటకృష్ణశాస్త్రిభి స్సమ్యక్ శోధయిత్వా
బందరు పుర్యాభరణాయమానాయాం
స్వకీయ శ్రీ
ఆర్యానందముద్రాక్షరశాలాయాం
వికృతినామ సంవత్సర జ్యేష్ఠ కృష్ణ ౧౧ భానువాసరే తృతీయవారం
పంచశత పుస్తకానాం ముద్రయిత్వా ( 500 )
1950.



(గ్రంథమూల్యము 2-8-0

పురాణము ప్రారంభించునప్పుడు పఠించునది.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే ॥
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

నూతనకథా ప్రారంభించునప్పుడు పఠించునది.

శ్లో॥ ఉల్లాసపల్లవితపాలిత సప్తలోకీ
నిర్వాహకోరకిత నేమకటాక్షలీలామ్ ।
శ్రీరంగహర్మ్యతల మంగళదీపరేఖాం
శ్రీరంగరాజమహిషీం శ్రియమాశ్రయామః ॥
వందేలక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం ।
తేజోరూపాం కనకవసనాం స్వర్ణభూషోజ్జ్వలాంగీం ।
బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానా ।
మాద్యాం శక్తిం సకలజననీం విష్ణువామాంకసంస్థామ్ ॥



గ్రంథకర్త:

చిల్లా లక్ష్మీనృసింహశాస్త్రి.

ఓమ్.

పరబ్రహ్మణే నమః.

శ్రీ స్కాందపురాణే

# మాఘమాహాత్మ్యమ్.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం । ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం । పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే । నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥ అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥ నారాయణం నమస్కృత్య నరంచైవనరోత్తమం । దేవీం సరస్వతీంవ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

అథ శిష్యాః పింగజటాబద్ధకలాపః ప్రాంశుర్దండీ కృష్ణమృగత్వక్పరిధానః । సర్వాన్ లోకాన్ పావయమానః కవిముఖ్యః పారాశర్యః పరమనురూపం విప్రాశోతు ॥ శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహు రపరోహరిః । అఫాలలోచనశ్శంభు ర్భగవాన్ బాదరాయణః ॥

## అథ మాఘపురాణ ప్రారంభః.

పార్వతీ ప్రశ్నః ॥ శ్లో॥ విశ్వాత్మన్ సర్వలోకేశ సర్వభూతదయానిధే । తదిదానీంపునశ్శ్రోతు మిచ్ఛామి వృషభధ్వజ ॥ త్వద్వచోమృతసారాణి మత్కర్ణచషకైః ప్రభో । పాయం పాయం సమేత్య ప్రీణామి తే విశ్వపావన ॥ మహాపుణ్యప్రకాశస్య పుణ్యస్యానన్తవైభవం । త్వయోక్తం దేవతద్ధర్మం సదా మాఘేమ శుశ్రువత్ ॥ తదిదం జ్ఞాతుమిచ్ఛామి విస్తరాద్వృషభార్చిత । మాఘమాసస్యమాహాత్మ్యం యథావిస్తరతః ప్రభో । సవిస్తరేణచాఖ్యానం వక్తుమర్హసి పావనితమ్ ॥

తా॥ పార్వతి యిట్లనినది. విశ్వాత్మకా! సర్వలోకనాధా! సకలభూత దయాళో! ఓ వృషభధ్వజ! శంకరా! ఇప్పుడుతిరిగి కొన్ని విషయములు వినగోరు చున్నాను. మీ వాక్యామృతమును కోరుచుంటిని. నిరంతరము వినుచున్నప్పటికిని నాకు

కృత్తికలుగలదియుండెను. కాబట్టి మహాపుణ్యప్రదమయిన ప్రయాగ మాహాత్మ్యమును అంతయు మాఘమాసమందే చేసిన ధర్మము నిక్కలి ఫలప్రద మగునని చెప్పితిరి. ఓసురాసురవందితపాదారవిందా, ఆ మాఘమాహాత్మ్యమును నాకు సవిస్తరముగా చెప్పుమని కోరెను.

శ్రీ మహాదేవ ఉవాచ। శ్లో॥ వక్ష్యామి శృణ్వేదం భద్రే గుహ్యాద్గుహ్యతమం శుభం। ప్రాణప్రియాయాః పార్వత్యాః తే గోప్యంవా వదా మ్యహమ్ ।

తా॥ శంకరుఁడు చెప్పుచున్నాఁడు. మంగళప్రదురాలవయిన ఓ పార్వతీ! చెప్పుచున్నాను వినుము. ప్రాణప్రియురాలవయిన నీకు అది యెంతరహస్యమైనను చెప్పుచున్నాను, వినుము

శ్లో॥ మాఘే మకరగే భానౌ ప్రాతర్యస్స్నాన మాచరేత్ । ససర్వపాతకైర్ముక్తః ప్రాప్నోతి పరమాంగతిమ్ ।

తా॥ రవి మకరమం దుండఁగా మాఘమాసమం దెవ్వఁడు ప్రాతస్స్నానమాచరించునో వాఁడు సమస్తపాప నిర్ముక్తుఁడై పరమపదమున కేగును.

శ్లో॥ మకరస్థైరవౌమాఘే మాఘేవాయేశుభేక్షణే। ప్రయాగ స్నానమాత్రేణ ప్రయాంతి హరిమందిరమ్ ।

తా॥ ఓ పార్వతీ! సూర్యుఁడు మకరమందుండగాగాని, లేక మాఘమాసము నందుగాని యెవరు ప్రయాగ స్నానమును చేయుదురో వారందరు విష్ణుపురమునకు చేరుదురు.

శ్లో॥ మాఘమాసే మహాపుణ్యే యస్స్నానం గోష్పదోదకే। ఏవం యత్రాపి కురుతే తేనపాపైః ప్రముచ్యతే । ద్వితీయేన హరేర్లోకం తృతీయేన ఋణీహరిః ।

తా॥ పుణ్యప్రదమయిన మాఘమాసమందు యెవ్వఁడు యెచ్చటనయినాగాని గోష్పదోదకమందు (అనఁగా గోవుపాదము మునిగినంత లోతు నీళ్లలో) స్నానమును చేయునో వాఁడు ఒకస్నానముచేతనే సమస్త పాతకములచేత విడువఁబడు చున్నాఁడు. ద్వితీయ స్నానముచేత హరిలోకమును బొందును. తృతీయ స్నానము చేత హరిఋణవంతుఁ డగుచున్నాఁడు. (అనఁగా వీనికి యేమి ఫలమిత్తునాయని హరి చింతించుచుండునని భావము.)

శ్లో॥ గంగాయాంతు ప్రయాగేచ మాఘమాసి ప్రయత్నతః। స్నానం యఃకురుతేమర్త్యః సనైవ స్తనపోభవేత్ ।

తా॥ మాఘమాసమందు ప్రయాగలో గంగయందు శ్రద్ధతో స్నానముచేసిన వాఁడు తిరిగి స్తన్యపానమును జేయుడు. (అనఁగా పునః జన్మించడని భావము.)

శ్లో॥ సరిత్ప్రవాహే సరసి మాఘే మకరగే రవౌ । ప్రాత స్సూర్యోదయే స్నానం యఃకుర్యాత్సోపి ముక్తిభాక్ ।

తా॥ రవి మకరమందుండఁగా మాఘమాసమందు సూర్యోదయ కాలమందు నదిలోగాని, సరస్సులోగాని స్నాన మాచరించువాఁడు ముక్తినిబొందును.

శ్లో॥ రవావర్ధోదితేమాఘే భక్త్యాయఃకురుతేనఘె । గ్రామా ద్బహి స్తటాకాది కూప కుల్యేషువా నరః । సముక్తః పాతకైర్ఘోరై స్సనైతిచ పునర్భవమ్ ।

తా॥ పాపరహితురాలవయిన ఓపార్వతీ! మాఘమాసమందు సూర్యుఁ డర్ధో దితుఁడగుచుండఁగా గ్రామానకు బయిట చెఱువు, బావి, కాలువలయందు యెవ్వఁడు భక్తితో స్నానమాచరించునో వాఁడు పునర్జన్మదాయకము లయినట్టియు భయంకరము లయినట్టియు పాతకములచేత విడువఁబడును.

శ్లో॥ మాఘే యస్స్నవయేన్నిత్యం ప్రాత ర్గోష్పదవారిభిః । జలాభావా ద్దృఢాభావా త్సోపిపాపైః ప్రముచ్యతే ।

తా॥ మాఘమాసమందు యెవ్వఁడు నిత్యము ప్రాతఃకాలమందు జలాభావము చేతగాని, దార్ఢ్యాభావముచేతగాని, గోష్పదోదకములచేత స్నానము చేయునో వాఁడును పాపవిముక్తుఁడగును. (అనఁగా జలాభావమునందును, తనకు శక్తిలేనప్పుడును గోష్పదోదకమార్జనమాత్రస్నానముచే పవిత్రుఁడగును.

శ్లో॥ యఃకుర్యాన్మజ్జనం మాఘే ప్రాతస్సూర్యోదయేఽనఘె । సకృద్వాకురుతే దైవాత్ జ్ఞానతోఽజ్ఞానతోపివా । నశ్యంత్యత్యుగ్ర పాపాని తత్తస్య నగనందిని । కిం పునర్భక్తిభావేన యఃకుర్యాన్మాఘ మజ్జనమ్ । తస్యపుణ్యస్యవిస్తారం వక్ష్యామి శృణు పార్వతి । అశ్వమేధ ఫలంప్రాప్య పశ్చాద్విష్ణుపదంవ్రజేత్ ।

తా॥ పాపరహితవైన ఓపార్వతీ! మాఘమాసంబున ప్రాతఃకాలమందు సూర్యో దయసమయమున యెవ్వఁడు దైవవశముచేత తెలిసిగాని, తెలియకగాని ఒక్కమారయ్యి

వను స్నానముచేయునో వానియొక్క ఉగ్రపాపములు నశించును. ఓపార్వతీ! భక్తితో స్నానమాచరించువానిని గూర్చి యేమి చెప్పవలసియున్నది. వాని పుణ్యమును జెప్పెదను వినుము. అశ్వమేధయాగఫలమును బొంది అంతమందు విష్ణులోకమును బొందును.

శ్లో॥ భక్త్యా యఃకురుతేమాఘే మాసమేకంనిరంతరం। స్నాత్వా విష్ణ్వర్చనంకృత్వా సవైకుంఠపతిర్భవేత్ ॥

తా॥ మాఘమాసమంతయు నియమముగా భక్తితో స్నానముచేసి విష్ణుపూజ నొనరించెనేని వైకుంఠాధిపతియగును.

శ్లో॥ స్నానం విష్ణ్వర్చనం కృత్వా ప్రాతర్మాఘే బహిర్జలే। పురాణశ్రవణాద్దేవి జీవన్ముక్తస్సగద్యతే ॥

తా॥ ఓపార్వతీ! మాఘంబున ప్రాతఃకాలమందు బహిర్జలమందు స్నానముచేసి హరిని పూజించి మాఘపురాణమును వినినవాఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

శ్లో॥ స్నానం విష్ణ్వర్చనం కృత్వా పురాణశ్రవణంతథా। ప్రాతర్మాఘేనరఃకుర్యాత్తటాకాదిజలాంతరే। పురాణశ్రవణాద్దేవి సఋషివ్రివరో భవేత్ ।

తా॥ ఓపార్వతీ! మాఘమాసమున ప్రాతఃకాలమందు స్నానమాడి హరిపూజ చేసి తటాకాది సమీపమందే పురాణశ్రవణ మాచరించెనేని వాఁడు జన్మాంతరమందు ఋషియై జన్మించును.

శ్లో॥ వినాస్నానం వినావిష్ణోరర్చనం దానమేవచ। వినాశాస్త్రకథాలాపం యేనమాఘో నివర్త్యతే ॥ కథం నశ్యంతి పాపాని మనోవాక్కాయజానిచ। తిస్యదేవిపునర్దేహే సంభవంత్యఘరాశయః ॥

తా॥ ఎవ్వఁడు మాఘమాసమందు ప్రాతస్స్నాన, హరిపూజన. యథాశక్తి దాన, పురాణశ్రవణముల నాచరించడో వాని మనోవాక్కాయజన్యములయిన పాపములు యెట్లు నశించును. నశించవు. స్నానాదు లాచరించువాని పాపములు నశించును. ఓ పార్వతీ! అట్లు నశించి తిరిగి వానిదేహమం దంటవు.

శ్లో॥ నకుర్యాద్యది యోమాఘే ప్రాతస్స్నానం నరాధమః। కుంభీపాకే మహాఘోరే పచ్యతే నరకాగ్నినా ॥

తా॥ ఎవ్వఁడు మాఘమాసమందు ప్రాతస్స్నాన మాచరించడో ఆ నరాధముఁడు మహాభయంకరమైన కుంభీపాకమను నరకాగ్నియందు వండబడుచున్నాఁడు.

శ్లో॥ స్నానం నకురుతే మాఘే మానవో మదగర్వితః । కోటి జన్మసు చండాల యోనౌ సంజాయతేనఘే ॥

తా॥ ఓ పార్వతీ! మనుష్యుఁడు మదగర్వితుఁడై మాఘస్నాన మాచరింపఁడేని కోటిజన్మలయందు చండాలుఁడై పుట్టును.

శ్లో॥ రవావభ్యుదితే మాఘే నారీవా పురుషోపివా । శీతభీతా నమజ్జంతి అఘకోటి కృతో నరాః । నతేషాం దర్శనం కుర్యా ద్యది సూర్యావలోకనమ్ ॥

తా॥ మాఘమాసంబున సూర్యోదయ సమయమందు స్త్రీగాని, పురుషుఁడుగాని, పాపాత్ములయిన యేమనుష్యులుగాని శీతమునకు భయపడి స్నానమాచరించరో వారిని చూడఁగూడదు. ఒకవేళ చూచినేని సూర్యుని చూడవలెను. తద్దర్శనదోషము నివారణమగును.

శ్లో॥ ప్రాతర్మాఘే బహిః స్నానం క్రతుకోటి ఫలప్రదం । యఃకుర్యాత్సోపి పాపైశ్చ ముచ్యతే నాత్రసంశయః ॥

తా॥ మాఘమాసంబున ప్రాతఃకాలమందు బహిస్స్నానము కోటియజ్ఞసమాన ఫలప్రదము. ఇట్టిస్నానం బెవ్వఁ డాచరించునో వాఁడు పాపములచేత విడువఁబడుచున్నాఁడు. ఈవిషయమందు సందేహములేదు.

శ్లో॥ క్రతుకోటికృతో గర్వా న్నకుర్యాన్మాఘమజ్జనం । తం విద్యాత్పాపినంసుభ్రు చండాలం పశుఘాతుకమ్ ॥

తా॥ సుందరములయిన కనుబొమలుగలిగిన ఓ పార్వతీ! ఎవ్వఁడు కోటియజ్ఞముల నాచరించినాననే గర్వముచేత మాఘస్నానమాచరింపఁడో వానిని పశువులనుజంపు చండాలునిగా తెలిసికొనుము.

శ్లో॥ బాలోవాపి దరిద్రోవా ప్రాతర్మాఘమజ్జనం । కురుతే క్రతుసాహస్రం ఫలంప్రాప్య హరింవ్రజేత్ ॥

తా॥ బాలుఁడుగాని, దరిద్రుఁడుగాని, ప్రాతఃకాలమందు మాఘస్నాన మాచరించెనేని సహస్రయజ్ఞఫలమునుబొంది దేహాంతమందు హరిని బొందును.

శ్లో॥ యువావాచార్ధకోవాపి వృద్ధోవాపి నృగేశ్వరే । ప్రాతస్స్నానేర్బహిర్గత్వా మాఘే జలకేతుస్తనుమ్ ॥ త్రివారం సేచయేద్దేవి

వ్యాహరన్ విష్ణుకీర్తనం । తేషాం పాపాని నశ్యంతి ప్రసాదా చ్చక్రపాణినః ॥

తా॥ కలికాలమందు శిశువుగాని, పసుచువాడుగాని, వృద్ధుడు గాని మెల్లగా బయటకుపోయి హరికీర్తన చేయుచు, ఉదకబిందువులచేత ముహూర్తకాలము తడిసెనేని వారి కటాక్షమువలన వారి పాపములు నశించును.

శ్లో॥ ప్రాతర్మాఘె దృఢాంగస్య స్నానమావశ్యకం స్మృతం ।
శతవారవియద్గంగా స్నానపుణ్యం ప్రజేన్నరః ॥

తా॥ దృఢశరీరునకు మాఘస్నాన మావశ్యకము. (అనగా తప్పక నాచరించవలెనని భావము) నూరుమార్లు ఆకాశగంగలో స్నానము చేసిన ఫలమును మాఘస్నాత పొందును.

శ్లో॥ సంప్రాప్తె మాఘమాసేచ చండాలశ్చ ప్రమాదతః ।
సస్నానమాచరే ద్దేవి హంతిపాపం పురాకృతమ్ ॥

తా॥ స్వయంప్రకాశురాలవయిన ఓపార్వతీ; చండాలుడయినను తెలియకనయినను మాఘస్నాన మాచరించినయెడల పూర్వపాపమును నశింపజేసికొనును.

శ్లో॥ బ్రహ్మహాత్రసురాపశ్చ స్తేయీచ గురుతల్పగః । తత్సంగీ మనుజష్షష్ట స్తథివాన్యోపపాతకీ । మాఘస్నానాద్ధరింయాంతి ముక్తపాపా స్సురార్చితే ।

తా॥ ఓపార్వతీ! బ్రహ్మహత్య నాచరించినవాడుగాని, సురాపానమాచరించినవాడుగాని, సువర్ణము నపహరించినవాడు గాని, అగమ్యాగమన మాచరించినవాడుగాని, యీనలుగురితో సహవాస మాచరించినవాడుగాని, యీ పంచమహాపాతకములు గాక యితర పాతకముల నాచరించినవాడుగాని మాఘస్నాన మనుష్ఠించినయెడల పాపవిముక్తుడై హరినిబొందును.

శ్లో॥ మహాపాపరతం గౌరీ శ్వపచంవా కులాధమం । క్రూరం కులాంతకంకష్ట మద్దత్తం కర్మవర్జితమ్ ॥ పశుఘ్నంచ పరద్రోహ మాశ్రితం నరకం తథా । అసత్యభాషణం దంభం పరపాకరతం తథా ॥ మిత్రద్రోహం కృతఘ్నంచ భ్రూణహత్యా సుపాతకం । పరదారరతంపాపం పరాశా మర్థనూచకమ్ ॥ అన్నృతం కృషికర్మాణం స్వామిద్రోహంచ

వంచకం । సలోభం పిశునం దీనం సర్వదేవ పరాఙ్ముఖమ్ । ఆత్మప్రశంసాం కుర్వాణం ధర్మవిఘ్నకరం శఠం । అపాత్రవ్యయకర్తారం సాధుకూల్యవిభేదకమ్ । సపల్లవఫలోపేతం విటపిచ్ఛేదకారకం । విశ్వాసఘాతుకంచైవ వీరహత్యాపరాయణమ్ । అనగ్నిక మపుత్రించ విప్రకర్మవిరాగిణం । గురుద్వేషం మహాపాపం దంపత్యోర్విరసావహమ్ । గ్రామాధిపత్యం కుర్వాణం తథా దేవాలయస్యచ । భృతకాధ్యాపకంవిప్రం క్రూరకర్మపరాయణమ్ । ప్రకటీకృతపాపిష్ఠం గుహ్యవ్యసనపరాయణం । అజ్ఞానాం దఘకర్తారం జ్ఞానదుష్కర్మకారకమ్ । ఇత్యాది బహుభిఃపాపైర్యుక్తంనిష్కృతివర్జితం । ప్రాతస్స్నాన్యోదయే మాఘే సంవత్సరం పునీమహే । ఇతివారిణిగర్జంతి సర్వతీర్థోదికే రవా ।

తా॥ ఓ పార్వతీ! వినుము. పూర్వోక్తమహాపాపముల ననుష్ఠించినవాడును, కుక్కమాంసమును తినువాడును. కులహీనుడును. క్రూరుడును కులనాశకుడును, భక్తిహీనుడును, దానహీనుడును, కర్మను విడిచినవాడును. పశుహంతకుడును, పరద్రోహకుడును, నరకమును బొందినవాడును, అబద్ధమాడువాడును. డాంబికుడును, పరపాకమును భుజించువాడును, (శక్తి గురు శిష్య శ్రోత్రియ విప్రేతరాన్య బంధుభిస్స్వయంవా కృతఃపాకః స్వయంపాకః తదితరః పరపాకః నిత్యంతమత్తియః స్వపరపాకరత ఇత్యుచ్యతే) మిత్రద్రోహియును, ఉపకారమును మరచినవాడును. భ్రూణహత్య చేసినవాడును, పరస్త్రీలోలుడును. పరుల ధనమును వెలిబుచ్చువాడును, ఇరుపరులకు భేదమును గాంచించువాడును, శిలోంఛవృత్తుల విడిచి సేవాదివృత్తులచేత జీవించువాడును. వ్యవసాయముచేయు బ్రాహ్మణుడును, విభువునకు ద్రోహముచేయువాడును. వంచనావృత్తికలవాడును. అశక్తితోగూడినవాడును, కొండెముచెప్పువాడును, దీనత్వముతోగూడినవాడును. సమస్త దేవతావిముఖుడును, తన్ను తాను పొగడుకొనువాడును. ధర్మకార్య నాశకుడును, గూఢముగా నపకారము చేయువాడును, అయోగ్యునకు దానమిచ్చువాడును, అనుకూల్యమును చెడగొట్టువాడును, ఫల పుష్పసహిత వృక్షమును ఛేదించువాడును, విశ్వాసఘాతకుడును, వీరహత్యాపరుడును. అగ్నిహోత్రములను విడిచినవాడును, పుత్రహీనుడును, విప్రకర్మలనాచరించువాడును, గురువుతో ద్వేషించువాడును, మహాపాపియు. భార్యాభర్తలకు విభేదమును చేసినవాడును, గ్రామాధిపతియు, దేవాలయాధిపతియు, ధనముపుచ్చుకొని వేద

ముసుకొప్పువాడును, క్రూరకర్మల నాచరించువాడును బహిష్కృతపాపుడును, రహ స్యకృత పాపుడును, తెలిసి పాపమాచరించువాడును, తెలియక పాప మాచరించు వాడును, యింకా అనేక పాపములను చేసినవారు ప్రాయశ్చిత్తవిహీనులై మాఘమా సంబున ప్రాతఃకాలమందు స్నానమాచరించినచో వారినందరిని పవిత్రులను జేయుదుమని సూర్యుడు సగము ఉదయించునంతట — సర్వత్ర ఉదకములు గర్జించుచుండునట.

శ్లో॥ మాఘేచ క్రూరకర్మాణం పాపిష్ఠం నిరపత్రపం । ఉషస్య స్నానమజ్జంతం హరిష్యామ్యఘసంచయం । రటంత్యాపోహి సర్వత్ర ప్రాతస్సూర్యోదయేఽనఘే ॥

తా॥ ఓ పార్వతీ! హింసాకర్ముడును, పాపిష్ఠుడును, లజ్జాహీనుడును, మాఘమాసమందు ఉషఃకాలమందు ఉదకములో (నదులయందు) స్నానమాడినచో వాని సమస్తపాపములను మేము హరింతుమని సర్వత్ర ఉదకములు ఘోషించుచున్నవిగదా.

శ్లో॥ సంసారభయభీతస్య పాపభీరోర్నరస్యచ । ప్రాతర్మాఘే బహిస్స్నానం కర్తవ్యం నాత్రసంశయః ॥

తా॥ పాపభీతిగలవాడును సంసారభయమును బొందినవాడును నయిన మనుజునిచేత మాఘమాసంబున ప్రాతఃకాలమందు బహిస్స్నానము చేయదగినది. ఈవిషయములో సంశయము లేదు. అనగా మాఘస్నాతకు సంసారాది భీతి లేదని భావము.

శ్లో॥ దంభాద్వాపి భయాద్వాపి పరప్రేష్యాదథాపివా । సంగాత్స్వభావాద్దేవేశి యఃకుర్యాన్మాఘమజ్జనం । ససర్వపాతకైర్ఘోరైర్విముక్తోఽమృతమశ్నుతే ॥

తా॥ ఓ పార్వతీ! ఎవ్వడు బడాయికిగాని, భయమువలనగాని, మఱియొకడు పంపగాగాని, సత్సంగమువలనగాని, లేక స్వకీయ స్వభావమువలనగాని మాఘస్నాన మాచరించునో వాడు భయంకరములయిన సమస్తపాతకములచేత విడువబడి మోక్షమును బొందును.

శ్లో॥ ప్రాతస్స్నానమహం భక్త్యా కరిష్యామీతియో వదేత్ । తస్యపాపాని నశ్యంతి తూలశైలా ఇవాగ్నినా ॥

తా॥ ఎవ్వడు భక్తితో "ప్రాతర్మాఘస్నానమహంకరిష్యే" ఈ ప్రకా

తము సంకల్పమును చేయుదురో వాని సమస్త పాపములు అగ్నిచేత దూదిపోగులువలె భస్మీకృతమగును.

శ్లో॥ ప్రాతర్గమనమాత్రేణ విద్రవంతిదిశోదశ ।

తా॥ ప్రాతఃకాలమందు స్నానార్థమలుగు వానిపాపములు దిక్కులకుపా పోవును.

శ్లో॥ ప్రాతర్మాఘేంభసిస్నానా త్పరంబ్రహ్మాధిగచ్ఛతి ।

తా॥ ప్రాతఃకాలమందు మాఘస్నానమువలన పరబ్రహ్మను పొందును.

శ్లో॥ సర్వమాసోత్తమోమాఘ స్సర్వదేవోత్తమోహరిః । సర్వ
వృక్షోత్తమోశ్వత్థ స్సర్వ తేజోత్తమో రవిః । సర్వశాస్త్రోత్తమో వేద
స్సర్వవర్ణోత్తమో ద్విజః । సర్వశైలోత్తమో మేరు స్సర్వమాసోత్తమో
హ్యయం । మాఘమాసోయుతఫలం మజ్జతస్స్యాదదాతిహి ।

తా॥ సర్వమాసములలో మాఘమాసమును, సర్వదేవతలలో హరియును, సర్వ వృక్షములలో అశ్వత్థవృక్షమును, సర్వప్రకాశకులలో సూర్యుడును, సర్వశాస్త్రములలో వేదమును, సర్వవర్ణములలో బ్రాహ్మణుడును, సర్వపర్వతములలో మేరుపర్వతమును శ్రేష్ఠములు. సర్వ మాసోత్తమమయిన యీ మాఘమాసమున స్నానము చేయువానికి (౧౦౦౦) వెయ్యిరెట్లు ఫలమిచ్చును

శ్లో॥ భక్త్యావ్యనన్యయా మాఘే ప్రాతస్సూర్యోదయే ప్రియే ।
మోహాద్వాకురుతేస్నానం సముక్తఃపాతకాదికైః ।

తా॥ ఓ ప్రియురాలా! మాఘమాసమందు అనన్యభక్తితోగాని, మోహము వలనగాని సూర్యోదయమందు స్నానమాచరించువాడు పాపవిముక్తుడగును.

శ్లో॥ శీతభీతస్సుపుష్టాంగః కంపయన్మాఘమజ్జనం । నకుర్యా
ద్యదిమూఢాత్మా సచండాలో భవిష్యతి ।

తా॥ దృఢమయిన శరీరముగలిగియు చలికి భయపడి వణకుచు ఎవ్వడు మాఘ స్నానమాచరింపడో వాడు చండాలుడై పుట్టును.

శ్లో॥ అశక్తశ్చేతగైర్వాపి పటుభిస్స్నానజంఫలం । గృహీత్వా
దక్షిణాం దత్వా మాఘే లబ్ధమనోరథః । సదేహాంతే హరింప్రాప్య
మోదతే విష్ణుమందిరే ।

తా॥ ఓ ప్రియా! ఇంకొక విశేషము వినుము. ఈ మాఘస్నాన మాచరించుటకు శక్తిలేనివాఁడు తనకుగాను సమర్థుఁడయిన మతియొక పురుషునిచేత స్నానమును జేయించి వానికి యథాశక్తిగా దక్షిణ యిచ్చి వానివల్ల స్నానఫలమును గ్రహించిన ఇహమందు నానేక భోగముల ననుభవించి దేహాంతమందు హరిసన్నిధిలో సంతోషముతో చిరకాలముండును.

శ్లో॥ మాఘస్నానరతానాంచ శీతార్తానాంమృగేక్షణే । ఇధ్మభార ముపాదాయ పావకం చాంబుసన్నిధౌ । సేవార్థం దీవ్యతే దేవి సస్నానఫలమశ్నుతే ।

తా॥ ఓ పార్వతీ! ఎవ్వఁడు మాఘస్నానముచేసి చలిచే వణకుచున్నవారికి శీతబాధా నివారణకుగాను యెండిన కట్టెలను దెచ్చి తీరమందు దగ్నిని ప్రజ్వలింపచేసి యిచ్చునో వాఁడును స్నానఫలమును బొందును.

శ్లో॥ కృత్వా స్నానం శీతభీతో వహ్ని సేవాం యదీచ్ఛతి । స్నానం విష్ణ్వర్పణంకృత్వా వహ్నిసేవాపరో భవేత్ ।

తా॥ మాఘస్నానమాడి చలిచే భయపడి అగ్నిసేవ కోరినయెడల స్నానాదికము హరికి నర్పణచేసి అగ్నిని సేవించవలెను

శ్లో॥ మాఘస్నానరతానాంచ దరిద్రాణాం కుటుంబినాం। శీతార్తానాంతు యోగారీ వస్త్రదానం ప్రయచ్ఛతి । సోపి స్నానఫలంప్రాప్య ప్రియాతి పరమాంగతిమ్ ।

తా॥ ఓ పార్వతీ! ఎవ్వఁడు దరిద్రులై కుటుంబవంతులై వస్త్రాదులు లేక మాఘస్నానముచేసి శీతపీడితులగువారికి వస్త్రదానముచేయునో వాఁడును స్నానఫలమంది తరువాత పరమపదమును బొందును.

శ్లో॥ స్నానశీలాయవిప్రాయ దరిద్రాయకుటుంబినే । వస్త్రంవా కంబళంవాపి యఃప్రయచ్ఛతి శోభనే । సపాపై ర్లిప్యతేనైవ యోగీ కర్మగణైర్యథా ।

తా॥ ప్రకాశించువానవయిన యో పార్వతీ! మాఘస్నాననిరతుఁడయినటువంటిన్ని, దరిద్రుఁడయినటువంటిన్ని కుటుంబియైన బ్రాహ్మణునకు వస్త్రమునుగాని, కంబళమునుగాని యిచ్చువాఁడు యోగి. వాఁడు కర్మజాలము లచేతనువలె పాపములచేత అంటబడడు.

శ్లో॥ సంప్రాప్తే మాఘమాసేతు స్నానం కుర్విత్యమజ్జనం । పా
మ్యేనవా బలాద్వాపి స్నానార్థంయో బహిర్జలమ్ ॥ ఉద్దిశ్యగమయే త్తేన
సహితో మాఘమజ్జనం । యఃకరిష్యతి దేవేశి తావుభౌ పుణ్యశీలినౌ ॥

తా॥ ఓ పార్వతీ! మాఘమాసము రాగానే స్నానమాచరించుట ఇష్టములేని వానిని సాధుమార్గముచేతగాని, బలాత్కారముగాగాని ఎవ్వడు మాఘస్నానార్థమై బహిర్జలమునుగూర్చి తీసికొనివెళ్లునో వాడును, వానితోగూడా వచ్చి స్నానమాచరించినవాడును యిద్దఱును పుణ్యవంతులగుదురు.

శ్లో॥ మాఘేచార్ధోదితే సూర్యే స్నానార్థం యోజనాన్నరః ।
ఉద్బోధయిత్వా తైస్సాకం యోగచ్ఛతి వరాననే । తస్య తేషాం భవే
త్పుణ్యం వాజపేయశతాధికమ్ ।

తా॥ ఎవ్వడు మాఘమాసమందు సూర్యుడు అర్ధోదితుడగుచుండగా స్నానార్థము జనులను ప్రోత్సాహపఱచి తీసికొనివెళ్లుచూ వాడును, వానితోగూడ వచ్చినవారును నూఱు వాజపేయయాగముల ఫలమును బొందుదురు.

శ్లో॥ మాఘస్నానం ప్రకుర్వాణం యోవారయతి మూఢధీః ।
మహాపాపోపపాపాని తమాయాంతి మృగేక్షణే ।

తా॥ ఓ పార్వతీ! ఏ దుర్మార్గుడు మాఘస్నాతను దూషించుచూ వాడు మహాపాపములును ఉపపాపములును వాని నాశ్రయించియుండును.

శ్లో॥ పితరం స్వానుజం పుత్రిం మాతరం స్నేహసంయుతః ।
మాఘస్నానరతం దేవి మామాకుర్వితిమందధీః ॥ సగోఘ్నఇతి విజ్ఞేయ
స్సర్వకర్మబహిష్కృతః । దారుణంతస్య దేహాంతే భవిష్యతివరాననే॥

తా॥ ఓ పార్వతీ! ఎవ్వడు ప్రేమచేత తండ్రినిగాని, తల్లినిగాని, తమ్మునిగాని, పుత్రినిగాని మాఘస్నానము మానుమని మందబుద్ధితో నివారించుచూ వాడు గోహంతకుడువలె సర్వకర్మ బహిష్కృతుడగును. ఇంతేకాదు. దేహాంతమందు దారుణమయిన నరకమును బొందును. (వరాననే పరమాననం యస్యాస్సా వరాననాతస్యాస్సంబుద్ధిః హేవరాననే... శ్రేష్ఠమయిన ముఖముగలిగినదానా అని అర్థము.)

శ్లో॥ బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచాపిస్త్రియంతథా।
మాఘవ్రతంకురుష్వేతి బ్రూయాద్యస్సతుపుణ్యభాక్ ।

తా॥ బ్రాహ్మణునితోగాని, క్షత్రియునితోగాని, వైశ్యునితోగాని, శూద్రునితోగాని స్త్రీతో మాఘస్నాన మాచరింపుమని పలికినవాఁడు పుణ్యమును బొందును.

శ్లో॥ మాఘస్నానరతందృష్ట్వా శుచిం మోదతిమానవః । దేహాలగ్నానిపాపాని తస్యనశ్యంతిపార్వతి ॥

తా॥ ఓపార్వతీ! మాఘస్నాన మాచరించి శుచియైనవానిని జూచి సంతోషించువాని పాపములు నశించును.

శ్లో॥ పాపంవా యదివాపాపం మాఘస్నానపరాయణం । నిందయేద్యదిమూఢాత్మా రౌరవంనరకంవ్రజేత్ ॥

తా॥ పాపియైగాని, అపాపియైగాని మాఘస్నాన మాచరించు వానిని యేమూఢుఁడు నిందించునో వాఁడు రౌరవ నరకమును బొందును.

శ్లో॥ నమాఘస్నానసదృశం పుణ్యం దేవి నవిద్యతే । సద్యః పాపహరో మాఘ స్సద్యోముక్తిప్రదాయకః ॥

తా॥ ఓ పార్వతీ! మాఘస్నానముతో సమానమయిన పుణ్యము మూఁడులోకములయందును లేదు. మాఘము తత్కాలమందే పాపహరము తత్కాలమందే మోక్షదాయకము.

శ్లో॥ ప్రాతర్బాహ్యజలేమాఘే శక్తిమాన్స్నానమాచరేత్ । పాదౌప్రక్షాళ్యచాచమ్య మాసమేకంహ్యశక్తిమాన్ । పురాణశ్రవణాద్వాపి మాఘేపుణ్యే నయుజ్యతే ॥

తా॥ సమర్థుఁడు మాఘమాసంబున నిత్యము బహిర్జలమందు స్నానమాచరింపవలెను. శక్తిలేనివాఁడు ప్రతిదినము ప్రాతఃకాలమందు పాదప్రక్షాళనము చేసికొని ఆచమించి పురాణశ్రవణ మాచరించినచో స్నానపుణ్యమును సంపూర్ణముగ బొందును.

శ్లో॥ మాఘస్నానే హ్యశక్తశ్చే దేతన్మాసప్రశంసినీం । మాసమేకంయశ్శృణోతి తత్ఫలంసోధిగచ్ఛతి ॥

తా॥ మాఘస్నానమాచరించు సామర్థ్యములేనివాఁడు మాసమంతయు మాఘమాస మాహాత్మ్యమును వినినయెడల సంపూర్ణముగా స్నానఫలమును బొందును.

శ్లో॥ నైవ మాఘసదృశం జగత్త్రయే ధర్మమార్తిహరణం వరాననే । అశ్వమేధశతకృత్సదక్షిణం సోపియాతి మృగభాస్కరస్యతత్ ॥

తా॥ ఓ పార్వతీ! మూఁడు లోకములయందు దుఃఖ నివారణమందు మాఘస్నానముతో సమానమయిన పుణ్యము లేదు నూఱుమాఱు లశ్వమేదయాగమునుజేసి దక్షిణల నిచ్చినవాఁడును, మాఘస్నాన మాచరించినవాఁడును సమానఫలమునొందుదురు.

శ్లో॥ పద్మపత్రనయనాననే శుభ్రిణు పాపభీతపురుషోతితే రవౌ। స్నాతియాతి హరిమాదిపూరుషం రౌరవాది బహునారకంవినా॥

తా॥ తామరరేకులవంటి కన్నులును, తామరపువ్వువంటి ముఖమును గలిగిన యో పార్వతీ! వినుము. ఎవ్వఁడేని పాపములకు భయపడినవాఁడై రవి యుదయించువేళ మాఘస్నానమాడినచో రౌరవాది నానా నరకముల నొందక నాదిదేవుఁడయిన శ్రీహరిని బొందును.

శ్లో॥ మాఘమాసిమతి మానథాపివా మజ్జనం హ్యుదిపదే హరిం స్మరన్। యఃకరోతిసహియాతి వైష్ణవం లోకమాశుతువసంశయం శుభే॥

తా॥ ఓ పార్వతీ! మతిమంతుఁడుగాని, లేనివాఁడుగాని, యెవ్వఁడు మాఘమాసంబున హృదయమందు శ్రీహరి పాదారవిందములను స్మరింపుచు ప్రాతస్స్నానమాచరించునో వాఁడు విష్ణులోకమునుబొందును. సందియములేదు.

శ్లో॥ భ్రాతృ మాతృ యతి ఘాతుకోపివా మిత్ర బాల సతి గో విఘాతకః। మాఘమాసి కృత మజ్జనోషసి ముక్తపాప నిచయో హరిం వ్రజేత్॥

తా॥ సోదరఘాతుకుఁడుగాని, మాతృహింసకుఁడుగాని, యతిహంతకుఁడుగాని, మిత్రనాశకుఁడుగాని, బాలహత్యాశీలుఁడుగాని, స్త్రీప్రాణహరణపరాయణుఁడుగాని, గోహంతకుఁడుగాని మాఘమాసంబున ఉషఃకాలమందు స్నానమాడినచో సమస్తపాపములచేత విడువఁబడి హరినిబొందును.

శ్లో॥ యశ్శృణోతిదమాఖ్యానం మాఘస్నానవిశారదః। తస్య పుణ్యస్యవిస్తారం నాహంవేద్మి నగాత్మజే॥

తా॥ పర్వతరాజపుత్రివయిన యోపార్వతీ! ఎవ్వఁడు మాఘస్నాతయై యీకథను వినునో వానికి లభించు పుణ్యమును నేను దెలిసికొనజాలను.

శ్లో॥ యశ్శృణోత్యథవాథక్త్యా మాసమేకంసరంతరం। ఏతదాఖ్యానమఖిలం సవైకుంఠేచిరంవసేత్॥

తా॥ లేక స్నానమాచరించుశక్తి లేనివాఁడై మాసమంతయు సర్వదా యీకథను వినువాఁడు చిరకాలము వైకుంఠలోకమందుండును.

ఇతి ప్రథమోధ్యాయస్సమాప్తః.

---

—♦ అథ ద్వితీయోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీమహాదేవఉవాచ॥ శ్లో॥ మాఘమాస ప్రభావేన పురా కాచి ద్విజాత్మజా । ముక్తపాపాహరింయాతా స్వభర్త్రావిబుధార్చితే ।

తా॥ పరమేశ్వరుఁడు పలుకుచున్నాఁడు. ఓపార్వతీ! వినుము. ఈమాఘమాస మహిమవలన పూర్వకాలమందు ఒక బ్రాహ్మణపుత్రిక పాపనిర్ముక్తయై తన పతితో కూడా శ్రీహరిని జేరెను.

శ్రీదేవ్యువాచ॥ శ్లో॥ దేవ కాసా ద్విజసుతా కిం కృతం పాతకం తయా । కథంవిముక్తామాఘస్య ఫలతో మే వదా ధునా ।

తా॥ పార్వతి అడుగుచున్నది. ఓశంకరా! ఆవిప్రకన్య యెవరు ఆమె యేమి పాపమాచరించినది మాఘమాస మహిమవలన యెట్లు విముక్తయైనది. ఈసర్వమును నాకు నిప్పుడు చెప్పుము.

మహాదేవః॥ శ్లో॥ శృణు దేవి ప్రవక్ష్యామి దేశే సౌరాష్ట్రకే పురా । గ్రామే బృందారకేకశ్చి త్సుదేవో బ్రాహ్మణోత్తమః । సదాచార సమాయుక్త స్సదా సజ్జనపాలకః । వేదవేదార్థ తత్వజ్ఞో వేత్తా వేదాంగపంచకమ్ ।

తా॥ ఈప్రకారము పార్వతి ప్రశ్నించగా తిరిగి పరమేశ్వరుఁడు పలుకుచున్నాఁడు. ఓపార్వతీ! వినుము. పూర్వకాలమందు సౌరాష్ట్రదేశంబున బృందారకమను గ్రామమందు సుదేవుఁడను నొక బ్రాహ్మణోత్తముఁడుగలఁడు. అతఁడు సదాచారవంతుఁడును, సుజనపోషకుఁడును, వేదముయొక్క వేదార్థముయొక్క తత్వమును తెలిసినవాఁడును వేదాంగపంచకమును సంపూర్ణముగా చదివినవాఁడును అయియుండెను.

శ్లో॥ తస్యవిప్రస్యబహవ శ్శిష్యా వేదాంగపారగాః । శుశ్రూష మాణాస్తేగౌరి గురుం వేదార్థపారగమ్ ।

తా॥ ఓగౌరీ! ఆవిప్రునకు వేదవేదాంగవేత్తలయిన శిష్యులు బహుమందిగలరు. వారందఱు వేదవేదార్థపారదృశ్యులయిన ఆనుదేవగురువును నిత్యము సేవించుచుండిరి.

శ్లో॥ తస్యాసీత్తనుజాతన్వీ సురూపా దశవార్షికా । సర్వాంగసుందరీదేవి బాలా బాలమృగేక్షణే ।

తా॥ లేతలేడియొక్క చూపులవంటి చూపులుగలిగిన ఓ పార్వతీ! ఆబ్రాహ్మణునకు పదిసంవత్సరముల వయస్సుగలిగినదియు, కృశశరీరిణియు, సుభగమయిన రూపము గలిగినదియు, సమస్తమయినశరీరమందు కాంతివిశేషము గలిగినదియు బాలయయిన యొక పుత్రికగలదు.

శ్లో॥ దీర్ఘకేశీ చారుముఖీ పక్వబింబోష్ఠపల్లవా । కంబుకంఠీ కీరవాణీ సునాసా చారుహాసినీ ।

తా॥ ఆచిన్నది దీర్ఘకేశియు, సుందరముఖియు, పండిన దొండపండువంటి అధరోష్ఠముగలిగినదియు, శంఖమువంటి కంఠముగలిగినదియు చిలుకయొక్క స్వరమువంటి స్వరముగలిగినదియు, యోగ్యమైన ముక్కుగలిగినదియు ఒప్పుచున్న నవ్వుగలిగినదియునై యుండెను.

శ్లో॥ పితా తామీదృశీం దృష్ట్వా కస్మైదేయా మయా సుతా । విచార్యమాణే విప్రేంద్రే కించిత్కాలాంతరే శుభే । శిష్యస్సుమిత్రనామాఖ్యః కశ్చిద్గురుహితేరతః సమిత్పుష్పకుశార్థం తు హ్యాటవీం గురుచోదితః । చరంతీ కందుకక్రీడాం కుమారీ తేనసంయుతా । దూరాద్దూరమనుప్రాప్తా తచ్ఛిష్యేణ వరాననే ।

తా॥ శుభంకరివయిన యోపార్వతీ! వినుము. ఇట్టికుమార్తెను జూచి తండ్రి యీకన్యను యెవ్వనికిచ్చి వివాహముచేతునని విచారించుచుండగా కొంతకాలము గడచిన పిమ్మట సుమిత్రుండను నొకశిష్యుండు గుర్వర్థము సమిత్పుష్పఫలాదులను దెచ్చుటకు అరణ్యమునకు వెళ్ళెను. బంతితో నాటలాడుచు నాకన్యక ఆశిష్యునితోకూడా అరణ్యమందు చాలాదూరముపోయెను.

శ్లో॥ సాపి యాతా మహద్దూరం విపినంద్రుమసంకులం । దదర్శాగ్రే మహారణ్యే కాసారంచజలాశయమ్ ।

తా॥ ఆశిష్యుఁడును చాలదూరముపోయి అశోకవృక్షములతోనున్న యొక యరణ్యమునుజూచెను. దానియందు ఉదకపూరితమయిన యొక సరస్సునుజూచెను.

శ్లో॥ తట(ద్రుమసమాకీర్ణం నిర్మలంశీతలం జలం । విలసద్విశదాంభోజం మధువశ్రితశోభితమ్ । రక్తారవిందపాలాశ కుముదోత్పలశోభితమ్ । చలద్వారిచరోద్భిన్న తరంగానేకరాజితమ్ । జలపక్షిభిరాకీర్ణం కూజద్భిస్స్వేచ్ఛచారిభిః ॥

తా॥ ఆ సరస్సుతీరములయందు వివిధ విటపిసమావృతమును, నిర్మలమును, శీతలమునునయిన ఉదకముతో నిండినదియును, వికసించి ప్రకాశించుచున్న పద్మములుగలిగినదియును, అనేకములయిన తుమ్మెదలతో నిండియున్నదియు, రక్తపద్మములతోను, పలాశవర్ణములయిన కలువలతోను ప్రకాశించుచున్నదియును, నీటిలో చరించుచున్న జలజంతువులచేత విచ్చిపోయిన తరంగములచేత నొప్పుచున్నదియు, స్వేచ్ఛగా తిరుగుచు కూయుచున్న జలపక్షులతో గూడినదియునైయుండెను.

శ్లో॥ కూజద్భిః కోకిలవ్రాతైః వదద్భిశ్శుకసారసైః । అనేకవృక్షసంఛన్న మేకాంతభవనంయథా । వనం మనోహరందృష్ట్వా పీత్వా జలఫలానిచ । కుమారీవి(వగనయా తత్రైకాంతస్థలే శుభే । వృష్పాయుధేన బలినా సంతప్తహృదయాతురా. తచ్ఛిష్యేమరతింకర్తుమువాచనగనందిని॥

తా॥ ఓపార్వతీ! తలువార కూయుచున్న కోకిలలతోను, పలుకుచున్న చిలుకలతోను కూడినదియు, అనేకవృక్షములతో గూడినదియునై అంతఃపురమువలె ప్రకాశించుచున్న యొకవనమునుజూచి త్రతత్య కాసారమందు జలపానముచేసి వనమందయిన ఫలములను భుజించి ఒక యేకాంతస్థలమందు కూర్చున్న ఆవిప్రకన్య మన్మథునిచేత సంతపింపబడిన చిత్తముగలదై తొందరపాటుతో ఆశిష్యునితో సంభోగముచేయ నిశ్చయించి యిట్లనెను.

కన్యా॥ శ్లో॥ శృణు భద్రవనేదివ్యే చైకాంతేజనవర్జితే । క్రీడార్థం రోచతేకామం చిత్తంమేత్వత్వయాసహ ।

తా॥ కన్య పలుకుచున్నది, ఓయీ శోభనా! వినుము. స్వయంప్రకాశమై, జనశూన్యమై, ఏకాంతమై యొప్పుచున్న యీ వనమందు నీతో సంభోగించుటకు నామనస్సు మిక్కిలి కోరుచున్నది.

శ్లో॥ వనేచానంగదావాగ్ని ర్వ్యాపనేంతర్గతో(త్రమాం । సందహత్యధునాత్యంతం స్వాన్మయా మరతింకురు ।

తా॥ యౌవనాంతర్గతమయిన మన్మథదవాగ్ని యీ వనమంతయు నన్ను కాలుచున్నది. కాబట్టి నీవు నాతో రతిసౌఖ్యవర్షమనియెడు నాయగ్ని చల్లార్పుము.

శ్లో॥ మచ్చిత్తశోభనే కాంత వనే త్వచ్చిత్తశోభనే । సమాన యౌవనావావాం రతి స్సర్వ స్సుఖప్రదః ॥ మావిలంబం కురుష్వాత్ర సమాగచ్ఛ మమాంతికమ్ ।

తా॥ ఓ ప్రియుడా! ఈవనము నాచిత్తమునకు నీచిత్తమునకు అతిరమ్యముగా నున్నది మనమిద్దరము సమాన యౌవనముగలవారము. సంభోగ సుఖప్రదమయిన దీని యందు ఆలస్యము చేయకుము. నావద్దకురమ్ము.

శ్లో॥ తులాన్మృదుతరం దేహం కోమలాంగం సుఖప్రదం। మనోభవేన మోహేన మామాలింగయమాచిరమ్ ।

తా॥ నాదేహము దూదికంటె మృదువయినది. అతికోమలమైన అంగములు కలిగినది. సుఖప్రదమయినది. నీవు ప్రేమచేత మన్మథోద్రేకముచేత నన్నాలింగనము జేసికొనుము. ఆలస్యమువద్దు.

శ్లో॥ సోపీత్యుక్త స్తయాశిష్యః పునస్తామాహ పార్వతి। మామాం వదదురాచార ప్రదం వాక్యం సుశోభనే ।

తా॥ ఓపార్వతీ! ఈప్రకారముగా పలికిన గురుపుత్రికవాక్యమును విని శిష్యుడు పలుకుచున్నాడు. ఓ సుదతీ! యిట్టి దురాచారప్రదమయిన వాక్యమును పలుకవచ్చునా.

శ్లో॥ కుమారీ మద్గురోః పుణ్యా మత్స్వసా భ్రాతరంతవ । వృథా మాం కాంక్షసే పాపే మహామారాగ్ని పీడితా ।

తా॥ నీవు మాగురువుకుపుత్రికవు. పుణ్యాత్మవు. నాకు తోబుట్టువవు. మన్మథాగ్నిపీడితవై నీసోదరుడవయిన నన్ను వృథాగా కోరుచున్నావు.

శ్లో॥ సత్యయామే మనోరంతుం రోచతే త్రసుభేక్షణే । సూర్యాచంద్రమసౌ యావ చ్చరేతాం తావదేవహి ॥ ఏతత్కర్మఫలాన్వావాం భుంజానౌ నరకంచిరం । గచ్ఛావో తిష్ఠరతనం గురూణాంపరుషంవచః॥ వ్యక్తీదీర్ఘేకతే కాలే తిథాత్వాం తాడయే త్పితా । సమిత్పుష్పం ఫలం గృహ్య యాస్యావో గ్రామమండసా ॥

తా॥ ఓ అమ్మాయీ! నీతో సంభోగించుటకు నామనస్సునకు యిష్టములేదు ఒకవేళ మనమిద్దరము క్రీడించినయెడల సూర్యుడును, చంద్రుడును ఎంతకాలముండునో అంతకాలము యీకర్మఫలము ననుభవించుచు నరకమందుండగలవారము గాన లెమ్మా. ఇంటికి పొమ్మా. వద్దుసుమ్మా. గురువు నామీద కోపించునుసుమ్మా. ఆలస్యంబైనచో తండ్రినిన్ను కొట్టునుసుమ్మా సమిత్పుష్పఫలాదులంగైకొని త్వరగాగ్రామమునకుపోదము రమ్మా. నామాటవినుమమ్మా

శ్లో॥ సాతత్రిస్యవచశ్శ్రుత్వా పునఃప్రోవాచతంసుధీః । కన్యా రత్నంచ కనకం సద్విద్యాపి సుధాతథా । స్వయంయస్యాగతా గేహం మాస్త్వీత్యుక్తస్సమూఢధీః ।

తా॥ ఈప్రకారముగా పలికిన శిష్యుని వాక్యములను విని తిరిగి ఆకన్యక పలికెను. కన్యయు, రత్నము, సువర్ణము, విద్య, అమృతమును స్వయముగానే గృహమునకు వచ్చినప్పుడు వాకువద్దని పలుకువాడు మూఢుడని చెప్పబడును.

శ్లో॥ అన్యోన్యాలింగనక్రీడాం హిత్వాగేహంగతేత్వయి । విహాస్యామ్యత్రహిప్రాణా న్వనేక్రూరే భయానకే ।

తా॥ పరస్పరాలింగనక్రీడను విడిచి నీవు యింటికి వెళ్ళినయెడల నేను భయంకరమయిన యీవనమందే ప్రాణములను విడుతును.

శ్లో॥ నాయాతే మయిమత్తాతో ప్యాయతే త్వయిమాం వినా । సద్యోదాస్యతేశాపం దారుణం నాత్రసంశయః ।

తా॥ అట్లు నేనులేకుండ నీవే యింటికి వెళ్ళినయెడల మాతండ్రి నీకుదారుణమయిన శాపమిచ్చును. సందేహములేదు.

శ్లో॥ నసహామి తనుంత్యక్తుం రతింహిత్వాత్ర కానసే । నానుయాస్యే త్వయాగేహం గత్వాత్వంభుంక్ష్వ తత్ఫలమ్ ।

తా॥ నీతో సంభోగము విడిచి నేను యీ అరణ్యమందు దేహమునుధరించి యుండలేను. నీతోగూడా నింటికి రాను నీవువెళ్ళి ఆఫలము ననుభవించుము.

శ్లో॥ ఇత్థం తద్విపినే తస్య సంకటే సముపాగతే । రతికామా భవేత్తస్యాం క్రీడాంకర్తుం సమూఢధీః ।

తా॥ ఆ యరణ్యమందు యీప్రకారముగా నా శిష్యునకు సంకటము ప్రాప్తమయినంతలో నాచిన్నదానితో సంభోగించుటకు నతడును దుర్మతియై యత్నించెను.

శ్లో॥ రక్తారవిందవద్భృతి సుమసంవాసితే ప్రియే। నానావర్ణసుమైర్యుక్తే మకరందస్రుతేమసృలే। వరాగామోద పుష్పాణాం శయనే సురతప్రియే। గాయత్సుస్ఫుక్షి కోకిలధ్వానైః కపోతశుకసారసైః। స్వామోద గంధవాహేతు సుఖస్పర్శే సమీరణే। కుసుమేషు సముద్భూత చేష్టాభిర్మితభాషణైః। అన్యోన్యాలింగనైశ్చేష్టైశ్చక్రీతుస్తౌ రతింప్రియే॥

తా॥ శుభదృష్టివయిన యో పార్వతీ! వినుము. తరువాత వారిద్దరును నొక రమ్యప్రదేశమందు కాసారస్థపద్మములతోను, అనేక కుసుమములతోను, పరిమళించుచున్నటువంటివి, సంభోగానుకూలమయిన శయనమును రచించి, కోయిలలు కూయుచుండఁగా, కపోతములు కలధ్వని చేయుచుండఁగా, చిలుకలు పలుకుచుండఁగా, బెగ్గురు పులుగులు శబ్దమును జేయుచుండఁగా, వాయువు పరిమళమును వహించి సుఖస్పర్శనకర మగుచుండఁగా, మన్మథోద్రేక సముద్భూతములయిన నానావిధ చేష్టలచేతనున్ను, అన్యోన్యాలింగనములతోను సంభోగమును సుఖముగా సలిపిరి.

శ్లో॥ గతేసురతికాలేతు సంతుష్టమనసిప్రియే। గ్రామంగంతు మథోద్యుక్తౌ కందుకక్రీడ మానసౌ। సమిత్పుష్పఫలాదీని కుశాన్యాదాయమస్తకే। తౌహిత్వావిపినంరమ్యం విలసద్గ్రామమాగతౌ॥

తా॥ ఓ పార్వతీ! వారిరువురు యీప్రకారముగా సలిపి రతికాలము గడిచి మనస్సులు సంతోషించినతరువాత బంతులాట లాడి సమిత్పుష్పఫలాదులను పుచ్చుకొని సుందరమయిన యీ వనమునువిడిచి గ్రామమునకు జేరిరి,

శ్లో॥ అప్యయామాస శిష్యోసౌ సత్క్రియాం గురుచోదితాం। శిష్యం సంతోషయిత్వాతు సదేవో గురుసత్తమః। కుమారీమాహభో భద్రే శ్రాంతాసివిపినేశుభే। భుంక్ష్వాన్నం స్వాదుసంయుక్తం త్యక్త్వా కందుక మార్గజే।

తా॥ గురువుగారిచే నాజ్ఞాపింపఁబడిన కుశాద్యానయనమును శిష్యుఁడు గురువునకు సమర్పించెను. గురువును శిష్యుని సంతోషపెట్టి తన కుమార్తెతో నిట్లనిరి. ఓ మంగళప్రదా! అరణ్యమునకుపోయి చాలా ఆయాసపడితివి బంతిని దాచి రుచితోగూడిన యీ అన్నము తినుమా అమ్మాయి.

శ్లో॥ తేనేత్యుక్త్వా తథాకృత్వా గతేకాలాంతరేఽనఘే। ద్విజః కాశ్మీరదేశస్థః కాముద్వాహ్య యయోస్మృతిమ్॥

తా॥ ఓ పార్వతీ! ఈప్రకారముగా పలికిన తండ్రిమాట విని ఆచిన్నది ఆటు లాచరించెను. తరువాత కొంతకాలమునకు కాశ్మీరదేశస్థుఁడయిన యొక బ్రాహ్మణుఁడాచిన్నదానిని పెండ్లిచేసికొని అతఁడు మృతిబొందెను.

శ్లో॥ దృష్ట్వాసుదేవ స్తనయాం దుఃఖితాంస్వపతిం ప్రతి। పురోభూమిగతాముచ్చై శ్శోచంతీం బహుధా భువి। లుఠద్వికీర్ణ కేశాంచ విశీర్ణ కటివాససీమ్ ॥ కురంగశాబేక్షణ వామలోచనాం చిరాదవిచ్ఛిత్తి గతాశ్రుమోచనాం। కుమారికామాహ ధరామవస్థితాం సుదుఃఖితాం వీక్ష్య పితాహతాహతః ॥ అహంనపశ్యామి సుతామభర్తృకాం బాలామనంగే ష్వభిసంవృతాంసతీమ్ ॥

తా॥ అనంతరము మృతుఁడయిన భర్తకళేబరమువద్దబడి శోకించుచున్నటువంటిన్ని, లేడిపిల్లయొక్క చూపులతో సమానమయిన చూపులు గలిగినటువంటిన్ని, ఊడిపోయిన కేశములును, వస్త్రములును గలిగినటువంటిన్ని, మిక్కిలి దుఃఖించుచున్న కుమార్తెను తండ్రియైన సుదేవుఁడుచూచి గోలబడియేడ్చెను. తరువాత భూమిమీద బడియుండి శోకించుచున్న కుమార్తెనుజూచి హాహాహతుఁడై (మిక్కిలి కొట్టబడినవాఁడై) పతివ్రితయై, బాలయై, మన్మథావస్థలోనుండి భర్తృవిహీనయైన యీ నాకుమార్తెను నేను చూడలేనని పలికెను.

శ్లో॥ కథంవ్యతీయు ర్దివసాని తస్యాః అవాచ్యదుఃఖాతిభయావహాని। పురాణయాకల్పితపాతకాదికై ర్బాలేద్యవైధవ్యదకాశ్మి హేతుభిః॥

తా॥ ఈ చిన్నదానికి యింత దుఃఖములో దినము లెట్లు గడచును ఈచిన్నది పూర్వజన్మమం దాచరించిన పాతకములచేత నిప్పుడు బాల్యమందే వైధవ్యమునుబొందెను.

శ్లో॥ మూఢోవిధాతా రమణీం వరాననాం సృష్ట్వాచ వైధవ్యఫలంచ మస్తకే। సమాలిఖ ద్దీనదయాపరః పురా ధిగ్ధిగ్విధాతారమకర్మకారకమ్ ॥

తా॥ దీనదయాళువయిన బ్రహ్మ సుందరియైన కన్యను బుట్టించి వైధవ్యమును లలాటమందు పూర్వము వ్రాసెను. ఎంత మూఢుఁడైనాఁడు. ఛీ! ఛీ! సృష్టికారకుఁడయిన బ్రహ్మ దుష్కర్మకారకుఁడైనాఁడు,

శ్లో॥ ఇత్థం సుదేవ స్తనయాంతి లోకయన్ శుశోచ పత్నీసహిత

స్త్వనేకథా। తదాగమాయాతి యతీ దృఢవ్రత స్సమస్తజంతు వ్యస నాపహారకః॥

తా॥ సుదేవుఁడు భార్యతోసహా యీప్రకారముగా కూతురునుజూచి అనేక విధములుగా శోకించెను. అంతలో నియతవ్రతుఁడును, సమస్త జంతువుల కష్టముల నివారించు స్వభావముగలవాఁడునునయిన దృఢవ్రతుఁడను నొక యతీశ్వరుఁడు వచ్చుచుండెను.

శ్లో॥ యతీ సతత్రత్య గృహేషు పర్యటన్ శుశ్రావ తద్రోదన మార్తినాశకః। దయాపర స్తన్నికటంయయౌ శుభే తమబ్రవీ త్కిం బహురోదనం ద్విజ॥

తా॥ ఆయతి భిక్షార్థమై ప్రతిగృహమును తిరుగుచు వచ్చుట నా రోదనమును విని దయావంతుఁడై యచ్చటికి విచ్చేసి ఆ సుదేవునితో నిట్లనెను. నీవెందుకు గొప్పగా నేడ్చుచున్నావు.

శ్లో॥ బ్రూహ్యద్య దాసార మనంతదుఃఖ హేతుం క్షణే నాద్య విమోచయిష్యే। ఇత్థం యతీంద్రప్రవరోదితం శుభే శ్రుత్వాతిహర్షా దథ వాక్యమబ్రవీత్॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! నీ దుఃఖహేతువును మాకుఁ జెప్పుము. క్షణములో నీ దుఃఖమును తీసివేతును. ఈప్రకారముగా పలికిన యతిపుంగవుని వాక్యమును విని సంతోషించి సుదేవుఁడు యతీశ్వరునితో పలుకుచున్నాఁడు

శ్లో॥ శ్రుత్వాత్వ దుఃఖాతిశయం మహామతే త్వద్దర్శనా త్కింపిత తద్గృదంతరా। ఇయం కుమారీ తనయా మమ ప్రభో సుశోచతీ భర్తృమృతౌ సుశోభనా॥

తా॥ ఓమహానుభావా! మాదుఃఖమును వినుము. నీదర్శనమువలన నాదుఃఖము పోయినది నాకు శాంతి సుఖము గలుగును ఈచిన్నది నాకూతురు. ఈసుందరిభర్త చనిపోయినాఁడు. అందుచేత నిది యేడ్చుచున్నది.

శ్లో॥ తద్రోదనోపాధి బలా దహం తథా శోచే బహుస్నేహ తయా మహామతే। పురానయా దుష్కృత మార్తిదాయకం కృతంవద స్వాఖిలమత్రజన్మని॥ త్వందుఃఖ వైశ్వానవమాశుదీ వ్యకం శాంతిం కురు

త్వద్వచనోదబిందుభిః । ఇత్థం సుదేవ ద్విజవర్యభాషితం దుఃఖం తదాకర్ణ్య యతిర్జగాదతమ ॥

తా॥ దీనియందు నాకుఁగల ప్రేమచేత దీని రోదనము నుజూచి నేనును ఏడ్చుచున్నాను. ఈచిన్నది పూర్వజన్మమం దేమిపాపమాచరించెనో, యీజన్మమందేమిపాపమాచరించెనో చెప్పుము మిక్కిలి మండుచున్న దుఃఖమను అగ్నిని నీవాక్యములను జలబిందువులచేత చల్లార్చుము. ఈప్రకారముగా పలుకఁబడిన సుదేవుని దుఃఖకారణమును విని యతి తిరిగి పలుకుచున్నాఁడు.

శ్లో॥ సుతా పురా తేఽఘబాహుజాత్మజా సురూపలావణ్య కృశోదరీప్రియా । జారప్రియా రూప వయో విచక్షణై స్సైరోద్బోధితా భర్తృవధాయ దుస్సహా ॥

తా॥ పాపరహితుఁడవయిన యోబ్రాహ్మణుఁడా! వినుము. నీకుమార్తె పూర్వజన్మమందు క్షత్రియకుమార్తె. అతిసౌందర్యవతి. తనుమధ్య. జారులయందు దాసక్తిగలిగినదియునై జారులమాటచొప్పున తన భర్తను చంప నుద్యోగించెను.

శ్లో॥ పతింతదా వావ్య విదర్భనాయకం జఘానకోపాదశినామహో నిశి । దృష్ట్వామృతం స్వాత్మపతిం శుశోచసా రాత్రౌ పునస్తత్ర మహో భయాన్వితా ॥ తదా స్వయం తేన జఘానచాత్మనా మృతింవృథాసా ప్రయయౌమహామతే । కృతంపురా స్వాత్మవిఘాతనంపతిం తథానయా ఘాతయతీద మద్భుతమ్ ।

తా॥ ఇట్లుద్యోగించి విదర్భ నాయకుఁడయిన తనపతిని అర్థరాత్రమందు నిద్రించుచున్నవానిని ఖడ్గముచేత జంపెను. అట్లు చంపి మహాభయముతో శోకించెను తరువాత ఖడ్గముతో తనను చంపుకొనెను. ఈప్రకారముగా పతిహత్య స్వాత్మహత్య నాచరించెను. ఎంత అద్భుతమో వినుము.

శ్లో॥ ఇత్థం తయా దుష్కృతపాతకాదికం కృతంతదాపే తనయా వరాననా । తద్దోషతస్తే తనయాపతిర్మృతో వైధవ్యమాసీ ద్బహు దుఃఖకారణమ్ ॥

తా॥ అది యిట్లుగా పూర్వమందు పాతక మాచరించినది. ఆమెయిప్పుడు నీకు పుత్రికయై జన్మించెను. ఆదోషమువలన నీపుత్రికయొక్క భర్త మృతుఁడాయెను నానాదుఃఖనిధానమయిన వైధవ్యము సంప్రాప్తమాయెను.

శ్లో॥ విశల్మాషే పీతభయే ఉమలే కులే జనించ తస్యాః వ్రవదామి త్వం శృణు ॥

తా॥ ఈచిన్నది దోషయుక్తమయిన దానికి పాపరహితమును భయహీనమును నిర్మలమునునైన నీకులమందు (గృహమందు) జన్మించుటకు కారణమును జెప్పెద వినుము.

శ్లో॥ ఇత్థం పురాజన్మ చతుర్దశేగతే సంప్రాప్తమాఘే మకరే దివాకరే। సరస్వతీతీరముపాగతాజనై ర్దిష్ట్వాచగౌరీవ్రతపారగైస్తథా ॥ తస్యాం ద్విజస్త్రీగణమేత్య దర్శనం తాం మాఘగౌరీ మథ సైకతామయీం। సమర్చ్యగౌరీ మఖలేశ్వరీంస్త్రియో దినేషుమాఘవ్రతమాచరన్ముదా। దృష్ట్వా పురాతే గినయాత్వదన్వయే భవేస్విశాపే విమలే మునీశ్వర ॥

తా॥ పూర్వము పదునాలుగు జన్మలకు క్రిందట మాఘమాసమందు మకరమందు సూర్యుండుండగా గౌరీవ్రత పరాయణులగు వారితో పంతోషముతో సరస్వతీనదికి వెళ్ళినది. ఆ సరస్వతీనదియందు బ్రాహ్మణ స్త్రీబృందము సైకతముచేత మాఘగౌరిని చేసి మాఘమాసమందు ప్రతిదినంబున భక్తితో బూజించిరి ఈచిన్నదివారిచే బూజింపఁబడు గౌరిని, పూజాక్రమమునున్ను జూచుటవలన నిర్మలమయిన నీవంశమందుజన్మించినది.

శ్లో॥ తథేహజన్మ న్యతిపాపమీదృశం వనేవిహారా త్స్వరత స్తవానఘ। శిష్యేణతేనంగములాద్దతారతిం చకారతద్దోషభరందురాసదమ్ ॥

తా॥ అట్లుగానే యీ జన్మమందును నీసన్నిధిలో వనవిహారమువలన ఘోరమయిన పాపముచరించినది ఆ దేహంబె అరణ్యమందు నీ శిష్యునితో మన్మథోద్రేకముచేత సంభోగించినది. అదోషము అత్యుత్కటమయినది. దానిఫల మిప్పుడే అనుభవించక తప్పదు.

శ్లో॥ సాకర్మణా ద్దుష్కృతజాతభూరిణా సుశోచతీత్వంతువృథైవ శోచసే। యత్కర్మజాతం సుకృతం గథావరం భుంజంతి తత్కర్మఫలాఫలం నరాః ॥

తా॥ కాఁబట్టి పూర్వజన్మార్జిత మయినటువంటిన్ని ఈజన్మసంచితమయినటువంటిన్ని మహాపాతకములచేత ఆకివ్య యిట్టి అవస్థనుబొంది దుఃఖించుచున్నది. నీవు వృథాగా దానికొరకు శోకించెదవు. మనుష్యులకు తాముచేసిన పాపపుణ్యముల ఫలము ననుభవించక తప్పదు.

ఈశ్వర॥ శ్లో॥ శ్రుత్వా యతీంద్రస్య వచః పురాతనం తదేహ దేవేశి పురాకృతం త్వఘం । పిధాయ కర్ణద్వయ మాశు చింతయన్ ఉవాచ తం యోగివరం వరాననే ।

తా॥ ఈశ్వరుఁడు చెప్పుచున్నాఁడు ఓ పార్వతీ! ఈప్రకారముగా పలికిన యతీంద్రుని వాక్యమును సుదేవుఁడు విని యెంతకష్టము పూర్వమందు పతిహత్యయు ఆత్మహత్యయు యిప్పుడు కన్యాత్మమందే గురుపుత్రితో సంగమమును నాచేసి నది. హరిహరీ! ఏంత పాపపుమాట వినఁబడెనని రెండు కర్ణములను చేతులచే మూసి కొంతకాలము చింతించి తిరిగి యోగినిగురించి యిట్లనియె.

సుదేవ॥ శ్లో॥ తాతమేతనయా పాపం కేన శీఘ్రం వినశ్యతి । జామాతా కేనపుణ్యేన పునర్జీవేన యోజితః ।

తా॥ ఓనాయనా! ఏయుపాయముచేత నాకుమార్తెపాపమునశించును. నాఅల్లుఁడును యేపుణ్యముచేత తిరిగి జీవించును.

శ్లో॥ వక్తుమర్హసిమే బ్రహ్మన్ శ్రోతుకామాయ సాంప్రతమ్ ।

తా॥ ఓ యతీశ్వరా! ఈవిషయమంతయు యిప్పుడు వినగోరినాను చెప్పుము అని సుదేవుఁ డడిగెను.

దృఢవ్రతః । శ్లో॥ సుతాయాస్తు సుమాంగల్య వృద్ధ్యర్థం యది కాంక్షసే । జామాతు స్తవవిప్రేంద్ర సర్వాఘౌఘనివారణమ్ । వక్ష్యామి శ్రుణుతే మాఘే మాసిచోషసి మజ్జనం । కారయిత్వాతు సుతయా తటాకేవా జలాశయే । కృత్వా గౌరీంతు తత్తీరే దేవీం తత్రైసైకతా మయీం । సుగంధధూపదీపైశ్చ పుష్పతాంబూలమోదకైః । సువాసినీభిస్సాదేవీ మర్చయిత్వావిధానతః । ఏవం దినేదినేమాఘే స్నాత్వా భ్యర్చ్యైనమేస్సదా । ఏవం గౌరీవ్రతం మాఘే కృత్వాస్తేషుహరాయచ । కారయాస్యాశ్వతిర్జీవే న్నాత్రకార్యావిచారణా ।

తా॥ దృఢవ్రతుఁడను నా యతిపుంగవుండు వచించుచున్నాఁడు. ఓ సుదేవ! నీకుమార్తె మాంగల్యవృద్ధినిన్ని, నీ అల్లునకు పాపక్షయమునున్ను కోరితివిగనుక చెప్పెదను వినుము. మాఘమాసంబున ఉషఃకాలమందు నీకుమార్తెచేత తటాకమందుగాని, నది యందుగాని స్నానముచేయించి అతీరమందే యిసుకచే గౌరీవిగ్రహమును చేసి సువాసినీ సహితముగా ధూప దీప నైవేద్యాదులచేత నా గౌరిని పూజించవలెను. ఈప్రకార

ముగా ప్రతిదినమందు పూజించి నమస్కరించవలెను. ఇట్లు నీకుమార్తెచేత మాఘమాస మందు మాఘగౌరీ వ్రతము చేయించితివేని నీకుమార్తె పాపములు నశించును. భర్త పునర్జీవితుఁడగును. ఇందుకు సందియములేదు.

శ్లో॥ మాఘేతృతీయే దేవేశి సువాసిన్యా మహామతే। శూర్ప యుగ్మం సతార్పాసం సహరిద్రం ఫలాన్వితమ్॥ సతాంబూలం ముదా దత్వా పూజయిత్వాంజనాదిభిః। ప్రదక్షిణనమస్కారాః సప్తవారం సమాచరేత్। భోజయిత్వాన్యసంసర్గాత్ స్త్రీణా మఘనివారణమ్॥

తా॥ మాఘశుక్ల తృతీయా దినమందు రెండు క్రొత్తచేటలను దెచ్చి అందులో కొంక చీర, రవిక, పసుపు, ఫలములు, తాంబూలము, దక్షిణలనుంచి యొక సువాసినీ స్త్రీని కాటుక మొదలయినవాటిచే పూజించి యీశూర్పయుగ్మము (మానివాయన మును) నామునైవేద్యమిచ్చి, సప్తప్రదక్షిణ నమస్కారములను జేసి షడ్రసోపేతముగా నన్నమిడినయెడల యీచిన్నదానియొక్క సంసర్గదోషము యాపత్తు నశించును.

(అత్రదేవేశీతి సంబోధనేన శివవాక్యమిదమితి ప్రతిభాతి తథా నాస్తిగ్రంథే శివఉవాచేతి। యది యతివాక్యం భవేత్తర్హి దేవేశీతి సంబోధనం వ్యర్థంభూయాత్। అతః పాఠాంతరకల్పనా కార్యా। నోచే దీశ్వరఉవాచేతివా రచితవ్యం మహాపురాణేస్మిన్ పాఠాంతరకల్పనస్య సాహసమర్హా ఇత్యుపేక్షితం తదర్థనిర్ధారణే।)

శ్లో॥ బ్రహ్మన్ తేతనయాయాశ్చ మాఘమాసి నిమజ్జనాత్। నశ్యంతి సర్వపాపాని నైవకుర్యాత్సంశయమ్॥

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! మాఘస్నానమువలన నీకుమార్తె సమస్తపాపములు నశించును. సందేహపడవద్దు.

శ్లో॥ మాఘే మకరగే భానౌ యస్స్నాతి స్వర్యోదయే సదా। నారీవా పురుషోవాపి కృతాఘైరిహముచ్యతే॥

తా॥ మకరమందు రవియుండఁగా మాఘమం దరుణోదయకాలమందు స్త్రీగాని, పురుషుఁడుగాని స్నానమాచరించినయెడల స్వయంకృతపాపములచేత ముక్తులగుదురు.

శ్లో॥ మాఘేచార్కోదితేనూర్ధ్వ మకరస్థేదివాకరే। స్నాత్వార్చ నంచ చక్రాంకం యఃకుర్యాత్సహరింప్రజేత్॥

తా॥ మాఘ మకరమందు స్నానముచేసి హరిని పూజించి చక్రాంకమును వేయు వాడు హరిని బొందును.

శ్లో॥ అభర్తృకావా సభర్తృకావా యాకుర్యాన్మాఘమజ్జనం! అభర్త్రీ విష్ణుమాప్నోతి సభర్త్రీ నిత్యమంగళమ్ ॥

తా॥ విధవగాని, పుణ్యస్త్రీగాని మాఘస్నాన మాచరించిన ఫలముగలదు భర్త లేని స్త్రీ విష్ణులోకమును బొందును. సువాసినీ సర్వదా మంగళమును బొందును.

శ్లో॥ మాఘస్నానం వరం స్త్రీణాం ద్విజాతీనాం తథోత్తమం। సర్వదుఃఖప్రశమనం సర్వమాంగల్యదాయకమ్ ॥

తా॥ స్త్రీలకు మాఘ స్నానము ముఖ్యము. బ్రాహ్మణులకును ఉత్తమము. సర్వదుఃఖ నివారణము. సర్వమంగళ దాయకము.

శ్లో॥ మాఘస్నానప్రతానాంతు మాఘమాహుర్మహర్షయః॥

తా॥ ఋషులు మాఘస్నాతలకు పాపములు లేవని చెప్పిరి. మా అఘం అఘ మనగా పాపము, మా అనగా లేదు. మాఘం పాపములేదని తాత్పర్యము.

శ్లో॥ ఉన్మత్తోవా జడోవాపి నారీవా పురుషోపివా। సంగాత్స్వభావా ద్దంభాద్వా మాఘస్నానా ద్ధరింవ్రజేత్ ।

తా॥ ఉన్మత్తుడుగాని (పిచ్చివాడు) జడుడుగాని, (యేమియు తెలియనివాడు) నారిగాని, నరుడుగాని, సంగమువలనగాని, స్వభావమువలనగాని, దంభము వలనగాని మాఘస్నాన మాచరించిన హరినిబొందును.

శ్లో॥ ఇత్యుక్తో యతినావిప్ర స్సుదేవో నగనందిని। తథాహీతి యతింనత్వా స్వేచ్ఛాచారగతో యయా ।

తా॥ ఓ గౌరీ! ఈప్రకారముగా యతి పలుకులువిని అట్లే ఆచరింతునని సుదేవుడు పలికి యతికి వదంన మాచరించెను యతియు స్వేచ్ఛగా వెళ్ళిపోయెను.

శ్లో॥ సంప్రాప్తె దైవయోగేన మాఘే వ్యఘనివారకం। గౌరీవ్రతం తతః పుత్ర్యా మాఘస్నానం సుఖప్రదం। సుదేవః కారయామాస భక్త్యా కాత్యాయనీవ్రతమ్ ।

తా॥ తరువాత సుదేవుడు దైవయోగముచేత సంప్రాప్తించిన మాఘమాసమందు తన పుత్రికచేత పాపనివారణార్థము మాఘస్నానమునున్ను, మాఘగౌరీ వ్రతమునున్ను చేయించెను.

శ్లో॥ తత్పుణ్యేన మహాదేవి సఖీభిః పితృసంయుతా । సభర్త్రీ ప్రయయాచాంతే వైకుంఠంచ సుచిస్మితే ।

తా॥ ఓ కాత్యాయనీ! ఆ పుణ్యముచేత నామె పాపములు నశించెను. భర్త జీవించెను. పిమ్మట సఖులతోడను తండ్రితోడను అనేక భోగముల ననుభవించి అంతమందు భర్తతోసహా వైకుంఠలోకము చేరెను.

శ్లో॥ మాఘస్నానం మహత్పుణ్యం కృత్వా దేవి ద్విజోత్తమః । ప్రయయౌ విష్ణుసాయుజ్యం పితృభిస్సహ శోభనే ।

తా॥ ఆ సుదేవుడును పుణ్యప్రదమయిన మాఘస్నాన మాచరించి తన పితురులతోగూడా విష్ణుసాయుజ్య ముక్తిని బొందెను.

శ్లో॥ తత్తస్మాన్మాఘమాసేతు కించి దభ్యుదితే రవౌ । హరిం యోర్చయతి స్నాత్వా సవైకుంఠేశ్వరో భవేత్ ।

తా॥ కాఁబట్టి మాఘమాసమందు రవి కొంచెముదయించినవాఁ డగుచుండఁగా స్నానముచేసి హరిని పూజించువాఁడు వైకుంఠలోకాధిపతి యగును.

ఇతి ద్వితీయోధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ తృతీయోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీదేవ్యువాచ । శ్లో॥ తచ్ఛిష్యస్య భవేత్పాపం సుదేవస్య మహాత్మనః । కథం తద్వద దేవేశ శ్రోతుమిచ్ఛామి సాంప్రతమ్ ।

తా॥ పార్వతి ప్రశ్నించుచున్నది. ఓ శంకరా! మహాత్ముఁడైన ఆ సుదేవుని యొక్క శిష్యున కేమిపాపము సంభవించెనో వినగోరినాను గాన నిప్పుడు చెప్పుమా.

శ్రీమహాదేవః । శ్లో॥ పశ్చాత్తాప మనుప్రాప్త శ్శిష్యస్తస్య శుభేక్షణే । గురుం సుదేవమాహేదం కించిత్కాలాంత రేనఘమ్ ।

తా॥ ఓ పార్వతీ! కొంతకాలమునకు ఆ సుదేవుని శిష్యుఁడు పశ్చాత్తాపమును బొంది పాపరహితుఁడయిన తన గురువునుగూర్చి యిట్లనియె.

శ్లో॥ గురోమే విటనేచాసీ త్వత్పుత్ర్యాసహ సంగమః । కాంక్షేహం తయాసంగం కాంక్షమాణా కుమారికా । మయామాస్త్రీతి

యద్ఘోర మువాచ విపినే సుతా ! నశరోపి యతస్సంగం మయిమూఢ శుభేవనే ॥ త్యక్ష్యే కళేబరం తూర్ణం కిమన్యైర్బహుభాషణైః । తచ్ఛ్రుత్వాహం తతోభీత స్త్వత్తశ్చావవిశంకితః ॥ గురోరణ్యే మయాసాకం కృతం రతిసుఖప్రదం । త్వత్సుతాకృత దోషేణ మహాదోషఉపాగతః ॥ విధత్స్వమాం గురుశ్రేష్ఠ ప్రాయశ్చిత్తం సుఖప్రదమ్ ॥

తా॥ ఓ గురుపుంగవా! అరణ్యమందు నాకు నీకుమారికతో సంభోగమాయెను. అది నేను కోరినదికాదు. నీకుమారికయే కోరినది. అప్పటికిని నేను వద్దని చెప్పినను నాతో సంభోగించనియెడల నే నిక్కడనే శరీరమును విడుతునని ఘోరముగా పలికినది అప్పుడు కుమారిక మృతించిన మీరు శపింతురనే భయముచేత సంభోగము జేసినాను. నీ కుమార్తెమూలముగా నాకు నింతదోషము ప్రాప్తమయినది. కాన నే నీదోషము సహించలేనుగనుక నాకు ప్రాయశ్చిత్తమును జెప్పుము. దాని ననుష్ఠించి సుఖినౌదును.

శ్లో॥ ఏవం శిష్యవచశ్శ్రుత్వా సుదేవో గురుసత్తమః । శిష్యం విజ్ఞాపయామాస పరేచ్ఛా ప్రాప్తకర్మణః ॥ ముక్తిమాహ శ్రుణుష్వేహ వత్సగచ్ఛసరిద్వరాం । మందాకినీసరిత్తీరే తపశ్చరసుదుష్కరం । తేవ తత్పాపహానిస్స్యా ద్ద్వాదశాబ్దైగతేతవ ॥

తా॥ ఈప్రకారమడిగిన శిష్యునిమాట విని గురువు పరేచ్ఛవలన వచ్చినదోషమునకు ప్రాయశ్చిత్తమును జెప్పుచున్నాడు. ఎట్లంటే, కుమారా! వినుము. గంగకుబోయి తత్తీరమందు పన్నెండు సంవత్సరములు ఘోరతపస్సు నాచరించుము. అట్లాచరించిన నీపాపము నశించును.

శ్లో॥ ఏవం గురువచశ్శ్రుత్వా తదాజ్ఞాం శిరసావహన్ । గురుం నత్వాజగామాసౌ శిష్యో భాగీరథీతటమ్ ॥

తా॥ శిష్యుడు యీప్రకారముగా బలికిన గురువుగారి మాటను విని గురువు ఆజ్ఞనుబొంది నమస్కరించి గంగానదీతీరమునకు వెళ్లెను.

శ్లో॥ సగచ్ఛన్ మార్గమధ్యేతు దదర్శ మునిసేవితం । దివ్యాశ్రమం మనోరమ్యం సర్వజంతు సుఖావహమ్ ॥

తా॥ ఆ శిష్యుడు గంగకుబోవుచరి మార్గమందు మునులతో గూడినదియు, మనస్సునకు రమ్యమైనదియు సమస్తప్రాణులకు సుఖకరమయినదియు నయిన వొకదివ్యాశ్రమమును జూచెను.

శ్లో॥ విశ్రాంతః ప్రాప్తవాంస్తత్ర గంగాస్నాతవశర్మితః। నదీ న్యాంమునయస్సర్వే మాఘస్నాత్వా శుచివ్రతాః। సశిష్యాస్ససుతా స్తత్ర సభార్యాస్సంశ్రితవ్రతాః। సుఖోపవిష్టాః పులినే నద్యాస్సైకతే శుభే। శృణ్వంతో మాఘమాహాత్మ్యం నందయంతః పరస్పరం। అర్చయంతోచ్యుతం భక్త్యా కీర్తయంతో హరింపరం। సుదేవశిష్యస్తా న్సర్వాన్ దదర్శ శమలేక్షణే।

తా॥ చూచి, అతపపీడితుడై మార్గాయాసమును జెందిన యా శిష్యుడు ఆ దివ్యాశ్రమమునకొచ్చి అచ్చట నదీతీరమందు మాఘస్నానమాడి శుచులై పుత్రులతోను, శిష్యులతోను, భార్యలతోను గూడి సుఖముగా కూర్చుండి మాఘమహాత్మ్యమును వినుచు, ఆనందించుచు, హరిని బూజించుచు, కీర్తించుచున్న మునిపుంగవులను జూచెను.

శ్లో॥ తానాహ నత్వా దేవేశి వినీతస్సఃకృతాంజలిః। యుష్మాభి ర్మునిశార్దూలాః కింకృతం వ్రతముత్తమమ్।

తా॥ చూచి నమస్కరించి నమ్రుడై కృతాంజలియై ఆమునిపుంగవులను గూర్చి యిట్లనియె. ఓ మునిశ్రేష్ఠులారా! మీచే నాచరించబడు నుత్తమవ్రతమెద్ది.

శ్లో॥ కిమనేనఫలం ప్రాప్తం కోలోకః కస్య పూజనం। వదంతు కృపయాయూయం శిష్యాయ ప్రణతాయచ।

తా॥ ఈ వ్రతముచేత నేఫలము పొందబడును. ఏలోకము వచ్చును. ఈపూజ యెవ్వనిది. సమస్తము మీ శిష్యుడనైనటువంటిన్ని నమస్కరించుచున్న నాకు దయచేత మీరు చెప్పుదురుగాక.

శ్లో॥ జ్ఞాతు మిచ్ఛామి యుష్మాభి ర్వ్రతం పాపవినాశనం। యుష్మత్కృపావలోకేన శ్రుత్వాశ్రుత్వా పునామ్యహమ్।

తా॥ పాపవినాశనకరమయిన యీవ్రతమును మీవలన వినగోరితి. మీయొక్క దయాదృష్టిచేత నేను విని పవిత్రుడనగుదును.

శ్లో॥ శ్రుత్వేత్థం తస్యశిష్యస్య వచస్తే సంశ్రితవ్రతాః। సత్యవ్రతంమునిశ్రేష్ఠ మాహుస్తద్ధర్మశంసనే।

తా॥ ఈప్రకారముగా పలికిన ఆ శిష్యునిమాటల నాశ్రితవ్రతులై విని యాశిష్యునకు మాఘధర్మమును జెప్పుమని సత్యవ్రతుడను నొక మునిశ్రేష్ఠుని నియమించిరి.

శ్లో॥ మునిస్సత్యవ్రతస్తస్మై సమాజ్ఞప్తస్తమబ్రవీత్ । వక్ష్యామి శ్రుణు తే విప్ర సావధానేన చేతసా ॥

తా॥ ఇట్లాజ్ఞాపించబడిన సత్యవ్రతుఁడా శిష్యునితో నిట్లని పలికెను. ఓ బ్రాహ్మణుఁడా! చెప్పెదను. సావధానమనస్కుఁడవై వినుము.

శ్లో॥ మాఘమాసవ్రతమిదం మహాపాతకనాశనమ్ ॥

తా॥ ఇది మాఘవ్రతము. మహాపాతకములను నశింపజేయును.

శ్లో॥ సంప్రాప్తే మాఘమాసేతు మకరస్థే దివాకరే । ప్రాతస్సూర్యోదయే స్నానం యః కుర్యాత్స హరిప్రియః ॥

తా॥ మాఘమాసంబున మకరమందు సూర్యుఁడుండఁగా యెవ్వఁడు సూర్యోదయకాలమందు స్నానముచేయునో వాఁడు శ్రీహరికి ప్రియుఁడగును.

శ్లో॥ ప్రాతస్సూర్యోదయే మాఘే స్నాత్వా విష్ణుమతంద్రితః । పూజయిత్వా కథాం శ్రుత్వా ఏతన్మాసవ్రశంసినీం । మాఘవ్రతం మాసమేకం యః కుర్యాత్స హరిం వ్రజేత్ ॥

తా॥ మాఘంబున సూర్యోదయ కాలమందు స్నానముచేసి లోపములులేక విష్ణువును బూజించి యీ మాఘమహిమ ప్రతిపాదకమయిన కథను వినుచు ఒక్క మాఘమాసమందయినను సంపూర్ణముగా మాఘవ్రతము నాచరించినవాఁడు శ్రీహరిని బొందును.

శ్లో॥ మాఘస్నానవిహీనో యస్సత్యశౌచవివర్జితః । పరనిందాపరో నిత్యం తమాహుర్బ్రహ్మఘాతుకమ్ ॥

తా॥ మాఘస్నానవిహీనుఁ డెవ్వఁడో సత్యశౌచత్యాగి యెవ్వఁడో నిత్యము పరనిందాపరుఁ డెవ్వఁడో వాఁడు బ్రహ్మఘాతకుఁడని చెప్పఁబడును.

శ్లో॥ కూటసాక్ష్యప్రవక్తారం దురాచారం రతిప్రియం । మాఘవ్రతవిహీనంచ తమాహుర్బ్రహ్మఘాతుకమ్ ॥

తా॥ అసత్యపుసాక్ష్యమును చెప్పువానినిన్ని, దురాచారునిన్ని, సంభోగప్రియునిన్ని, లేక దుష్టసంభోగమును కాంక్షించువానినిన్ని, మాఘవ్రతపరిత్యక్తునిన్ని బ్రహ్మఘాతుకునిగా చెప్పుచున్నారు.

శ్లో॥ ఆరామచ్ఛేదకం క్రూరం కన్యా తురగవిక్రయం । మాఘస్నానపరిత్యక్తం తమాహుర్బ్రహ్మఘాతుకమ్ ॥

తా॥ ఆరామమును నఱకువాఁడును, క్రూరుఁడును, కన్యలను, అశ్వములను అమ్మువాఁడును (విక్రయించువాఁడును) మాఘవ్రత పరిత్యక్తుఁడును బ్రహ్మఘాతుకుఁ డని చెప్పఁబడును.

శ్లో॥ తటాకసేతుభేత్తారం పరస్త్రీసంగలోలుపం। మాఘస్నానపరిత్యక్తం తమాహుర్బ్రహ్మఘాతుకమ్ ।

తా॥ తటాకముల కట్టను త్రెంపి ఉదకములను బయటకు వెళ్లగొట్టువాఁడును, పరభార్యా సంభోగమం దాశగలవాఁడును, మాఘ స్నానమును విడిచినవాఁడును, బ్రహ్మఘాతకుఁ డనఁబడును.

శ్లో॥ దేవద్రవ్యాపహర్తారం తథాదత్తాపహారకం। మాఘస్నానపరిత్యక్తం తమాహుస్తేయినంబుధాః ।

తా॥ ఎవ్వఁడు దేవద్రవ్యమును హరించునో, దత్తద్రవ్యము నపహరించునో, మాఘస్నానమును విడుచునో వాఁడు స్తేయియని విద్వాంసులు పలుకుచున్నారు. స్తేయియనఁగా బంగారమును హరించువాఁడు. ౧ బ్రహ్మహత్య. ౨ సురాపానము, ౩ గురుతల్పగమనము, ౪ స్తేయి, సువర్ణహరణము, యీ నలుగురితో సహవాసము చేయుట, ౫ తత్సంసర్గము. ఈ అయిదును పంచమహాపాపము లనఁబడును. ఇందులో బ్రహ్మహత్యాసమానపాపమును చెప్పి స్తేయమును చెప్పుచున్నాఁడు

శ్లో॥ తదామీతి ద్విజాయాదౌ పశ్చాద్యో నాస్తికోధమః । మాఘస్నానపరిత్యక్తం సురాపంతవిదుర్బుధాః ।

తా॥ (సంకీర్ణముగా చెప్పఁబడుచున్నది) ఎవ్వఁడు బ్రాహ్మణునకు ముందుగా యిచ్చెదనని పలికి తరువాత లేదని చెప్పునో వానిని, మాఘస్నాన పరిత్యక్తునిన్ని సురాపునిగా చెప్పుచున్నారు అనఁగా దోషవంతుఁడని తాత్పర్యము.

శ్లో॥ గురువిప్రజనద్వేష్ట్యా మాత్మస్తుతి పరాయణం । మాఘస్నానపరిత్యక్తం తమాహుస్తేయినంబుధాః ।

తా॥ గురువులతోను, బ్రాహ్మణులతోను ద్వేషించువాఁడును, తన్ను తానే స్తుతిచేసికొనువాఁడును, మాఘస్నానవిముఖుఁడును స్తేయియని చెప్పఁబడును.

శ్లో॥ అసంస్కృతాన్నభోక్తారం పితృశేషాన్నభోజనం । మాఘవ్రతపరిత్యక్తం తమాహుస్తేయినంబుధాః ।

తా॥ వైశ్వదేవవిహీనమయిన యన్నము భుజించువాఁడును, పితృశేషాన్నమును తినువాఁడును, మాఘవ్రతపరిత్యక్తుఁడును సువర్ణహారి యనఁబడును.

శ్లో॥ పరస్త్రీసంగనిరతం భ్రాతృభార్యా రతిప్రియం। మాఘస్నానపరిత్యక్తం తమాహుర్గురుతల్పగమ్ ।

తా॥ అన్యభార్యా సంగము చేయువాఁడును, సోదరభార్యా సంగమము నాచరించువాఁడును, మాఘస్నాన రహితుఁడును గురుతల్పగామి యనఁబడును. (అనగా అగమ్యాగమన మాచరించువాఁడు.)

శ్లో॥ గుర్వంగనారతం శశ్వం గురుసంబంధినీరతం । మాఘస్నాన పరిత్యక్తం తమాహుర్గురుతల్పగమ్ ॥

తా॥ గురుభార్యాసంభోగియు గురుసంబంధినీ స్త్రీతో భోగించువాఁడును, మాఘస్నాన విముఖుఁడును గురుతల్పగామి యనఁబడును.

శ్లో॥ చండాలభాషిణం విప్రం వినా నైదర్భపాణినం । మాఘవ్రతపరిత్యక్తం తత్సంసర్గంతు పంచమమ్ ।

తా॥ చండాలురతో సంభాషించు బ్రాహ్మణుఁడును, దర్భరహితపాణియైన విప్రుఁడును, మాఘవ్రత శూన్యుఁడును తత్సంసర్గరూపా పంచమ మహాపాతకుఁ డని చెప్పఁబడును.

శ్లో॥ రజస్వలాయాశ్చండాల ధ్వానిం శ్రుత్వాన్నభోజనం మాఘవ్రతపరిత్యక్తం తత్సంసర్గంతు పంచమమ్ ।

తా॥ రజస్వలా చండాలుర మాటలు వినుచు భుజించువాఁడును, మాఘవ్రత రహితుఁడును తత్సంసర్గియనఁబడును.

శ్లో॥ దుర్సంగకరణాసక్తం నిర్వేదగ్రామవాసినం। మాఘవ్రత పరిత్యక్తం తత్సంసర్గంతు పంచమమ్ ।

తా॥ దుష్టసహవాసము చేయువాఁడును, వేదశూన్య గ్రామవాసియు, మాఘవ్రతత్యాగియు తత్సంసర్గియనఁబడును. శ్లో॥ బ్రహ్మహా చసురాపశ్చ స్తేయీచ గురుతల్పగః మహాపాతకినస్త్వేతే తత్సంసర్గీచ పంచమః ॥ బ్రహ్మహా= బ్రాహ్మణుని జంపువాఁడు, సురాపః= కల్లు త్రాగు విప్రుఁడు, స్తేయీ= బంగారమును హరించువాఁడు, గురుతల్పగః= పొందగూడని స్త్రీని పొందినవాఁడు తత్సంసర్గీ= ఈ నలుగురితో సాంగత్యము చేయువాఁడు యీ అయిదుగురును మహాపాతకు లనఁబడుదురు.

శ్లో॥ పురాణోద్వాహ మౌంజ్యాది ధర్మాణాం విఘ్నకారకం । మాఘవ్రతపరిత్యక్తం తమాహుః పశుఘాతుకమ్ ।

తా॥ పురాణశ్రవణమునకు, వివాహమునకు, ఉపనయనమునకు, ధర్మకార్యము లకు విఘ్నమాచరించువాఁడును మాఘవ్రతశూన్యుఁడును పశుఘాతుకుఁ డనఁబడును.

శ్లో॥ శరణాగతహంతారం సర్వతీర్థపరాఙ్ముఖం మాఘవ్రతపరిత్యక్తం తమాహుర్భ్రూణహం బుధాః ॥

తా॥ శరణుజొచ్చినవానిని చంపువాఁడును, తీర్థయాత్రావిముఖుఁడును, మాఘత్యాగియు భ్రూణహంతయని పెద్దలు చెప్పుచున్నారు. (భ్రూణమనఁగా గర్భము.)

శ్లో॥ పితృయజ్ఞపరిత్యాగం త్యక్తభార్యం కులాధమం। మాఘవ్రతపరిత్యక్తం తమాహుర్గోవిఘాతుకమ్ ॥

తా॥ పితృయజ్ఞత్యాగియు భార్యను విడిచినవాఁడును, కులాధముఁడు అనఁగా కులధర్మత్యాగియు, మాఘహీనుఁడును గోవిఘాతకుఁ డనఁబడును. (ఇచ్చట భార్యాత్యాగియనఁగా గుణవతియగు యున భార్యాత్యాగి యని అర్థము.) సద్యస్త్వప్రియవాదినీం॥ ఇతి. దుష్టభార్యాత్యాగము విహితమగుటవలన.)

శ్లో॥ ద్వేష్టారం మాతృపిత్రోశ్చ తమాహుర్గోవిఘాతుకమ్ ॥

తా॥ మాతాపితరులతో కలహించువాఁడు గోఘాతకుఁడని చెప్పఁబడును.

శ్లో॥ మహాపాపోపపాపాని క్షుద్రపాపానియానిచ। మాఘస్నానపరిత్యక్త మాశ్రయంతిసదానఘ ॥

తా॥ పంచమహాపాపములు, యితరోపపాతకములు, తక్కువ పాపములు, యింకా స్వల్పపాపములును మాఘస్నానవిముఖుని నాశ్రయించి యుండును. ʻమాఘస్నానవిహీనోయ స్పత్వశాచవివర్జితః॥ అను శ్లోకము మొదలు యితవఱకు చెప్పఁబడిన పాతకములు ఆయాపాతకముల నాచరించువారి నెట్లాశ్రయించి యుండునో అట్లే మాఘస్నానవిహీనుని ఆశ్రయించియుండును. మాఘస్నానహీనుఁడును, పాతకియు సమానులు. పూర్వోక్తపాతకులు యేకష్టములను బొందుదురో మాఘస్నానవిముఖులును ఆకష్టములను బొందుదురు గాన మాఘస్నానవైతవ్యము యిన్నిపాతకములకు నాలయము గనుక బుద్ధిమంతుఁడు మాఘస్నానమాచరించి సుఖముల బొందవలయు నని భావము.

శ్లో॥ అస్మాభిరర్థ తత్ప్రోక్తం పుణ్యం మాఘవ్రత మిదం శుభం। అస్యానుష్ఠానమాత్రేణ నరో ముచ్యేతకిల్బిషాత్ ॥

తా॥ మాచేనాచరించబడు-గి మాఘవ్రతము. దీని నాచరించినవాడు పాపవిముక్తుఁడగును.

శ్లో॥ మాఘేచార్కోదితే నార్క్యే యస్స్నాయాద్విష్ణుతుష్టయే। స్నానంకృత్వార్చయేద్విష్ణుం సోశ్వమేధఫలంలభేత్॥

తా॥ మాఘమందు అర్కోదయకాలంబున విష్ణుప్రీతికొఱకు స్నానమాచరించి విష్ణుపూజ నాచరించినవాఁడు అశ్వమేధయాగ ఫలమును బొందును.

శ్లో॥ మాఘస్య మాధవో దేవో వ్రతస్యాస్య ఫలప్రదః। తస్మాత్సమర్చయేన్మాఘే యోమాఘవ్రతకోవిదః॥

తా॥ ఈ మాఘమాసమునకు మాధవుఁ డధిదేవత. మాఘవ్రత ఫలము నిచ్చువాఁడు మాధవుఁడుగనుక మాఘవ్రతము నెఱిగినవాఁడా విష్ణువును బూజించవలెను.

శ్లో॥ యఃకుర్యాత్తులసీపత్రైర్మాఘే మాధవపూజనం। ప్రాతస్స్నాత్వా విధానేన సవైకుంఠేశ్వరో భవేత్॥

తా॥ ఏమానవుఁడు మాఘంబున ప్రాతఃకాలమందు స్నానమాచరించి యథావిధిగా తులసీపత్రములచేత లక్ష్మీనారాయణుని బూజించునో వాఁడు వైకుంఠలోకమున కధిపతియగును.

శ్లో॥ తులసీమంజరీభిర్యో మాఘే మాధవమవ్యయం। స్నాత్వా సమర్చయేత్ప్రాతో నద్యాం వాచాంబుసన్నిధౌ॥

తా॥ మాఘంబున ప్రాతఃకాలమందు స్నానమాడి తులసీగుత్తులతో మాధవుని అంబుసన్నిధియందు బూజించవలెను.

శ్లో॥ సుగంధధూపదీపాద్యై ర్నైవేద్యభోజ్యాదిభి శ్శుభైః। సతాంబూలఫలైర్విప్రః కృత్వా మాధవపూజనమ్॥

తా॥ ఆ విష్ణువును గంధ ధూప దీప భక్ష్య భోజ్య నైవేద్యాదులతోను, తాంబూల ఫలాదులతోను బూజించవలెను.

శ్లో॥ తతస్తదగ్రేతన్మాఘ మాహాత్మ్యంచాభ్యసేత్సుధీః॥

తా॥ పూజించి ఆ హరిసన్నిధిని మాఘమాస మాహాత్మ్యమును పఠించవలెను

శ్లో॥ పురాణశ్రావకాస్త్రీకథాలాపా మేతన్మాసప్రశంసినీం। యథాశక్తిసువర్ణాని వస్త్రాన్నోదకపాయసమ్॥ దత్వాచవిప్రవర్యేభ్యః మాసమేకం నిరంతరం। కందమూలఫలాద్యైశ్చ మాసమాత్రంవ్రతంచరేత్॥

తా॥ అట్లు కథాశ్రవణమును జేసి బ్రాహ్మణులకు సువర్ణ వస్త్ర అన్న ఉదక పరమాన్నముల నిచ్చి కందమూలఫలాదులచేత నియతముగా మాసవ్రతమును జేయవలెను.

శ్లో॥ మాసాంతే విప్రముఖ్యేభ్యో మాఘస్నాన పరాయణః । తుష్టయే దేవదేవస్య మాధవస్య మహాత్మనః । ఆచరే దన్నదానంతు వ్రతసంపూర్తికారకమ్ ।

తా॥ ఇట్లు మాసము వ్రతముసలిపి మాసాంతమందు మాఘస్నాన సాద్గుణ్య సిద్ధికై మాధవప్రీతిగా నన్నదానము బ్రాహ్మణులకొఱకు జేయవలెను.

శ్లో॥ ఏవం మాఘవ్రతం మర్త్యో యః ప్రీత్యై చక్రపాణినః । వతస్యపాపభీతిస్స్యా న్నాస్తితస్యాంతకాద్భయమ్ ।

తా॥ ఈప్రకారముగా నెవ్వఁడు పుండరీకాక్షుని ప్రీతికొఱకు మాఘవ్రతము నాచరించునో వానికి పాపభయములేదు. యమునివలన భయములేదు.

శ్లో॥ నపునర్జననం విప్ర నమాతుస్తనపో భవేత్ । నేంద్రియైః బాధితశ్చాపి నదుఃఖం నాత్రసంశయః ।

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! వానికి తిరిగి జన్మలేదు. పునః మాతృస్తన్యపానము చేయఁడు. ఇంద్రియములచేత నెన్నఁడును బాధనుబొందడు. ఎప్పుడును దుఃఖమును బొందడు. ఇందుకు సందియములేదు.

శ్లో॥ ఇదంతే కథితంవిప్ర శ్రోతుకామాయ సువ్రతం । స్నానం కుర్వత్ర నలితే నళినీ పావనోదకే । దినత్రయావశిష్టేతు మాఘేస్మి న్నఘహారకే ।

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! యిది మాఘవ్రతము. నీవు విన నిశ్చయించినందున చెప్పితిని. మాఘమాసము యిప్పటికి మూడురోజులు మిగిలియున్నది. పాపహారకమయి నదిగాన యీనదిలో స్నానము జేయుము.

ఈశ్వరః॥ శ్లో॥ సత్యవ్రత వచశ్శ్రుత్వా సశిష్య శ్రద్ధయాన్వితః । పరేచ్ఛాసంగతిప్రాప్త దోషంతస్మైన్యవేదయత్ ।

తా॥ శంకరుఁడు చెప్పుచున్నాఁడు. ఈప్రకారముగా సత్యవ్రతుని మాటలను విని శిష్యుఁడు శ్రద్ధావంతుఁడై పరేచ్ఛాసంగమమువలన ప్రాప్తమైన దోషము నా సత్యవ్రతునకు తెలియజేసెను.

శ్లో॥ తత్సర్వం జ్ఞాపయ త్తస్మై యథోద్దిష్టం గురుం పురా । యదుక్తం గురుణా పూర్వం సంప్రాప్తాఘవిహారకం । జ్ఞాపయామాస తత్తస్మై శ్రుత్వా సత్యవ్రతస్తతః ।

తా॥ పిమ్మట గురువుతో తాను విజ్ఞాపించదలచిన విషయమును చెప్పెదను. పిమ్మట గురువు తనకు విజ్ఞాపించిన పాప నివారణోపాయమును దెలియజేసెను. ఈ సమస్తమును విని సత్యవ్రతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ మాఘే దినత్రయ స్నానా చ్ఛ్రవణస్య ఫలాదికాత్ । సద్యోనశ్యంతిపాపాని పాత్రికార్యావిచారణా ॥

తా॥ మాఘమాసమందు మూఁడురోజులు స్నానము చేయుటవలననున్న కథా శ్రవణాది ఫలమువలననున్న తక్షణమందే పాపములు నశించును. ఈవిషయమై ఆలోచనచేయ నవసరము లేదు.

శ్లో॥ గచ్ఛ భాగీరథీతీర మశేషఫలదాయకం । కురు విప్ర తతః కాలే యదుక్తం గురుణా స్మరన్ ॥

తా॥ సమస్త ఫలదాయకమయిన భాగీరథీతీరమునకు వెళ్లుము. గురువుగారి మాటను స్మరింపుము గురువు చెప్పినచొప్పున నాచరించుము.

శ్లో॥ ముక్తిస్తే భవితానూనం జరా జన్మ వివర్జితా ॥

తా॥ అట్లయిన నీవు నిశ్చయముగా జన్మ, జరా, మరణ వివర్జితమయిన మోక్షమును గలుగును.

శ్లో॥ శ్రుత్వా సత్యవ్రతాశ్చిత్థం మాఘమాసే దినత్రయే । కృత స్నానో యయౌగంగా తీరం భక్తిపరాయణః । సముక్తః పాతకైస్సర్వై తపస్తేపే సుదుస్తరమ్ ॥

తా॥ ఈప్రకారముగా సత్యవ్రతునివలన విని మాఘమాసమందు మిగిలిన మూఁడు దినములయందు స్నానముజేసి సమస్తపాపవిముక్తుఁడై భక్తితో గంగాతీరముజేరి దుస్తరమయిన తపము నాచరించెను.

శ్లో॥ నిగృహీతేంద్రియ గ్రామో సహన్ శీతోష్ణమారుతాన్ । న్యస్తనాసాగ్రదృష్టిస్స న్నచల న్నణుమాత్రకం ॥ ధ్యాయన్ హృది పదే విష్ణుం భక్తానాం మోక్షదాయకం । శంఖచక్రగదాపద్మై ర్విరాజిత చతుర్భుజమ్ ॥ పీతకౌశేయవసనం కౌస్తుభోదర మచ్యుతం । హార గ్రైవేయ కటక కిరీటాంగదశోభితం । సలక్ష్మీకం శుభాకారం చింతయన్ మనసా శుభే ॥

తా॥ ఇంద్రియములను జయించి శీత వేష్ణ వాయువులను సహించి నాసాగ్ర న్యస్తదృష్టిగలవాఁడై కొంచమయినను చలించక భక్తిముక్తిప్రదుఁడును, శంఖమును,

చక్రమును, గదను, పద్మమును, చతుర్భుజములతో ధరించువాఁడును, పచ్చ పట్టుబట్టను ధరించినవాఁడును, ఉదరమందు కౌస్తుభమణిగలవాఁడును, ముత్యాలహార కంఠభూషణ కంకణ కిరీట కేయూరాదులచేత శోభిల్లువాఁడును, శుభాకారుఁడును నయిన లక్ష్మీ నారాయణుని హృదయస్థానమందు మనసా ధ్యానింపుచు ఘోరమైనతపము నాచరించెను

శ్లో॥ ఏవంభూతస్యశిష్యస్య తపః శర్మరతస్యచ । ప్రభావం యేన కేనాపి వక్తుంశ్యాపి నశక్యతె ॥

తా॥ ఓ గౌరీ! వినుము. ఈప్రకారముగా తపమాచరించు నా సుదేవశిష్యుని యొక్క ప్రభావమును వర్ణించుటకు ఒకానొకనికిని ఒకప్పుడును శక్యముగాదు.

శ్లో॥ వినిర్యయు ర్ద్వాదశాబ్దాః పురా యద్గురుచోదితాః ॥

తా॥ ఈప్రకారముగా గురువుచే నాజ్ఞాపింపఁబడినవిధముగా ద్వాదశసంవత్స రములు గడచినవి.

శ్లో॥ తతోజగామ నిర్వాణం ప్రసాదా చ్చక్రపాణినః । మాఘ స్నానప్రభావేన తపస్సిద్ధిరభూచ్ఛుభే ॥

తా॥ అనంతరమం దా శిష్యుఁడు పుండరీకాక్షుని ప్రసాదమువలన మోక్షమును బొందెను. ఓ గౌరీ! ఇదంతయు మాఘస్నాన ప్రభావముచేత నయినదిగా నెఱుంగుము.

శ్లో॥ తపఃప్రభావా త్తద్విష్ణోః పదం నిర్వాణకారణం । సుదేవ శిష్యః ప్రయయౌ మాఘస్నానప్రభావతః ॥

తా॥ ఆ సుదేవశిష్యుఁడు మాఘస్నాన ప్రభావముచేతనయిన తపఃప్రభావము చేత నత్యంత సుఖనిదాయకమైన నారాయణస్థానమును పదవిని బొందినవాఁడాయెను.

మహాదేవః ॥ శ్లో॥ మయాతే కథితం దేవి యత్పృష్టంతు త్వయా పురా ॥

తా॥ ఓ పార్వతీ! నీవు నన్నడిగినప్రశ్నకు సమాధానము చెప్పఁబడియెను.

శ్లో॥ సుదేవశిష్యస్య మహాఘసంక్షయం శ్రుణోతి మాఘవ్రత కోవిద స్సకృత్ । సయాతి వైకుంఠపురం సురాలయం విముక్తపాపః పితృభి ర్వరాననే ॥

తా॥ ఈ సుదేవ శిష్యునియొక్క పాపనాశనకథను మాఘస్నానపరాయణుఁ డొకమారైనను వినిన యెడల పాపముక్తుఁడై పితృలతోసహా వైకుంఠ లోకమునకు బోవును.

శ్లో॥ యఇదం శృణుతేధ్యాయం భక్తితో వాబలాదపి। సమాఘ ఫలమాప్నోతి సముక్త స్సర్వపాతకైః ।

తా॥ ఈ అధ్యాయమును భక్తిచేత గాని, నిర్బంధముచేత గాని వినువాఁడు మాఘ స్నానఫలమును బొంది పాపవిముక్తుఁడగును.

శ్లో॥ ఇదం భాగవతం పుణ్యం మాఘస్నానస్య వైభవం । నశృణోతి యదామూఢః సయాత్యంధతమస్శుభే ।

తా॥ భగవద్భక్తిపూరితమయిన యీ మాఘస్నానమహిమ నెవ్వఁడు వినఁడో ఆమూఢుఁడు అంధతమనే నరకమును బొందును.

శ్లో॥ ఛందోవిరహితం మంత్రం ఓంకారరహితం తపః । వినా మాఘకథాం ధర్మం వ్యర్థంభవతి పార్వతి ।

తా॥ ఛందోహీనమయిన మంత్రమును, ఓంకారశూన్యమైన తపస్సును, మాఘ కథను వినని ధర్మమును నిష్ఫలములని పార్వతితో పరమేశ్వరుఁడు చెప్పెను.

ఇతి తృతీయోధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ చతుర్థోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీమహాదేవఉవాచ । శ్లో॥ కథయామి పునర్దేవి మాఘస్నాన ఫలం శుభం । శృణుత్వమపి దేవేశి పరత్రేహ సుఖప్రదమ్ ।

తా॥ ఈశ్వరుఁడు పలుకుచున్నాఁడు. ఐహికాముష్మిక సుఖప్రదమైన మాఘ స్నానమహిమను తిరిగి మఱియొక కథను చెప్పుచున్నాను. ఓపార్వతీ! వినుము.

శ్లో॥ సార్వభౌమోథ వేదత్రి పరత్ర హరిమందిరే ।

తా॥ ఈ లోకమందును, పరలోకమందును, వైకుంఠమందును స్వారభౌముఁ డగును.

శ్లో॥ మాఘే శుద్ధ దశమ్యాంతు లక్ష్మీ నారాయణ వ్రతం । మాఘస్నానపరో భక్త్యా యఃకుర్యా త్సహరిప్రియః ।

తా॥ మాఘస్నాన పరాయణుఁడు మాఘమాసమందు శుద్ధ దశమినాఁడు భక్తితో లక్ష్మీనారాయణుని బూజించువాఁడు హరికి ప్రియుఁడగును.

శ్రీదేవ్యువాచ। శ్లో॥ లక్ష్మీనారాయణంనామ వ్రత మిష్టార్థదాయకం। కైర్ద్రవ్యైః కోవిధి శ్శంభో కథ మారాధ్యతేహరిః॥

తా॥ పార్వతి అడుగుచున్నది. ఓ శంభో! (శమస్మాద్భవతీతిశంభుః) ఇతని వలన సుఖము గలుగుచున్నదిగాన శంభువు (తస్యసంబుద్ధిః హేశంభో) అతనికి సంబోధన (ఓ శంభో) ఇష్టార్థప్రదమయిన యీ లక్ష్మీనారాయణవ్రతము యేద్రవ్యముచేత నాచరించదగినది. విధి యేమి పూజ యెట్లు చేయవలెను.

మహాదేవః॥ శ్లో॥ మాఘే శుద్ధ దశమ్యాంచ ప్రాతస్స్నాత్వా దితే రవా। నద్యాంవాపి గృహేవాపి మంటపం పరికల్పయేత్॥

తా॥ శివుడు చెప్పుచున్నాడు. మాఘ శుక్ల దశమినాడు ప్రాతస్స్నాన మాచరించి నదీతీరమందుగాని, స్వగృహమందుగాని మంటపము నిర్మించవలెను.

శ్లో॥ గోమయేనోపలిప్యాథ రంగవల్ల్యాదిధాతుభిః। మధ్యేచాష్టదళంపద్మం స్వస్తికావరణంలిఖేత్॥

తా॥ ఆ మంటపమును గోమయముచేత నలికి పచ్చరంగులతో ముగ్గులుబెట్టి మధ్యను అష్టదళపద్మమును లిఖించి స్వస్తికావరణమును నిర్మించవలెను.

శ్లో॥ నానాపుష్పఫలైర్యుక్తై ర్వితానాద్యై రలంకృతే। తస్మిన్ సంపూజయేద్దేవం సశ్రీకం జగదీశ్వరమ్॥

తా॥ అనేక పుష్ప ఫలములతోను, చాందినీలతోను అలంకరించబడిన ఆమంటపమందు జగత్ప్రభువయిన లక్ష్మీనారాయణుని పూజించవలెను.

శ్లో॥ సపల్లవఫలోపేతే కుంభేచోదకపూరితే। సవస్త్రప్రతిమాయుక్తే తస్మిన్ సంపూజయేద్విభుమ్॥

తా॥ నూతనకలశమందు ఉదకముంచి పంచపల్లవములను ఫలములనుంచి వస్త్రమునుకప్పి ఆ వస్త్రమందు లక్ష్మీనారాయణ ప్రతిమనుంచి పూజించవలెను.

శ్లో॥ సాలగ్రామశిలా మధ్యే స్థాప్యపీఠే సమర్చయేత్॥

తా॥ పీఠమధ్యను సాలగ్రామమునుంచి పూజించవలెను.

శ్లో॥ కోమలైస్తులసీపత్రైః పుష్పైరగరుచందనైః। పాయసాన్నఫలాపూపై ర్ధూపైర్దీపైర్మనోహరైః॥ పంచామృతవిధానేన పవిత్రైర్మంత్రవిత్తమైః। స్నాప్య సంపూజయేద్దేవం కల్పోక్తవిధినానరః॥

తా॥ సాలగ్రామమును పవిత్రులయిన బ్రాహ్మణులచేత పంచామృతములచేత స్నానము చేయించి మనోహరములయిన తులసీ పత్రములచేతను, పుష్పములచేతను పూజించి, చందనమిడి, అగరుచేతను, ధూప దీపములచేతను, పరమాన్నముచేతను, ఫలములచేతను, అపూపములచేతను పూజింపవలెను

శ్లో॥ స్నానం వైకుంఠవాసాయ వస్త్రమిష్టార్థదాయినే । జనార్దనాయోపవీతం గంధం గోవర్ధనాయచ । పుష్పం పద్మాలయాభర్త్రే ధూపమాదిత్యవర్చసే । దీపం సురేశ్వరాయేతి నైవేద్యం కేశవాయచ । తాంబూలం సుముఖాయేతి విష్ణవేతు ప్రదక్షిణం । నమస్కారం నృసింహాయ లక్ష్మీనారాయణాయచ । జపం శ్రీరామచంద్రాయ ఓంకారాదిత్రియక్షరం । ఇత్యేతైర్నామభిర్భక్త్యా అర్చయేదచ్యుతం శుభే ।

తా॥ ఓ పార్వతీ! వైకుంఠనిలయునికొఱకు స్నానము సమర్పించుచున్నాను అని యిట్లే అంతట చెప్పవలెను. అభిలషితదాయకునికొఱకు వస్త్రము, జనార్దనునికొఱకు యజ్ఞోపవీతము, గోవర్ధనపర్వతోద్ధారికొఱకు గంధము, కమలాలయాపతికొఱకు పుష్పము, సూర్యసమాన కాంతి శోభితునికొఱకు ధూపము, దేవేశ్వరునికొఱకు దీపము, పవిత్రకేశునికొఱకు నైవేద్యము, శోభనముఖునికొఱకు తాంబూలము, వ్యాపనశీలునికొఱకు ప్రదక్షిణము, నరహరిరూపునికొఱకు నమస్కారము, శ్రీ దశరథకుమారునికొఱకు ఓంకారాద్యక్షర త్రయాత్మకమయిన జపము సమర్పించుచున్నాను ఇవి మొదలయిన నామములచేత అచ్యుతుని అర్చింపవలెను.

శ్లో॥ తతః ప్రకల్పయేదర్ఘ్యం తామ్రపాత్రస్థవారిణా । మంత్రేణానేన దేవేశి తదగ్రే భక్తితత్పరః ।

తా॥ పార్వతీ! అనంతరము భక్తితో హరికి తామ్రపాత్రస్థితమయిన ఉదకము చేత అర్ఘ్యము నివ్వవలెను.

అర్ఘ్యదానమంత్రః । శ్లో॥ సర్వదేవనివాసాయ లక్ష్మీనారాయణాయచ । ఇదమర్ఘ్యం మయాదత్తం స్వీకురుష్వరమాపతే ।

తా॥ ఓ లక్ష్మీపతీ! సర్వదేవతలకు స్థానభూతుడ వైనటువంటివి. లక్ష్మీనారాయణాంశవయిన నీకొఱకు యీ అర్ఘ్యమును యిచ్చుచున్నాను. స్వీకరించుము.

శ్లో॥ యన్మయాచరితం దేవ త్వాముద్దిశ్య మమప్రభో । తత్సర్వం సఫలంకృత్వా రక్షమాం భక్తవత్సల ।

తా॥ దేవదేవా, మత్ప్రభూ, నాచేత నాచరించబడు సర్వమును సఫలముగా చేసి నన్ను రక్షింపుమూ, భక్తవత్సలా.

శ్లో॥ దానంచమాచరేత్పశ్చాత్తండులంలవణంగుడం । మాఘ స్నానరతైస్సుభ్రూ సపితృస్నేహబంధుభిః ।

తా॥ మాఘస్నాన మాచరించువారు పితృ బంధు జనులతోసహా బియ్యమును బెల్లమును లవణమును బ్రాహ్మణుల కివ్వవలెను. సుందరములయిన కనుబొమలుగల ఓ పార్వతీ!

శ్లో॥ శ్రుత్వైవమిదమాఖ్యాన మేతన్మాసప్రశంసనం । దేవస్య పురతో భక్త్యా వ్రతీసాక్షతపాణినా ।

తా॥ మాఘవ్రతి అక్షతలను బుచ్చుకొని దేవుని ముందర యీ మాఘమాస మహిమను భక్తితో వినవలెను.

శ్లో॥ బ్రాహ్మణాన్భోజయేచ్ఛక్త్యా యథాశక్త్యనుసారతః ।

తా॥ అనంతరము యథాశక్తిగా బ్రాహ్మణసంతర్పణ మాచరించవలెను.

శ్లో॥ ఏవంయఃకురుతేదేవి లక్ష్మీనారాయణవ్రతం । మాఘే శుద్ధదశమ్యాంతు మాఘస్నానపరాయణః । మేరుమందర తుల్యాని పాపానివివిధానిచ । వ్రతేనానేనదేవేశి తస్యనశ్యంతితత్క్షణాత్ ।

తా॥ ఓ పార్వతీ! ఈప్రకారముగా మాఘస్నాత మాఘశుద్ధ దశమినాడు లక్ష్మీనారాయణవ్రతము నాచరించినయెడల వ్రత మహిమచేత మేరుమందరపర్వత సమానములయిన వాని పాపములు నశించును.

శ్లో॥ వ్రతస్యాస్యసహాయంతు యఃకుర్యాద్ద్రవ్యవర్జితే । సోపి తత్ఫలమాప్నోతి మాఘేభక్త్యాశుచిస్మితే ॥

తా॥ చిఱునవ్వుగలిగిన ఓపార్వతీ! మాఘవ్రతము నారంభించువానికి యెవరు ద్రవ్యసహాయము చేయుదురో, ద్రవ్యము నుపయోగించుదురో వారలకును ఆ వ్రత ఫలము సిద్ధించును.

శ్లో॥ యఃకుర్యాద్దర్శనందేవి సమాఘే లక్ష్మీపతివ్రతం । ముక్త పాపస్తతోయాతి రాజా దుర్యోనితో యథా ।

తా॥ ఓ పార్వతీ! మాఘమందు లక్ష్మీనారాయణ వ్రతమును దర్శించువాఁడు రాజు దుర్యోనివలన నెట్లు ముక్తినొందెనో అట్లు పాపవిముక్తుఁడై ముక్తినొందును,

పార్వత్యువాచ ॥ శ్లో॥ కోరాజా కేనదోషేణ దుర్యోనిత్వమవాప్తవాన్ । కథంముక్తిర్భవేత్తస్య వదవిస్తరతోమమ ॥

తా॥ పార్వతి అడుగుచున్నది. ఆరాజు యెవ్వఁడు. ఏ దోషముచేత దుర్యోనిని బొందెను. అతనికి యెట్లు ముక్తి లభించినది ఈసర్వము విస్తరముగా చెప్పుము.

శ్రీమహాదేవః ॥ శ్లో॥ పురాతు గౌతమోనామ ముని ర్మునివరార్చితః । సర్వశాస్త్రార్థకుశల స్సర్వభూతదయాపరః ॥

తా॥ ఈశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. ఓగౌరీ! పూర్వకాలంబున సర్వశాస్త్రార్థవేత్తయును, సర్వజంతుదయాళువును, సర్వమునీశ్వర సత్కృతుఁడును నయిన గౌతముఁడను నొక ముని గలఁడు.

శ్లో॥ సశిష్యైర్బహుభిర్యుక్త స్సానుగై ర్నమ్రకంధరైః । తీర్థాని పర్యటన్నాగా త్కృష్ణవేణీంసరిద్వరామ్ ॥

తా॥ ఆగౌతమమహాముని వంగి నమస్కరించుచున్న అనుచరులతోను, అనేకశిష్యులతోను తీర్థయాత్ర సల్పుచు సర్వనదులలో నుత్తమమయిన కృష్ణవేణి యను నదికి వచ్చెను.

శ్లో॥ సంప్రాప్తే మాఘమాసేతు కృష్ణవేణీతటే వనే । సతత్రైవాశ్రమంపుణ్యం విధాయ మునిసత్తమః ॥

తా॥ ఆ గౌతమముని మాఘమాసము రాఁగానే ఆ కృష్ణవేణీ తీరంబున నొక వనమందు ఆశ్రమమును నిర్మించుకొనెను

శ్లో॥ సశిష్యై ర్గౌతమో హృష్టః ప్రాత ర్మాఘే శుచిస్మితే । స్నానంకృత్వోదితేసూర్యే కృష్ణవేణీజలేమలే ॥

తా॥ అట్లు నిర్మించుకొని శిష్యులును, తానును సూర్యోదయ సమయమందు కృష్ణవేణీజలంబున ప్రాతస్స్నాన మాచరించెను.

శ్లో॥ తత్తీరాశ్వత్థమూలేతు సశిష్యైః కేశవార్చనం । అర్చయిత్వావిధానేన భక్త్యా పరమయాముదా ॥

తా॥ అట్లాచరించి తత్తీరమందున్న అశ్వత్థవృక్ష మూలమునందు శిష్యులతో సహా యథావిధిగా మంచి భక్తితో హరిని బూజించెను.

శ్లో॥ తదగ్రే సోఽపి శిష్యేభ్యో వ్యాకుర్వాణః కథామిమామ్ ॥

తా॥ పూజించి అచ్చటనే శిష్యులకు యీ మాఘమాస వైభవమును చెప్పుచుండెను

శ్లో॥ ఏవం దినేషు గచ్ఛత్సు దశమ్యాం భక్తితత్పరః । తత్రైవా శ్వత్థమూలే చ కల్పయిత్వా సుశోభనమ్ ॥ మంటపం పల్లవైః పేతం ఫల పుష్పసమన్వితం । తన్మధ్యే పూజయద్విష్ణుం సశిష్యో గౌతమస్సుధీః ॥

తా॥ ఈప్రకారముగా దినములుగడచుచుండగా గౌతముడు శిష్యులతో సహా మాఘశుద్ధ దశమినాడు ఆ అశ్వత్థమూలమందే శోభనమైన మంటపమును నిర్మించి ఫల పుష్పములతో నలంకరించి ఆ మంటపమధ్యమున విష్ణువును పూజించెను.

శ్లో॥ తత్రాగత్య శునీకాచి త్పూజా మాలోకయత్తదా । ఉప విశ్యావిదూరేతు హ్యశ్వత్థాభిముఖీ శునీ ॥

తా॥ అచ్చటికి ఒక ఆడకుక్క వచ్చి పూజాక్రమమును చూచుచు అశ్వత్థమున కభిముఖముగా సమీపమందు కూర్చుండెను.

శ్లో॥ తాం దృష్ట్వా గురుణా జ్ఞప్తా శ్శిష్యా దండై రతర్జయన్ । దండభీత్యా తతస్సద్య శ్శనైర్దుద్రావ చోత్తరమ్ ॥

తా॥ ఆ కుక్కనుజూచి గౌతముశిష్యులు గుర్వాజ్ఞమీద దండములను ధరించి భయపెట్టిరి. ఆ కుక్కయు మెల్లగా నుత్తరమునకు పోయెను.

శ్లో॥ సమాయయౌ తతశ్చైంద్రీం శనైస్సా దక్షిణాం దిశం । శునీ సా శనకై ర్గత్వా యథావాసం శుభాననే ॥

తా॥ ఓ సుందరముఖీ! వినుము. ఆ కుక్క అట్లుత్తరమునకేగి తూర్పుగా దక్షిణమునకు వచ్చి మెల్లగా పశ్చిమమున యథాస్థానమును జేరెను.

శ్లో॥ పున శ్శిష్యా స్తతస్తాంతు భత్స్యయానా సహస్రశః । సా శునీతు యథాపూర్వ మావృత్త్యైవ ప్రదక్షిణమ్ ॥

తా॥ తిరిగి శిష్యులు భయపెట్టిరి. కుక్కయును పూర్వమందువలెనే ప్రదక్షిణ మాచరించెను.

శ్లో॥ ఏవం త్రివారం తద్విష్ణో ర్దశమ్యాం భానువాసరే । ప్రదక్షిణత్రయం జాతం దర్శనంచాశరోత్తదా ॥

తా॥ ఈ ప్రకారముగా మాఘ శుద్ధ దశమి భానువారమందు విష్ణువునకు ముమ్మారు ప్రదక్షిణ మాచరించెను. మహాత్ముల దర్శనమును బొందెను.

శ్లో॥ ప్రదక్షిణ త్రయాంతే భూ చ్ఛ్వానదేహ విమోక్షణం ।
దివ్యదేహధరోభూత్వా రాజాసీత్తత్రశేనఘే ॥

తా॥ ఈ ప్రకారము ప్రదక్షిణత్రయము సలిపిన తఱువాత కుక్క దేహమును విడిచి దివ్యదేహమును ధరించి ఆతీరమందు రాజయ్యెను.

శ్లో॥ కృతాంజలి స్తథోత్థాయ భూషిత స్సర్వభూషణైః। గౌతమ స్యాంతికంప్రాప్త స్తంననామ మునీశ్వరమ్ ।

తా॥ ఆ రాజు సర్వ భూషణములచేత భూషితుండై లేచి అంజలి ధరించి గౌతమునివద్దకు వచ్చి నమస్కరించెను.

శ్లో॥ తందృష్ట్వాగౌతమశ్శిష్యై స్సహితో విస్మయంగతః। కోభవా నితి తంప్రాహ రాజానం శ్రుణు పార్వతి ॥

తా॥ గౌతముఁడు శిష్యులతో సహా ఆ రాజును జూచి మిందట కుక్కయై పిమ్మట రాజగుటకు నాశ్చర్యమును బొంది నీ వెవ్వఁడవని యడిగెను. ఓ పార్వతీ! అడిగిన విధమును జెప్పెదను వినుము

గౌతమః॥ శ్లో॥ గంధర్వో మానవో దేవో రాక్షసఃకిన్నరోభవా। కోభవాన్ వద శీఘ్రంమే జ్ఞాతుకామాయ సాంప్రతమ్ ।

తా॥ గౌతముఁ డడుగుచున్నాఁడు. నీవు రెవ్వఁడవు. గంధర్వుఁడవా, లేక మనుష్యుఁడవా, దేవుఁడవా, రాక్షసుఁడవా, లేక కిన్నరుఁడవా, త్వరగా చెప్పుము. నేనిప్పుడు వినగోరితిని.

రాజః॥ శ్లో॥ రాజాహం వంగదేశీయో నామ్నా వేగరథోమునే। సోమాన్వయభవోధీర శస్త్రవిద్యావిశారదః । పాలక స్సర్వరాష్ట్రాణాం ధర్మేణైవ వసుంధరాం । ధర్మసంగ్రహకర్తారం సదాధర్మేషులాలసః ।

తా॥ రాజు మునిరాజుతో చెప్పుచున్నాఁడు. నేను వంగదేశపు రాజును. నాపేరు వేగరథుఁడు. చంద్రవంశమున బుట్టినవాఁడను. ధీరుఁడను. శస్త్రవిద్యయందు నేర్పరిని. సమస్తదేశములను పరిపాలించువాఁడను. ధర్మమును, మఱియు భూమిని తప్పక పాలించువాఁడను. ధర్మార్జనమును జేయువాఁడను. ఎప్పుడును ధర్మమునందే ఆశగలవాఁడను.

శ్లో॥ మయాకృతానిదానాని గో భూ వస్త్రయుతానిచ । తులా పురుషముఖ్యాని సదాన్నాదీని సర్వశః ।

తా|| నేను గోదాన, భూదాన, వస్త్రదాన, తులాపురుషదాన, ప్రముఖదానముల నాచరించితిని. అన్నదానముఁ గూడ నాచరించితిని.

శ్లో|| బహుశ స్తిలదానాని హిరణ్యాదీని యన్మయా । కృతాని బహుయజ్ఞాని ఇష్టాపూర్తాన్యనేకశః ॥

తా|| నేను తఱుచుగా తిలదానములు చేసితిని. హిరణ్యదానము నాచరించితిని అనేకయజ్ఞముల నాచరించితిని ఇష్ట క్రతు కర్మ పూర్తము, తటాకములు, గుళ్లునిర్మించుట మొదలయినవాటిని అనేకములుగా చేసితిని. (శ్లో|| క్రతుకర్మేష్టంపూర్తం ఖాతాదికర్మయత్||) అని అమరనిఘంటు. ఇచ్చట పూర్తిశబ్దము సామాన్యవాచకము.

శ్లో|| తటాకాదీని ధర్మాణి కూపోద్యాన వనానిచ । కృతాని సర్వధర్మాణి యదుక్తాని మహర్షిభిః ।

తా|| తటాకము మొదలయిన ధర్మకార్యములను, కూపము ఉద్యానవనములను చేయించితిని. బహుగా జెప్పనేమి. మహర్షులు చెప్పిన ధర్మములన్నిటి నాచరించితిని.

శ్లో|| మయాకృతానివిప్రేంద్ర నతథాపిగతిర్భవేత్ । తదహంతే వదిష్యామి శృణుమే గతివర్జితమ్ ।

తా|| ఓ బ్రాహ్మణోత్తమా! ఈ ప్రకారముగా అనేక ధర్మముల నాచరించినను నాకు గతి సంభవించినదికాదు. దానికి కారణము జెప్పెదను వినుము.

శ్లో|| గృహంమే పైంగలోనామ కాంక్షయా యజ్ఞదక్షిణాం । మాముద్దిశ్యసమాయాతి స్సర్వజ్ఞో మునిపూజితః ।

తా|| ఒకప్పుడు సర్వమును తెలిసినవాఁడును, మునివందితుఁడును నయిన పైంగఁడును మహాముని యజ్ఞదక్షిణకొఱకు నన్నుగుఱించి మదీయగృహమునకు వచ్చెను.

శ్లో|| తందృష్ట్వాత్వరితోత్థాన మహంకృత్వాభివందనైః । అర్ఘ్యపాద్యాదిభిస్సమ్యక్ పూజయిత్వా మునీశ్వరమ్ । పూర్వమేవాసనం దత్వా పశ్చాత్తం హృష్టమానసం । అపృచ్ఛ్యకుశలం జ్ఞాత్వా తోషయంతమునిం ముదా ।

తా|| ఆ మునినిఁజూచి నేను త్వరగా లేచి వందనమాచరించి అర్ఘ్యపాద్యాదులచేత తృప్తునిగాఁజేసి కుశలప్రశ్నను జేసితిని.

శ్లో|| తతోమాముప్రవిద్వాన్స్యం ధర్మ్యమే హితకామ్యయా।

తా॥ ఈప్రకారముగా తృప్తుఁడై నా హితమును గోరి పైంగలుఁడు నాతో యీరీతిగా జెప్పెను.

శ్రీపైంగలః॥ శ్లో॥ శ్రుణురాజన్ పరంగుహ్యం ధర్మం ధర్మవిదుత్తమ । హితాయతేహంవక్ష్యామి నాఖ్యాతందుర్జనాయచ ।

తా॥ ధర్మవేత్తలలో శ్రేష్ఠుఁడవయిన ఓ రాజా! వినుము. నీకొఱకు నొక రహస్యమును జెప్పెదను. దీనిని దుర్జనునకు జెప్పియుండలేదు.

శ్లో॥ మాఘే మకరగేసూర్యే ప్రాతర్వాల్యోదితే రవౌ । కురు స్నానం ప్రయత్నేన శ్రుణు మాఘప్రశంసనమ్ ।

తా॥ మాఘంబున మకరమందు రవియుండఁగా సూర్యుఁ డర్ధోదితుఁడగుచుండఁగా శ్రద్ధతో స్నానమును జేయుము. మాఘమాస మాహాత్మ్యమును వినుము.

శ్లో॥ తేనతే విష్ణుసాయుజ్యం భవిష్యతి నసంశయః ।

తా॥ దానిచేత నీకు విష్ణుసాయుజ్యము లభించును. సందియములేదు.

శ్లో॥ కించిత్సూర్యోదయే మాఘే యఃకుర్యాన్మజ్జనం నరః । సతీర్థస్నానదానానా మన్నాదినాం నరాధిప । యత్ఫలం తదవాప్నోతి హ్యశ్వమేధకృతో యథా ।

తా॥ ఎవ్వఁడు రవి కొంచ ముదయించినవాఁ డగుచుండఁగా మాఘస్నానమాచరించునో వాఁడు అశ్వమేధయాగమును జేసినవాఁడువలె తీర్థస్నాన దాన అన్నాదులకెంత ఫలముండునో అంత ఫలమును బొందును.

శ్లో॥ మాఘేరవౌ భానువారేతు సప్తమ్యాం దశమీ తిథౌ । ప్రాతస్స్నానంకృతో రాజన్ సవిష్ణోరాలయే వసేత్ ।

తా॥ మాఘమాసంబున సప్తమీ భానువారమందుగాని, దశమీ భానువారమందుగాని ప్రాతస్స్నాన మాచరించినవాఁడు విష్ణులోకమందు నివసించును.

శ్లో॥ మాఘమాసే పూర్ణిమాయాం ప్రాతస్స్నానంనరోత్తమ। యఃకరోతి నరశ్రేష్ఠ స్సముక్తః పాపకోటిభిః ।

తా॥ ఓ రాజోత్తమా! మాఘపూర్ణిమయందు యెవ్వఁడు ప్రాతస్స్నాన మాచరించినో ఆ మానవోత్తముఁడు కోటిపాపపుంజములచేత విడువఁబడును.

శ్లో॥ ప్రాతర్న కురుతే మోహాత్ స్నానం మాఘే నరాధమః । ప్రతిపద్యాదితిథిషు త్రింశత్స్వఘహారేషుచ । స్నానం నకుర్యా దేకంవా సచండాలో భవేద్ధ్రువ ।

తా॥ ఓ రాజా! వినుము. ఎవ్వఁడు మోహముచేత ప్రాతఃకాలమందు మాఘస్నాన మాచరింపఁడో ముప్పదిరోజులలో నొకనాఁడయినను మాఘస్నాన మాచరింపఁడో ఆ నరాధముఁడు జన్మాంతరమందు చండాలుఁడగును.

శ్లో॥ స్నానం న కురుతే మాఘే మోహాచ్ఛీతభయాదపి । ఉత్తమోపి సచండాల స్స్నాతశ్చే దుత్తమోత్తమః ।

తా॥ మాఘమాసంబున ప్రాతఃకాలమందు మోహమువలన గాని, శీతభయము వలన గాని. స్నానము చేయనివాఁడు బ్రాహ్మణుఁడయినను చండాలుఁడగును. స్నాన మాచరించినయెడల ఉత్తముఁడగు బ్రాహ్మణుఁడగును

శ్లో॥ తస్మాత్త్యక్త్వా కర్మాణి మాఘే ప్రాతర్బహిర్జలే । స్నానంకుర్వీత అభీతోభూ ద్దారుణై శ్చాంతకానుగైః ।

తా॥ కనుక మాఘంబున ప్రాతఃకాలమందు యితర కర్మలను సంక్షేపించి బహిర్జలమందు స్నాన మాచరించవలెను. ఇట్లాచరించువానికి యమభటులభయము లేదు.

శ్లో॥ శ్రుత్వేత్థం పైంగలస్యాహం వాణీ మఘనివారిణీం। మయా ప్రత్యుదితం విప్ర వాక్యంమే దుర్గతిప్రదమ్ ।

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! ఈప్రకారము పైంగలుని పలికిన పాపహారమైన వాక్యమును విని నరకప్రదమయిన ప్రతివచనమును బలికితిని.

శ్లో॥ నాహం కరోమి విప్రేంద్ర మాఘ స్నానం మహామతే । నైవాస్తిస్నానశక్తిర్మే శీతంమామతిబాధతే ।

తా॥ మహాబుద్ధియయిన యో బ్రాహ్మణోత్తమా! నేను మాఘస్నానమును చేయను. నాకు శక్తిలేదు. చలి నన్ను విశేషముగా బాధించును.

శ్లో॥ దాస్యామి దానం విపులం విప్రేభ్యో మునిపుంగవ । వక్తుం నార్హసిమాం త్వాపి స్నానంకుర్వితి యద్వచః ।

తా॥ ఓ మునిశ్రేష్ఠా! బ్రాహ్మణులకు గొప్పగా దానమిచ్చెదను గని, స్నాన మాచరించను. స్నానముచేయుమని నాతో నెన్నఁటికిని చెప్పకుము.

శ్లో॥ స్నానేనైకేన మే ప్రాణాః ప్రాతశ్శీతభయప్రదే । మాఘే సూర్యోదయే యాంతి తస్మాద్దేహో వినశ్యతి ॥

తా॥ మాఘంబున ప్రాతఃకాలమందు ఒక స్నానముచేతనే శీతబాధకు నాప్రాణములు పోవును. తరువాత శరీరము నశించును.

శ్లో॥ వినశ్యమానే దేహేతు కోహి ధర్మార్జనం కథం । స్నానస్య కరణే బ్రహ్మన్ తస్మాన్నాహం ప్రవర్తయే ॥

తా॥ దేహము నశించిన తరువాత దేహి ధర్మాచరణము నెట్లుగా నలుపును చెప్పుము. కనుక నేను స్నానమందు ప్రవర్తించువాడను గాను.

శ్లో॥ సోపి మద్వచనం శ్రుత్వా పైంగలో మునిసత్తమః । విహాయ దక్షిణాం మత్తో యజ్ఞస్య విపులాం మునిః ॥ ప్రయయౌ ప్రార్థ్యమానోపి బహుదా శీఘ్రగో మునిః ॥

తా॥ ఆ పైంగలముని యీప్రకారముగా బలికిన నామాటలను విని నావలన యజ్ఞదక్షిణను గ్రహించుటమాని నేనెంతగా ప్రార్థించినను అంగీకరించక త్వరగా వెళ్లెను.

శ్లో॥ ప్రసాద్య బహుదా విప్రం వాగ్భిస్సాధు కృపోదయైః । మయా తత్రాత్త తస్మై సంపూర్ణా యజ్ఞదక్షిణా ॥

తా॥ అతి దీనోక్తులచేత నేను అనేకవిధములుగా ఆబ్రాహ్మణుని బ్రతిమాలుకొని యజ్ఞమునకు సరిపోవు దక్షిణనిచ్చి పంపితిని

శ్లో॥ గృహీత్వా తాం యయావిప్ర స్స్వాశ్రమం పైంగలో మునిః॥

తా॥ ఆపైంగలుడును ఆదక్షిణను గ్రహించి తన యాశ్రమమునకు వెళ్లెను.

శ్లో॥ తతస్సంప్రాప్తకాలేహం గతాసుర్నరకాలయం। తంభుక్త్వా బహుధా తస్మిన్ నరకే దారుణాలయే ॥

తా॥ తరువాత కాల మాసన్నమై నేను మృతినొంది దారుణమైన నరకమును బొంది అచ్చట ననేక యాతనలనొందితిని.

శ్లో॥ పునర్భూమి ముపాశ్రిత్య గార్దభేషు ముహుర్ముహుః । శత వారం తతో గత్వా దుఃఖాద్గార్దభయోనిషు ॥

తా॥ అనుభవించి తిరిగి భూమికి వచ్చి నాలుమారులు గార్దభమై (గాడిద) జన్మించితిని.

శ్లో॥ శ్వానయోనౌ చతుర్వింశ ద్వారంమే జననంమునే। అసీత్రింశోంశవిప్రేంద్ర శ్వానయోనింగతస్యమే। అస్మిన్నే దైవయోగేన విముక్త శ్శ్వానయోనితః।

తా॥ తరువాత యిరువదినాలుగుమారులు కుక్కనై జన్మించితిని. బ్రాహ్మణోత్తమా! ఇప్పుడు దైవయోగముచేత యీ కుక్కజన్మమునుంచి విముక్తియాయెను.

శ్లో॥ మునిదేహాద్విముక్తిర్మే కేనేదానీం ప్రజాయతే। తదహం త్వన్ముఖాద్భద్ర శ్రుత్వా కృత్వా పునామ్యహం। శ్రోతుకామాయ విప్రేంద్ర సర్వం తద్వక్తుమర్హసి।

తా॥ ఓ మునిపుంగవా! ఇప్పుడు నాకు యీ కుక్కదేహమువలన విముక్తి యెట్లుగా నయినదో చెప్పుము. నీముఖమువలన విని ఆచరించి పవిత్రుఁడనగుదును. కనుక వినగోరిన నాకు ఆసర్వమును చెప్పుము.

శ్లో॥ ఇతి భూప వచశ్శ్రుత్వా గౌతమో విస్మయాన్వితః। ధ్యాత్వా ముహూర్తమూహేదం రాజానం వీతకల్మషమ్।

తా॥ ఓ గౌరీ! యిట్లు గౌతముఁడు రాజుమాటను విని ఆశ్చర్యమునుబొంది ముహూర్తకాలము ధ్యానించి పాపవిముక్తుఁడయిన రాజుతో నిట్లనిరి.

గౌతమః। శ్లో॥ యత్సత్యం పైంగలేనోక్తం మాఘస్నానఫలం శుభం। తవాపదమిమాంఘోరాం మాఘస్నానావమానజాం। దుర్యోనేరతతేముక్తి కారణంత్వవధారయ।

తా॥ గౌతమమహాముని చెప్పుచున్నాఁడు. ఓ రాజా! పైంగళుఁడు పలికిన పద్ధతిని మాఘస్నానమహిమ సత్యమయినదే. అంతలో అసత్యమేమియును లేదు. నీకు ప్రాప్తించిన యీ యాపత్తు మాఘస్నాన తిరస్కారమువలన వచ్చినదాని నిగా తెలిసికొనుము. ఇప్పుడు యీదుర్యోనినుంచి ముక్తవగుటకు కారణమును చెప్పెదను వినుము.

శ్లో॥ కృష్ణవేణీతటేస్నాభి స్సఖిభిర్భక్తమానసైః। విష్ణుపూజా కృతాధక్త్యా దశమ్యాం శుక్లపక్షగే।

తా॥ కృష్ణవేణీతీరంబున మాఘశుక్ల దశమీదినమందు నేనును, నా శిష్యులును కలసి భక్తితో లక్ష్మీనారాయణపూజ నొనరించితిమి.

శ్లో॥ వయంవిధాయమాఘేస్మిన్ స్నానం సూర్యోదయేనఘే । లక్ష్మీనారాయణంనామ వ్రతం పాపప్రణాశనం । అనుష్ఠితంసమాస్మాభి ర్దశమ్యాం శుక్లపక్షకే ।

తా॥ మేము యీ మాఘంబున శుద్ధ దశమియందు ప్రాతస్స్నానమాచరించి పాప నాశనమయిన లక్ష్మీనారాయణవ్రతమును చేసితిమి.

శ్లో॥ వ్రతం దృష్టం త్వయా శున్యా దైవాదాగత్యతచ్ఛుభం । అథాసీత్తవభూయోపి శునీదర్శనసంశయా । కుర్వన్ కోలాహలంశిష్యా యష్టిహస్తా మమానుగాః । శునీ మన్యత్ర యత్నంతో శునీరూప ధరో భవాన్ । కాంత్వన్ భక్త్యాశయానాస్య దన్యత్రైవాగతాగతా । తస్మాత్ప్రదక్షిణావృత్తి రాసీత్రైతత్రయంనృప ।

తా॥ అంతలో నీవు కుక్కరూపముతో దైవవశముచేత నచ్చటికి వచ్చి వ్రతమును చూచితివి. ఇదియొక శుభము. ఇంకొకటి చెప్పెదను వినుము. కుక్క చూచుచుండగా వ్రతముసల్పుట విధి గాదని మాశిష్యులు కఱ్ఱలతో నిన్ను బెదరించిరి. నీవు దూరముగా బోయి తిరిగి వచ్చితివి. ఇట్లే ముమ్మారు జరిగినదిగాన, మూడు ప్రదక్షిణములు జరిగినవి

శ్లో॥ మాఘే శుద్ధదశమ్యాంతు విష్ణో రాసీ త్ప్రదక్షిణం । తత్కాలకర్మయోగేన ముక్తిరాసీత్కుయోనితః ।

తా॥ మాఘశుద్ధ దశమినాడు మాధవునకు మూడు ప్రదక్షిణములు జరిగినవి. కాన ఆ సుకృత కర్మ యోగముచేత నీకు దుర్యోనినుంచి ముక్తికలిగినది.

శ్లో॥ ముక్తిస్తవేద్య శ్రీజాతా రాజన్ జన్మవివర్జితా । కురుత్వం పునరేవాత మాఘస్నానం నదీజలే ।

తా॥ నీకు యిప్పుడు జన్మరహితమయిన యట్టి మోక్షము గలిగినది. తిరిగి యీ నదీజలమందు మాఘస్నానమాచరింపుము.

శ్లో॥ తేననశ్యంత్యశేషాణి కృతాఘాన్యన్యజన్మను । తతోయాస్యసి వైకుంఠం పునరావృత్తివర్జితమ్ ।

తా॥ ఆస్నానముచేత అన్యజన్మలలో చేసిన సమస్తపాపములు నశించును. తరువాత పునరావృత్తిరహితమైన వైకుంఠము లభించును.

శ్లో॥ మాఘస్యార్క నృపశ్రేష్ఠ శీతాయాంశ్చేదితేరవా। బహిర్వారి కురుస్నానం మాఘేస్మిన్ మాధవప్రియే॥

తా॥ ఓరాజా! సూర్యోదయకాలమందు చలికి భయపడక బహిరుదకమందు మాధవప్రీతిగా మాఘస్నానమాచరింపుము.

శ్రీశివః॥ శ్లో॥ ఆకర్ణ్య దేవి తద్వాక్యం గౌతమస్య నరాధిపః। తత్రైవాపావనన్మాఘ స్నానకాంక్షీ నదీజలే॥

తా॥ ఓపార్వతీ! గౌతముని మాటచొప్పున రాజు మాఘస్నానార్థము నదీతీరమందే నివసించెను,

శ్లో॥ కథ్యమానేమునావిత్థ చాశ్వత్థద్రుమకోటరాత్। మండూకశ్చోత్పతిన్నాగా ద్గౌతమస్యపురోభువి॥

తా॥ ఈప్రకారముగా గౌతముఁడు చెప్పుచుండగా అశ్వత్థవృక్షముయొక్క తొఱ్ఱలోనుంచి యొక కప్ప క్రిందికిపడి గౌతమునిముందుకు వచ్చెను.

శ్లో॥ సర్వేషుదృశ్యమానేషు శిష్యేష్వఖిలపూజితే లుఠన్నివత్యమేదిన్యాం శోకశోకపరిప్లుతః॥

తా॥ అశేషపూజితవయిన ఓగౌరీ! వినుము. శిష్యులందఱు చూచుచుండగా ఆకప్ప భూమిమీదబడి యిటునటు తిఱుగుచు శోకించెను.

శ్లో॥ కూడక విముచ్య తద్రూపం పన్నగః కంచుకం యథా। దివ్యదేహముపాశ్రిత్య నారి సర్వాంగసుందరి॥

తా॥ శోకించుచు, కూయుచు పాముకుబుసమువలె కప్పదేహమును విడిచి దివ్యదేహమును ధరించి సర్వాంగశోభనయైన స్త్రీయాయెను.

శ్లో॥ తృణేనాసీన్మునివధూః చీరవల్కలవాసనా। సువృత్తచారు వక్షోజా సుస్మితా సమ్రకంధరా॥

తా॥ అప్పుడే నారచీరలుధరించిన ఋషిభార్యయై సుందరముగాను, వట్రువగానున్న కుచములుగలిగినదై చిఱునవ్వుతో గూడినదయిన మితకంఠయైయుండెను.

శ్లో॥ విలోకయన్మునేః పాద పద్మం యన్ముక్తికారణం। వక్షోజ

వల్కలస్యాంతం సాధుకుర్వన్ స్వపాణినా। తత్రసాసంస్థితా తేషాం మధ్యే కంపాన్వితాశుభే । విలోకయన్తీ ధరాపృష్ఠం లజ్జానమ్రాననా సతీ।

తా॥ తనకు ముక్తికారణమైన గౌతముని పాదములను దర్శించుచు, కుచములపైనున్న నారచీర అంచును తిన్నగా దోయుచు వారిమధ్యను నమ్రకంధరయై సిగ్గుతో భూమినిజూచుచుండెను.

శ్లో॥ తాందృష్ట్వా గౌతమో గౌరి మందారతనుమాశ్రితాం। తద్దేహాన్ముక్తిచార్వంగీం మునిపత్నీం శుచిస్మితామ్ ।

తా॥ గౌతముఁడు మందార దేహమును ఆశ్రయించి నటువంటిన్ని, పిమ్మట తద్దేహమునుంచి ముక్తురాలైనటువంటిన్ని, చిఱునవ్వుతోఁగూడినటువంటిన్ని ఆ ముని భార్యను జూచెను.

శ్లో॥ లాలయిత్వా తతస్తాంతు గౌతమః కరుణానిధిః । ఉవాచ వచనంచేద్ధం భయంమాకురుమాకురు ।

తా॥ గౌతముఁడు కరుణతో నామెను సన్మానించి నీకు భయము లేదు. భయము లేదని పలికెను.

గౌతమః॥ శ్లో॥ కాచిద్భద్రేవదాస్మాక మఘం కేనేవ ఖేకటం । కస్మాదత్రాగమత్కేన ముక్తిస్తే కేనకర్మణా । ఆపదామూలయంకర్మ కిం కృతం పూర్వజన్మని । నూన మస్మాక మగ్రేతు యథా సత్యం వదా ఽధునా ।

తా॥ ఓ చిన్నదానా ! నీ వెవ్వతెవు. ఏ పాపముచేత కప్పబడితివి. ఎందుకు యిచ్చటికి వచ్చితివి. ఏకర్మచేత నీకు మందారదేహ ముక్తిగలిగినది. ఇంత ఆపత్తుకు మూలమైనకర్మను పూర్వమందేముచేసితివి ఇదంతయూ మాముందర సత్యముగ చెప్పుము.

శ్లో॥ ఏవముక్త్వామునీంద్రేణ ప్రాదుర్భూతాంగనాశుభే। నత్వా తద్దర్శనోద్భూత జ్ఞానదీపేన భాస్వతా । విదిత్వోవాచ విప్రేంద్రం యత్కృతం శృణు పార్వతి ।

తా॥ ఆవనిత యీప్రకారముగా గౌతమమహాముని అడుగగా నమస్కరించి ఆగౌతముని దర్శనమువలన నుదయించిన జ్ఞానముచేత సమస్తము తెలిసికొని పూర్వమాచరించిన పాపమును జెప్పదొడంగెను.

ఇతి చతుర్థోధ్యాయస్సమాప్తః.

## — అథ పంచమోఽధ్యాయ ప్రారంభః —

మునిపత్న్యువాచః శ్లో॥ పురాజన్మని విప్రేంద్ర జ్ఞానసిద్ధే స్తనూభవా । ప్రజ్ఞామునివరేర్భార్యా కావేరీతీరవాసినీ ॥

తా॥ ఆమునిపత్ని వచించుచున్నది. ఓ బ్రాహ్మణోత్తమా! నేను పూర్వజన్మమందు జ్ఞానసిద్ధి పుత్రికను. ప్రజ్ఞామునివరుని భార్యను. కావేరీతీరమందు మానివాసము.

శ్లో॥ పతిర్మే సర్వధర్మజ్ఞ స్సమ్యగాత్మ వివేకదృక్ । సుశీలః కరుణారాశిః సర్వజీవోపకారకః ॥

తా॥ నాభర్త సర్వధర్మవేదియు, ఆత్మజ్ఞానవేత్తయు, మంచిస్వభావముగలవాడును, దయాసింధువును, సమస్తజంతూపకారకుడును.

శ్లో॥ కావేర్యా శ్చోత్తరేతీరే నివసన్నాశ్రమే శుభే । సంప్రాప్తె మాఘమాసేతు సుస్నాతి స్స శుచివ్రతః ॥

తా॥ ఆకావేరీనదీ ఉత్తరతీరమందు ఒక ఆశ్రమము గల్పించుకొని దానిలో నుండి మాఘమాసమందు చక్కగా స్నానమాచరించి శుచియైయుండెను.

శ్లో॥ తదామామాహమే భర్తా కురుస్నానం మయా ప్రియే । మాఘమాస్యుదితేసూర్యే సర్వకల్మషనాశనే ॥

తా॥ అట్లు శుచియై నాతో నిట్లనియె. ఓ నా ప్రియా! మాఘస్నానము వలన పాపములు నశించును గాన నాతోకూడా మాఘస్నానమాచరించుము.

శ్లో॥ తీరేస్మిన్ విష్ణుపూజార్థం గోమయాలేపనం కురు । రంగవల్ల్యాదిభిస్సుభ్రై పద్మస్వస్తికధాతుభిః ॥

తా॥ ఈతీరమందు విష్ణుపూజార్థము గోమయముచేత నలుకుము. పంచరంగులతో పద్మస్వస్తికప్రముఖ రచనలను జేయుము.

శ్లో॥ శుశ్రూషాం కురుమే విష్ణో ర్మాఘేస్మిన్ మంగళప్రదే । మాఘేస్మిన్ మాధవస్యాస్య కురుత్వం దీపవర్తికామ్ ।

తా॥ శుభకరమయిన యీ మాఘమాసమందు నాచే పూజింపబడు హరికి శుశ్రూషచేయుము. మాధవపూజకు దీపారాధనకు వత్తిని జేయుము.

శ్లో॥ నధూపం పావకంథక్త్వా సమర్పయ హరేః పురా । కురుపూజాం శుచిర్భూత్వా మాధవాయ మహాత్మనే ।

తా॥ హరిమందర ధూపమును సమర్పించుము. దీపమునిమ్ము. పవిత్రురాలవై హరికై నైవేద్యార్పము పాకమును జేయుము.

శ్లో॥ ప్రదక్షిణ నమస్కారై ర్భక్త్యా మాఘె మయానఘె । కురుష్వ దేవదేవస్య సపర్యాం విష్ణవేన్వహమ్ ।

తా॥ హరికి నాతోగూడా భక్తితో ప్రతిదినమందు ప్రదక్షిణ నమస్కారములచేత సేవచేయుము.

శ్లో॥ శ్రుణు మాఘఫలం స్నాత్వా ముహూర్తత్రయమేవవా । మాఘేస్మిన్మాసమేవంతు పిబపాదోదకం హరేః ।

తా॥ ఈ మాఘమాసమందు ప్రతిదినము ప్రాతస్స్నానము చేసి త్రిముహూర్తకాలమయినను మాఘమాహాత్మ్యమును వినుము. హరిపాదోదకమును పానముచేయుము.

శ్లో॥ కృష్ణ విష్ణో ముకుందేతి నారాయణ జనార్దన । అచ్యుతానంత విశ్వాత్మన్ ఇతికీర్తయసంతతమ్ ।

తా॥ ఓ కృష్ణా, విష్ణూ, ముకుందా, నారాయణా, జనార్దనా, అచ్యుతా, అనంతా, విశ్వాత్మ యీప్రకారముగా నిత్యము శ్రీహరిని కీర్తించుము.

శ్లో॥ క్రోధ మాత్సర్య లోభాదీన్ త్యక్త్వా మాఘవ్రతం చర । తేనసంజాయతేముక్తి ర్విష్ణులోకంచశాశ్వతమ్ ।

తా॥ క్రోధ మాత్సర్యాదులను విడిచి మాఘవ్రతము నాచరింపుము. దానిచేత నీకు ముక్తికలిగి శాశ్వతమయిన విష్ణులోకము లభించును.

శ్లో॥ ఇత్థంమేభర్తృగదిత మాకర్ణ్యమునిపూజిత । పునర్మయాపతింప్రోక్తం అసహ్యాం దుర్గతిప్రదమ్ ।

తా॥ మునిపూజితుండవయిన ఓ బ్రాహ్మణోత్తమా ! ఈప్రకారముగా పలికిన నాభర్తమాటను విని నేను తిరిగి నాభర్తతో విన శక్యముగానటువంటిన్ని, నరకప్రదాయకమయినట్టిన్ని వాక్యములు పలికితిని.

శ్లో॥ కోమాఘః కోవిధిః కోవా కింఫలం కోపిపశ్యతి । క్వచిద్ధర్మనిషేధశ్చ కాగతిః కుత్రమాఘజమ్ ।

తా॥ మాఘమనఁగా నేమి, ఎక్కడి విధి, ఎవ్వఁడు దేవుఁడు, ఎక్కడిఫలము మాఘఫలము, ఎవ్వఁడు మాఘఫలమును జూచుచున్నాఁడు, ధర్మనిషేధ మెక్కడ?

ఏమిగతిగల్గును. మాఘపద్మమయిన ఫలాదిక మెచ్చట. అనఁగా యిదియంతయు అసత్యమని అభిప్రాయము.

శ్లో॥ మాఘేచోదర్కాగ శీతేతు ప్రాతస్సంధ్యోదితే రవౌ। బహిర్వాతయుతాశేష శీతాతిశయవారిషు । కథంనిమజ్జయే తస్మిన్ మాఘే శీతార్తికే నఘ ।

తా॥ ఓ భృగువర్యుఁడా! ఈ మాఘమందు సూర్యుఁ డర్ధోదయుఁ డగుచుండఁగా యెక్కుడయిన శీతమందు బయటకుబోయి చలిగాలిలో అతిశీతలమయిన ఉదకమందు నేనెట్లుగా స్నానమాచరింతును.

శ్లో॥ యత్త్వయోక్తాని కర్మాణి నశక్తాని మయా సకృత్ । నోత్సృజామ్యటజం నాథ యావద్ధంసోనమధ్యగః । శాకరిష్యతిమాఘే స్మిన్ స్నానమర్ధోదితే రవౌ ।

తా॥ మీరుచెప్పిన కర్మలను నేను చేయలేను. సూర్యుఁడు మధ్యాహ్నమునకు వచ్చువఱకు పర్ణశాలనుంచి బయటకు రాలేను. ఈమాఘమాసంబున అర్ధోదయసమయమునందు శీతములో నెవ్వతె స్నానమాడగలదు?

శ్లో॥ సా శీతవ్రతదేవార్తి స్సదా ప్రాణాన్విముంచతి ।

తా॥ ఈచలిలో స్నానమాడినచో ప్రాణముబోవును.

శ్లో॥ నకరోమి వతే స్నానం మాఘే ప్రాతర్బహిర్జలే । మృతే శీతాదిపాతేన నచత్వేరక్ష కేన్వయి ।

తా॥ ఓనాథా! ఈ మాఘమందు నేను స్నానమునుజేయను. నీ మాటను విని శీతపాతముచేత చచ్చుటకు నేను ఒప్పుకొనను

శ్లో॥ ఇత్యేవముదితంశ్రుత్వా పతిర్మే మాఘధర్మవిత్ । సశాంతోపినశాపాథ మాంవిప్రోఽప్రియవాదినీమ్ ।

తా॥ నేను యీ ప్రకారముగా బల్కఁగా మాఘ ధర్మవేత్తయయిన నా భర్త నిరంతరము శాంతిగలవాఁడయునప్పటికి నేను పలికిన అప్రియవాక్యమును విని కోపించినవాఁడై నన్ను శపించెను.

శ్లో॥ పుత్రంచ ధర్మవిముఖం భార్యాంచాప్రియవాదినీం । అబ్రహ్మణ్యంచ రాజానం సద్యశ్శాపేన దండయేత్ ।

తా॥ ధర్మపరాఙ్ముఖుఁడయిన కుమారునిన్ని, అప్రియభాషిణియయిన భార్యనున్ను, అబ్రాహ్మణ్యుఁడయిన రాజునున్ను శాపముచేత తక్షణమే దండించవలెను.

శ్లో॥ విచారితార్థో విప్రేంద్రః శ్శశాపేత్థం సతీం మునే । కృష్ణవేణీతటే మాఘే పిప్పలద్రుమకోటరే । తత్రాంబురహితే వాసీ మండూకో భవ కేవలమ్ ॥

తా॥ ఈ ప్రకారముగా నాలోచించి నాభర్త కృష్ణవేణీతీరమందు ఉదకరహితమైన అశ్వత్థవృక్షముయొక్క తొఱ్ఱయందు ఒకకప్పవైయుండుమని నన్ను శపియించెను.

శ్లో॥ ఇత్థం మే పతినా శప్తా శాపాంజన విలోచనా । పతిత్వా పాదయోస్తస్య ప్రార్థితాస్మి పతిం బహు ॥

తా॥ ఈప్రకారముగా నాభర్త నన్ను శపించగా నాయొక్క సౌందర్యమంతయూ వదలి కన్నులెఱ్ఱజేసి భయపడి భర్తయొక్క పాదారవిందములయందు పడి అనేకవిధములుగా ప్రార్థించితిని

శ్లో॥ విశాపమవదచ్చాసౌ భర్తా మే మునివందిత । గౌతమస్య మునేర్మాఘే దశమ్యాం దర్శనం యదా । భవిష్యతి తదా ముక్తిస్తేన మాఘఫలోదయమ్ ॥

తా॥ ఓ ఋషిపూజిత! నేనిట్లు ప్రార్థించగా నాభర్త శాపమునకు పరిమితిని చెప్పెను ఎట్లనిన, మాఘ శుద్ధ దశమినాడు నీవు గౌతమమహామునిని యెప్పుడు దర్శించెదవో అప్పుడు నీకు ముక్తికలుగును

శ్లో॥ యదా శ్రోష్యసి తే ముక్తి స్తవ మండూక యోనితః । ఇత్యుక్త్వా విరరామర్షిః మద్భర్తా కుపితో౽ధిక ॥

తా॥ ఆగౌతమమహామునివలన నీవు యెప్పుడు మాఘమాహాత్మ్యమును వినెదవో అప్పుడు నీకు యీ కప్పరూపమువలన విముక్తికలుగును ఈప్రకారముగా పలికి నాభర్త యూరకుండెను.

శ్లో॥ మండూకతనురాసీన్మే విప్రశ్య ప్రమదోత్తమః । తన్నైశ్చైన న్నదుఃఖేన హ్యుత్సృత న్సృతన్మనే । కృష్ణవేణీతటేహ్యస్మిన్ అశ్వత్థద్రుమకోటరే । ఆసీన్మమాగమాఖ్యాస మృతకాలావధిం శ్రుణు ॥

తా॥ అంతలో నాకు సుందరమయిన స్త్రీరూపము నశించి మండూకదేహము లభించెను. తరువాత నేను దుఃఖముచేత యేడ్చుచు వెడలుచు కృష్ణవేణీతీరమం

దుష్ట అశ్వత్థవృక్ష కోటరమందు నివసించితిని. ఆశాపముయొక్క మితకాలమును తెల్పెదను వినుము.

శ్లో॥ అయుతాబ్దావ్యతీయుర్మే అరుణోదయకోటిభిః । తతస్తే గమనాతత్ర దర్శనాన్మాఘవైభవం । తస్మాత్కుయోనితోముక్తి రభవ త్కరుణానిధే ।

తా॥ ఇప్పటికి పదివేలయేండ్లు గడచినవి. కోటి అరుణోదయంబులుగతించినవి. ఇవి అనంతవాచకములు. అనంతరము మీరు వచ్చి దర్శనమిచ్చితిరి. తరువాత మీవలన మాఘపురాణమును వింటిని. ఓ కరుణాసముద్రా! మీనిర్హేతుక దయవలన కరుణా వశముచేత నాకీ మకడూకదేహ ముక్తి గలిగి పునః పూర్వ రూపము లభించెను.

శంకరః॥ ఇత్యుక్త్వామథ సంవీక్ష్య విహసన్నగనందిని । ప్రత్యబ్రవీ దిదంవాక్యం పునస్తాం మునిసత్తమః ।

తా॥ పర్వతరాజపుత్రివయిన ఓ పార్వతీ! వినుము. ఇట్లు పలికిన ఆవనితను గౌతముడు జూచి నవ్వుచు తిరిగి యామెతో నిట్లనెను.

గౌతమః॥ శ్లో॥ దండితస్త్వేద్భుతం సత్యం భేకయోనిప్రదాయకం । పత్యుతాయాః పతే ర్వాక్యం తథా మాఘోదితంఫలమ్ । మునిశాప ప్రభావేన మాఘస్నాన పరాఙ్ముఖాత్ । తేన మండూకయోనిత్వం స్వాశ్మనో మలభక్షణమ్ ।

తా॥ గౌతముడు పలుకుచున్నాడు. ఆశ్చర్యము. భర్తమాట వినక తద్దడిత మాఘవైభవమును విననందున నీభర్త నిన్ను శపించెను. ఆ శాపముచేత నీకు వ్యక్తియు మలమే స్వాశనముగా గలిగిన మండూకజన్మ సంప్రాప్తమాయెను. ఇదంతయు మాఘ స్నానవైముఖ్యముచేతనైనది.

శ్లో॥ నరం మండూకదేహాచ్చ నరకం దుఃఖసంకులం । నోత వాసో భవేద్యస్మిన్ మండూకస్య శుభాననే । దుఃఖం తత్కేవవక్తవ్యం తస్మాత్తే శాపమీదృశమ్ ।

తా॥ ఈకప్పజన్మమెత్తుటకంటె దుఃఖాలయమయిన నరకాలయమే శ్రేష్ఠము. నరకమందు ఉపవాసములేదు. ఇచ్చటనో అదియే శరణము గనుక యీ దుఃఖమానమితిలేదు. కాబట్టి నీకు నిట్టి శాపము సంభవించెను

శ్లో॥ కుశాగ్రబుద్ధిస్తేభర్తా శాపంమండూకయోనిజం। జలవాస విహీనంచ శుష్కకోటరే భవత్యసౌ। దదాతి జలభీతాయాః భీతాయా శ్శీతతోనఘః। యదితోయనివాసశ్చే న్మాఘమాస్యసినిశ్చితం। తేనతే జలవాసస్య ముక్తిస్స్వర్గం భవిష్యతి।

తా॥ నీభర్త కుశాగ్రబుద్ధి గనుక నీకీ శాపము నిచ్చినాడు. ఏమంటే. నీవు మాఘస్నాన మాచరించుటకు చలికి భయపడి ఉదకమందు మునుగుటకు వెఱచితివి గాన నీకు జలవిహీనమయిన శుష్కకోటరమందు మండూకజన్మము నిచ్చినాడు. నీకు జల నివాసమయినచో నన్ను బొందుదువు. దానిచేత నీకు ముక్తికలుగునని యాలోచించి యిట్టి శాపమిచ్చెను

శ్లో॥ మాఘేస్మిన్వారివాసానాం ముక్తిర్దుర్యోనిసంకటాత్। సత్యం భవతి యత్పూర్వం దుఃఖాద్వారిచరానఘే। వారిసంచరణాన్మాఘే ముక్తపాపాః కుయోనితః। తేదివ్యతనుభిస్సత్యం ప్రపద్యంతేసురాలయమ్। పురావారిచరత్వంచ ముక్తిస్సన్మాఘసంభవాత్। తస్మాచ్ఛాపోనకర్తవ్యో జలవాసప్రదో మయా। దాస్యామ్యాత్మమలాహారం శుష్కమండూకయోనిజం। ఇత్థంవిచారితార్థస్తే దదౌశాపంపతిస్తవ।

తా॥ ఇంతే కాదు. ఈ మాఘమాసమందు ఉదకవాసులకు దుర్యోనివలన ముక్తికలుగును. నిశ్చయము. పూర్వమందు జలచరములు, జలజంతువులు మాఘమందు సంచారమువలన కుయోనివలన ముక్తినొంది దివ్యదేహమును ధరించి స్వర్గమును బొందినవిగనుక మాఘమందు జలవాసము ముక్తికి కారణము గనుక జలవాస యుక్తమయిన శాపము నివ్వరాదు. స్వకీయ మలాహారమయిన శుష్క మండూక జన్మ నిచ్చెదనని యీ ప్రకారముగా విచారించి నీభర్త నీకీ శాపమిచ్చెను

శ్లో॥ నస్వాతంత్ర్యంచనారీణాం నోల్లంఘ్యం పతిభాషణం। పాతివ్రత్యేన పుణ్యేన పతిశుశ్రూషణేనచ। స్త్రియో విష్ణుపదం యాంతి నచాన్యైరపి సువ్రతైః।

తా॥ కాన స్త్రీలకు స్వాతంత్ర్యములేదు. పతి వాక్యము మీరరాదు. పాతివ్రత్య పుణ్యముచేతను, పతి శుశ్రూషచేతనే స్త్రీలు విష్ణులోకమును బొందుదురు ఇతర వ్రతములచేత బొందజాలరు.

శ్లో॥ పతి రాత్మా పతిర్విష్ణుః పతిర్బ్రహ్మా పతిశ్శివః। పతిర్గురుః పతి స్తీర్థ మితిస్త్రీణాంవిదుర్బుధాః।

తా॥ స్త్రీలకు పతియే ఆత్మ- పతియే విష్ణువు- పతియే బ్రహ్మ- పతియే శివుడు- పతియే గురువు- పతియే తీర్థము- ఈలాగున పెద్దలు చెప్పుదురు

శ్లో॥ పతివాక్య మనాదృత్య యానారీ సుకృతైఃపరైః । యదా నియుజ్యతేసాపి నైవసిద్ధాభవేత్సకృత్ ।

తా॥ ఏ స్త్రీ పతి వాక్యమును నిరాకరించి యితర పుణ్యముల నాచరించుచున్నో ఆస్త్రీ ఒకప్పుడయినను సిద్ధినిబొందదు.

శ్లో॥ యానారీపతిముల్లంఘ్య స్వేచ్ఛయావర్తతేసఘే । సానారీ యాతనేఘోరే వసత్యాచంద్రతారకమ్ ।

తా॥ ఏవనిత పతిని విడిచి స్వేచ్ఛగా సంచరించుచున్నో ఆవనిత భయంకరమయిన యమయాతనయందు చంద్రనక్షత్రము లుండువఱకు నివసించును.

శ్లో॥ పతిహీనాతు యానారీ గురుభి ర్ధర్మవిత్తమైః । ప్రేరితాచ విధాతవ్యం వ్రతం ధర్మఫలప్రదమ్ । యదినాప్రేరితంనైవ పతిబుద్ధిపరాయణా । పతిపాదాబ్జతీర్థేన యాస్నాతాసాహరిప్రియా ।

తా॥ ఏస్త్రీ పతివిహీనయగునో ఆ స్త్రీ ధర్మవేత్తలయిన గురువులచేత ప్రేరేపించబడినగాని, ప్రేరేపించబడకగాని పతిపరాయణయై ధర్మ మాచరించవలెను- ఏస్త్రీ పతిపాదోదకమును శిరస్సున జల్లుకొనునో ఆస్త్రీ హరికి ప్రియురాలగును.

శ్లో॥ సాస్నాతా సర్వతీర్థేషు గంగాదిషుసురార్చితే । యాతీర్థం పిబతేనిత్యం పతి పాదాభిషేకజం । చాంద్రాయణ సహస్రాణాం ఫల మాప్నోతిసాశుభే । తస్మాత్త్వత్కృతదోషేణ స్వమేవాయాతితత్ఫలం। భుజంత్యాస్త్రైమాఘేస్మిన్ దళిమ్యాం పుణ్యవాసరే । ముక్తిరాసీ ద్యథాపూర్వం నారీరూపంపునర్యయా ।

తా॥ ఆస్త్రీ గంగాది సమస్త తీర్థములయందు స్నానమాడిన దగును- ఏస్త్రీ నిత్యము పతి పాదోదకమును పానముచేయునో ఆస్త్రీ సహస్ర చాంద్రాయణఫలమును బొందునుగనుక నీచేత చేయబడిన దోషముచే ఫలము నీవే అనుభవించవలెను- ఇట్టి నీకు యీ మాఘశుద్ధ దశమినాడు పుణ్యదినమందు మండూకయోనివలన ముక్తికలిగి పూర్వమువలె సుందర స్త్రీరూపము లభించినది.

శ్లో॥ కృష్ణవేణీజలే పుణ్యే మాఘేస్మి న్నఘవారకే । స్నాన మాచరమాభీస్త్రై తేనతే విష్ణుసన్నిధిః ।

తా॥ ఈ మాఘమందు పాపహరమయిన యీ కృష్ణోదకమందు స్నానమాచరింపుము. దానంజేసి నీకు విష్ణులోకము వచ్చును. భయమొందకుము.

శ్లో॥ స్త్రియోవా పురుషోవాపి ప్రాతర్మాఘే బహిర్జలే । యే నరాశ్చావగాహంతే తేపియాంతి హరేర్గృహమ్ ॥

తా॥ స్త్రీలుగాని, పురుషులుగాని యెవ్వరేని మాఘంబున ప్రాతఃకాలమందు బహిర్జలమందు స్నానమాచరించినయెడల శ్రీగృహమును బొందుదురు

శ్లో॥ అజ్ఞానాద్వాపి యత్నేన నావగాహంతి యేనరాః । దశమ్యామథసప్తమ్యాం పౌర్ణమ్యాం ప్రతిపద్దినే । నతేషాం మగ్రిపాపాని విలయంయాంతికర్హిచిత్ ॥

తా॥ ఏమనుష్యులు అజ్ఞానమువలనగాని, ప్రయత్నముచేత (గాని) మాఘశుద్ధ దశమిదినమందును, సప్తమియందును, పౌర్ణమాసియందును, పాడ్యమినాడును స్నానమాచరించరో వారియొక్క పాపములు ఒకప్పుడును నాశమును బొందవు.

శ్లో॥ యేవగాహంతి శుక్లేతు మాఘేవై ప్రతిపద్దినే । తేషాం పాపాని నశ్యంతి జీమూతాఇవవాయునా ॥

తా॥ మాఘ శుద్ధ పాడ్యమిదినంబున మాఘస్నానము చేయువారి పాపములు వాయువుచేత మబ్బులవలె నశించును.

శ్లో॥ యస్స్నాతి మాఘద్వాదశ్యా మేకాదశ్యాం బహిర్జలే । ప్రాతస్సూర్యోదయే విష్ణు మభ్యర్చ్య హరి సత్కథామ్ । మనఃప్రీతికరాం పుణ్యా మేతన్మాఘ ప్రశంసనీం । యశ్శృణోతి ముదామాఘే యో భక్త్యావా హరేః పురః । దహ్యంతే తస్య పాపాని తృణ శైలా ఇవానలాత్ ॥

తా॥ ఎవ్వడు మాఘశుద్ధ ఏకాదశీ ద్వాదశులయందు బహిర్జలంబున ప్రాత స్స్నానమాచరించి శ్రీవిష్ణువును పూజించి తదగ్రమందు హరిచరిత్రపూరితమయిన మాఘవైభవమును సంతోషముగా భక్తితో వినునో వానిపాపములు అగ్నిచేత కాలిన గడ్డిగుట్టలవలె నశించును.

శ్లో॥ మాఘే శుక్ల చతుర్దశ్యాం పౌర్ణమ్యాం భక్తితత్పరః । ప్రాతర్నిమజ్య మాఘేస్మిన్ స్నాత్వా సంపూజ్య మాధవమ్ । అష్టా

దశాన్యపూపాని పూరికాని విశేషతః । వేణుపాత్రస్థితాన్యేతం దానం యఃకురుతేనఘే ॥ భుక్త్వేహ సంపదం భోగం పరత్రచ పరాంగతిం । సార్వభౌమో భవేద్భూయః ప్రసాదాచ్చక్రపాణినః ॥

తా॥ ఎవ్వఁడు మాఘ శుక్ల చతుర్దశి దినంబునగాని, పౌర్ణమాసియందుగాని భక్తితో ప్రాతస్స్నాన మాచరించి మాఘమాసాధిదేవుఁడయిన మాధవుని ఆరాధించి అష్టాదశ (౧౮) అపూపములుగాని, పూరీలుగాని వేణుపాత్రయందుంచి బ్రాహ్మణునకు దానమిచ్చునో ఆపుణ్యాత్ముఁడు యీలోకమందు సమస్తభోగముల ననుభవించి పరమందు స్వర్గాదుల ననుభవించి చక్రపాణి ప్రసాదమువలన తిరిగి భూమియందుచక్రవర్తిగా పుట్టును.

శ్లో॥ యేనకేనాప్యుపాయేన మాఘే స్నాత్వా జనార్దనం । సమభ్యర్చ్య ప్రదాతవ్యం దానం శక్త్యనుసారతః ॥

తా॥ ఏ యుపాయముచేతనయినను మాఘస్నాన మాచరించి మాధవపూజసల్పి యథాశక్తిగా దాన మాచరింపవలయును.

శ్లో॥ ఇతీదం కథితం పుణ్యం మాఘమాసస్యవైభవం । యథాతే కథితం కామ మిత్యుక్త్వావిరరామసః ॥

తా॥ ఈప్రకారముగా పుణ్యమైన మాఘమాహాత్మ్యమును యిష్టానుసారముగా నీకు జెప్పితినని పలికి గౌతమమహాముని యూరకుండెను.

శ్రీమహాదేవః॥ శ్లో॥ తతస్సరాజా దేవేశి కృష్ణవేణీ శుభోదకే । సంజాతభక్త్యా మాఘేస్మిన్ స్నాత్వాసంపూజ్య మాధవమ్ ॥ శ్రుత్వా విష్ణుకథాందివ్యా మేతన్మాస ప్రశంసినీం । ఇహాభుక్త్వా స్వకంరాజ్యం రథవాజిగజాన్వితమ్ ॥ పుత్రపౌత్రసమాయుక్త స్సపునర్మాఘమజ్జనం । విధాయాంతే యయౌవిష్ణో రాలయం నీరజేక్షణే ॥ గౌతమస్య ప్రసాదేన ప్రసాదా చ్చక్రపాణినః । మాఘమజ్జనతో యాతి వైకుంఠం జన్మవర్జితం । సతత్ర విష్ణుసాయుజ్యం లభ్యతే స్నానమాత్రతః ॥

తా॥ ఓ పార్వతీ ! వినుము. అంతట నా రాజోత్తముఁడు కృష్ణవేణీజలమందు భక్తితో స్నానమాడి రాజీవనయనుని షడిరాజేపచారంబులు రాజీవాదులచే బూజించి మాఘపురాణశ్రవణ మాచరించి భూలోకమందు పుత్రపౌత్రాదిసమేతుఁడై రథాశ్వగజాది సంపదలతో స్వకీయ రాజ్యము ననుభవించి తిరిగి మాఘస్నానమాచరించి గౌతముని

కరుణచేతనున్ను, కృష్ణుని కృపచేతనున్ను దేహాంతమందు పునర్జన్మరహితమయిన పుండరీకాక్షుని పురముజేరి అచ్చట విష్ణుసాయుజ్య ముక్తిని బొందెను. ౧ సాలోక్యముక్తి, ౨ సామీప్యముక్తి. ౩ సారూప్యముక్తి ౪ సాయుజ్యముక్తి ఉత్తరోత్తరముశ్రేష్ఠము. ఇదంతయు మాఘస్నానమువలన నైనదిగా తెలిసికొనుమా మాధవసోదరీ

శ్లో॥ తత్రైవమునిపత్నీసా. కృష్ణవేణ్యాం ముదాన్వితా। మాఘే చార్ధోదితేమిత్రే ప్రాతస్స్నాత్వా దినేదినే। ధ్యాయంతీ పతిపాదాబ్జం శ్రుత్వా విష్ణుః కథాంశుభామ్। మాధవస్య ప్రసాదేన మాఘస్నానఫలేనచ। యయౌసా గౌరీ దేహాంతే విష్ణులోకం సుఖప్రదమ్॥

తా॥ ఓ పర్వతరాజపుత్రీ! ఆ మునివరుని పత్నికూడ అచ్చటనే కృష్ణవేణీ జలమందు మాఘమాసంబున మాధవపదపద్మముల ధ్యానమానసురాలై మిత్రుం డర్థోదితుండగుచుండగా ప్రతిదినము ప్రాతస్స్నానమాడి విజనాథుని పదకమల మరందగ్రోలమానసురాలై మధుసూదనుని మధురకథామృతపాన మాచరించుచు కాలముగడిపి పాంచభౌతిక దేహాంతమందు పుండరీకనయనుని ప్రసాదముచేతను. పుణ్యప్రద మాఘస్నాన మహిమచేతను, పురుహూతాదిసురపుంజముల కగమ్యమగు నా పుండరీకాక్షుని పురముజేరెను.

శ్లో॥ తపవిధి వివదంతి మనీషిణ స్తపసిబుద్ధి విశేష ఫలప్రదం। తపసి మజ్జనమత్ర విభావసావ నుదితే సకలేప్సితసిద్ధిదం। సకలపాప మహాభయాతుర స్తపసిదేవనిమజ్జతోయతః॥

తా॥ మాఘమాసమందు చేయఁబడిన తపస్సు బుద్ధి విశేషఫలము నిచ్చునని విద్వాంసులు చెప్పుచున్నారు మాఘమందు సూర్యుఁడు అనుదితుఁడగుచుండఁగా స్నానమాచరించినయెడల సకలార్థములు సిద్ధించును ఇచ్చట అనుదితమను స్థలమందు ఆకారముకు స్వల్పార్థమని కొందఱు చెప్పుచున్నారు. (అనుదరాకన్యేతివత్) అట్టిఅర్థమందు అర్థోదయ కాలమందు వచ్చును. ఉదయాత్పూర్వమని కొందరు చెప్పుచున్నారు. వికల్పమందు ఉదయ పూర్వకాలమును స్నానకాల మని చెప్పఁబడి యున్నది. ఇట్లే యీ గ్రంథమం దంతట తెలిసికొనఁదగినది. మాస్నానమువలన సకల పాపములును సర్వ భయములును నశించును.

శ్లో॥ పాతకాదినగకోటికోటయో మాఘమజ్జన పవిత్రహారతిః। కేతిభీకిముపయాంతిగోప్యతాం మాఘహీనమనుజాంబుధౌశుభే॥

తా॥ ఓ గౌరి! పాతకములు అను పర్వతసమూహములు మాఘస్నాన మను వజ్రాయుధముచేత కొట్టఁబడి మిక్కిలి భయమొంది మాఘస్నానవిహీనమానవులు అను సముద్రమునందు రహస్యముగా దాగుచున్నవి. అనఁగా వజ్రముచేత గొట్టఁబడిన పర్వతములు భూమిని విడిచి సముద్రమం దెట్లు దాగెనో అట్లు మాఘస్నానముచేత హతములై పాపములు స్నానహీనులయందు దాగునని భావము.

శ్లో॥ మాఘమజ్జన మరుద్బలాధికా క్షోభురాశి ఘనకోటికోటయః। యాంతిదూరమవిశేషకేవలం సంవిదాశునతుసంశయం శుభే ।

తా॥ మాఘస్నాన మను మహాబలములయిన వాయువులవలన పాపరాసు లను మేఘసమూహములు దూరముగా గొట్టఁబడుచున్నవి. ఇందుకు సందేహము లేదు అట్లు పోయి పాపక మాఘస్నానవిముఖ మహారణ్యములందు దాగుచున్నవి.

శ్లో॥ సకల పాతక స్సమాన్వితో మాఘమజ్జనరత స్సమాగతః। అఘనాశముపయాతిమంగళే శేషమాత్రముపయాతి కుత్రచిత్।

తా॥ ఓ గౌరి! సమస్తపాపములు అను చీకట్లు వ్యాపించినంతలో మాఘస్నాన మను సూర్యుఁడు వచ్చెను. ఈ మాఘస్నానరవి పాపతమస్సులను నశింపఁజేసెను. కొంచెము మాత్రము ఒకమూల మిగిలియున్నది. సూర్యోదయమందు చీకట్లు నశించును. గుహలలోమాత్రము కొంచముండును. మాఘస్నానమువలన పాపములు నశించును. మాఘస్నాన విముఖులందుమాత్రము నిల్చియుండును.

శ్లో॥ మాఘధర్మశతవ్రతం వ్రతం శుభే వ్రతగణేషు మహత్వనచాస్తిహి। ఇతివిబుధ్యనరః ప్రయత్నతః శుచిమనాస్సతతం సమాచరేత్ ।

తా॥ ఎన్ని వ్రతములయినను మాఘవ్రతముతో సమానములు గావుగదా యని తెలిసికొని మనుజుఁడు శుచియై నిరంతరము ప్రయత్నముతో మాఘ వ్రతము సాధించవలెను.

శ్లో॥ ఇతితవేశ మనంతసుఖప్రదం మాఘమాసఫల మార్తినాశనం। యఃశ్రుణోతిఫలమస్యశోభనే సర్వమస్తమఖకృత్ఫలంయయా ।

తా॥ ఓ సుందరీ! నీకు యీప్రకారముగా దుఃఖనాశనమును, సుఖప్రదమును నైన మాఘమహిమను జెప్పితిని. దీనిని వినువారు సమస్తయజ్ఞఫలములను బొందుదురు.

ఇతి పంచమోధ్యాయ స్సమాప్తః.

## — అథ షష్ఠోధ్యాయ ప్రారంభః —

శ్రీమహాదేవః॥ శ్లో॥ మాఘేస్మిన్నానవస్నాతి దైవయోగేనవా సకృత్ । సయాతి విష్ణుసాలోక్యం శూద్రశ్శూద్రసతీయథా ।

తా॥ ఓ నా ప్రియా! చెప్పెదను వినుము. ఈ మాఘమాసమందు దైవవశముచేత నొక్కమారయినను స్నానమాడువాడు శూద్రుడు శూద్రభార్యవలె విష్ణుసాలోక్యము క్తిని పొందును.

పార్వత్యువాచ॥ శ్లో॥ కథం శూద్రసతీ శూద్రో మాఘేస్మిన్ అవగాహనం । కేనాసీత్సంకృతంపాపం కథయాద్యమమప్రభో ।

తా॥ అద్రిరాజతనయ అడుగుచున్నది. ఓ నాప్రియుడా! చెప్పుము. శూద్రుడును, భార్యయు యెట్లు స్నానమాడిరి. ఏమి పాతకమాచరించిరి.

శ్రీశివః॥ శ్లో॥ కథయామి కథాంపుణ్యాం శ్రుణు పాపప్రణాశినీం। శ్రోత్రానందకరామద్య సమాధానేన పార్వతి ॥

తా॥ శంకరుడు చెప్పుచున్నాడు. ఓ పార్వతీ! పాపనాశనమయిన కథను చెప్పెదను వినుము. సావధానముగా వినిన శ్రవణానందకరమగును.

శ్లో॥ ఆంధ్రదేశేపురాకశ్చి చ్ఛూద్రోబహుధనార్జితః। సుమందో నామవిఖ్యాతః బహుధాన్యార్థసంచయః ।

తా॥ పూర్వంబున ఆంధ్రదేశమందు సుమందుడను నొక శూద్రుడు అనేక ధనధాన్యసంపాదకుడై యుండెను.

శ్లో॥ నిత్యం కృషిపరః క్రూరః కథా వార్ధుషికశ్చరః । క్రియ విక్రియశీలశ్చ గోమహిష్యాదకోష్ట్రికాః ।

తా॥ అతడు నిత్యము వ్యవసాయము చేయువాడును, క్రూరుడును వడ్డి వర్తకుడును, గూఢముగా వ్యవహారమును చేయువాడును, గోవులను, గేదెలను, గుఱ్ఱములను, మేకలను, ఒంటెలను, కొనుచు అమ్ముచుండువాడునై యుండెను.

శ్లో॥ సంచితం తేనశూద్రేణ మహాక్షోణీమితం శుభే । తస్యాసీత్కుముదాభార్యా సర్వభూతదయాన్వితా ।

తా॥ వాడొక మహాక్షోణీమితమైన (౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦) ధనమును సంపాదించెను. వానికి సర్వభూతదయాళువైన కుముదయను భార్యగలదు.

శ్లో॥ శూద్రస్సుమందః కుమతి స్సర్వదేవపరాఙ్ముఖః । అసత్య భాషణః పాపీ క్రూరవాఙ్నిర్దయః ఖలః ॥

తా॥ ఆ సుమందుడు దుర్బుద్ధియు, సమస్తదేవతావిముఖుడును, అబద్ధమాడువాడును, పాపియు, కఠినవాక్యుడును, నిర్దయుడును, దుర్జనుడునునై యుండెను.

శ్లో॥ యత్నేనసంచితం ద్రవ్యం స్వాత్మభుక్తి వివర్జితం । దాన క్రియావిహీనంచ నిక్షిప్తం భువి పార్వతి ॥

తా॥ ఆశ్చర్యకరము. యత్నముచే సంపాదించిన ధనమును తాను తినక, పరుల కియ్యక భూమియందు పాతిపెట్టెను,

శ్లో॥ తత స్తత్సదనం కశ్చి ద్దాయాతో నిశి దైవతః । ముని శ్శుచి వ్రతో నామ మాఘేహ్యస్య నికేతనమ్ ॥

తా॥ కొంత కాలమునకు దైవవశమున శుచివ్రతుడను నొక మునీశ్వరుడు మాఘమాసమందు రాత్రియందు ఆ శూద్రుని గృహమునకు వచ్చెను.

శ్లో॥ వాసార్థం యాచయద్ద్వారం శూద్రస్య గృహిణీం శుభే । మార్గశ్రాంతసువృష్ట్యాచ పీడిత శ్శీతగద్గదః ॥

తా॥ ఆముని మార్గాయాసగతుడై వర్షపీడితుడై చలిచే వణకుచు మాటలాడుటకు తిన్నగా నోరురాక ఆ శూద్రభార్యను నివాసముకొఱకు యీ విధముగా యాచించెను

శ్లో॥ దేహి విప్రస్యమే భద్రే పథిశ్రాంతస్య వృష్టిభిః । మేఘచ్ఛన్నతుషారైశ్చ ప్రాప్తాంధతమయామిణః ॥ దేహి త్వన్మందిరేవాసం శీతవృష్టివివర్జితం । అద్యోషిత్వానిశాం నీత్వా ప్రాతర్గచ్ఛామిచానఘే ॥

తా॥ ఓ శుభాంగీ! నేను బ్రాహ్మణుడను. మార్గమందు వర్షముచేత బాధనొందినాను ఆకాశము మేఘాచ్ఛాదితమై తుషారవృష్టితో నున్నది. చీకట్లు మూది దూరం పందులేకున్నవి గనుక నీయిల్లు బాగున్నది. ఈ రాత్రి నీయింటిలో నివసించి శీత వృష్టిబాధలకు పాత్రుడను గాక ఉదయాన నేను వెళ్లెదను గాన నీయింటిలో నాకు నివాసమిమ్మా

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా శూద్రీజాతదయాన్వితా । ఆహేద మథవిప్రేంద్ర మాగచ్ఛాంతర్గృహం ద్విజ ॥

తా॥ ఈప్రకారముగా నడిగిన ఆ బ్రాహ్మణునిమాట విని ఆ కుముద దయాపరురాలై ఓ బ్రాహ్మణోత్తమా! మా యింటిలోపలికి రమ్ము. బాధను నివర్తింతును రమ్ము. సుఖాన నుండుమని పలికెను.

శ్లో॥ తతోవ్యశోధయద్గోష్ఠం సమ్యక్సమ్మార్జనం శుభే। రోమ కాకీమథాస్తీర్య శ్రీంతాయాగ్రసుజన్మనే॥

తా॥ ఇట్లు పలికి గోష్ఠానమును వూడ్చి, అలికి, ముగ్గిడి, యొక కంబళమును పఱచి ఆబ్రాహ్మణుని గూర్చుండుమనెను.

శ్లో॥ శుచివ్రతస్తతోగత్వా శీతవృష్ట్యంబుపీడితః। తతోప్రవిశ్య విప్రేంద్రో ముదమాప శుభేక్షణే।

తా॥ ఆ శీతవర్షపీడితుఁడయిన శుచివ్రతుఁడును లోపలికిపోయి కంబళముమీద గూర్చుండి సంతోషించెను

శ్లో॥ సాపునఃపరిధానాయ కంబళం శీతవారణం। దత్వాచాగ్నిమథోద్దీప్య దదాత్యగ్రేతివేగతః।

తా॥ ఆకుముదయు నతివేగంబున శీతనివారణకొఱకు మఱియొక కంబళమును దెచ్చియిచ్చి పైన గప్పుకొనుమని కుంపటిలో నగ్నినుంచి ప్రజ్వలింపజేసి వానిముందఱ నుంచినదాయెను.

శ్లో॥ గాం దుదోహ తతఃక్షీరం సుపాత్రేమృణ్మయేనవే। దదౌ తస్మైద్విజేంద్రాయ క్షుత్తృష్ణా పరిహారకమ్॥

తా॥ తఱువాత ఆవును పాలుపితికి మంచికుండలో కాచి ఆకలిదప్పులు తీరకొఱకు క్షీరములను నాబ్రాహ్మణునకిచ్చెను

శ్లో॥ సాకుర్యాదితిమాఘేస్మిన్ పతౌ గ్రామాంతరంగతే। పత్యౌ ప్రైగతంభూయో నశక్యంవిప్రసేవనమ్॥ ఇత్థం విదితవృత్తాంతా లబ్ధకామ మనోరథా।

తా॥ అదిన్నది యీప్రకారముగా మాఘమాసమందు జరిపినది. అసమయమందు తనభర్త గ్రామాంతరము వెళ్ళినాఁడు. భర్త తిరిగి యింటికివచ్చిన యీయుపచారము నతఁడు జేయనివ్వడుగనుక యిప్పుడే చేసికొనవలయునని విచారించి యీప్రకారము బ్రాహ్మణసేవఁజేసి కృతార్థురాలై సంతోషించెను.

శ్లో॥ విప్రవస్తుంతుమ్మచిశ్రోసా గృహీతస్యాశ్శుశ్రుతే । శ్రాంతః సుప్తస్సముదితః ప్రబుద్ధశ్చాపరేనిశి ॥ గీతపాఠం వితన్వానః కీర్తయ న్విష్ణుకీర్తనమ్ ॥

తా॥ బ్రాహ్మణుఁడును సంతోషించి అచ్చట శయనించి ఆయాసమును బోఁ గొట్టుకొని నిద్రించి అపరరాత్రమందు లేచి హరికీర్తనలు పాడుచుండెను. అంతలో నిద్రలేచిలేచిన దాచిన్నది

శ్లో॥ తతస్తాంనిర్గతాంనిద్రా దుత్థాయనిశిభూసురం । కీర్తయంతం ముదంప్రాహ హరినామాని శూద్రిజా ॥

తా॥ తరువాత దాసముద నిద్రలేచి హరినామోచ్చారణ చేయుచున్న యా బ్రాహ్మణునిఁజూచి సంతోషించి యిట్లనియె.

శ్లో॥ బ్రహ్మన్ తేగమనంకస్మా త్కుత్రయాస్యసి సాంప్రతం । తదహంజ్ఞాతుమిచ్ఛామి వదమేకృపయానఘ ॥

తా॥ ఓబ్రాహ్మణోత్తమా! ఎచ్చటనుండి వచ్చుచుంటిరి. ఇప్పుడెచ్చటికి వెళ్లు చున్నారు. ఈవిషయము నాయందు దయయుంచి చెప్పుము.

శుచివ్రతః॥ శ్లో॥ తుంగభద్రాతటాన్మేద్య ఆగమంప్రైతదానఘే। శ్రీరంగం ద్రష్టుకామస్సన్ మాఘేస్మిన్ తీర్థసేవనమ్ ॥ కాంక్షన్ మమాగమం భద్రే విష్ణులోకాయ శాశ్వతం । ఇత్యుక్త్వా విప్రవర్యేణ ప్రోవాచ వచనం సతీ ॥

తా॥ ఓచిన్నదానా! నేనిప్పుడు తుంగభద్రా నదీతీరమునుంచి వచ్చుచున్నాను. శ్రీరంగమును దర్శించు కోరికచేత వెళ్ళుచు యీమాఘమాసమందు తీర్థసేవాభిలాషినై వచ్చుచుంటిని. ఈగమనము విష్ణులోకప్రదము. ఈప్రకారముగా మునిచేత పలుకఁ బడిన విని యాకసముద తిరిగి బ్రాహ్మణునితో నిట్లనియె.

శ్లో॥ కథం మాఘఫలం విప్ర కథం తీర్థనిషేవణం । కేనసశ్యంతి పాపాని కథం తుష్యతి కేశవః ॥

తా॥ బ్రాహ్మణోత్తమా! మాఘఫలమెట్టిది. తీర్థసేవయెట్లుగా చేయఁదగినది. ఏమిఫలము. దేనిచేత పాపములు నశించును. మాధవుఁడు దేనిచేత సంతోషించును.

శ్లో॥ ఇత్యుక్తస్సతయా ప్రాహ శుచిస్తు మాఘఫలం శుభే । యచ్ఛ్రుత్వాముచ్యతేఽంతుః పాపైర్జన్మశతార్జితైః ॥

తా॥ ఈప్రకారముగా నా కుమారునిచేత నడుగఁబడిన శుచివ్రతుఁడు చెప్పు చున్నాఁడు. ఓ శుభచరితా! చెప్పెదను వినుము. మాఘఫలమును వినినచో సామాన్య ఫలము. ఇది నూరుజన్మములచేత నార్జించిన పాపములనయినను నశింపఁజేసికొనవచ్చును.

శ్లో॥ మాఘే మకరగేసూర్యే మహాక్రతుఫలప్రదే। ప్రాతర్యః కురుతే స్నానం నారీవా పురుషోపివా। నశ్యంతి తస్యపాపాని ఘోర దుఃఖప్రదానిచ।

తా॥ మాఘమందు రవి మకరమందుండఁగా ప్రాతఃకాలమందు నెవ్వఁడు క్రతు కోటిఫలప్రదమయిన మాఘస్నాన మాచరించునో వానియొక్క ఘోర పాపములు నశించిపోవును.

శ్లో॥ సంప్రాప్తే మాఘమాసేతు ప్రాతస్సూర్యోదయేనఘే। స్నాత్వా హరిం సమభ్యర్చ్య సుపుష్పైశ్చ సితాసితైః। కరవీరైస్సుగంధాఢ్యైః కోమలైస్తులసీదళైః। సంపూజ్య మాధవం దేవం మాఘధర్మ ప్రియావహమ్। శ్రుత్వా భాగవతం శాస్త్రం మాఘమాసఫలోదితం। దానమేకంతు యఃకుర్యా దన్వహం శృణుతత్ఫలమ్। బ్రహ్మహత్యాది పాపాని జ్ఞానాజ్ఞానకృతానిచ। నరాణామపినారీణాం నాశమాయాంతి తత్క్షణాత్।

తా॥ ఎవ్వఁడు మాఘమాసంబున సూర్యోదయకాలమందు స్నానమాచరించి తెల్లనివియు, నల్లనివియునయిన పుష్పములచేతను, పరిమళించుచున్న కరవీరాదులచేతను, కోమలములయిన తులసీదళములచేతను. మాఘధర్మ ప్రియుఁడయిన మాధవస్వామి నారాధించి మాఘవైభవ ప్రతిపాదక మాధవ మధురకథా మానసు లగుచు ప్రతిదిన మందు యథాశక్తిగా దానమిచ్చెదరో వారికి లభించు ఫలమును జెప్పెదను వినుము. అట్టివారు నరులుగాని, నారీమణులుగాని జ్ఞానాజ్ఞానకృత బ్రహ్మహత్యాది మహా పాతకములచే తత్క్షణమే విముక్తులగుదురు

శ్లో॥ వినా స్నానం వినా దానం వినా కేశవపూజనం। మాఘే నివర్త్యతే యేన పతత్యంధతమోలయే।

తా॥ స్నానదానవ్రతపూజా దానరహితముగా మాఘమాసమును గడుపు మానవుఁడు అంధతామిశ్రనరకమందు అత్యంతకష్ట మనుభవించుచుండును.

శ్లో॥ యోనరో జన్మమధ్యేతు మాఘేస్మిన్స్నానవాసరే। ప్రాత

ర్బహిర్జలే స్నానం యదాస్యై నాచరేద్యది । ప్రయాతి రౌరవంఘోరం పునరావృత్తివర్జితమ్ ।

తా॥ ఎవ్వఁడు జన్మలో నొకప్పుడయినను మాఘమాసమందు ఒకదినమందయి నను ప్రాతఃకాలంబున బహిర్జలమందు స్నానమాచరింపఁడో ఆ మనుజాధముండు పున రావృత్తిరహితమయిన నిత్యమై వెలుంగు రౌరవనరకమందు నివసించి (తత్ర్కియ) దుఃఖ మనుభవించుచు మాఘస్నానవైముఖ్యమును స్మరించుచుండును.

శ్లో॥ నమాఘసదృశంపుణ్యం పవిత్రం విద్యతేన మే । క్రతుభ్య స్సర్వలోకేభ్య స్తథా దానార్చనాదిభిః । యత్ఫలం ప్రోచ్యతే విద్భిః మాఘస్నానేన తత్ఫలమ్ ।

తా॥ మాఘసమానమయిన పుణ్య మీజగతియందు లేదు. క్రతువులవలన, సర్వ లోకములవలన, దానాదులవలన నేఫలమును బొందుదురో ఆఫలము మాఘస్నానము వలన లభించును.

శ్లో॥ తస్మిన్యఃస్నాతితీర్థేతు ప్రయాగే మంగళప్రదే। నతస్య పునరావృత్తి స్సాక్షాద్విష్ణుర్భవేత్సహి ।

తా॥ ఆ మాఘమాసమందు మంగళదాయకమయిన ప్రయాగయందు స్నాన మాచరించువారికి పునరావృత్తిలేదు. అతఁడు సాక్షాద్విష్ణుస్వరూపుఁడగును.

శ్లో॥ ప్రయాగే మాఘమాసేతు యస్స్నాత్వా మాధవార్చ నం । మాధవస్యప్రసాదేన సవైకుంఠే చిరంవసేత్ ।

తా॥ మాఘంబున ప్రయాగయందు స్నానమాడి మాధవపూజ సలిపినవారు మాధవానుగ్రహముచేత మాధవాలయమయిన వైకుంఠమందు చిరకాలముండును.

శ్లో॥ యత్ఫలంప్రోచ్యతేవిద్భిః ప్రయాగేచ శుభప్రదే । కావేరి సలిలేమాఘే కృష్ణవేణీజలేమలే । రేవాయాం తుంగభద్రాయాం సర స్వత్యాంజలాప్లుతః । గోదావర్యాంచ ప్రభాసేచ శోణభద్రేచ గౌతమీ । స్నానం దక్షిణకూపాదౌ వేగవాన్ సురదీర్ఘికా । ప్రత్యక్ప్రవాహే కావేర్యాం తామ్రపర్ణ్యాం శుభాననే । సయాతివిష్ణుసాయుజ్యం సాక్షా ద్విష్ణుర్నసంశయః ।

తా॥ ప్రయాగయందు బొందెడు ఫలమును మాఘమాసమందు కావేరి, కృష్ణ

వేణీ, రేవా, తుంగభద్రా, సరస్వతీ, గోకర్ణ, ప్రభాస, శ్రోణభద్ర, గౌతమీ, దక్షిణ కూపాది వేగవతి, సురదీర్ఘికా ప్రత్యక్షవాహ కావేరీ తామ్రపర్ణీ యీపుణ్యజలముల యందు స్నానము చేయువారు విష్ణుసాయుజ్యమును బొందుదురు. సందియంబులేదు.

శ్లో॥ కూపకుల్యా తటాకేషు దేవఖాతేషుయేషుచ। మాఘేస్మి న్మజ్జనాన్ముక్తి ర్నమాతురుదరోదయమ్ ॥

తా॥ మాఘమందు కూప (నుయ్యి) కుల్యా (కాలువ) తటాక (చెఱువు) ములయందును, దేవఖాత (మనుష్యనిర్మితములుగాని నద్యాదులు) ములయందును స్నానమాచరించువానికి ముక్తికలుగును. తిరిగి తల్లిగర్భమందు బుట్టుట లేదు.

శ్లో॥ గోష్పదే సలిలేవాపి పుణ్యక్షేత్రజలాశయే। మాఘస్నానంతు యఃకుర్యాత్ యత్రకుత్రాపి మానవః। నతస్య పాపభీతిశ్చ నపాపైర్లిప్యతేక్వచిత్। భుక్త్వేహసకలాన్భోగా నంతేయాతిహరేఃపదం ॥

తా॥ మాఘంబున పుణ్యక్షేత్ర జలమందుగాని, గోష్పాద సలిలమందుగాని, యెచ్చటనయినను ప్రాతస్స్నానమాచరించినవానికి పాపసంబంధములేదు. యమభటుల భయమునులేదు. ఐహికమందు విశేషభోగముల ననుభవించి ఆముష్మికమందు హరి సాన్నిధ్యముజేరుదురు.

శ్లో॥ బలాద్వా భక్తితో మోహాత్ మాఘేమాసి నిమజ్జనం। కరోతి తస్యదేహాంతే ముక్తిః కరతలేస్థితా ॥

తా॥ బలవంతముచేతగాని, భక్తిచేతగాని, మోహముచేతగాని, మాఘస్నాన మాచరించువానికి ముక్తి హస్తమందే యుండును.

శ్లో॥ కిమత్రబహునోక్తేన నమాఘస్నానజంఫలం। వక్తుమర్హంతి రుద్రాద్యా ఇంద్రాద్యాఅపిచామరాః ॥

తా॥ ఓ తల్లీ! ఈవిషయమై యింకేమి చెప్పవలెను. మాఘస్నాన పుణ్యము చెప్పుటకు రుద్రులు, ఇంద్రాది దేవతలుగూడ సమర్థులుగారు.

శ్లో॥ ప్రసన్నవదనా శూద్రీ శ్రుత్వేత్థం మునిభాషితం। వికసన్నాననాంభోజా ఉద్యద్రోమాంచకరోదయాతే। తుష్టావ విప్రేంద్రం వాక్యైస్సాధుకృపోర్జితైః ॥

తా॥ ఈవిధముగా [illegible] ముఖమున విని ఆ మునివాక్యములను [illegible] మానసపద్మము గలదై (అనగా సంతోషచిత్తము గలదనుట) అప్పుడు మంచి మాటలచేత మునీశ్వరుని స్తోత్రముచేసెను.

శ్లో॥ ధన్యాస్త్వవవిప్రేంద్ర పావితోస్మి మహామునే. పావితంమే కులంసర్వం పావితాః పితరోఖిలాః । పావితం సదనమేశ్య గమనాత్తవసాంప్రతమ్ ॥

తా॥ ఓ మహానుభావా! బ్రాహ్మణోత్తమా! మీదర్శనముచేత నేను ధన్యురాలనైతిని. మాకులము తరించె. మాపితరులు ధన్యులైరి. మీ రాకచేత మాగృహము పావనమాయె.

శ్లో॥ ఏవంవివదమానేతు సాధ్వోరాసీద్గతానిశా । బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ సమాప్తస్నరుణే శుభే । మునిశ్చచివ్రితస్నార్థం మాఘే సూర్యోదితే రవౌ । గంతుకామో భవేద్దేవి తంవృష్ట్వాసా పునర్ద్విజమ్ ।

తా॥ ఈప్రకారముగా మాట్లాడుచున్నంతలో రాత్రి గడచినది. బ్రాహ్మీముహూర్తమున అరుణోదయ సమయమందు నాతి లేచి కించిత్సూర్యోదయకాలమందు స్నానార్థమై పోవుచున్నంతలో ఆసుందరి బ్రాహ్మణునితో నిట్లనియె.

శ్లో॥ ఉవాచవిప్రమేవాక్యం శ్రీణుయాస్యామి తేనుగా । మాం పాలయ కృపారాశే కరిష్యే మాఘమజ్జనమ్ ।

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నామాట వినుమా. దయాసముద్రా! నన్ను రక్షించుము. నేను నీతో వచ్చి మాఘస్నాన మాచరించెదను.

శ్లో॥ ఇతితస్యావచశ్శ్రుత్వా సాధుసాధ్వితిసంస్తువన్ । సంభూత సంబ్రమేతస్యాః స్నానాయగమనేముదా ।

తా॥ ఆ కన్యకమాట విని మునివర్యుండు మంచిది మంచిదని స్తుతిచేసి కన్యక యొక్క స్నానార్థగమనమును చాల సంతోషించెను.

శ్లో॥ సమాయాతః పతిః క్రూర స్సమందత్స్వోదితే రవౌ । తం దృష్ట్వా పతిమాహేదం యత్కృతం పూర్వవాసరే । మునేరాగమనం

సర్వం తత్సేవ్యం మాఘజంఫలం । తస్మైన్నివేద్యయాస్యామి స్నానాయాస్మిన్ బహిర్జలే । ప్రాతర్వ్రేణశుచినా తటాకేమదితేరవా ।

తా॥ పూర్వ శ్లోకమందు "సంభూత సంభ్రమః" అను పాఠాంతరమునకు తాత్పర్యము వ్రాయబడుచున్నది. మంచిదని మని స్తుతించెను. తరువాత కుముద స్నానార్థము బయలుదేరనని సంభ్రమముతో నున్నంతలో తన భర్త వచ్చెనని యీశ్లోకముతో నన్వయము. ఇంతలో క్రూరుఁడయిన ఆ కుముద భర్త సుమందుఁడు వచ్చెను. అతని జూచి కుముద రాత్రి మునిరాకయు, తత్సేవయు, మాఘమహిమ శ్రవణమును అతనికి జెప్పి సూర్యోదయము కాకముందు తటాకమునకు స్నానార్థమై మునితో నతి గెదనని బ్రతిమాలుకొనెను.

శ్లో॥ ఇతి భార్యావచశ్శ్రుత్వా కోపరక్తాంతలోచనః । ప్రత్యువాచతతోభార్యాం ప్రాతశ్శీగజలే వృధా । కోమాఘః కింఫలంమూఢే కోవిప్రః స్నానబోధకః ।

తా॥ ఇట్లు భార్యమాటను విన్నంతలోనే సుమందుఁడు కోపస్వభావుఁడై భార్యతో నిట్లనెను. ఓ పిచ్చిదానా! ప్రాతఃకాలమందు శీతజలమందు వృధాగా నెందుకు మునింగెదవు. మాఘ మేమిటి. దానికి ఫలమనఁగా నేమిటి. ఇవంతయు నసత్యము. ఏ బ్రాహ్మణుఁడే నీకు స్నానమును బోధించినవాఁడు.

శ్లో॥ శిష్టతూష్ణీంనచేత్వాంతు తాడయామిగదేష్టినా ।

తా॥ మెదలకుండా కూర్చుండుము. అట్లు చేయకని నిన్ను పుఱు ఈ గదాఘాతంబులకు పాత్రనుగా చేయుదును.

శ్లో॥ ఇత్యేతద్వచనంశ్రూద్రీ మాఘస్నాననిరోధకం । శ్రుత్వాబాధమవాదేవి మాఘస్నాన ఫలోత్సుకా । గచ్ఛంత మనుగచ్ఛంతి తటాక మనువేగతః । తత్తస్మాచ్ఛ్వాద్రికాభీతా దద్రువే సాభయాతురా । అజ్ఞప్తా ఘరుతూర్ణం చ చకారస్నానమంభసి ।

తా॥ మాఘస్నాన నివారకమయిన భర్తమాటను విని కుముద మనోవ్యాకులత చెంది మాఘ స్నానోత్సుకయై బ్రాహ్మణునితో వేగముగా వెడలి స్నానమునకు విఘ్నము వచ్చునేమో యను భయముచేత తటాకమునకు త్వరగా బోయి బ్రాహ్మణాజ్ఞ మీద వడిగా మాఘస్నానము సాధించెను.

శ్లో॥ మాఘేస్మిన్ ఉదితే సూర్యే ప్రాత స్స్నానార్థమ స్త్రథా । వేగేనానుగమం కుర్వన్ యష్టి మాదాయ పాణినా । జలస్థాం తాడయ న్కోపా దపితాం జగృహే బలాత్ ।

తా॥ మాఘోదయమందు నా శూద్రాధముఁడు త్వరగా భార్యతో ననుగమించుచు చేతిలో కఱ్ఱను బుచ్చుకొని జలమధ్యమున్న భార్యను కొట్టుచు, బలాత్కారముగా పట్టుకొనెను. ఆ సముదయము నతనిని బట్టుకొనెను.

శ్లో॥ అన్యోన్యాకర్షణక్రోధా న్నిమజ్జ సలిలే సహ । ప్రాతర్మాఘే శూద్రః పపాతాన్యోన్యాకర్షణాత్ । మాఘస్నానంభ వేశ్యస్య శివే అన్యోన్యాకర్షణాత్ ।

తా॥ ఒకరి నొకరు లాగుకొనుటలో శూద్రుఁడుకూడా మాఘోదయమందు స్నానమాడినవాఁడాయెను. ఇట్లిరువురకు అన్యోన్యాకర్షణవలన మాఘస్నానము లభించినది. అనఁగా స్వయముగా స్నానమాడ నిచ్ఛగలిగిని భార్యను బట్టుకొనియుండుటచేత భర్తకుగూడా స్నానమాయెను.

శ్లో॥ దంపతీ సిక్తసర్వాంగౌ జగ్మతు స్స్వగృహం ప్రతి । ద్విజ స్స్నాత్వా యయౌచైంద్రీ మట స్తీర్థానికృత్యసత్క్రియః ।

తా॥ దంపతులు యిద్దఱును తడిసిన శరీరములు గలవారై తమ గృహమునకు వెళ్లిరి. బ్రాహ్మణుఁడును స్నానముచేసి, సంధ్యాదిపయాచరించి, సమస్తతీర్థసేవకొఱకు తూర్పుదిక్కునకు వెళ్లెను.

శ్లో॥ తయోఃకాలేనమాయాతే పకస్మిన్వ్యాధకేనఘే ! పంచత్వ మాపతుఃపశ్చా దామయేనాతిపీడితౌ ।

తా॥ కొంతకాలమునకు వారిరువురు దంపతులు కాల మాసన్నమై పిమ్మట రోగములచేత పీడితులై యొకదినమందు మృతినొందిరి.

శ్లో॥ తతస్సమాయయుర్యామ్యాః ఘోరరూపా భయంకరాః । పాశైరాబంధయామాసు స్తంశూద్రం ధర్మఘాతుకమ్ ।

తా॥ అంతట భయంకరాకారులును, వికృతరూపులును నయిన యమభటులు వచ్చి పాశములచేత ధర్మవిహీనుఁడయిన ఆశూద్రుని బంధించిరి.

శ్లో॥ వైకుంఠాదాయయుర్దూతా విష్ణోరమితతేజసః । ఆదా

యతే విమానాఢ్యం జాంబూనద విభూషితం । నానామణిగణాకీర్ణం
విచిత్రధ్వజశోభితం । తస్మిన్ని వేశ్య తాం శూద్రీం విష్ణునాజ్ఞప్రబుద్ధయః ।

తా॥ వైకుంఠలోకమునుండి మహామహిమలుగలయిన శ్రీ విష్ణు దూతలు బంగారముతో చేయబడినదియు అనేక మణిగణములతో నలంకరించబడినదియు, అనేక వర్ణ ధ్వజములచే శోభిల్లునదియు నయిన వొక దివ్యవిమానమును దెచ్చి ఆ విమానమందు ఆ శూద్రునిభార్యను వుంచిరి

శ్లో॥ తతస్తే గంతుముద్యుక్తా యామ్యా గోవిందపార్శ్వగాః ।
దృష్ట్వా తానాహ సా శూద్రీ విష్ణుదూతానిదం వచః ।

తా॥ తరువాత యమభటులు శూద్రునిగొని యమలోకమునకును, విష్ణుభటులు శూద్రుని భార్యనుగొని విష్ణులోకమునకు తీసికొనిపోవుచుండగా ఆ శూద్రునిభార్య విష్ణుదూతలతో నిట్లనిరి.

శ్లో॥ వైకుంఠనిలయా స్సర్వే శృణుధ్వం మేనుశాసనం । పతిర్మే
దుష్కృతిః పాపః సర్వధర్మపరాఙ్ముఖః ।

తా॥ భో భో వైకుంఠదూతాః, మీరందరు నామాట వినండి. నాభర్త దుష్ట బుద్ధియు, పాపియు, సర్వధర్మ విముఖుడును నగును.

శ్లో॥ తస్మాత్తస్యగతిర్యామ్యా సర్వదుఃఖవిధాయకం । అహం
తస్యప్రియాభార్యా తత్సంగాఘవరాయణా ।

తా॥ అందుచేత నతనికి దుఃఖమూలమయిన యమలోకము గలిగినది. నేనును అతని భార్యనగుటచేత తత్సంసర్గ దోషయుక్తనయితిని.

శ్లో॥ నైవకించిత్కృతం ధర్మం మయామే పతిభీతితః । దుస్సంగ
దోషయుక్తాయా స్సద్గతిః కేనలభ్యతే ।

తా॥ నాభర్తవలననైన భయముచేత నేను కొంచమయినను ధర్మమును చేయలేదు. దుర్జనసంగతిదోషయుక్తనయిన నాకు పుణ్యలోక మెట్లులభించినదో చెప్పుడీ యని కుముద వారిని గట్టిగా నడిగెను.

శ్లో॥ తామూచుస్తే పునర్వాక్యం మాఘమాసే నిమజ్జనం ।
కృతం త్వయేరితం శ్రుత్వా మాఘే సర్వాఘనాశనే ।

తా॥ ఇట్లడిగిన కుముదతో వైకుంఠవాసులుచ్చరించుచున్నారు. నీవు బ్రాహ్మణుని మాటచొప్పున సమస్త పాపనివారకమయిన మాఘస్నాన మాచరించితివి.

శ్లో॥ ముక్తిస్తేనైవపుణ్యేన మాఘస్నానోదితే సచ। శ్రుత్వా తేషాంవచః ప్రాహ సాపునర్మైవతి స్తథా॥ స్నానంమాఘే భవేత్పుణ్యాం అన్యోన్యాకర్షణా జ్జలే। తత్ఫలం నభవేద్భర్తు ర్యయాయుంవదంతుమే॥

తా॥ ఆపుణ్యముచేత నీకు ముక్తి గలిగెనని చెప్పగా నా మాట విని కుముద తిరిగి ప్రశ్నచేసెను. నేను మాఘస్నాన మాచరించునప్పుడు నాభర్త నాతో కలహించి నన్ను లాగు సమయాన అన్యోన్యాకర్షణవలన మేమిద్దఱము జలమందు మునిగి తిరిగాన నాకువలె నా భర్తకును మాఘస్నానమాయెను. ఆ ఫలమును నాభర్తకు లేదా యేమి చెప్పుదని కుముద పలికెను.

శ్లో॥ తత స్తద్వచనం శ్రుత్వా చిత్రగుప్తం బభాషిరే। అనుయాతు స్తయాస్నానా దవలోక్య శుభాశుభమ్॥ విచారితార్థస్తానాహ మాఘే చాన్యోన్యకర్షణాత్। ప్రాతర్జలే నిమజ్జ్యాథ నిర్మమజ్జ జలే సకృత్॥ తేనపాపాని సర్వాణి మార్జితాని స్వయం తథా। తస్మాన్న లేశఃపాపోస్తి సుమందస్య మహాత్మనః। తంవిముచ్య తతస్తూర్ణం ప్రేష యంతు హరేఃపదమ్॥

తా॥ ఆ మాట విని వారు పుణ్యాపుణ్య లేఖకుఁడయిన చిత్రగుప్తు నడిగిరి ఆ చిత్రగుప్తుఁడును స్నానార్థమై వద్దని భార్యతోగూడా వెళ్ళిన సుమందుని శుభాశుభ జాబితాను జూచి నిశ్చయించి యిట్లనియె. మాఘమాసంబున ప్రాతఃకాలమందు భార్యతో కలహించునప్పుడు అన్యోన్యాకర్షణవలనయి సుమందునకు అనేకపర్యాయములు మునుగుటచేత మాఘస్నానము దైవలబ్ధమయినది. ఆ మాఘస్నానముచేత సమస్తపాపములు నశించినవి. ఇచ్చట కుడువు పెట్టినాను గనుక యితనికి పాపము కొంచమయినను లేదు. సుమందుఁడు సుజనుఁడాయె. కాబట్టి ఓ యమభటులాలా! మీరితనిని విడువుఁడు. ఓ విష్ణుదూతలారా! మీరితనిఁగూడా తీసికొనిపొండు ఇట్లని వచించెను

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా యామ్యాస్తే విష్ణుపార్శ్వగాః। యామ్యా సర్వేగతాస్తూష్ణీం యమాజ్ఞావశవర్తినః॥ సుమందం విష్ణుదూతాస్తే సభార్యం వీతకల్మషం। విమానం స్వముపాదాయ జగ్ముర్వైకుంఠమందిరమ్॥

తా॥ ఈమాట విని యమభటులు తమ మంత్రి ఆజ్ఞచొప్పున తాము స్వస్థాన

మునకు వెళ్ళిరి. విష్ణుదూతలు సుకుంఠుని భార్యతోసహా విమానముమీద నెక్కించుకొని వైకుంఠలోకమునకు వెళ్ళి అచ్చట సుఖంబుగ నుంచిరి.

శ్రీమహాదేవః॥ శ్లో॥ తత్సంగాజ్జాయతే తాభ్యాం మాఘస్నానం శుచివ్రతం । జన్మతుస్నానమాత్రేణ వైకుంఠం విష్ణుమందిరమ్ ॥

తా॥ ఓ గౌరీ! వినుము. సత్సంగమువలన నా దంపతులు పుణ్యప్రదమయిన మాఘస్నానమాచరించి తత్ఫల మహిమచేత పునరావృత్తి రహితమయిన వైకుంఠలోకమును పొందిరి. (విగతాకుంఠావిగతః కుంఠావాన్యత్ర తస్యలోకస్య సవికుంఠః వికుంఠ ఏవవైకుంఠః నాశరహితః॥) అనే వ్యుత్పత్తిచేత వైకుంఠ శాశ్వతమయినది.

శ్లో॥ సత్సంగేన భవేన్ముక్తిః దుస్సంగేనాగసంచయః ।

తా॥ సత్సంగముచేత ముక్తికలుగును. దుస్సంగముచేత నరకమే దిక్కగును.

శ్లో॥ సంగస్సర్వాత్మనా త్యాజ్యో యదా త్యక్తుం నశక్యతే । సత్సంగ మాశ్రయేద్ధీమాన్ దుస్సంగం పరివర్జయేత్ ॥

తా॥ ఎల్లప్పుడు తప్పక సంగమును విడువవలెను. విడువ శక్తుడుగానిచో సత్సంగమునాశ్రయించి దుస్సంగమును విడువవలెను.

శ్లో॥ దిష్ట్యా సజ్జనసంగేన గౌరీ మాఘఫలన్నృణాం । సిద్ధిర్భవతు దేవేశి కిమన్యై ర్బహుభాషణైః ॥

తా॥ ఓ గౌరీ! సంతోషమాయెను. సత్సంగమువలన మనుజులకుమాఘఫలముసిద్ధించినది. ఇట్లే సర్వకాలమును సిద్ధించుగాక. ఇతర ప్రసంగములతో నేమిప్రయోజనము.

శ్లో॥ మాఘే సమాచరేత్స్నానం హిత్వా కార్యశతాన్యపి । స్నాన దాన విహీనో యః కేవలం స్వాత్మపోషకః । భుక్త్వాతు నరకం ఘోరం సభూమౌ రాక్షసో భవేత్ ॥

తా॥ నూరు కార్యములయినను వదలి మాఘస్నానమాచరించవలెను. స్నాన దాన శూన్యముగా మాఘమును గడుపువాడు అనేక నరకముల ననుభవించి భూమియందు రాక్షసుడై పుట్టును.

శ్లో॥ ప్రాతర్మిత్రోదయే మాఘే మహాపాపోపపాతకైః । విముచ్యతే నరస్సద్యః స్నానమాత్రేణ పార్వతి ॥

తా॥ మాఘమందు సూర్యోదయమందు స్నానమాచరించినవారు అప్పుడే పాతక ముక్తులగుదురు.

శ్లో॥ అగ్నిష్టోమ సహస్రాణి వాజపేయ శతానిచ । అతిరాత్రి సహస్రాణి సర్వాణ్యేవాస్య పార్వతి । మాఘస్నానసమం పుణ్యం లభతే నైవకర్హిచిత్ ।

తా॥ సహస్రాగ్నిష్టోమములును, శత వాజపేయ క్రతువులును, సహస్రాతిరాత్రి యజ్ఞములును, ఇతర సమస్తయాగములను మాఘస్నానముతో నొకప్పుడును సమానములు గావుసుమా పార్వతీ.

శ్లో॥ మాఘే మిత్రోదయే యేమలినతను ధరా మజ్జనం దైవయోగా । న్నారోపాంతే నిశాంతే విధివదనుచరన్ విశ్వపాలం తదైవ । కృత్వా పూజా మమేయాం ప్రభు మఖిలగురుం యాంతి దేహాంతరే । తేశాంతాకారై శ్శరీరైః పితృముఖనిఖిలై రన్వయై ర్విష్ణులోకమ్ ।

తా॥ మాఘంబున మిహిరోదయమందు మేఘప్రచ్ఛన్నమందు దైవయోగముచేత యథావిధిగా స్నానమాచరించి విశ్వపాలకుడును, విరించ్యాదిగురుత్రను నయిన విష్ణువును విధ్యుక్తముగా పూజించువారు వీతశారీరదోషులై విగ్రహాంతమందు శాంతాకారము లయిన శరీరములతో పితృ మాతృ మిత్రాది బంధువర్గములతో సహా పుండరీకాక్షునిపుర మును జేరుదురు.

ఇతి షష్ఠోధ్యాయ స్సమాప్తః.

---

—♦ అథ సప్తమోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీమహాదేవః । శ్లో॥ మాఘస్నానఫలం భూయః ప్రవక్ష్యామి వరాననే । యచ్ఛ్రుత్వాముచ్యతే జంతుః పాపైర్జన్మశతార్జితైః ।

తా॥ శంకరుడు చెప్పుచున్నాడు. ఓపార్వతీ! యింకా మాఘస్నానఫలమును చెప్పుచున్నాను వినుము. విన్నంతనే నూరు జన్మలయం దార్జించిన పాతక కోటులు నశించును.

శ్లో॥ యదివా యేనకేనాపి దైవాద్యస్యాన్వయే శుభే । కురుతే మాఘమాసేస్మిన్ స్నానం తస్య హరేర్గృహమ్ ।

తా॥ ఈమాఘమందు దైవయోగముచేత యెవ్వనియొక్క వంశమందు పుట్టినవాడు తననుద్దేశించి మాఘస్నానమాచరించునో వానికి హరిమందిరవాసము లభించును.

శ్లో॥ అస్మిన్నర్థే కథాం పుణ్యా మభిధాస్యామి పార్వతి । ద్వాపరేతు పురాదేవి గోదావర్యాస్తటే శుభే ॥ సుశీలఇతి విఖ్యాతో వేద వేదార్థతత్త్వవిత్ । ప్రవివేశ మహారణ్యం మార్గభ్రష్టస్సుదారుణమ్ ॥

తా॥ పార్వతీ! ఈ అర్థమం దొకకథను జెప్పెద వినుము. పూర్వమందు ద్వాపరయుగంబున గోదావరీతీరమందు వేదవేదార్థతత్త్వవేత్తయైన సుశీలుడను నొక బ్రాహ్మణుడు గలడు. అతడు పర్యటనము జేయుచు మార్గభ్రష్టుడై యొకభయంకరమయిన మహారణ్యము జొచ్చెను.

శ్లో॥ బహుద్రుమ సమాకీర్ణం కపిత్థాద్రు వటాదిభిః । నిరంతర తరువ్రాతై శ్శిరీషై స్సురదారుభిః ॥ సకంటకై శ్చబధురై ర్బహుభిస్థూల దారుభిః । వేణుగుల్మైశ్చ వివిధైః సాంధకారై స్సుదారుణైః ॥ వేణు గుల్మోత్థితధ్వానైః శ్వగోమాయుఖగస్వనైః । వాయునా తత్రతత్రైవ పతద్భిశ్శుష్కభూరుహైః ॥ మత్తమాలంగ మహిషైః వరాహ వ్యాఘ్ర నిశ్వనైః । తథాదావానలధ్వానై రన్యైశ్చాతిభయంకరైః ॥

తా॥ ఆయరణ్యము అనేకవృక్షములతో గూడినదియు, దట్టముగానున్న వృక్షములతో గూడినదియు, వెలగ, మామిడి, మఱ్ఱి, దిరిసెన, దేవదారు వృక్షములతోను, కంటకసహిత బధురములతోను, అనేక స్థూల దారువృక్షములతోను, దట్టముగానుండి- చీకట్లుగలిగి- భయంకరములయిన వెదురుపొదలతోను గూడినదియు, వెదురు పొదల నుంచి పుట్టిన ధ్వనులతోను, కుక్క- నక్కల కూతలతోను, పక్షి పలుకులతోను, ఎండి గాలికి పడుచున్న ఆకుల చప్పుళ్ళతోను, మదించిన గజ- మహిష- వరాహ- వ్యాఘ్రముల ఝూంకారములతోను, దవానల ఛటాఛట ధ్వనులతోను, భయంకరములయిన యితరధ్వనులతోను నిండియున్నదియునై యుండెను.

శ్లో॥ తత్రైకస్మిన్ మహారణ్యే రాక్షసం ఖాదిరాన్వితం । పాద యుగ్మం భవేత్తస్య ఖదిరో భూరుహా స్తథా ॥ తస్యాంఘ్రి రూర్ధ్వ దేహోభూ ద్రాక్షసో ఘోరదర్శనః । తస్యాంఘ్రియుగళో దేవి ఖాదిరః కంటకాన్వితః ॥ తస్మాల్లోద్భూత శాఖాభిః ఖదిరః కంటకావృతః । తన్మధ్యేవర్తితేపాదో దురాత్మా బ్రహ్మరాక్షసః ॥

తా॥ అచ్చట నొకచోట ఖదిరాకారముతో నొక రాక్షసుడుండెను. (ఖదిర మనగా చండ్రచెట్టు) ఆరాక్షసునిపాదయుగ్మము చండ్రచెట్టుగాను, మిగిలిన కాయము భయంకరమయిన రాక్షసాకారముగాను వుండెను. పాదములు మాత్రము చండ్రి

చెట్టులో నున్నది. అగ్ని సూర్యులో గూడినది ఇంతేగాక గాలిచెంగట ధట్టినకొమ్మలు గాలిచే కదలివచ్చుచు శరీరమంతయు గుచ్చుకొనుచు ఆ దుర్గాన్నుండియున్న బ్రహ్మరాక్షసుఁడు యాపరిశోకముగా నున్నాఁడు

శ్లో॥ నీలజీమూతసంకాశః కాలాంజనసమప్రభః । కాళరాత్రి సమాకారః కరాళాస్యః కృశోదరః । కరాళదంష్ట్రః క్రూరాత్మా రక్తాక్షోదీర్ఘదర్శనః । దిగంబరోనిరాహార స్తామ్రశ్మశ్రుశిరోరుహః ।

తా॥ వాఁడు నల్లనిమబ్బులో సమానమయినవాఁడును. కాటుకవంటి కాంతిగలవాఁడును, ప్రళయకాలరాత్రి సమానమయిన ఆకారముగలవాఁడును, పొడ్డ నోరు గలవాఁడును, కృశించిన పొట్టగలవాఁడును, వికటదంతుఁడును, క్రూరబుద్ధియు. రక్తనేత్రుఁడును, దూరదృష్టియు, వస్త్ర విహీనుఁడును. ఆహార శూన్యుఁడును, రొమ్ము గడ్డము- మీసము- వెంట్రుకలుగలవాఁడును నై యుండెను.

శ్లో॥ చల న్నైవాణు మాత్రంతు భ్రమన్ దేహ మిత స్తతః । ఆవృతఃఖాదిరానేక శాఖాభిశ్చోర్ధ్వగైశ్శుభే ।

తా॥ వాఁడు పాదములు ఖదిరము నంటుటచేత కదలలేక యిటునటు తిరుగుచు అనేక ఖదిరశాఖలతో గప్పఁబడియుండెను

శ్లో॥ భ్రమత స్తస్య సర్వాంగః తీక్ష్ణైః ఖాదిర కంటకైః । చండ వాయుచలద్భిశ్చ శాఖాభి ర్వ్యాహుదానిశమ్ । నిర్భిన్న దేహ స్తస్మాచ్చ స్రావరుధిరావదీ । వికీర్ణ దేశే శాఖాసు సమ్యగాకృతిమాశ్రితా ।

తా॥ గాలికి చలించుచున్న చంద్రకొమ్మలచేత శరీరమంతయు తెగి నిరంతరము దానినుండి నెత్తురు బయలుదేరి వ్యాపించుచున్నది. కొమ్మల నంటుకొనుచున్నది. నదిగా ప్రవహించుచున్నది.

శ్లో॥ నైవాహారో నోదపానం నైవాన్యజ్జీవభక్షణం । ఇతివేదన యుక్తస్య రాక్షసస్య సుదుఃఖితః । తద్దుఃఖం నరకేనాసీ న్నారకేషు నగాత్మజే । సుశీల స్తత్ర దేవేశి వేదవేదార్థతత్త్వవిత్ । తీర్థానిపర్యట న్నాగా న్మార్గభ్రష్టో వనేచరః । చింతయన్ తత్ర తత్రైవ పశ్యన్ ఘోరాటవీం ముహుః । భయార్తః కీర్తయన్ విష్ణుం విచరన్ గహనే వనే । దదర్శ ఖాదిరాంతస్థం రాక్షసం ఘోరరూపిణమ్ ।

తా॥ ఆరాక్షసునకు ఆహారము లేదు ఉదకపానము లేదు. జంతుభక్షణ లేదు. సుపరివారము దుఃఖించుచున్న ఆరాక్షసునిదుఃఖము వాకమందును లేదు. ఓ గౌరీ! సుశీలుఁడును తీర్థయాత్రఁజేయుచు మార్గమునదప్పి విచారించుచు మధ్యమధ్య ఘోరారణ్యములఁ జూచుచు భయముచేత క్లేశనాశకుఁడయిన కేశవుని కీర్తించుచు నా యరణ్యమందు చండ చెట్టులోనున్న రాక్షసునిజూచెను

శ్లో॥ కూజంతం బహుదాతస్మిన్ రుదంతమతిదుఃఖితం। భూయశ్శంత్రస్తహృదయః తం దృష్ట్వా బ్రాహ్మణ స్తదా। శ్మశానే వా వనే వాపి జలే వా సదనేఽపి వా। సమాపన్నే భయేనౄణాం భయనాశకరో హరిః। ఇతి సంచింత్య మనసా స్మరన్ నారాయణం ద్విజః। న భీత స్తత్ర తం దేవి త్రిష్టకామో హ్యతిష్ఠత।

తా॥ ఆ రాక్షసుఁడు బహువిధా కూయుచు, అతిదుఃఖముచేత యేడ్చుచుండెను ఘోరారణ్యమం దిదివఱకే భయపడుచున్న ఆబ్రాహ్మణుఁడు రాక్షసునిజూచి మఱింత భీతినొందెను. అప్పుడు కొంతసేపటికి ధైర్యముదెచ్చుకొని శ్మశానమందుగాని అరణ్యమందుగాని, జలమందుగాని, గృహమందుగాని మనుజులకు భయమాగతమయినచో నారాయణస్మరణవలన నాభయము తొలఁగునను నార్యోక్తిని తలఁచుకొని నారాయణ స్మరణఁజేయుచు భయమును వదలి రాక్షసుని జూడఁగోరి యచ్చటనే నిలిచెను.

శ్లో॥ సమమాలోకయ త్తస్మి న్మహా త్తద్వాయ మాదరాత్। యస్మా త్తద్వేదనా త్తస్మా న్మూర్ఛితః పునరుత్థితః। పునర్భ్రమంతం దుఃఖేన పునర్మూర్ఛా ముపాగతం। పునర్భిన్నసంసిక్త రక్తమాంస మదఃస్థలాత్। పునశ్శోకపరిక్రాంతం మూర్ఛంతంతు పునఃపునః। తం దృష్ట్వా రాక్షసంఘోరం రాక్షసానాం భయంకరం। సుశీలః కృపయా విష్టా త్తమాహ నగనందిని।

తా॥ నిలచి నాలుగుగడియలకాలము చూచుచున్నంతలో రాక్షసుఁడు ఆ బాధకు మూర్ఛితుఁడగుచు. తిరిగి లేచుచు. ఇటు నటు కదలుచు, తిరిగి మూర్ఛ నొందుచుండెను. తిరిగి శరీరము కంటకములచేత విభిన్నమై నెత్తురు. మాంసము బయిటకు వచ్చుచుండెను, తిరిగి శోకించెను. మూర్ఛనొందెను. ఇట్లు రాక్షసులకుగూడ భయంకరుఁడయిన ఆబ్రహ్మరాక్షసునిజూచి సుశీలుఁడు దయాళుఁడై అతనితో నిట్లనియె.

శ్లో॥ హాహాహా వర్తయతత్రైవ తిష్ఠతిష్ఠక్షణంయతః । కోథ వా వద కింపాపం కృతంవై పూర్వజన్మని ॥ దుఃఖం కేనకృతంకస్మా త్వం ప్రాప్తం కర్మణాత్వయా ॥

తా॥ ఓరీ! ఇటునటు తిరుగకుము. దుఃఖించకుము. కొంచెముకాలముండుము. నీవెవ్వఁడవు పూర్వజన్మమం దేమిపాపమాచరించితివి. ఏకర్మచేత నీకీదుఃఖము సం ప్రాప్తమయినది ఈవర్తమును నాకు చెప్పుము.

శ్లో॥ తన్మేకథయపాపాత్మన్ శ్రోతుమిచ్ఛామి సాంప్రతమ్ ॥

తా॥ ఇప్పుడీసమస్తము నేను వినగోరుచున్నానుగనుక నాకు చెప్పుము. ఓదురాత్మా.

శ్లో॥ విహాయ రోదనం పశ్చా త్యక్త్వాభ్రమణ మాతురః । శనై స్తూష్ణింస్థితః శ్రుత్వా వచస్తస్యమహాత్మనః ॥ ఇత్యుక్త స్తేనవిప్రేణ సర్వభూతదయాళునా । జాతాజాతిస్మృతి స్తస్య దర్శనాదావ రాక్షసః ॥

తా॥ ఆరాక్షసుఁడును యిట్లు సర్వభూతకోటి దయాళువయిన నా బ్రాహ్మణునివాక్యమును రోదనముచాలించి విని బ్రాహ్మణునిదర్శనమువలన జాతిస్మృతికలిగి యిట్లని చెప్పనొడంగెను.

బ్రహ్మరాక్షసః ॥ శ్లో॥ భోభో బ్రహ్మన్ బ్రహ్మరూపే బ్రహ్మతేజోధరావ్యయ। దర్శనాదత్ర తేవిప్ర జాతాజాతిస్మృతిర్మనే । మయా పూర్వంకృతంపాపం పరిహార్యసుఖప్రదమ్ ॥

తా॥ బ్రహ్మరాక్షసుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బ్రహ్మభూత, బ్రహ్మతేజోధర, బ్రాహ్మణోత్తమా! నా కిప్పుడు మీ దర్శనమువలన జాతిస్మరణ గలిగినది. నేను పూర్వమందు పుణ్యమునువదలి పాపమునే ఆచరించితిని.

శ్లో॥ గోకర్ణే పశ్చిమేదేశే పురా గ్రామే మధువ్రతే । బహువిప్రసమాయుక్తే తత్రాహం గ్రామణీర్ద్విజః ॥

తా॥ పశ్చిమదేశంబున గోకర్ణతీరమందు మధువ్రతమను నొక గ్రామముగలదు. ఆ గ్రామమందు నేకులు బ్రాహ్మణులుండిరి. నేనును బ్రాహ్మణుఁడను ఆ గ్రామమునకు నే నధిపతిని. (అనఁగా గ్రామ మునసభును)

శ్లో॥ గ్రామాధిపత్య మాశ్రిత్య గ్రామ స్యార్య మహామతే । వాచాల స్సర్వకార్యేషు వ్యవహారే పరాఙ్ముఖః ॥

తా॥ గ్రామాధిపత్యమును బట్టి సమస్త కార్యములలో నేనే మాట్లాడు వాఁడను గాని, వ్యవహారమందు పెదముఖముగా నుండువాఁడను.

శ్లో॥ అసత్యభాషా చతురః సభాంగత్వా మహాత్మనః । బ్రహ్మ స్వంతు మయాభుక్తం బ్రహ్మస్వప్రియమూత్మనః ।

తా॥ సభలో చెప్పుటకు అసత్యమే పలుకువాఁడను బ్రాహ్మణుల సొమ్ము నపహరించితిని. బ్రాహ్మణద్రవ్యమే నాకు ప్రీతికరము.

శ్లో॥ ప్రత్యహం మమ విప్రేంద్ర బ్రాహ్మీయాద్వ్యాత్మనస్సదా । క్వచిన్నచాగతంభూయో నైవభోక్ష్యామి తద్దినే ।

తా॥ నాకు ప్రతిరోజు బ్రాహ్మణులగృహమునుంచి ద్రవ్యము వచ్చుచుండును ఎప్పుడయిన నొకరోజున బ్రాహ్మణద్రవ్యము నాయింటికి రానియెడల అదినమందు నేను భోజనముచేసేదిలేదు.

శ్లో॥ బ్రహ్మస్వపూరితం తను ర్బ్రహ్మస్వ ప్రియకారతః । ఇత్థం మయార్జింభూరి ద్రవ్యం సంఖ్యావివర్జితమ్ ।

తా॥ బ్రాహ్మణధనముచే నాశరీరము నిండించబడినది. అదియే నాకు ప్రీతి కరము. ఈప్రకారముగా సంఖ్యలేని ధనమును సంపాదించితిని

శ్లో॥ నచాంతం ధనధాన్యస్య నిత్యం గేహ రతస్యచ । తథాపి నమయాకించి ద్ధర్మార్థం నోపపాదితమ్ ।

తా॥ నాయింట్లోనున్న ధనమునకును, ధాన్యమునకును అంతములేదు. ఇట్లున్న ప్పటికిని ధర్మార్థము కించిత్తయినను ఖర్చుపెట్టలేదు.

శ్లో॥ నమయా క్వాపి పూజ్యాశ్చ విప్రా శ్చాతిథయ స్తథా । విప్రాణా మన్నకామానాం నైవాన్నం దీయతే మయా ।

తా॥ నే నెప్పుడును బ్రాహ్మణులను అతిథులను బూజించలేదు. ఒకప్పుడును అడిగినవిప్రుల కన్నమిడలేదు.

శ్లో॥ పుణ్యకాలేషు రర్వేషు దినేష్వేషుమాసేషుచ । నచాన్నంవా ధనంవాపి ధాన్యం ప్రస్థ ప్రమాణకమ్ । విప్రేభ్యో నమయా విప్ర దానం నాచరితం సకృత్ । న స్నానం న జపో హోమో నాచారః పురుషార్థకః ।

తా॥ పాపహారములయిన పర్వకాలములయందు బ్రాహ్మణులకు అన్నముగాని, ధనముగాని, ఒకకుంచము ధాన్యమునుగాని ఒకప్పుడయినను యివ్వలేదు. స్నానమాచరించలేదు జపమన్ననో బొత్తిగానే సున్న. ఆచార మడుగంటిపోయినది.

శ్లో॥ నమయోపాసితా సంధ్యా తథాకాల్యానియానిచ । తంత్రమాత్రా మయాసంధ్యా బ్రహ్మస్వహరణం స్మరన్ ।

తా॥ మంచి కార్యముల నాచరించలేదు. సంధ్యావందనమును సలుపలేదు. సంధ్యా మంత్రములను విడిచి తంత్రముమాత్రము అనఁగా నోట్లో నీళ్లోసుకొనుట, స్థాలీతో నీళ్లు క్రిందపోయుట, చెవులు గట్టిగా పట్టుకొనుట మాత్రము చేయుచుంటిని. ఎందువలననంటే మనస్సులో బ్రాహ్మణద్రవ్య మెట్లు దొరుకునా యను చింతతో మంత్రపఠనము మఱచినది. చూచుకొ రేమనుకొందురో యను మాటమీద తంత్రమును మాత్రము చూపుచుంటిని.

శ్లో॥ మయా నాచరితం విష్ణో రర్చనం దైవయోగతః । విషయాసక్తచిత్తోహం స్వాత్మనో భోజ్యలాలసః ।

తా॥ ఒకానొకప్పుడయినను విష్ణుపూజ నొనరించలేదు. నిత్యము విషయాలోలమానసుఁడనై ఆత్మభోజనపరాయణుఁడనయితిని.

శ్లో॥ నమయా విష్ణవే క్వాపి దీపం గోదోహనావధి । మయా మూఢేన సత్సంగం న క్షణార్థోపి భూసుర ।

తా॥ మార్యక్రమం దొరకప్పుడయినను ఆవును పాలుపితుకునంత కాలమయినను దీపము నుంచలేదు. సజ్జనసాంగత్యము క్షణకాలమయినను సలుపలేదు.

శ్లో॥ తత్సంగే యదిమే ప్రాప్తె తస్మాదుత్థాయ చింతయన్ । మన్మనః ప్రీతియుక్తానాం మద్వచఃకారిణాం ద్విజ । దుస్సంగ మిళితానాంచ సభాంగత్వా ముదాన్వితః । తత్ర సంతుష్టచిత్తోహం వాగ్భిర్మే దుర్గతిప్రదైః ।

తా॥ ఒకవేళ నేను కూర్చున్నస్థలమందే సజ్జనసాంగత్యము సంప్రాప్తమయిన యెడల ఈశ్వరా! యిదియేమి కర్మము. ఇచ్చట నాకీ సాంగత్యమెందుకు సంప్రాప్తమయినదని ఆచోటును వదలి నా మనస్సునకు సంతోషమును గలుగ జేయువారును, నా మాట వినువారును నయిన దుస్సాంగత్యశీలులవద్దకు వెళ్లి నే నచ్చట నాకు నరకమహార్ణవ పతన హేతువులయిన మాటలచేత సంతోషించువాఁడను.

శ్లో॥ న ధ్యానం విష్ణుపాదాబ్జం న శ్రుతా హరిసత్కథా । కథాయాం కథ్యమానాయాం విష్ణోర్యత్రాపి చక్రిణః ॥ హిత్వా తాం దూరతస్తూర్ణం గత్వాతాం దూరతో వ్యహం । నోపకారం కృతం కించి ద్యస్య కస్యాపి దేహినః ॥

తా॥ నామనస్సు యెన్నఁడును హరి పాదారవింద ధ్యాన మాచరించలేదు. నేను అట్టివి విననూ లేదు. దైవవశమున నేనున్న స్థలమందు హరికథ జరిగినచో దానినివిడిచి దూరముగా తొలగుదును. నేనుజన్మమెత్తినది మొదలు చచ్చేవఱకు యేజంతువునకును ఉపకారము చేయలేదు.

శ్లో॥ ఇతిమేదుర్గతిర్వ్యస్య స్వబుద్ధ్యాచరితానఘ । తతః పంచత్వ మాప్త్వాహ మతిఘోరం యమాలయమ్ ॥ దారుణాని మహోగ్రాణి నరకాదిసుసర్వశః । భుక్త్వాత్రక్రమాద్దుఃఖం యాతనాంచయుగాష్టకమ్॥

తా॥ ఈప్రకారముగా నాకిప్పుడు గలిగిన దురవస్థ స్వయంకృతమే గాని, అన్యకృతము గాదు. అంతలో నేను మృతినొంది ఘోరమయిన యమలోకముజేరి అచ్చట యెనిమిదియుగములు అనేకములయిన కష్టముల ననుభవించితిని.

శ్లో॥ తత శ్చాంతికపక్షీయా శ్చాంతకాజ్ఞప్తచేతసః । సర్వేతే క్రోధయుత స్తూర్ణం మాం విప్ర శృణు భూతలే ॥ పాతయామాసురు ద్విగ్నాః పాపిష్ఠం చాత్మలంపటం । నిర్వర్త్య భువి విప్రేంద్ర గర్దభేషు గజేషు చ ॥ శ్వాన సూకర మార్జాల జంబూక వృకయోనిషు । జన్మ హాసింభూద్విప్ర ఏకైకేష్వయుతంసమాః ॥

తా॥ తరువాత యమభటులు యమాజ్ఞచొప్పున నన్ను భూతలమునకు పడద్రోసిరి. అచ్చట నేను గాడిదలయందును, గజములయందును, కుక్కలయందును, నక్కలయందును, పిల్లులయందును, పందులయందును, తోడేళ్ళయందును జన్మించితిని. ఒక్కొకజాతియందు అయుత (౧౦౦౦౦) సంవత్సరములు జరిగినవి.

శ్లో॥ తతస్తస్మిన్వనే ఘోరే ఖాదిరోస్మి మహామతే । పాదాఖాదిరతాం ప్రాప్తా కాయామే రాక్షసాకృతిః ॥

తా॥ తరువాత యీవనమందు ఖదిరవృక్షమునైతిని. అందులో పాదములు మాత్రము ఖదిరవృక్షము, పైభాగమంతయు రాక్షసాకృతియే.

శ్లో॥ నాన్యత్రగంతుంమేవిప్ర పాదౌ పాదపభాగతౌ। శాఖాభిః ఖాదిరోద్భూతైః వాయునాప్రేరితై రహమ్॥ విచ్ఛిన్న స్వతనుప్రాప్త రుధిరోదరజీవితః। ఏతాదృశం మహాఘోరం దుఃఖం పూర్వార్జితంద్విజ॥

తా॥ నాపాదములు పాదపము దుండుటచేత నితరస్థలములకు నడచుటకు వీలు లేదు. వాయువశమున చలించుచున్న చండ్రకొమ్మల కంటకములచేత శరీరము విచ్ఛిన్నమై మాంసము నెత్తురు బయిటకు వచ్చుచుండును. దానిని నే నాహారము పుచ్చుకొనుచున్నాను. ఇట్టిఘోరదుఃఖమును నేను పూర్వజన్మమందార్జించితిని.

శ్లో॥ త్వద్దర్శనాంజనా ద్విప్ర విబుధ్యాత్మకృతాగసం। ఇత్థంమే కథితంపాపం రక్షమాం కృపయావిభో॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నీ దర్శనమనే కాటుకచేత నాపూర్వకృతము నాకు తెలిసినది. నాపాపమిది. నన్నెట్లు రక్షించెదవో దయానిధీ.

శ్రీమహాదేవః॥ శ్లో॥ సుశీల స్సచ తద్వృత్తాం నిశమ్యావాచ విస్మితః। మాఖేదంతే మహద్దుఃఖం నిత్యం త్వేషునిముత్స్యవమ్॥ అస్మిన్వనేవిమారేతు తత్రైవాంబూనివర్తతే। తేనతే ముక్తిహేతుం తం కల్పయే వద రాక్షస॥

తా॥ ఓగారీ! ఈప్రకారము రాక్షసునివృత్తాంతము విని సుశీలుడు విస్మితుడై యిట్లనెను. ఓరీ రాక్షసా! నీకు గొప్ప కష్టము సంభవించినది. ఈవనమందు దగ్గిరలో ఉదకములున్నవా చెప్పుము. వాటిచేత నీదుఃఖమును తొలగింతును.

శ్లో॥ ఇత్యుక్తః పున రాహేదం బ్రాహ్మణం బ్రహ్మరాక్షసః। జలంనైవాస్తివిప్రేంద్ర వనే ద్వాదశయోజనే॥ వరితః కరుణారాశే వారి సర్వత్రవర్తతే। ఇతి తద్వచనంశ్రుత్వా రాక్షసం పునరబ్రవీత్॥

తా॥ ఈమాటవిని రాక్షసుడు యీవనమందు ద్వాదశయోజనమధ్యను ఉదకములేదు. అవలనున్నది. నన్నెట్లుద్ధరింతువో దయానిధీ యని చెప్పెను. ఆమాట విని తిరిగి ఆబ్రాహ్మణుడు పలుకుచున్నాడు.

శ్లో॥ తవ పాపవిముక్త్యే వక్ష్యామి శ్రుణు రాక్షస। ఇత్యుక్త్వాం పునఃప్రాహ విప్రాసఙ్గ చతురోరసాః॥

తా॥ ఓ రాక్షస! నీపాపము నివర్తించు యుపాయమును జెప్పెద వినుము.

ఈప్రకారముగా బ్రాహ్మణుడుపలుకగా వెంటనే రాక్షసుడు తిరిగి చెప్పుచున్నాడు అయ్యా నాకు నలుగురు పుత్రులుగలరు.

శ్లో॥ గోకర్ణరాష్ట్రే నివసన్ గ్రామే మద్వ్యాససాధకే । తేధర్మోద్భూత దోషేణ దురాచారేణ కాతపత్ । పంచత్వమాప్య నరక మాశ్రితా స్తత్సుతా స్తథా । తత్సుతా స్తత్సుతా స్తద్వ త్తత్సుతా స్తత్సుతానఘ ।

తా॥ అయ్యా, నానివాసము పూర్వము గోకర్ణదేశమందుండెను. అప్పుడు నాకు దురాచారులయిన నలుగురు పుత్రులు పుట్టియు దుష్టప్రవర్తనలచే ఆ నలుగురు నరకమందు దుఃఖమును బొందుచుండిరి. అది అట్లుండగా క్రమశః వారి పుత్రులును వారిపుత్రులును వారిపుత్రులును అట్లే అనుభవించుచుండిరి.

శ్లో॥ తత్రైక స్తనయ స్తద్వ దాసీ త్తచ్ఛ్రేణు పండిత । నామ్నా భామ్కలకో విప్ర గ్రామణీర్వర్తతేఽధునా ।

తా॥ వారిలో నొకరి పుత్రుడు యిప్పుడు ఆ గ్రామమందున్నాడు. అతని పేరు బామ్కలుడు. వాడును తండ్రులతో సమానుడేను. ఇప్పుడతడు ఆగ్రామమునకు అధిపతిగా యుండెను.

శ్లో॥ తస్మాన్న మేభవేన్ముక్తిః కథం మేదుఃఖమోక్షణమ్ ।

తా॥ అతడును దురాచారుడగుటచేత ఆతనివలన నాకు ముక్తిగలుగదుగాన యింకెట్లు నాకు దుఃఖవిమోచనమగును

శ్లో॥ ఇత్యుక్తో వాచనోద్విభి స్తేనముక్తిర్భవేత్తవ । తం గత్వా వంశజంతూర్ణం బోధయామి తవాపదమ్ । ఉపదిశ్య తత స్తస్య ముక్త్యుపాయం తవాఘజమ్ ।

తా॥ ఇట్లు రాక్షసుడు పలుకగా బ్రాహ్మణుడు చెప్పుచున్నాడు. ఓరీ రాక్షసా! నీకు భయములేదు. ఆ బామ్కలునివలన నీకు ముక్తిగలుగును. నేనుత్వరగా మీ గ్రామమునకువెళ్ళి నీఆపత్తును మీవంశజునకు తెలియజెప్పి నీముక్తికి ఉపాయము నతనితో చెప్పెదను.

శ్లో॥ తమిత్యుక్త్వా యయౌ విప్ర స్సుశీల శ్చింతయన్ శుభే । గోకర్ణరాష్ట్రమాసాద్య సుశీల స్తమదృశ్యత ।

తా॥ రాక్షసునితో నిట్లు పలికి తరువాత ఆ విప్రయువతి యాలోచించుచు గోకర్ణ రాష్ట్రమును జేరి సుశీలుండను రాక్షసవంశోత్పన్నుండయిన బ్రాహ్మణుని జూచెను.

శ్లో॥ బోధయామాస విప్రేంద్రో యథాదృష్టం యథామతి। మాఘమాసి కురుస్నానం ప్రాతస్సూర్యోదయే జలే। తేనతే పితర స్సర్వే ముక్తిమాయాంతి నిశ్చితమ్।

తా॥ సుశీలుండు యిట్లు బ్రాహ్మణుని జూచి అతనితో తానుజూచినదంతయు వివరముగా జెప్పి ఓయి బ్రాహ్మణా! నీవు మాఘంబున సూర్యోదయమందు స్నాన మాచరించుము. దానిచేత నీ పితరులు ముక్తులగుదురు. సందియము లేదు.

శ్లో॥ మాఘే మందోదితే సూర్యే యఃకరోతి నిమజ్జనం। ససర్వ పాతకైర్ముక్తః సమురారిపదే వసేత్।

తా॥ ఎవ్వండు మాఘంబున అర్కోదయకాలమందు స్నాన మాచరించునో ఆ పుణ్యాత్ముండు సమస్తపాపనిర్ముక్తుండై శ్రీహరిలోకమందు నివసించును

శ్లో॥ తవాన్వయపతి ర్విప్ర బ్రహ్మరాక్షసరూపధృత్। తత్పాప మోక్షణాయేదం కురు స్నానం శుచిప్రదం। తస్మాత్తస్య భవేన్ముక్తి రిత్యుక్తః ప్రియయా మునిః।

తా॥ ఓ బ్రాహ్మణుండా! నీ వంశమం దొకండు బ్రహ్మరాక్షసరూపమును ధరించి దుఃఖించుచున్నాండు. అతనియొక్క పాపమోక్షణకై నీవు పవిత్రమయిన మాఘ స్నాన మాచరించుము. దానిచేత నతనికి ముక్తి గలుగును. ఈప్రకారముగా జెప్పి సుశీలుండు యథేచ్ఛగా వెళ్లెను.

శ్రీమహాదేవః॥ శ్లో॥ తతః కాలాంతరే దేవి మాఘమాసి సమాగతే। బ్రాహ్మణ స్తస్య వాక్యేన చకార స్నానమంభసి।

తా॥ ఓ గౌరీ! తరువాత కొంతకాలమునకు మాఘమాసము రాగానే బ్రాహ్మణుండు సుశీలుని మాటప్రకారము మాఘస్నాన మాచరించెను.

శ్లో॥ సలిలై స్తర్పయే ద్భక్త్యా మాఘే చోదకతర్పణం। దేవి రాక్షసముద్దిశ్య మాసమేకం నిరంతరమ్। మాసాంతే రక్షస స్తస్య ముక్తి రాసీచ్ఛుభేక్షణే। నిపపాతక్షణా ద్భూమౌ ఖచరో రాక్షసేనచ। పున స్తూర్ణ సముత్థాయ ముక్తః పాపైర్దివంయయౌ।

తా॥ ఇట్లు స్నానము స్నానాంతమందు తర్పణమును రాక్షసుని యుద్దేశించి మాఘమంతయు నిర్విఘ్నముగా జేసెను. ఇట్లు మాసము గడచిన తరువాత ఆ రాక్షసునకు ముక్తి కలిగినది. శరీరము భూమిమీద పడెను. ఆరాక్షసుడు ముక్తపాపుడై రాక్షసదేహమును వదలి దివ్యదేహమును ధరించినవాడై స్వర్గమునకు జేరెను.

శ్లో॥ మయేత్థం కథితం దేవి మాఘస్నానఫలం శుభం । రౌరౌ భీతిః పాతకై ర్ఘోరై ర్మాఘస్నానం సమాచరేత్ । నాచరే ద్యది మాఘాస్నా భక్త్యా మోహేన వాధవా । మృత స్సయాతి నరకం కుంభీపాకం సుదారుణమ్ ।

తా॥ ఓ పార్వతీ! ఈప్రకారముగా నీకు మాఘఫలమును జెప్పితిని. పాపము వలన భయమును బొందినవాడు మాఘస్నాన మాచరించినచో పాపనిర్ముక్తుడై విష్ణులోకమును బొందును. భక్తితో గాని, భ్రాంతివశముచేత గాని మాఘస్నాన మాచరింపనివాడు దేహాంతమందు కుంభీపాకనరకమును బొందును.

ఇతి సప్తమోధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ అష్టమోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీమహాదేవః॥ శ్లో॥ మాఘస్నానేన దేవేశి పురా విద్యాధరాత్మజా । విష్ణుభక్తింపతిం లబ్ధ్వా దేహాంతే ప్రయయౌ హరిమ్ ।

తా॥ ఓ పార్వతీ! చెప్పెదను వినుము. పూర్వమందు ఒక విద్యాధరపుత్రిక మాఘస్నానముచేత మాధవభక్తుని భర్తగా బొంది దేహాంతమందు మాధవలోకమును బొందెను.

పార్వత్యువాచ। శ్లో॥ విద్యాధర సుతా పూర్వం కుత్రమాఘే నిమజ్జనాత్ । కథమాపపతిం పుణ్యాం తన్మే వక్తుమిహార్హసి ।

తా॥ పార్వతీదేవి అడుగుచున్నది. ఓశంకరా! పూర్వమందు విద్యాధరపుత్రి యెచ్చట మాఘస్నాన మాచరించి విష్ణుభక్తుడయిన పతిని బొందినది. అదినాకు చెప్పుము.

శ్రీమహాదేవ। శ్లో॥ పురా విద్యాధరః కశ్చి ద్దేవయోని ర్నగాత్మజే । పుత్రహీన స్తప స్తేపే గంగాయాం జాహ్నవీతటే ।

తా॥ హిమవంతుని కుమార్తెవగు ఓ పార్వతీ! ఈకథను వినుము. పూర్వమందొక విద్యాధరుడయిన దేవయోని విశేషుడు సంతానహీనుడై గంగాతీరమందు బ్రహ్మను గూర్చి తపమాచరించెను.

శ్లో॥ వినియమ్యేంద్రియగ్రామం సహన్ శీతోష్ణమారుతాన్ । విధాతారం జపన్మంత్రం ధ్యాయన్ హృదిపదేవిధిం దివ్యవర్షసహస్రాణి తతాపపరమంతపః ।

తా॥ ఇంద్రియ సమూహమును నియమించి, శీతోష్ణవాయువులను సహించి, బ్రహ్మమంత్రమును జపించుచు, హృదయమందు హిరణ్యగర్భుని ధ్యానించుచు సహస్ర దివ్యసంవత్సరముల కాలము తపము సల్పెను. అనగా (3౬,0000) మనుష్యవత్సరములు.

శ్లో॥ ఇత్యేవం తపత స్తస్య దేవయోనేర్మృగేక్షణే । దివ్యవర్ష సహస్రాణి ప్రాదురాశీ చ్చతుర్ముఖః । తప స్తప్త మువాచేదం వాక్యం విద్యాధరేశ్వరమ్ ।

తా॥ ఈప్రకారముగా తపము సల్పుచున్న దేవయోనికి వేయి దివ్యసంవత్సరములు గతించినపిదప బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై తపస్సుచేయుచున్న విద్యాధరునితో నిట్లని పలికెను. (శ్లో॥ విద్యాధరోయక్ష రక్షో గంధర్వకిన్నరాః । పిశాచోగుహ్యక స్సిద్ధో భూతోమీదేవయోనయః ॥ ఇత్యుక్తరీత్యా విద్యాధరాః యక్షాః రక్షాంసి గంధర్వాః కిన్నరాః పిశాచాః గుహ్యకాః సిద్ధాః భూతాః అమీదశదేవయోనయః తత్ర విద్యాధరోనామ దేవయోనిః ప్రకృతః॥)

బ్రహ్మోవాచ। శ్లో॥ శృణు విద్యాధరాద్యత్వం బ్రహ్మాణంవిద్ధితే పురః । దేవయోనేఽతితపసా దుస్తరేణతవానఘ । తుష్టోస్మితపసాతేద్య వరం వరయకాంక్షితమ్ ।

తా॥ బ్రహ్మవాక్యము. ఓ విద్యాధరా! వినుము. నేను బ్రహ్మదేవుఁడను. నీవు జేసిన గొప్పతపస్సుకు మెచ్చి వచ్చితిని. కోరిన వరము నిచ్చెదను. అడుగుము.

శ్లో॥ తేనేత్యుక్తో దేవయోని ర్విధింనత్వాతిహర్షితః । ప్రజాపతి మథోవాచ పుత్రార్థం తప్యతేతపః పుత్రకామస్య మే బ్రహ్మన్ పుత్రం దేహి మహామతే ।

తా॥ అనిన దేవయోని అడుగుచున్నాఁడు. ఓబ్రహ్మదేవుఁడా! నేను పుత్రార్థమై తపము జేయుచున్నానుగాన నాకు పుత్రుని యిమ్ము.

శ్లో॥ దేవయోనే ర్వచ శ్శ్రుత్వా పద్మయోని రథాబ్రవీత్ । నాస్తితే పుత్రసంతాన ఫలం విద్యాధరేశ్వర ।

తా॥ ఈప్రకారముగా పలికిన దేవయోనివాక్యము నా పద్మయోని విని యిట్లనియె. ఓవిద్యాధరా! నీకు పుత్రసంతానప్రాప్తి లేదు.

శ్లో॥ తథాపి తపసా తేఽద్య సంతుష్టస్తే దదామ్యహం। మయా దత్తో వరస్తేద్య పుత్రికా భవితా తవ।

తా॥ అయినను నీతపస్సుకు సంతోషించి నీకు వరమిచ్చుచున్నాను. నీకొక పుత్రిక కలుగును.

శ్లో॥ ఏవంవిధివచశ్శ్రుత్వా తథాహీతి ప్రహర్షితః। నమస్కృత్య విధాతారం దేవయోని స్తతోయయా।

తా॥ ఇట్లు బ్రహ్మ మాట విని విద్యాధరుడు ఆట్లేగాక యని సంతోషించి బ్రహ్మకు నమస్కరించి వెళ్లెను.

శ్లో॥ విరించిః ప్రయయాస్వాత్మ సదనం బ్రహ్మణఃపదం। దేవి విద్యాధరసతీ సుషువే సా కుమారికామ్।

తా॥ బ్రహ్మయు తనగృహంబు చేరెను. విద్యాధరుని భార్య పుత్రికను కనెను.

శ్లో॥ వృద్ధింగతా తతో బాలా క్రమాత్కాలాంతరే నఘే। సురూపా చంద్రవదనా కోమలాంగీ శుచిస్మితా। వికస చ్చంపకాభాసా విమలాయతలోచనా। సువృత్తా సాధువక్షోజా స్వర్ణకుంభ ఇవాకృతిః। మత్తమాతంగగమనా సురూపా సుముఖీ శుభే।

తా॥ ఆబాలిక క్రమముగా వృద్ధిబొంది యిట్లుండెను. యోగ్యమయిన స్వరూపము గలిగినదియు, చంద్రునివంటి ముఖముగలిగినదియు, మృదువులయిన అంగములుగలిగినదియు, స్వచ్ఛమయిన నవ్వు గలిగినదియు, ప్రకాశించుచున్న చంపకపుష్పము యొక్క కాంతివంటి కాంతిగలిగినదియు, (యద్వావికసచ్చంపకాభాసా) వికసించిన సంపెంగ పువ్వువంటి ముక్కు గలిగినదియు, స్వచ్ఛములును విశాలములునునయిన నేత్రములు గలిగినదియు, యోగ్యమయిన శీలముగలిగినదియు, చక్కని వటువయిన స్వర్ణకుంభములతో సమానమయిన కుచద్వయము గలిగినదియు, మదించిన యేనుగువలె నడుచునదియు, శోభనసౌందర్యవతియు, శోభనముఖియును.

శ్లో॥ దేవయోని స్సుతాం దృష్ట్వా సహర్షోత్ఫుల్లలోచనః। తాం సద్యోలాలయత్ దేవి కుమారీం వరరూపిణీమ్। కుమారీం నైవ దా

స్వామి యస్యోద్వాహ ఫలేనచ । యో యదా మే వశం ప్రాప్త స్తస్య దాస్యేహమంతికే ॥

తా॥ ఏతాదృశరూపవతి యయిన కుమార్తెను జూచి విద్యాధరుఁడు సంతోష సాగరమగ్నుఁడై పుత్రికను లాలించుచు యీచిన్నదానిని వివాహార్థ మెవ్వనికినివ్వను. నా స్వాధీనమయినవానికి యిచ్చి నా యింటిలోనే యుంచుకొందును.

శ్లో॥ మనస్యేవం వినిశ్చిత్య వర్తమానేగతేంతరే । కశ్చిన్నిశాచరోవీరో దానవో దేవకంటకః ॥ పూజయిత్వా మహామాయాం తయా ప్రాప్త వరేణచ । సర్వశాస్త్రార్థకుశల స్సర్వవిద్యావిశారదః ॥ వేదవిద్యా సునిష్ణాతః వేదవేదాంగ కోవిదః । శాస్త్రార్థవిద్యా చతురః మాయాసర్గవిచక్షణః । మాయాయుద్ధవిశేషజ్ఞః కామరూపధరోసురః ॥

తా॥ విద్యాధరుఁడు యిట్లు మనస్సునందు నిశ్చయించుకొని యున్నంతలో కొంతకాలమునకు ఒక రాక్షసుఁడు తన కులదేవతయైన మాయాశక్తిని పూజించి దాని వలన వరమునొంది తన్మహిమచేత సర్వశాస్త్రసారవేత్తయు, సమస్త విద్యాప్రవీణుఁడును, వేదపండితుఁడును వేదాంగవేత్తయు, శాస్త్రార్థవాదన ప్రవీణుఁడును, మాయా సృష్టిచణుఁడును, మాయాయుద్ధవిశేషవేత్తయు, కామరూపధరుఁడునునై యుండెను.

శ్లో॥ భూయస్తథాప్యతృప్తస్సన్ సోపిముచ్యాలకాముకః । ద్రోణాద్రితటమాసాద్య చచారపరమంతపః ॥

తా॥ ఇట్టి సామర్థ్యము గలిగినను తృప్తినొందక జాతులమునుగోరి ద్రోణాద్రి మీద తపముచేయ నుద్యోగించెను.

శ్లో॥ ద్రోణాద్రి స్సర్వజంతూనా మాశ్రయ స్సుఖదాయకః । నానామృగగణైర్యుక్త శ్చకోరైశ్చిత్రసారసైః ॥ విద్యాధరైః కిన్నరైశ్చ సేవ్యమానశ్శిలోచ్చయః. సేవ్యమానైస్సురైరేవై ర్గుహ్యకైరప్సరోగణైః ॥ తత్రైకస్మిన్ భృగావద్రేతోర్ బిల్వమూలే మహాసురః । తపశ్చకారమాం ధ్యాయన్ ఈశ్వరం శీఘ్రతోషిణమ్ ॥

తా॥ ఆ ద్రోణాద్రి సర్వజంతువులకు నాశ్రయమైనదియు, సుఖదాయకమును, అనేక మృగగణపరివృతమును, చకోరములచేతను, సారసములచేతను, నిండియున్నదియు విద్యాధర కిన్నర సేవితమును, గుహ్యకాప్సరోగణ సేవితమును, సురసంఘ సంసేవిత

మయమై యుండెను. దానియందొక పవిత్రదేశమందు బిల్వవృక్షమూలమున శీఘ్ర సంతోషినయిన నన్ను ధ్యానించుచు రాక్షసుఁడు తపముసలిపెను.

శ్లో॥ తిష్ఠన్ కనిష్ఠికాంగుళ్యా చలన్నైవ ఋమాత్రకం । ఊర్ధ్వవక్త్రాంజలి శ్చోర్ధ్వ బాహు ర్భాస్కరలోచనః ॥ మామకం పరమం మంత్రం సర్వజ్ఞ స్సజపన్ శుభే । సహాయం న చకారాసౌ తపః పరమదుష్కరమ్ ॥

తా॥ కనిష్ఠాంగుళిమీద నిలువఁబడి కొంచమయినను చలించక మీదికి ముఖము నెత్తి, అంజలిఘటించి, ఊర్ధ్వబాహుఁడై నా మంత్రమును జపించుచు నొక సంవత్సరము తీవ్రతపమును సల్పెఁ.

శ్లో॥ తపస్యమానే మహాఘోరే రాక్షసే దేవకంటకే । ప్రసన్నోహంతత స్తస్య వరదానాయ హర్షితః ॥ దాస్యామి దానవేత్యుక్తె మయి దేవి వరం శుభే । సోప్యాహ మాం తతశ్శూలం దేహి తే కరసంస్థితం ॥

తా॥ దేవబాధకుఁడయిన ఆరాక్షసుఁ డీప్రకారముగా ఘోరతపస్సు చేయు నంతలో నేను ప్రసన్నుఁడనై వరమిచ్చెదననఁగానే నీచేతనున్న శూలమిమ్మని నన్ను వాఁడడిగెను.

శ్లో॥ ఇత్యుక్తె దానవశ్రేష్ఠే తుష్టోహం తపసా నఘే । తథా దత్తం మయా తస్య త్రిశూలంమే కరస్థితమ్ ॥

తా॥ వాడిట్లడుగగా వాని తపస్సుకు మెచ్చి నా చేతనున్న త్రిశూలమును వానికిచ్చితిని.

శ్లో॥ దానకాలే వద న్నిత్థం త్రిశూలంతే కరస్థితం । ప్రపద్యతే కరంశత్రో ర్యదా తే మరణంధ్రువమ్ ॥

తా॥ ఈ శూలమిచ్చునప్పుడు యిది శత్రుహస్తగత మెప్పుడగునో అప్పుడు నీకు మరణముగలుగునని చెప్పితిని.

శ్లో॥ ఇత్యుక్తేమయి దైత్యేంద్రః ప్రత్యువాచాధమాం శుభే । తత్కరస్థోపిమాయాంతి త్రిశూలం శత్రుభీషణమ్ ॥ మత్తోధికాశ్శత్రవశ్చ కుత్రతిష్ఠంతి శంకర । మత్కరస్థోపి మే శత్రుం కథం ప్రాప్స్యతి దుర్లభమ్ ॥

తా॥ నేనిట్లు పలుకఁగా రాక్షసుఁడు తిరిగి నాతో నిట్లనియె. ఓ శంకరా!

నీహస్తమందున్నది నాకరమునకు రాలేదు, నాకంటె అధికులయిన శత్రువు లిచ్చట నున్నారు. అయినను నాచేతినుంచి శత్రుహస్తమున కెట్లు వెళ్లుదు. నేను పోనిత్తునా.

శ్లో॥ ఇత్యుక్తే దానవే గౌరి తత్రైవాంతర్గతోస్వ్యహం । తతస్స రాక్షసోదర్పా చ్చచార భువనత్రియమ్ ।

తా॥ దానవుఁ డిట్లు పలుకుచుండఁగా నేనచ్చటనే అంతర్ధానమైతిని. వాఁడు భయపెట్టుచు మూఁడులోకములం దిరిగెను.

శ్లో॥ నచమే సదృశః క్వాపి నాస్తీత్యుక్త్వా తతో బలీ । సముద్రసలిలాగాధే నిర్మమే నగరీం శుభే ।

తా॥ నాతో సమానుఁ డెచ్చటను లేడని చెప్పుచుండెను. సముద్రమధ్యమున అగాధజలమందు నొక నగరమును నిర్మించెను.

శ్లో॥ ప్రాకారపరివేష్టారాం చతుర్ద్వారోప శోభితాం । ప్రాసాదానేక చిత్రాభాం స్వర్ణతోరణ భూషితామ్ । మాయాబలేన నగరీ ప్రపంచ మివ సర్వతః । దృష్ట్వా తాం తుష్టచిత్తస్స చింతయామాస దానవః ।

తా॥ ఆనగరము ప్రాకారపరివేష్టితమును, నాలుగు ద్వారములతో శోభించునదియును, అనేకములయిన మేడలు గలిగినదియు, సువర్ణతోరణాలంకృతమై సమస్త ప్రపంచము నిచ్చటనే యున్నదా యన్నట్లుండెను. ఇదంతయు రాక్షసుని మాయాబలముచేత నైనది. ఇట్టి నగరమును నిర్మించి, వాఁడు సంతోషించినవాఁడై యిట్లని చింతించెను.

శ్లో॥ భార్యాం కుత్రవిధిత్సేమాం భామాం రూపగుణాన్వితాం। దేవనారీనమే గంతుంశోచతే పాపశంకయా। భక్తిస్పృహీం కుమారీం మేనా వివాహార్థం మమ ప్రియాం । మృగయామి హాలోకేషు సఇత్యుక్త్వా యయౌ ఖలః ।

తా॥ నాకు సౌందర్యవతియైన భార్య యెచ్చట దొరుకును. దేవస్త్రీ సంభోగము నాకు దోషకరము. ఇప్పటికి వివాహము కాని కన్య కావలెను. అట్టిదానిని లోకములయందు వెదకుదునని అదుర్మార్గుఁడు వెళ్లినవాఁడాయెను.

శ్లో॥ మార్గమాణ సలోకేషు భూరాదిషు చతుర్దశే । దానవే

షుచ దేవేషు మునిమానవజాతిషు । మార్గమాణో యయౌ దేవ యోనే ర్లోకం శుభేక్షణే । దేవయోనేస్సుతాంతత్ర సోదకుంభాం పితుర్గృహం॥ ప్రజంతీమిత్యుతామాహ భద్రేమాం వరయాధికం । విసృజ్యరాక్షసం రూపం కామరూపేణ కామవత్ ।

తా॥ ఆ రాక్షసుఁడు భూలోకాది చతుర్దశలోకములు వెదకి దానవ దేవ ముని మానవ లోకములయందు క్రమముగా వెదకుచు దేవయోని లోకమందు పూర్వోక్త విద్యాధరుని కుమారికను ఉదక కుంభమును వహించి తండ్రి యింటికి వెళ్లుచున్న దానిని జూచి రాక్షసరూపమును విడిచి మన్మథాకారముతో వచ్చి ఓ శుభాంగీ! నన్నువరించుమని పలికెను.

శ్లో॥ ఇత్యుక్తా దానవేంద్రేణ పునస్తం ప్రత్యభాషత। మత్పితా వర్తతేగేహే గత్వా తం పృచ్ఛ సాంప్రతమ్ ।

తా॥ రాక్షసుఁడిట్లు పలుకగా విద్యాధరపుత్రిక యిట్లని చెప్పెను. మాతండ్రి యింటివద్దనున్నాఁడు. నీవిప్పుడు మాయింటికి వెళ్ళి మాతండ్రిని అడుగుము.

శ్లో॥ తతో విద్యాధరంగత్వా కుమారీరూపమోహితః। తమపృచ్ఛత్తతస్సోపి నతో దాస్యామి మేసుతామ్ ।

తా॥ తరువాత రాక్షసుఁడు విద్యాధరునివద్దకు పోయి కుమారీరూప మోహితుఁడై విద్యాధరునితో నీకుమార్తెను నాకిచ్చి వివాహము చేయుమని అడిగెను. విద్యాధరుఁడు నీకు నాకుమార్తెను యివ్వనని చెప్పెను,

శ్లో॥ తేనేత్థం వారితే దైత్య శ్చింతయ న్నృపదానఘే । భగ్నప్రార్థయయా తూష్ణీ మవిదూరం సదానవః । కామరూపేణచార్వంగీ మాహరిష్యే మహాబలాత్ । ఇత్యాలోచ్యామర స్తత్ర పరేద్యు స్తత్సుతాం శుభే॥ సలిలార్థం ప్రజంతీం తా మాజహార సరాక్షసః । కక్షే నిక్షిప్యగతవాన్ సముద్రాంతర్గృహం మహత్ । స్థాపయామాస తాం తత్ర దైత్యో లబ్ధమనోరథః ।

తా॥ రాక్షసుఁడీప్రకారముగా విద్యాధరునిచేత పలుకబడినవాఁడై గొప్ప విచారమునుపొంది భగ్నమనస్కుఁడై ఆగ్రహమునను కొంచెముదూరమున మెల్లగాబోయి కామరూపముచేత ఆ సుందరిని బలాత్కారముగా తీసుకొనుదునని నిశ్చయించి ఆ మఱు

కాదు పూర్వమందువలెనే ఉదకమును తీసికొనిపోవుచున్న విద్యాధర పుత్రికను బలాత్కారముగా హరించి చంకలో నిడుకొనిపోయి సముద్రాంతరమందున్న స్వకీయగృహమందు స్థాపించి లబ్ధమనోరథుఁడై సుఖానసుండెను

శ్లో॥ దేవయోనిస్సుతాం నైవ పశ్యన్ దుఃఖాకరస్థితః ।

తా॥ విద్యాధరుఁడును కూతురును గానక దుఃఖించుచుండెను.

శ్లో॥ ఇచ్ఛన్నుద్వాహితం కర్మ కుమారీం శుభవాసరే । విత
న్వానస్సులగ్నంచ జానన్నపి యయావిధిమ్ ॥

తా॥ అట రాక్షసుఁడును శుభవాసరమందు శుభలగ్నమందు విద్యాధరపుత్రికను పెండ్లిచేసికొన నిశ్చయించి తనకు తెలిసినను లగ్న నిశ్చయముకొఱకు బ్రహ్మదేవుని వద్దకు పోయెను

శ్లో॥ విధినాజ్ఞప్తచిత్తోభూ దూర్ధ్వంమాసాష్టకా దితి । సపున
స్స్వపదంగత్వా తామువాచకుమారికామ్ ।

తా॥ బ్రహ్మయును యెనిమిది మాసములు గడచిన తరువాత వివాహలగ్నము బాగున్నదిగాన అంతవఱకు వివాహము జరుపవద్దని చెప్పెను. వాఁడును అట్లేయని యింటికివచ్చి ఆకుమారికతో నిట్లనెను

శ్లో॥ మాసాష్టకాంతరే భద్రే సులగ్నే సుతిథావహం। వరయామి
తతస్త్వాంతు యావన్నాయాతి తద్దినమ్ । తావత్త్వాన ప్రవద్యేహం
తస్మాత్తిష్ఠయథాసుఖం । నాకాది సర్వలోకేషు యాన్యనర్ఘ్యాణిసంతివా।
తాని సర్వాణ్యహం తేఽద్య కానిచేత్ప్రీతిదానిచ । అనేష్యామి తవప్రీత్యై
వదమామత్రమాభయమ్ ।

తా॥ ఓ శుభాంగీ! అష్టమాసోర్ధము శుభతిథియందు సులగ్నమందు నిన్నువరించి వివాహము జేసికొందును. అంతపర్యంతము నిన్ను బొందను గాన నీవు సుఖముగా నుండుము. ఇంతేగాదు. స్వర్గాదిలోకములలోనున్న అమూల్యములయిన రత్నములెందరైనవాటిలో నీకేమి కావలయునో చెప్పుము. వాటిని తెచ్చియిచ్చెదను. నీకేమియు భయములేదు

శ్లో॥ ఇత్యుక్తాశ్వాసవేందేణ బలాదపహృతేనచ । మృగాంకో
దయచిత్తాబ్జ ముకుళం దీనవద్యథా । సపాపత్యాదిదాశాలా రాక్షసం
స్వపురస్థితం । ప్రార్థ్యమానే తతోదైత్యే ప్రత్యువాచశనైశ్శుభే ।

తా॥ తన్ను బలాత్కారముగా నెత్తుకొనివచ్చిన రాక్షసుఁ డిట్లు పలుకగా చంద్రోదయమందు ముకుళించిన పద్మమువలె దైన్యముతో గూడిన చిత్తముగలదై యుండర యున్న రాక్షసునితో నేమియు ననక యూరకుండెను. పిమ్మట వాఁడు మిక్కిలి ప్రార్థించగా కొంతకాలమునకు మెల్లగా నిట్లనియె

శ్లో॥ నచమేరోచతేవస్తు సర్వంతిష్ఠతిదానవ। యదామేరోచతే త్వాంతు తదాతంజ్ఞాపయామ్యహమ్॥

తా॥ ఓ రాక్షసుఁడా! నాకిప్పుడేవస్తువయును నక్కఱలేదు. అన్నియు నున్నవి. ఎప్పుడు కావలయునో అప్పుడు నీతో చెప్పెదను

శ్లో॥ మమేందువాసరే శంభోః ప్రదోషే దర్శనవ్రతం। అసీన్మే దర్శనార్థంతు కుత్రలింగః ప్రతిష్ఠితః॥

తా॥ అయితే నాకు సోమవారము సాయంకాలమందు శివదర్శన వ్రతమున్నది. దానికి లింగము నెచ్చట ప్రతిష్ఠించితివో చెప్పుము.

శ్లో॥ ఇత్యుక్తస్తయాదైత్యః పాతాళే హాటకేశ్వరం। తస్యా స్సందర్శయామాస స్వాలయాదనయత్తథా॥

తా॥ ఇట్లడుగగా ఆ రాక్షసుఁడు ఆచిన్నదానిని స్వగృహమునుంచి పాతాళ లోకమునకు తీసికొనిపోయి అచ్చటి హాటకేశ్వరుని జూపెను. శ్లో॥ ఆకాశేతారకా లింగం పాతాళేహాటకేశ్వరం। మర్త్యలోకేమహాకాళం దృష్ట్వాముక్తిమవాప్నుయాదితి॥

శ్లో॥ దేవయోనిసుతా తేన హృష్టా త్సంఫుల్లలోచనా। తామి త్యుక్త్వా తథాదైత్య స్స్వేచ్ఛాచార స్సుఖేశ్వరి। యదాయదా చేందు వారే ప్రాప్తె విద్యాధరాత్మజా। తదాతదా యయౌ దేవి పాతాళే హాటకేశ్వరమ్॥

తా॥ విద్యాధరాత్మజయు దానికి సంతోషించెను. వాఁడును ఇట్లు నియమించి యిచ్ఛానుకూలము నిర్భయుఁడై తిరుగుచుండెను. కన్యయు ప్రతిసోమవారమందును పాతాళమునకు హాటకేశ్వర దర్శనార్థమై వెళ్లుచుండెను.

శ్లో॥ తస్మిన్ పాతాళలోకేతు యేపాతాళనివాసినః। తేసర్వే హాటకేశస్య ప్రదోషే దర్శనేచ్ఛవః। తేష్వితా స్తత్రమిళితా హ్యాజగ్ముః ప్రతివాసరమ్॥

తా॥ ఆ పాతాళలోకమందుండువారందఱు ప్రతిదినము సాయంకాలమందు హాటకేశ్వర దర్శనముకొఱకు వచ్చి స్వామిని దర్శించి తిరిగి వెళ్లుచుండిరి

శ్లో॥ తదా దేవఋషి ర్దేవి పర్యటన్ భువనత్రయం। పాతాళస్థః ప్రదోషేతు దర్శనాయాగమచ్ఛుభే ।

తా॥ అప్పుడు నారదుఁడు మూడులోకములను దిరుగుచు పాతాళలోకమునకు వచ్చెను. పిమ్మట అచ్చట ఈశ్వర దర్శనముకొఱకు హాటకేశ్వరాలయమునకు వచ్చిన వాఁడాయెను.

శ్లో॥ తదా జగామ పాతాళం సోమవారవ్రతప్రియా। ప్రదోషే దర్శనార్థంసా హాటకేశం శుభేక్షణే ॥

తా॥ అప్పుడు సోమవారవ్రతముగల యాచిన్నది ప్రదోషకాలమందు దర్శించుటకొఱకు హాటకేశ్వరాలయమునకు వచ్చెను.

శ్లో॥ తదా దేవఋషిస్తాంతు సమాలోక్యాబ్రవీద్వచః । కిమత్రాగమనం తేద్య కథం విద్యాధరాత్మజే కథయాశ్చర్యమేతచ్చ నారదోహం సులోచనే ॥

తా॥ అప్పుడచ్చట నారదుఁడు ఆ చిన్నదానినిజూచి అమ్మాయీ విద్యాధర పుత్రీ! నీవిచ్చటి కెందుకు వచ్చితివి. ఇది నా కాశ్చర్యకరముగా నున్నది. నేను నారదుఁడను. భయములేక చెప్పుము

శ్లో॥ తదా ప్రాహ ఋషిం బాలా శ్రుత్వా నారదభాషితం । శ్రుణుమేగమనంతాత కశ్చిద్దైత్యవరో బలీ । అపహృత్యామర శ్శీఘ్రం కక్షేమాం జనకాలయాత్ । సముద్రాంతర్గతేకస్మిన్ నగరేమాం తథా నయత్ । మాసాష్టకేగతేవశ్చాత్ స్నపిమాంపరిణేష్యతి । సోపి చోద్వాహపర్యంతం సమాంగచ్ఛతి కాముక । తతోహం నివసామ్యద్య ఏకాకీ శ్రుణు నారద ।

తా॥ ఇట్లు నారదునిమాట విని బాలిక పలుకుచున్నది. ఓతాతా! నాగమనము వినుము. బలవంతుఁడయిన యొక రాక్షసుఁడు తండ్రి గృహమునుంచి నన్నుచంకలోనిడుకొని తెచ్చి సముద్రమధ్యను ఒక పట్టణమందుంచినాఁడు. ఎనిమిది మాసములు గడచిన తరువాత వాఁడు నన్ను పెండ్లియాడును. అంతపర్యంతము వాఁడు కామ

ర్థము నన్నుబొందదు. నేను యిట్టి దురవస్థలో నిటనొక్క దానను వున్నాను మహా సారదా.

శ్లో॥ ఇతితస్యా వచశ్శ్రుత్వా నారదః పునరబ్రవీత్ ।

తా॥ ఇట్లుచెప్పిన బాలికవాక్యమును విని నారదుడు తిరిగి పలుకుచున్నాడు.

శ్లో॥ మాభయంపుత్రి కించిత్తే విష్ణుభక్తంపతింతవ । ఆనేష్యామి వచస్సత్యం సముద్రాంత స్తవాలయమ్ ।

తా॥ అమ్మాయీ! భయపడకుము. నీకు విష్ణుభక్తుడయిన భర్తను నీవున్న సముద్రాంతర్గృహమునకే తెచ్చెదను. నామాట నమ్మును.

శ్లో॥ శ్రుణు మే వచనం సత్య ముపాయంతే వదామ్యహం । అస్మిన్ శంభో పురోభాగే మానసాఖ్యే సరోవరే । కురుస్నానం ప్రియ త్నేన మాఘమాస్యుదితేరవౌ । మాఘేయాస్యతి సత్రాంతే జలేస్మిన్ మాఘమజ్జనమ్ । కురుత్వం తత్రతేవాపి జలేవా స్థండిలేపివా । సమర్చ యాచ్యుతం భక్త్యా కుసుమాగరు చందనైః । ప్రదక్షిణనమస్కారైః ప్రీత్వహం మాఘవల్లభమ్ ।

తా॥ నామాట వినుము. నీకు ఉపాయము జెప్పెదను. ఇచ్చట ఈ శివునిముందర మానసమను నొక సరోవరమున్నది. దానియందు అర్ధోదయమందు మాఘస్నాన మాచరింపుము. ఇంక పదిహేను దినములకు మాఘమాసము వచ్చును. అప్పుడు తప్పక యీ జలమందు మాఘస్నాన మాచరింపుము. స్నానముజేసి జలమందుగాని, స్థలమందు గాని, స్థండిలమందు గాని హరిని పుష్పాగరు చందన ప్రదక్షిణనమస్కారములచేత పూజిం చుము. మాధవుడు మాఘవల్లభుడు గాన ముదితుడై మనోభిలాషితముల నీకొసంగును

శ్లో॥ మాఘే యఃకురుతేస్నానం ప్రాతస్సూర్యోదయే బహిః । సర్వపాప వినిర్ముక్తః ప్రయాతి హరిమందిరమ్ । మాఘస్నానం విష్ణు పూజాం మాసమేకం నిరంతరం । యముద్దిశ్యాచరేత్సోపి తమాప్నోతి నసంశయః । కన్యాకామో లభేత్కన్యాం ధనకామో లభేద్ధనం । పతి కామాచభర్తారం పుత్రకామో లభేత్సుతమ్ । స్వర్గకామో లభేత్స్వర్గం పత్నీకామః పతివ్రతాం । రాజ్యకామో లభేద్రాజ్యం జ్ఞానకామోలభే న్మతిమ్ । మోక్షకామో లభేన్మోక్షం మాఘవ్రతపరాయణః । కురు

స్నానం మాఘమాసే మకరస్థేదివాకరే । తేనేష్టం తేభవేచ్ఛీఘ్రం నైవ కర్తవ్యాసంశయః ॥

తా॥ మాఘోదయంబునబహిర్జలమందు స్నానమాడువాఁడు పాపముక్తుఁడై పుండరీకవరదుని పురవరంబు చేరును. ఎవ్వఁడు మాఘమాసమందు నిరంతరము మాఘస్నానమును, మాధవపూజయు దేవునుద్దేశించి చేయుచున్నారు వారు హానిఫలమును బొందుదురు. సందియము లేదు. మాఘస్నానముచేత కన్యాకాముఁడు కన్యను, ధనకాముఁడు ధనమును, పతికామిని పతిని, పుత్రకామి ని పుత్రుని, స్వర్గకాముఁడు స్వర్గమును, పత్నికాముఁడు పతివ్రతయైన భార్యను, రాజ్యకాముఁడు రాజ్యమును, జ్ఞానకాముఁడు జ్ఞానమును, మోక్షకాముఁడు మోక్షమును బొందును గాన మకరమందు రవియుండఁగా మాఘంబున స్నానమాచరించును. దానంజేసి నీ యభీష్టసిద్ధి గలుగును. సంశయము లేదు. నామాట నమ్మును.

శ్లో॥ ఇత్యుక్త్వా నారదస్తూర్ణం ప్రయయౌనయథాగతః ॥

తా॥ ఇట్లు చెప్పి ఆ నారదుఁడు యథేచ్ఛగా వెళ్లెను.

శ్లో॥ శ్రుత్వా దేవఋషేర్వాక్యం విద్యాధరసుతానఘే । మాఘాగమం కాంక్షమాణా పశ్చాత్పత్యాంతరేనతి ॥ మాఘోయాతిమహాపుణ్యం ఫలదః పాపనాశనః । మాఘే మకరగేయార్కే బాలా విద్యాధరాత్మజా ॥ మానసాఖ్యం సరోగత్వా హాటకేశపురస్థితం । చకార స్నానముషసి మాఘేమాసిబహిర్జలే ॥ సపర్యాం ప్రత్యహంవిష్ణోర్యథా సంభవమాచరత్ । భక్త్యా పరమయాయుక్త మాఘమాసవ్రతే శుభే ॥ అనుష్ఠితేగతేమాఘ పశ్చాన్నారదభాషితం । చింతయంతీ మనసాదేవి వర్తమానా సనారదః ॥ పర్యటన్ ప్రవివేశాసౌ సారాష్ట్రాధిపతింశుభే। హారిద్రాదాఖ్య నామానం హరిర్భక్తి పరాయణం ॥ సపర్య భక్తిప్రయాలో స్మరంతం హరిమాదరాత్ ॥

తా॥ ఇట్లు చెప్పిపోయిన నారదునిమాటమీద నా చిన్నది మాఘమాసమును ప్రతీక్షించుచుండెను. పిమ్మట పుణ్యమైనను సర్వపాపహరమైన మాఘమాసము సంప్రాప్తమైనది. అప్పుడు సూర్యుఁడు మకరమందుండెను. అప్పుడు విద్యాధరకన్యక హాటకేశ్వరపురోపస్థ మానససరోవరమందు ఉషఃకాలంబున మాఘస్నానమాచరించి షోడశోపచారములచేత మాధవుని పూజింపుచు మాఘమాసమంతయు మాఘవ్రత

మును పలికి నారదోక్తిని స్మరించుచుండెను. ఆ నారదుండు యిచ్చట నిట్లుచెప్పి పోయి పలుదేశములు తిరుగుచు సౌరాష్ట్రదేశమునకు వెళ్ళి నిరంతరము హరిని స్మరించు ఆ సౌరాష్ట్రాధిపతియగు హరిద్రథుని జూచెను.

శ్లో॥ పృథివ్యాది మహాకాశం పూర్ణం స్థావరజంగమం। పుత్రంచ పితరం పౌత్రం భృత్యం వా గురుమేవ వా । పశుం వా మానుషం వాపి శ్వ చండాల స్వపాతకం । అణుం వా పరమాణుం వా కడ్య ద్రుమ గృహం తథా । మశకాంతం మహద్రూపం యద్దృష్ట మఖిలంజగత్ । సర్వం విష్ణుమయం పశ్యన్ తేన్వసౌ హరినామతః । ఆహ్వానేతి భవే ద్విష్ణు హరేతిగమనే నృపః । గోవిందేతి తథాభాష్యే కృష్ణేతి స్వీకృతే తదా । దామోదరేతి చాహారే చోత్థానే కేశవేతిచ । శయనే నారసింహేతి నిద్రాయాం మాధవేతిచ । వాసుదేవేతి క్రీడాయాం సంచారే వామనేతిచ । హృషీకేశేతి వ్యసనే చానందే శ్రీధరేతిచ । ఏవం సంజ్ఞాపరై ర్వాగ్భి ర్విష్ణునామానిసంతతమ్।

తా॥ రాజును పృథివ్యాది మహాకాశపర్యంతము నిండియున్న స్థావరజంగములను పుత్రుని, తండ్రిని, పౌత్రుని, భృత్యుని, గురువును, పశువును, మనుష్యుని, చండాలుని, కుక్కను, పాతకుని, అణువును, పరమాణువును, గోడను, వృక్షమును, గృహమును, ఇది అది యననేమి ? బ్రహ్మ మొదలు మశకాంతమయిన ఏవస్తువునయినను జూచినప్పుడు వాటినన్నిటిని హరిమయములుగా దలంచుచు వానిని హరినామములచేత బిలుచుచుండును. ఇంతేగాదు పిలచుటయందు విష్ణువనియును, గమనమందు హరియనియును, మాట్లాడునపుడు గోవిందాయనియు, స్వీకరించుచున్నపుడు శ్రీకృష్ణాయనియు, ఆహారావసరమందు దామోదరాయనియు, లేచువేళ కేశవాయనియు, శయనించుతరి నారసింహాయనియు, నిద్రవేళ మాధవాయనియు, క్రీడాకాలమందు వాసుదేవాయనియు, సంచార సమయమందు వామనాయనియు, కష్టమందు హృషీకేశాయనియు, ఆనందమందు శ్రీధరాయనియు ననుచుండును. అనఁగా ఆయా కార్యములకు ఆయా నామములను నియమించుచు హరినామస్మరణ చేయుచుండునని భావము.

శ్లో॥ అజస్రమర్చయ న్విష్ణుం కీర్తయన్విష్ణు దైవతం । శృణ్వన్ జన్మాని కర్మాణి విష్ణో రమితతేజసః । సర్వం విష్ణుమయం పశ్యన్ వర్తమానం వ్యలోకయత్ ।

తా॥ ఇట్లు నిరంతరము విష్ణుకీర్తనచేయుచు, విష్ణువు నారాధించుచు, అమిత తేజోవంతుఁడయిన హరియొక్క జన్మచరిత్రములను వినుచు, సర్వమును విష్ణుమయముగా జూచుచుండెను రాజును నారదుఁడు జూచెను

శ్లో॥ సరాజా నారదందృష్ట్వా ప్రత్యుత్థానాభివందనైః। తోషితస్తోషయిత్వాతు రాజా సౌరాష్ట్రవల్లభః।

తా॥ ఆ రాజు నారదునిజూచి ప్రత్యుత్థానవందనాదులచేత సంతోషపెట్టెను.

శ్లో॥ నారదస్తం సమాలోక్య రాజానం ప్రత్యభాషత।

తా॥ నారదుఁడు ఆ సౌరాష్ట్రదేశాధిపునిజూచి యిట్లనియె

నారదః॥ శ్లో॥ రాజన్నంబునిధౌ కాచిద్బాలావిద్యాధరాత్మజా। రాక్షసాపహృతా తస్మిన్ సురూపా ప్రాప్తయౌవనా। సముద్రాంతస్థితాంబాలాం త్వచ్ఛౌర్యేణ నృపోత్తమ। ఆనయిత్వావిధానేన గృహీతుంకాత్వమర్హసి। నారదత్తేనశూలేన వరలబ్ధేన రాక్షసం। తచ్ఛూలేనాసురంత్వంహి ఛేత్తుమర్హసిసాంప్రతమ్।

తా॥ ఓ రాజోత్తమా! ఒక విద్యాధరకన్యకను ఒక రాక్షసుఁడు బలాత్కారముగా హరించి సముద్రాంతరమందుంచెను. ఆబాల బహు రూపవతియు, సంప్రాప్త యౌవనయు నై యుండెను. కనుక నీవు పరాక్రమముచేత ఆ చిన్నదానిని తీసికొని వచ్చి గ్రహించవలెను. ఆ రాక్షసునివద్ద శక్తిమంతమైన శూలమున్నది. నీవు ఆశూలముచేతనే వానిని సంహరింతువు.

శ్లో॥ ఇత్థంప్రబోధితో రాజా నారదేన మహాత్మనా। విస్మితః ప్రాహతంభూయః సముద్రాంతఃకుమారికామ్। కథంవధ్యోసురఃపశ్చాదానేష్యామి కథంసతీం। ఇత్యుక్తే నృపతౌ ప్రాహ నారదస్తం మృగేక్షణే॥

తా॥ ఈప్రకారముగా నారదునిచేత బోధించబడినవాఁడై ఆ సౌరాష్ట్రరాజు ఆశ్చర్యమునుబొంది యిట్లనియె. ఓ మహాత్మా! సముద్రమధ్యమందున్న రాక్షసుని యెట్లు వధింతును. తరువాత ఆ విద్యాధరకన్యకను యెట్లు తీసికొనివత్తును. ఇట్లురాజు పలుకగా నారదుఁడు తిరిగి చెప్పుచున్నాఁడు.

శ్లో॥ శృణు ప్రసంగస్య రాజేంద్ర హ్యయాతే త్వయి వారిధిః సద్యోదాస్యతి తేమార్గం తస్మాద్గత్వా సురేణచ। యుద్ధంకృత్వా తస్యశూలం

గృహీత్వాచైశ్వరంక్వచిత్ । తేనశూలేనతంఘోరం హత్వారక్షోధిపం నృప । కుమార్యాసహితస్తూర్ణం త్వమాగంతుమిహార్హసి ॥

తా॥ ఓ రాజోత్తమా ! సముద్రుసన్నిధికి బొమ్ము నీవువెళ్లగానే సముద్రుము నీకు మార్గమునిచ్చును. ఆమార్గముచేత వెళ్ళి రాక్షసునితో యుద్ధమొనరించి వానిహస్తమందున్న శైవశూలమును బలాత్కారముగా గ్రహించి ఆశూలముచేతనే వానిని చంపి కుమారికతోగూడా త్వరగా నిచ్చటికిరమ్ము.

శ్లో॥ హరిద్రధస్తథేత్యాహ శ్రుత్వా నారదభాషితం । జగామ రథమారుహ్య సముద్రనికటం శుభే ।

తా॥ హరిద్రథుఁడును నారదవాక్య శ్రవణానంతరం మట్లే ఆచరింతునని రథారూఢుఁడై సముద్రసన్నిధికి వెళ్లెను.

శ్లో॥ సద్యస్సముద్రస్స్వయం దృష్ట్వా ద్విధామార్గం దదాయతః । తతశ్చాంతర్గతో రాజా ప్రవివేశపురీంనృపః ।

తా॥ ఆ రాజును జూచి అప్పుడే సముద్రుము రెండుగా విడి మార్గమిచ్చెను. ఆమార్గముచేత రాజు రాక్షసపురి జేరెను.

శ్లో॥ తదాసురోయయా దేవి లగ్నార్థంబ్రహ్మణఃపదం । ఐశ్వరం వారిధౌన్యస్య వదే సంస్థాప్యతంగతః ।

తా॥ ప్రవేశమునకు పూర్వమే రాక్షసుఁడు వివాహలగ్న నిశ్చయముకొఱకు బ్రహ్మవద్దకు వెళ్లేటప్పుడు శివశూలమును తన యింటిలో నేయుంచి పోయెను

శ్లో॥ తతస్సరాజాతం శీఘ్రం జగ్రాహ స్వకరే శుభే । దినత్రయమితంకృత్వా వివాహార్థం విరించినా । ఆజగామ పునర్దైత్య స్స్వాశ్రయం సలిలాశయమ్ ।

తా॥ రాజును త్వరగాబోయి ఆ శూలమును తన హస్తముచేత గ్రహించెను. వాఁడును లగ్ననిశ్చయముకొఱకు బ్రహ్మవద్ద మూఁడుదినములుండి తిరిగి స్వకీయాలయమయిన సలిలాశయమునకు వచ్చెను.

శ్లో॥ శూలపాణిం తతోదృష్ట్వా రాజానం యుద్ధకాముకం । వ్యచింతయద్దైత్యపం స్వమాధానేనచేతసా ।

తా॥ తచ్ఛివశూలమును ధరించి యుద్ధోద్యుక్తుఁడై యున్న రాజును జూచి చిత్తమునకాగ్రముగా నుంచి రాక్షసుఁ డిట్లు చింతించెను.

శ్లో॥ కీర్తయన్నత్రిదశేశం దేవేశంపురుషోత్తమం । అనేన విష్ణుభక్తేన మరణంమేవరంపరమ్ ॥ తపసా దుష్కరేణాపి దుర్లభంతు జగత్త్రయే । దేహాద్వాబ్దశతాంతేవా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః । విచారితార్థస్తేనేత్థం విధేయుద్ధాయముంజసా ॥

తా॥ నా గృహమందివ్వడో శూలధారియై దేవతాచక్రవర్తియైన దైత్యాంతకుని కీర్తించుచున్నాఁడు ఇట్టి విష్ణుభక్తునిచేత మరణము శ్రేయస్కరము ఇది దుస్తరతపస్సుచేతను బొందబడదు. శరీరికి యిప్పుడుగాని, నూరేండ్లకుగాని మరణము తప్పదు. ఈప్రకారముగా విచారించి రాక్షసుఁడు యుద్ధోద్యుక్తుఁడై రాజుమీదికి దుమికెను.

శ్లో॥ తతస్సరాజా వేగేన రాక్షసాభిముఖంగతః । అన్యోన్యం చక్రతుర్యుద్ధ మత్యంతంరోమహర్షణమ్ ॥

తా॥ రాజును రాక్షసాభిముఖుఁడాయెను. ఇట్లిద్దరు నతి భయంకరమయిన యుద్ధమును జేసిరి.

శ్లో॥ త్రియంబకస్యశూలేన జఘానోరసి రాక్షసం । తేనవిద్ధవపాతాసౌ గిరిర్వజ్రహతోయథా ॥

తా॥ రాజు శైవశూలముచేత రాక్షసుని వక్షస్థలమందుగొట్టెను. రాక్షసుఁడు ఆదెబ్బచేత వచ్చి వజ్రహతమయిన పర్వతమువలె గూలెను.

శ్లో॥ తతస్సరాజాహర్షేణ కుమారీనికటంయయౌ । దృష్ట్వా హరిద్రిధంకాంతం బభూవా నతకంధరా । స్మరంతీనారదేనోక్తం పతిమావ్రముఖప్రదమ్ ॥

తా॥ తరువాత రాజు సంతోషముచేత విద్యాధర కన్యకా సమీపమునకు బోయెను. కన్యయును హరిద్రిధాంగుని జూచి లజ్జచేత అవనతకంధరయై నారదోక్తిని స్మరించుచు సుఖప్రదుఁడయిన పతినిబొంది సుఖమును బొందెను

శ్లో॥ తతస్తౌదంపతీహృష్టౌ జగ్మతుస్స్వనికేతనమ్ ॥

తా॥ పిమ్మట నాదంపతులు సంతోషముగలవారై తమగృహంబుఁజేరిరి.

శ్లో॥ తత్రరామా పూజయిత్వాతం నారాయణ మనామయం ।

సమ్యక్తద్భక్తిమాలంబ్య దేహాంతే విష్ణుమాపతుః । పునర్జన్మవిహీనంచ నిత్యానందరసాలయమ్ ।

తా॥ అట్లుచేసి అచ్యుతుని నారాధించి శివస్వామి విష్ణుభక్తినవలంబించి దంపతులు దేహాంతమందు జన్మరహితమయిన నిత్యానందసుఖప్రదమయిన విష్ణులోకమునకు జేరిరి

శ్లో॥ తస్మాన్మాఘవ్రతం దేవి చైవంబుధ్వాసమాచరేత్ । సఋషి ప్రవరోభూత్వా కైవల్యంసోధిగచ్ఛతి ।

తా॥ కావున ఓ పార్వతీ ! మాఘవ్రతమిట్టిదని తెలిసికొని ఆచరించువాఁడు ఋషిశ్రేష్ఠుఁడై దేహాంతమందు మోక్షము బొందును

శ్లో॥ మాఘే వారిచరంగతేచ తరణౌ ప్రాతర్బహిః శ్చోదకే । స్నానం యఃకురుతే మహాఘనిచయైర్యుక్తోపివామానవః । సయాతి పదంపరంభగవతః సంసేవ్యమానంసురైః । రోన్నచేద్యాతి యమాలయం నగసుతే సత్యంనవైసంశయః ।

తా॥ మహీధ్రనాథుని ముద్దు కూతురవయిన ఓ మేనకాత్మజా ! మాఘంబున మకరమందు సూర్యుఁడుండగా బహిర్జలమందు మాధవప్రీతిగా స్నానమాచరించు మానవుఁడు మహాపాతకమిళితుఁడయినను, మాధవానుగ్రహా పాపనిర్ముక్తుఁడై విష్ణుమందిరమందు మోదితుఁడై యుండును. అట్లుచేయనివారందఱు అతిఘనంగా నందురు. ఇది నిజము. సంశయములేదు.

శ్లో॥ స్నాత్వా మాఘజలే మహేశ్వరి ముదా సంపూజ్య నారాయణం । శ్రుత్వా తత్సుకథాందినేష్వరతతం పేయం తదంఘ్రోర్జలమ్ । యఃకుర్యాదితి మాసమేక మనిశం పశ్చాద్ధరేరంతికం । ప్రాప్నోత్యేవ మనంతసౌఖ్యమతులం సత్యంనవైసంశయః ।

తా॥ ఓ గౌరీ ! ఎవ్వరు మాఘజలమందు స్నానమాచరించి సంతోషముచేత సర్వేశ్వరుని ఆరాధించి మాసమంతయు మాధవకథాశ్రవణ మాచరించి తత్పాదోదకము పానము చేయుదురో, ఆపుణ్యునికి దేహాంతమందు పుండరీకనయను పురముచేరి అనంత సౌఖ్యములను బొందుదురు ఇది నిజము సంశయములేదు

శ్లో॥ యః శృణోతిచ మాఖ్యానం మాఘస్నానపరాయణః । సమోక్షంలభతే దేవి విముక్తస్సర్వపాతకైః ।

తా॥ ఓ గౌరీ! ఈ చరిత్రమును మాఘస్నాన నిరతుఁడై వినువాఁడు సమస్త పాప వినిర్ముక్తుఁడై మోక్షమునుబొందును.

ఇత్యష్టమోధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ నవమోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీమహాదేవః॥ శ్లో॥ భూయోపహం సంప్రవక్ష్యామి శృణుమే వర మంపచః। మాఘమాసస్యమాహాత్మ్య మనంతసుఖదాయకమ్॥

తా॥ మహేశ్వరుఁడు తిరిగి చెప్పుచున్నాఁడు. ఓ గౌరీ! యింకా ఈమాఘ మాస మాహాత్మ్యమును జెప్పెదను వినుము.

శ్లో॥ పురా గృత్సమదోనామ మునిర్వేదార్థపారగః। గంగా యాః పులినేపుణ్యే సశిష్యైర్మాఘమజ్జనమ్॥ కృత్వా విష్ణుంసమభ్యర్చ్య శిష్యేభ్యో విష్ణుసత్కథాం। వ్యాఖ్యానసమయే తస్మిన్ జహ్నుస్తం ప్రత్యభాషత॥

తా॥ పూర్వకాలమందు వేదవేదాంగవేత్తయైన గృత్సమదమహర్షి గంగా తీరమందు శిష్యులతోసహా మాఘస్నాన మాచరించి మాధవపూజ చేసి శిష్యులకుమాధవ సత్కథా వ్యాఖ్యానము చేయుచున్నంతలో జహ్నువు వొక దినముయు గృత్సమదునితో నిట్లనెను.

శ్రీజహ్నుః॥ శ్లో॥ మాఘస్నానస్యమాహాత్మ్యం శ్రోతుంకౌతూహలంహిమే వక్తుమర్హసివిప్రేంద్ర యస్నాన్నఃగృత్సచ్ఛ్రుతిఃఫలమ్॥

తా॥ ఓ గృత్సమదమహర్షీ! సమస్త పాపనాశనమయిన మాఘస్నాన ఫలమును వినగోరినాను. దయయుంచి నాకు చెప్పుము.

శ్లో॥ జహ్నోర్వాక్య మిదంశ్రుత్వా దేవి గృత్సమదోమునిః। సాధుసాధ్వితిసంభావ్య జహ్నుంవాక్యసుధాబ్రవీత్॥

తా॥ ఇట్లు జహ్ను వాక్యమువిని గృత్సమదుఁడు నీమాట చాలాబాగున్న దని చెప్పి మాఘస్నాన మహిమను జెప్పదొడంగె.

గృత్సమదః॥ శ్లో॥ పాత్రీతర్ప్రకగతేనూర్యే యోమాఘేస్నాతి మానవః। సర్వపాపైర్వినిర్ముక్తో వజ్రిపాణిఃపురా యథా॥

తా॥ మాఘోదయకాలమందు మిహిరుఁడు మకరగతుఁడైనప్పుడు మాఘస్నాన మాచరించు మానవుఁడు శచీపతివలె సర్వపాతక ముక్తుడగును

జహ్నుః॥ శ్లో॥ వజ్రపాణిః పురా విప్ర కింకృతం కర్మనిందితం। విముక్తః పాతకేనాదౌ మాఘమజ్జనతః కథమ్ ॥

తా॥ తిరిగి జహ్నువడుగుచున్నాఁడు ఓ బ్రాహ్మణోత్తమా! పూర్వమందు ఇంద్రుఁడు యేమిపాపము నాచరించెను. మాఘస్నానమువలన ఆపాతకమెట్లునశించెను. చెప్పుమా యని అడిగెను

గృత్సమదః॥ శ్లో॥ తదహం సంప్రవక్ష్యామి శృణుమే కృతయుగే పిచ। తుంగభద్రాతటే విప్ర మిత్రవిందో మహామునిః। ఆసీత్తదాశ్రమేపుణ్యే త్రయీవిద్యావిశారదః॥

తా॥ ఈమాట విని తిరిగి గృత్సమదుఁడు చెప్పుచున్నాఁడు. పూర్వము కృతయుగమందు తుంగభద్రాతీరంబున ఒక పుణ్యాశ్రమమందు వేదత్రయమును జదివిన మిత్రవిందుఁడను నొక మహాముని యుండెను.

శ్లో॥ తస్య భార్యా చారుముఖీ బృహచ్ఛ్రోణీ పయోధరా। కామినీ రూపసంపన్నా మిత్రవిందవధూ శ్శుభే॥

తా॥ ఆ మిత్రవిందునకు సుందరముఖియు, గొప్పవైన పిఱుఁదులు, కుచములు గలిగినదియు, మహా సౌందర్యవతియు, విశేష కామముగలిగినదియు నైన భార్యగలదు.

శ్లో॥ తుంగభద్రాజలే ప్రాతః ఋతుస్నాతాశుభాననా। బాలాతపంసేవ్యమానా సాధుకుర్వన్ శిరోరుహాన్॥

తా॥ శుభకరములయిన తుంగభద్రా జలమునందు ఆ మునిపత్ని ప్రాతఃకాలంబున ఋతుస్నాతయై తలవెంట్రుకలను విదదీయుచు లేతయెండను సేవించుచుండెను.

శ్లో॥ తదా శక్రస్సమాగచ్ఛ ద్రాక్షసానాం వధోద్యమః। దిక్పాలై రన్వితో దేవై స్సర్వై స్స్వర్గనివాసిభిః। దృష్ట్వా తాం రంతుకామస్సన్ సందధేమతిమాత్మని॥

తా॥ అప్పుడింద్రుఁడు రాక్షస సంహారకాముఁడై దిక్పాలులతోను, కూడలయిన స్వర్గనివాసులగు దేవతలతోను అచ్చటికి వచ్చెను. వెళ్లుచు ఆ మునిభార్యను జూచి ఆత్మయందు ఆమెతో సంభోగించవలెనను బుద్ధిని నిశ్చయించుకొనెను.

శ్లో॥ దూరస్థస్తాం సమాలోక్య పదంతస్యాశ్శచీపతిః । తత స్స చింతయన్యాత స్తామేవ ద్విజపుంగవ ॥

తా॥ ఇంద్రుఁడు దూరమందుండి ఆమెనుఁజూచి మోహితుఁడై ఆమెనుతలఁచు కొనుచు వెళ్లెను.

శ్లో॥ యామ్యో ర్దైత్యాధిపైశ్శత్రుః సదేవైర్విదధేరణం । కృత్వా యుద్ధం మహాఘోరం దానవైర్దేవకంటకైః ॥ జిత్వాతానాసు దేవేశః ప్రయాణాయ పునః పురీం । ప్రత్యాగచ్ఛ ద్దినాంతే ఒసౌ తస్యాం సంసక్తమానసః ॥

తా॥ వెళ్లి దక్షిణమందున్న రాక్షసులతో అతి ఘోరమయిన యుద్ధమును జేసి రాక్షసులను జయించి తిరిగి తన పట్టణమునుగూర్చి బయలుదేరి వచ్చి ఆ మునిపత్నియందు ముఖ్యమయిన మనస్సుగలవాఁడై సాయంకాలమునకు ఆ మున్యాశ్రమ సమీపమునకు వెళ్లెను.

శ్లో॥ సర్వాన్ సంప్రేష్యయామాస త్రిదశాన్ త్రిదశాలయం । స్వయంతత్రస్థితస్స్వర్గం నయాతో మేఘవాహనః ॥ తుంగభద్రాతటే తస్యాః కుటీరద్వారి గృహ్యకః । కుటీరశాలా వలభి మావిశ్యాలోకయన్ సతీమ్ ॥

తా॥ వచ్చి సమస్తదేవతలను స్వర్గమునకుబంపి తాను అచ్చటనేయుండి తుంగభద్రా తీరమందున్న ఆ మునిపత్నియొక్క పర్ణశాలా ద్వారమందు ఆ పర్ణశాలయొక్క చూరుకొణిగ (యులిసె) లోన పైభాగమందు యుండి కాముకుఁడయిన మేఘవాహనుఁడు (ఇంద్రుఁడు) మునిభార్యను జూచుచుండెను.

శ్లో॥ మునిస్తత్రాపరేరాత్రౌ మిత్రవిందో బహిర్గతః । శిష్యానుద్బోధితుం వేద శిక్షార్థం హ్యుటజేషుచ ॥

తా॥ ఇట్లుండఁగా మిత్రవిందమహాముని అపరరాత్రియందు వేదమును చెప్పుకొనుటకు పర్ణశాలలయందు నివసించుచున్న శిష్యులను లేపుకొనుటకు బయటకు వెళ్లెను.

శ్లో॥ వివేశ తూష్ణీం దేవేంద్రః హ్యుటజాంతిస్సతీం మునే । తత స్తాం జగృహేసాధు దేవేంద్రోహామితీరయన్ ॥

తా॥ అంతలో దేవేంద్రుడు మెల్లగా మాట్లాడకుండా లోపలికి ప్రవేశించి కుటజమందున్న మునిభార్యను నేను దేవేంద్రుడననుచు పట్టుకొనెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా తూర్ణ ముత్థాయ శయనా దృషివల్లభాం । నిష్క్రాంతాం ప్రతిజగ్రాహ బాహుభ్యాం బాఢమాదరాత్ ।

తా॥ ఆమాటవిని త్వరగా లేచి బైటకు పోవుచున్న మునిభార్యను ఇంద్రుడు ప్రేమతో రెండుచేతులతో గట్టిగా పట్టుకొనెను.

శ్లో॥ సాంత్వయామాసతాం వాగ్భి స్సాధువార్తావహైర్మనే । విరరామతతో నారీ మారప్రాణవశంగతా ।

తా॥ పట్టుకొని మంచిమాటలతో నామెను సన్మానించెను. బ్రతిమాలుకొనెను. ఆ మునిపత్నియు మన్మథవశంగతయై యూరకుండెను.

శ్లో॥ శక్రస్తామనుభూయాథ గమనాయ ప్రచక్రమే । మిత్రవింద స్తదాయాతః కుటీరాంతే దదర్శతమ్ ।

తా॥ ఇంద్రుడు మునిభార్యతో సంభోగించి గమనోన్ముఖుడాయెను. ఇంతలో మిత్రవిందుడు యింటికివచ్చి కుటీరమందున్న ఇంద్రుని జూచెను.

శ్లో॥ జారం తమసి విజ్ఞాయ దేవేంద్రం జగృహే బలాత్ । సోప్యాహశక్ర స్తంవిప్రం దేవేంద్రంవిద్ధినావరమ్ ।

తా॥ ఇట్లుజూచి ముని వాడు జారుడని తెలిసికొని బలాత్కారముగా ఇంద్రుని పట్టుకొనెను. ఇంద్రుడును నేను దేవేంద్రుడను. ఇతరుడనుగానని చెప్పెను.

శ్లో॥ ద్విజ శ్శచీపతింప్రాహ కిమత్రాగమనం తవ । తచ్ఛ్రుత్వా విరరామేంద్రో వ్రీడయానతకంధరః ।

తా॥ ముని ఇంద్రునితో నీవిచ్చటికెందులకు వచ్చితివనెను. అదివిని ఇంద్రుడు సిగ్గుచేత తల వంచుకున్నవాడై యేమియు చెప్పలేక యూరకుండెను.

శ్లో॥ మిత్రవింద స్సత స్తస్మై తదాజ్ఞాత్వా దుష్కృతం మునిః । శచీపతింశశాపాథ జారకర్మరతం తదా ।

తా॥ తరువాత మిత్రవిందుడు యింద్రుడుచేసిన దోషమును దెలిసికొని జారకర్మపరాయణుడైన జంభారిని యిట్లు శపించెను.

శ్లో॥ ముఖం ఖరాననం భూయా ల్లంబోష్ఠద్వయ సంయుతం। యుత్తస్మాద్గమనేమూఢ శక్తిస్స్వర్గాయునస్యతు ॥

తా॥ ఓరీ దురాత్మా! మూఢుఁడా! నీయొక్క ముఖము గాడిదముఖ మగుఁ గాక. అందులో పెదవులు జారుచుండును. నీకు స్వర్గమునకుబోవుటకు శక్తిచలించుగాక.

శ్లో॥ ఇతిశప్తస్తతస్తేన సద్యో గర్దభాననః। శశాపాథప్రియాం విప్రః ప్రస్తరో భవ కాననే ॥

తా॥ ఇట్లు శపించబడిన యింద్రునకు అప్పుడే గాడిదముఖము సంభవించెను. మిత్రవిందుఁడిట్లు శచీపతిని శపించి పిమ్మట తన భార్యను అరణ్యమందు పాషాణమగు మని శపించెను

శ్లో॥ మిత్రవిందస్తతఃపశ్చా ద్గంగాతీరంయయౌమునే। ఆరూఢ యోగతఃకాయం విహాయాత్మవిన్మునిః ॥

తా॥ ఓ జహ్నూ! యిట్లిద్దఱిని శపించి మిత్రవిందుఁడు గంగాతీరమునకుబోయి ఆత్మవేత్తగాన యోగారూఢుఁడై దేహమును విడిచి బ్రహ్మీభూతుఁడాయెను.

శ్లో॥ శక్రో దేహో యదా పూర్వం తన్ముఖం గర్దభస్య తత్। ఉత్తబ్ధకర్ణ శ్చోర్ధ్వాస్యో ముంచన్ చండధ్వనిం తథా ॥ పాదన్యాసేన పద్మాద్రే శ్శ్రోనానాగుహాంగతః। వ్రీడయా శక్తిహీనో భూ ద్వ్యాఘ్రాద్రిర్గర్దభాననః ॥ గిరేర్గుహా ముపాశ్రిత్య వన్యశాక తృణాశనః। ముంచన్ చండధ్వనిం తత్ర చోర్ధ్వాస్యో బహుదుఃఖితః ॥

తా॥ యిచ్చట ఇంద్రునిదశ యెట్లున్నదంటే, ఇంద్రునకు దేహము పూర్వము వలెనే యున్నది. ముఖము గార్దభముఖము చెవులు నిక్కపట్టుకొని ముఖము మీద కెత్తి భయంకరమయిన గాడిదకూతలు కూయుచు యింద్రుఁడు పెల్లగా పాదన్యాస ములచేత పద్మాద్రికి వెళ్ళి అచ్చట నొక గుహయందుండెను గనుక శక్తిహీనుఁడై గాడిదముఖమువంటి ముఖముగలిగినవాఁడై సిగ్గుతో చేరి గుహలో ప్రవేశించెను. ఇతనికి ఆహారము అరణ్యమందున్న శాకములు, గడ్డి. ఇట్లు బహు దుఃఖముతో నుండెను

శ్లో॥ ఖరగ్రీవస్య శక్రస్య ద్వాదశాబ్దా వ్యతీయుః। దృష్ట్వాతే ఉనాయకంస్వర్గం దానవా దేవశత్రవః। స్వర్గమాప్తుత్యపబుద్ధ్యా స్యయు ధుస్తే పరస్పరమ్ ॥

తా॥ ఇట్లు గార్దభముఖుఁడయిన యింద్రునకు పన్నెండు సంవత్సరములు గడచినవి. స్వర్గమందు దేవేంద్రుఁడు లేనికారణముచేత రాక్షసు లిదేసమయమని దండెత్తి వచ్చి దేవతలతో యుద్ధముచేయ నారంభించిరి.

శ్లో॥ దేవానాం దానవానాంచ ప్రత్యహంరోమహర్షణం । ఆసీదాయోధనంవిప్ర విక్రాంతాస్త్రిదశాలయాః ।

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! దేవతలకు రాక్షసులకు యీప్రకారముగా ప్రతిదినమందు అతి భయంకరమయిన యుద్ధము జరుగుచుండెను. అందులో దేవతలు ఆయాసమును బొందిరి.

శ్లో॥ తతస్తే మృగయాంచక్రు ర్దేవేంద్రం వజ్రపాణినం । విభక్తాస్తే చతుర్దిక్షు మార్గమాణాయయుస్సురాః ।

తా॥ యిట్లు రాక్షసులతో పోట్లాడసమర్థులుగాక దేవతలు యింద్రుని అన్వేషించుటకు విభక్తులై నాలుగుదిక్కులకు వెళ్ళిరి.

శ్లో॥ విదిక్షుదిక్షువిబుధా స్త్రిషులోకేషుసర్వతః । అటవ్యద్రీంద్రఘోషేషు కందరేషు దరీషుచ । సర్వత్ర మృగయాంచక్రు ర్దేవా స్స్వర్గాధిపం మునే ।

తా॥ యిట్లు దేవతలు దిక్కులయందును, విదిక్కులయందును, మూఁడు లోకములయందును, అరణ్యములయందును, పర్వతేంద్రములయందును, పట్టణములయందును, పల్లెలయందును, గుహలయందును, కందరములయందును సర్వత్ర వెదకిరి.

శ్లో॥ సర్వే సంత్రస్తమతయః స్వర్గస్థై ర్దానవేశ్వరైః । ఆక్రమిష్యత్సదాతూర్ణ మితిజ్ఞాత్వాయయుర్దివమ్ ।

తా॥ యిట్లు వెదకి యిచ్చటను యింద్రునిగానక భయమును బొందినవారైరి. స్వర్గము దానవులచేత ఆక్రమించబడినదానినిగా దెలిసికొని స్వర్గమునకు తిరిగి వెళ్ళిరి.

శ్లో॥ అదృష్ట్వాపతిమూ తాస్తే శ్వేత మత్తేభవాహనం । పునర్నిశాచరైశ్శూరై ర్మాయాసంగ్రామకోవిదైః । కృత్వా ఘోరతరం యుద్ధం సర్వేదేవాః పరాజితాః । స్వర్గసంరక్షణార్థాయ దేవాః సంస్థాప్యకేచన । దృష్ట్వాతేనాయుకం స్వర్గం సురా స్స్వర్లోకవాసినః । సమాతేనమరాస్సర్వే పయోధింప్రాపురోజసా ।

తా॥ వెళ్ళి అచ్చట యింద్రుని గానక తిరిగి మాయా యుద్ధవిశారదులయిన రాక్షసులచేత యుద్ధమందు దెబ్బలుతిని పరాజితులై స్వర్గరక్షణార్థము కొండటిని దేవతలనుంచి స్వర్గ మశాయకమయినదని దేవతలందరు గుంపుగా శరాక్రమముచేత ఏదోయొక ప్రయత్నముకొరకు సముద్రమువద్దకు వెళ్ళిరి.

శ్లో॥ గచ్ఛకా వైమానికా స్తత్ర ప్రత్యగాగ్రే పయోనిధౌ। సంప్రాప్తే తత్రతపసి మకరస్థే దివాకరే।

తా॥ మాఘమాసము సంప్రాప్తమగుచుండ మఱియు సూర్యుడు మకరరాశిని బొందినవాడగు సమయమందు సముద్రతీరంబున ప్రత్యంతాగ్రమందు స్నానార్థమై ఆకాశమార్గమునుండి అచ్చటికి కొందరు వచ్చిరి.

శ్లో॥ ప్రత్యంతాగ్రే దేవభూతే మునయః ఖేచరానఘాః। ప్రాప్తె సూర్యోదయే స్నాత్వా పూజయిత్వా జనార్దనం। అథ్యర్చ్యమానా స్తత్రైవ మేతన్మాఘవ్రతంఘనమ్।

తా॥ ఆకాశ సంచారులయిన మునులు దేవరచితమయిన ప్రత్యంతాగ్రమందు మాఘంబున మార్తాండోదయమందు మజ్జనమాడి మాధవుని బూజించి మాఘమాసవైభవమును చెప్పుకొనుచుండిరి

శ్లో॥ తాన్ దృష్ట్వా నిర్జరా స్సర్వే తా నభ్యేత్య బభాషిరే। పయోధావత్ర యుష్మాభిః ప్రత్యంతాగ్రే పృథక్పృథక్। అనుష్ఠిత మిదంపుణ్యం కింవ్రతం కథ్యతాంబుధాః।

తా॥ ఇట్లున్న మునులనుజూచి దేవతలు వారివద్దకు బోయి యీపయోధంబున ప్రత్యంతాగ్రమందు మీరు వేఱువేఱుగా అనుష్ఠించుచున్న పుణ్యమయిన వ్రతమేమిటి- దీనికి ఫలమేమిటి- మాకు చెప్పుమని వారినడిగిరి

శ్లో॥ ఇత్యుక్తా విబుధైర్విప్ర మునయః ఖేచరోత్తమాః। ఇత్థం మాఘ వ్రతఫలం సురేభ్య స్సుఖదాయకమ్।

తా॥ దేవతలచేత నిట్లు అడుగబడినవారై ఖేచరులయిన మునులు సుఖప్రదమయిన మాఘస్నానఫలమును వక్ష్యమాణప్రకారముగా జెప్పదొడంగిరి

ఖేచరాః॥ శ్లో॥ శృణ్వంతు దేవా స్సర్వేత్ర వ్యాస్మాభిర్యత్కృతం

వ్రతం । మాఘమాగవ్రతమిదం సర్వపాపహరం శుభం । జగద్ధితాయ వక్ష్యామః శృణుధ్వం తద్వ్రతైభవమ్ ।

తా॥ ఓ దేవతలారా! వినుఁడు. మాచే వర్ణింపఁబడునది మాఘవ్రతము. ఇది సమస్తపాపహరము. లోకోపకారమునకొఱకు మీకు చెప్పుచున్నాము.

శ్లో॥ మాఘే చోష్ణకరేవారి చరత్యేవవిభావసౌ । స్నానం ప్రాతర్జలేకుర్వన్ త్యైతేకై వల్యభాగినః ।

తా॥ మాఘమాస మకరమందు ఉష్ణకిరణుఁడైన సూర్యుఁడుండఁగా ప్రాతఃకాలమందు స్నానమాచరించువారు మోక్షమును బొందుదురు.

శ్లో॥ యోమాఘే మాధవందేవం ప్రాతస్స్నాయస్సంస్మరేత్ । సర్వస్సముచ్యతేపాపై ర్నాత్రకార్యావిచారణా ।

తా॥ ఎవ్వఁడు మాఘమందు ప్రాతఃస్నానమాచరించుచు లేచి మాధవనామ సంస్మరణ గావించునో వాఁడు అప్పుడే పాపవిముక్తుఁడగును. సందేహములేదు.

శ్లో॥ స్నానం దానం జపో హోమః ప్రాతర్మాఘే జలాంతికే । యేకుర్వంతినరాభక్త్యా తేధన్యా నాత్రసంశయః ।

తా॥ మాఘమందు జలసాన్నిధ్యంబున ప్రాతఃకాలమందు స్నాన దాన జప హోమాదుల నాచరించువారు ధన్యులగుదురు. ఇందుకు సందియంబులేదు.

శ్లో॥ మాఘే శుక్లచతుర్దశ్యాం పౌర్ణమాస్యాం భక్తితత్పరః । గోదానంచ వృషోత్సర్గం తిలాపూపాన్న పాయసమ్ । కంబళం వస్త్రదానంచ యఃకుర్యాద్ద్విజసత్తమే । తే విష్ణులోకం సంప్రాప్య నైవ తస్మాన్నివర్తతే ।

తా॥ మాఘశుక్ల చతుర్దశి పూర్ణిమలయందు భక్తితో గోదానమును, వృషోత్సర్గమును, తిలలను, అపూపములను అన్నదానమును, పాయసమును, కంబళమును, వస్త్రమును బ్రాహ్మణున కిచ్చువాఁడు విష్ణులోకము చేరి అచ్చటనుంచి తిరిగి రాడు.

శ్లో॥ గోదానా దుద్రిలోకంచ వృషోత్సర్గేణ వైష్ణవం । తిలైశ్చాంద్రమసంలోక మపూపైః సూర్యమండలమ్ । స్వర్లోకమన్నదానేన పాయసేన ధ్రువాలయం । ఆగ్నేయః కంబళాద్యాని వస్త్రదానాద్విధేః పదమ్ । విష్ణో రంశాంశభూతేషు లోకే ష్వేతేషునిర్మితాః । నివసంతి

ముదామాఘే స్నానదానపరాయణాః । నాతఃపరతరం కించిత్పవిత్రం పాపనాశనమ్ ।

తా॥ పైనచెప్పిన దానములకు ప్రత్యేకఫలమును జెప్పఁబడును. గోదానమునకు గౌరీవల్లభలోకమును, వృషోత్సర్గముచేత విష్ణులోకమును, తిలదానముచేత త్రియామానాథలోకమును, అపూపములచేత అహస్కరలోకమును, అన్నదానముచేత అమరలోకమును, పరమాన్న దానముచేత ధ్రువలోకమును, కంబళాది దానములచేత కృష్ణవర్త్మ లోకమును, వస్త్రదానముచేత బ్రహ్మలోకమునున్న బొందుదురు. ఈలోకములన్నియు విష్ణుదేవాంశభూతములుగాన సమన్వయము. మాఘస్నానరతులై యీదానముల నాచరించువా రీ లోకములను బొంది సుఖింతురు. ఈ మాఘ వ్రతముకంటె పవిత్రమయినదియు, పాపనాశనమయినదియు నయిన వ్రతము మఱియొకటిలేదు.

శ్లో॥ ఏతద్వ్రతవరం పథ్యం మునీనామపినౌకసాం । ఏతన్మాఘవ్రతంతద్వత్సుపథ్యం గృహమేధినామ్ ।

తా॥ ఈ మాఘవ్రతము అరణ్యవాసులయిన మునులకు మిక్కిలి అనుకూలమైనది. ఈ మాఘవ్రతము అట్లుగానే గృహస్థులయిన గృహస్థులకును మిక్కిలి ఉపయోగము. (పంథేనోపేతం పథ్యం) అనఁగా మార్గమునతప్పనిది పథ్యమనఁబడును. (అనఁగా ముక్తికి తిన్ననిమార్గమని అర్థము)

శ్లో॥ శీతార్తోవా జడోవాపి జరఠోవా రుజాన్వితః । వటుర్వా బాలకోవాపి నారీ శూద్రాదయోపివా। నకుర్వంతిముదామాఘే ప్రాతర్వారిగాహనం । చండాలయోనౌ తేయాంతి తతః పుల్కసయోనిషు । రజకేషు కులాలేషు తిలఘాతకయోనిషు । శ్వగర్దభోష్ట్రజంబూక వృకవ్యాఘ్రాఖుయోనిషు । ఉత్పద్యపశ్చాత్తైపశాచ యోని మాసాద్య దుఃఖితాః ।

తా॥ చలికి భయపడువాఁడుగాని, ఉన్మత్తుఁడుగాని, ముసలివాఁడుగాని, రోగపీడితుఁడుగాని, బ్రహ్మచారిగాని, బాలుడుగాని, స్త్రీగాని, శూద్రాదులుగాని మాఘజలమందు మునుఁగనివారు దేహాంతమందు చండాలురై తరువాత పుల్కసయోనులయందు పుట్టి తరువాత రజ (చాకలి) కులమందును, కులాలుల (కుమ్మరి) యందును, తిలఘాతకుల (తెలుకుల) యందును జన్మించి, తరువాత కుక్కలయందును, గాడిదలయందును, ఒంటెలయందును, నక్కలయందును, తోడేళ్లయందును, వ్యాఘ్రములయం

దును, మూషకములయందును జన్మించి పిదప పిశాచయోనులయందు జన్మించి పిశాచములై దుఃఖించుచుందురు.

శ్లో॥ తస్మాన్మాఘేబహిర్వారి స్నావగాహంతియేనరాః । చండాలాస్తేకివిష్ఠేయాః శ్వపచాః పశుఘాతుకాః । మాఘవ్రతవిఘాతేన సదా దుస్నావసంకరాః ।

తా॥ కావున ఎవ్వరు మాఘంబున బహిర్జలమందు స్నానమాచరించరో వారు చండాలురును, కుక్కమాంసమును తినువారును, పశుఘాతకులును నగుదురు. మాఘవ్రతఘాతకు లెల్లప్పుడును అనివార్యావ్యసంకరులు నగుదురు.

శ్లో॥ యేమానువ్రతభేత్తారో వర్జయేదంత్యజం యథా । శ్వపచోపివరిష్ఠోథా న్మానువ్రతపరోయది । వరిష్ఠోవ్రతహీనశ్చేత్ శ్వపచాదపిచాధమః । బహునాకింప్రలాపేన శృణుధ్వంత్రిదశాలయాః ।

తా॥ మాఘవ్రతచ్ఛేదకుని చండాలునివలె త్యజించవలెను. ఓ దేవతలారా! అతిప్రసంగముతో నేమి ప్రయోజనమున్నది. వినుఁడు. చండాలుఁడైనను మాఘవ్రతపరాయణుఁడాయెనేని వాఁడు శ్రేష్ఠుఁడేయగును. శ్రేష్ఠుఁడయినను మాఘవ్రతహీనుఁడైనయెడల వాఁడు చండాలునికంటెను తక్కువవాఁడగును.

శ్లో॥ ఏవం వేదార్థతో జ్ఞాత్వా మాఘస్నానం శుచివ్రతం । యఏవంవేదయఃకుర్యా త్ససర్వాణం ప్రపద్యతే ।

తా॥ యిట్లు యెవ్వఁడు వేదార్థమువలన మాఘవ్రతము పవిత్రమైనదని తెలిసికొనునో, యెవ్వఁడు ఆచరించునో వాఁడును మోక్షమును బొందును.

శ్లో॥ అనుష్ఠితం యదస్మాభి ర్మాఘమాసవ్రతం సురాః । యుష్మాకమిత్థమస్మాభిః కథితంవ్రతముత్తమమ్ ।

తా॥ ఓ దేవతలారా! మాచే నాచరింపబడినది మాఘవ్రతము. దీని నిట్లు మీకు చెప్పితిమి.

గృత్సమదః॥ శ్లో॥ ఇతితేషాంవచశ్శ్రుత్వా దేవాస్తస్మిన్ జలే ముదా । స్నాన్నః సర్వార్థకామాస్తే వరయోధింప్రాపురోజసా ।

తా॥ గృత్సమదుఁడు చెప్పుచున్నాఁడు- ఓ జహ్నూ! యిట్లు ఖేచరవాక్యములను దేవతలు విని యిష్టార్థకాములై సముద్రమందు స్నానమాచరించిరి.

శ్లో॥ తేత్రాలోకయామాసుర్విష్ణుమాద్యం జగద్గురుం । చతుర్భుజం కోమలాంగం శంఖచక్రగదాంబుజమ్ ॥ దధానం పీతవసనం కంబుకంఠం కిరీటినం । హారగ్రైవేయకటకైర్వైజయంత్యా విరాజితమ్ ॥ స్మితం సువదనం విష్ణుం పంకేజదళలోచనం । గూఢగుల్ఫం కూర్మపాదం చారుజంఘోరుభాస్వరమ్ ॥ నాభీసరోజవిలసత్త్రివళిభిర్విరాజితం । మునిభిస్సనకాద్యైశ్చ స్తూయమానం శుచిస్మితమ్ ॥ నీలజీమూతసంకాశం కౌస్తుభాభరణోదరం । సునాసం సుకపోలంచ లలాటతిలకోజ్జ్వలమ్ ॥ సర్వాభరణసంయుక్తం లసన్మకరకుండలం । సశ్రీకం త్రిదశాస్తస్మై ప్రణేముః పరమాత్మనే । కృతాంజలిపుటాస్సర్వే తుష్టువుః పురుషోత్తమమ్ ॥

తా॥ పిమ్మట దేవతలిట్లు మాఘస్నానమాచరించి అచ్చటనే ప్రపంచమునకు అధ్యుఁడును, జగద్గురువును, నాలుగుచేతులు గలవాఁడును, మృదువులయిన అంగములు గలవాఁడును, శంఖమును, చక్రమును, గదను, పద్మమును ధరించినవాఁడును, పీతాంబరుఁడును, శంఖమువంటి కంఠముగలవాఁడును, కిరీటియు, ముత్యాల హారములచేతను, కంఠభూషణములచేతను, కంకణములచేతను, వైజయంతిచేతను, ప్రకాశించువాఁడును, చిఱునవ్వుముఖముగలవాఁడును, సర్వవ్యాపకుఁడును, పద్మపత్రాయత లోచనుఁడును, గూఢములయిన చీలమండలు గలవాఁడును, కూర్మమువంటి పాదములు గలవాఁడును, సుందరములయిన పిక్కలు తొడలుగలవాఁడును, నాభిపద్మకరి ప్రకాశమానమౌ ముడతలుంగలిగిన శోభితుఁడును, తెల్లని నగు మొగము గలవాఁడును, నల్లని మేఘముయొక్క కాంతివంటి కాంతిగలవాఁడును, వక్షమందు కౌస్తుభమణిగలవాఁడును, శుభకరమగు ముక్కుగలవాఁడును, మంచి చెక్కిళ్లుగలవాఁడును, సుందరలలాటతిలకుఁడును, మకరకుండల గ్రైవేయ కంకణములచే ప్రకాశితుఁడును, సర్వాభరణభూషితుఁడును, సనకాది ముని సేవితుఁడును, లక్ష్మీసహితుఁడును నయిన శ్రీ మహావిష్ణువును జూచిరి. పిమ్మట నమస్కరించి అంజలిబద్ధులై స్తోత్రము జేసిరి. వక్ష్యమాణాధ్యాయమందు స్తోత్రము చెప్పఁబడును

ఇతి నవమోధ్యాయస్సం॥ పూ॥

## —♦ అథ దశమోధ్యాయ ప్రారంభః ♦—

దేవా ఊచుః ॥ శ్లో॥ వినుతనిఖిల గురుం త్వాం వేదవేద్యం విధిజ్ఞాః వినుతనిగమ మార్గం నైవజానంతిమూఢాః। గ్రహపతిశశిపూర్వైశ్చైవం బ్రహ్మవైరించివ్యాసైః స్తుతచరణయుగం తే దర్శనంనోద్యజాతిమ్ ॥

తా॥ దేవతలు భగవంతుని స్తుతించుచున్నారు- ఓ నిగమగోచరా! సమస్తమయినవారికి గురువును, వేదవేద్యుండవును, నిగమాలయుండవును నయిన నిన్ను విధిజ్ఞులు తెలిసికొనుచున్నారు- మూఢులు తెలిసికొన లేరు- సూర్యాగ్రహ బ్రహ్మేంద్రలోకస్థులచేత స్తుతించబడుచుండెడు నీ చరణయుగళము మా కిప్పుడు ప్రత్యక్షమయినది.

శ్లో॥ దేవానంద సుధాబ్ధివృద్ధి శశినే స్వర్గాపవర్గాయతే। బ్రహ్మేంద్రామరపాలకాయవిదుషే వైకుంఠవాసాయతే॥ భూతావాసవాసస్రష్టృషు సదా వాసాయభాసాయతే। సచ్చిద్రూపధరాయ సత్యవచసే దేవేశ తుభ్యంనమః ॥

తా॥ దేవానందసముద్రవృద్ధిచంద్రుండవును, స్వర్గమోక్షప్రదుండవును, బ్రహ్మేంద్రాదుల సృష్టిని జేయువాండవును, వైకుంఠమందు నివసించువాండవును, భూతావాసనివాసస్రష్టులయం దుండువాండవును, సదా ప్రకాశించువాండవును, సచ్చిద్రూపమును ధరించువాండవును, సత్యవాక్యుండవును నయిన నీకు నమస్కారము

శ్లో॥ సృష్ట్వా సర్వజగత్సుబాధ మధికం ధాతా భవాన్పాలనే। విష్ణుస్తల్లయకారణాయ భగవాన్ శర్వోన్యథాత్మాస్వయం। సంపూర్ణాంబుసమావృతేచనిగమై సంస్తూయమానోభవాన్। శేషః పత్రిపుటేశయానఅధిక స్సర్గస్తథాపూర్వవత్ ॥

తా॥ నీవు సర్వమును సృష్టించునప్పుడు బ్రహ్మవును, సృష్టించి జగత్తును పోషించునప్పుడు విష్ణువును, పోషితజగత్తును సంహరించునప్పుడు రుద్రుండవును అగుచున్నావు- సర్వము నశించి ఉదకపూరిత మయినప్పుడు నీవొక్కండవే మిగిలినవాండవై వేదస్తుత్యుండవగుచు మఱ్ఱియాకుమీద శయనింతువు- తిరిగి పూర్వమువలె నేసృష్టింతువు, సర్వజగత్తునకు కర్తవు నీవే.

శ్లో॥ పురాకృత్వా కృత్యాశీధుం శిథిలికారవిపులం వివద్భంతే

విశ్వే వివిధశక్తైనైశ్చాతిగురుభిః । వరానందం లబ్ధ్వా పరమపదపీం పద్మ భవనో మురారే త్వింద్రాద్యా నవిదురమలం తే పదయుగమ్ ।

తా॥ ఈజగత్తు పూర్వకాలంబున బ్రహ్మచే సృజించబడి పిమ్మట సంహరింపబడుచుండె మఱియు నీజగత్తునందును ప్రజలయొక్క నానావిధ సౌకర్యములును, నానావిధ సుఖదుఃఖములను పరిపాలించుచుండు ఆ పరమాత్మవయిన నీకువప్ప సృజింపబడిన గొప్ప మహిమగలిగిన బ్రహ్మకు గాని, పోషింపబడుచుండు విష్ణువునకు గాని, లేక యింద్రాదులకు గాని, యీ జగత్తునందు పరమపవిత్రస్థానంబయిన భగవత్పద ద్వంద్వమును తెలిసికొనుట కష్టసాధ్యమని తాత్పర్యము.

శ్లో॥ చతుస్త్రింశాధిక్యైశ్చతురధిక చైతన్యనివహై ర్వ్యపాకుర్వన్ కర్మప్రకృతిగుణభేదిష్వనిఖిలం। నిషేధాష్టత్యాగగ్రహణపరచేష్టాభిరఖిలం తథా చైకం త్వాం తే నవిదురనయామోహమతయః ।

తా॥ కర్మప్రకృతి గుణభేదములుగల సమస్తచేతనజాతమును సృజించు అఖిల నిషేధమును విడచి యిష్టమును గ్రహించునట్టి అద్వితీయుఁడవయిన నిన్ను (సామాన్యులు) తెలిసికొనలేరని మామతము.

శ్లో॥ భవానేకో లోక స్తవ సఖిలరోమాళి వివరే ష్వనేకా బ్రహ్మాండాః పరమపరమాణుయివ । పరివర్తంతే వ్యస్మిన్ నిలయవిధయ స్త్వాం నచవిదుర్విమిశ్రాస్తే సర్వే రజసిరజసా మందమతయః ।

తా॥ ఈప్రపంచమంతయునీవే. నీయొక్క రోమబిలములందు అనేక బ్రహ్మాండములు సూక్ష్మపరమాణువులవలె పరివర్తించుచున్నవి గదా. ఇట్లుండియు గుణమిశ్రులై రజోగుణబద్ధులై మందమతులైనవారందఱు ఆ పరమాత్మ స్వరూపమును తెలిసికొనలేరని తాత్పర్యము.

శ్లో॥ మహామాయా మాదౌ సృజసి భగవన్ తత్త్వనిచయాన్ మనశ్చిత్తాదీన్వై గుణగణనవ ప్రస్తుతవరాన్ । తతస్సద్జీవాత్మ ద్వితయ వరరూపేణ తనుషు భవాన్ లాస్యత్స్వేహం నటయతిసుమాత్రాధికధరః ।

తా॥ ఓ భగవంతుఁడా! నీవు ముందుగా మాయను సృష్టించి, తరువాత తత్త్వములను, చిత్తాదులను, గుణములను సృష్టించి, దేహములను సృష్టించి జీవాత్మయుపర

మూర్తియువై ఆత్మయందు ప్రవేశించి సూత్రధారివై నాట్యోత్సాహమును జేయుచున్నావని తాత్పర్యము.

శ్లో॥ విధిస్త్వన్నాభిస్థః కమలభవనస్సన్ తవవిభో। నజానన్నా కాంతః ప్రతివదపదాధారకజలధౌ। విమృగ్యన్ కోధారః కమలధరకః కోహ మితిసః స్వయంభూశ్చింతాం తేతవ ఇతివచః ఖేచనుగతిమ్ ॥

తా॥ బ్రహ్మ నీయొక్క నాభికమలమందు జన్మించి సముద్రమందు తన జన్మ స్థానమును తెలిసికొనక పద్మనాళమందు ప్రవేశించి వెదకుచు నా కాధారమేమిటి. నే నెవ్వఁడను అను చింతనొందెను. తరువాత ఆకాశమందు తప అను మాట వినఁబడెను. కనుక తపస్సు శ్రేష్ఠమని తాత్పర్యము.

శ్లో॥ శతస్త్వాసాహస్రం సమధికనాభిస్థకమలే తవాధారంజ్ఞాత్వా హరిరితివిరించి స్తవనుతిం। విధత్తే త్వంవిష్ణో మశకకరిభూతం స్థిరచయం విసర్గాద్యవర్తన్ త్వంవిహాశమతనోషీ త్వద్బలతః ॥

తా॥ పిమ్మట ఆమాటను విని నాభికమలమందే సహస్రసంవత్సరములు తప మాచరించి తన కాధారము హరియని తెలిసికొని విష్ణువును స్తుతించి మీ ప్రసాదమువలన హస్తిమశకభూతమయిన ప్రపంచము సృష్టించఁబడెనని తాత్పర్యము.

శ్లో॥ సహస్రాక్షోయావత్సకలిత సహస్రాంతవదనః సహస్రాంఘ్రి ర్బాహు స్సకలసహస్రయుతగుణః। సహస్రాకారై స్త్వం సకల దివిభూ రాదివిపులం సమావృత్యాభ్యాసీ త్యధికదశకాంగుష్ఠమపరమ్ ॥

తా॥ సహస్ర నేత్రుఁడవును, సహస్ర ముఖుఁడవును, సహస్ర పాదుఁడవును, సహస్రబాహుఁడవును సర్వగుణ సాహస్రవంతుఁడవును నై సహస్రాకారములచేత భూమ్యాది సమస్తలోకములను వ్యాపించి పదిఅంగుళము లధికముగానుండెను. పంచదశాధ్యాయమం దీ యర్థము విశదముగా వ్రాయఁబడును.

శ్లో॥ హరే కుక్షౌ లోకాస్తవవిహిత సప్తద్వయపరాః ప్రవర్తంతే కోణే క్వచిదఖిలభూతైశ్చసహితాః। విజానంతస్సర్వే న విదురపరం త్వాం తవబలాం స్వతంత్రం తేశౌర్యం జననమరణానేకకలితః ॥

తా॥ ఓ హరీ! నీ కుక్షియందు ఒక భాగమందే యీ పదునాలుగు భువనములు అఖిల భూతములతో సహా యుండి అచ్చటనే జన్మించుచు మృతినొందుచుండెను. గనుక

తెలిసినవారువలె యుండి నిన్ను తెలిసికొనలేరు. నీవలెనూ స్వతంత్రులు నీకొఱ్ఱలు స్వతంత్రులని తాత్పర్యము

శ్లో॥ హారేకేచి త్త్వత్తః పరమపదవిజ్ఞార్థనిగమా న్విబుధ్వాకూర్మాద్యాః భగవతి విరించిప్రభృతయః । భజంతి త్వామేవ ప్రకృతిరహితా స్సత్వమతిభిః ప్రపద్యంతే త్వాంతే పరమపురుషం పావనధరాః ।

తా॥ ఓ హరీ! పవిత్రులయిన గరుడ విరించ్యగ్నిరాదులు కొందఱు నీవలన పరమపదలబ్ధసాధన మార్గములను విని నిన్నే సేవించి, మాయాతీతులై, సత్యవతులై, పరమపురుషుడవును, పరాత్పరుడవును, పరంజ్యోతివిని, పరబ్రహ్మవును నయిన నిన్ను పొందుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ ప్రహ్లాదోద్ధవశౌనకధ్రువవరా రుక్మాంగదో నారదః । హాస్తిం ద్రిశ్చపరాశరప్రభృతయో యే స్వేపసిష్ఠాదయః । త్వద్భక్త్యావరమాయా రా ర్తిరహితం తేజోమయంతే పదం । తస్మాదద్యననామ తే పదయుగం దేవేశసౌఖ్యప్రదమ్ ।

తా॥ ధ్రువ నారద దార్జున ప్రహ్లాదోద్ధవ శౌనక విభీషణ వసిష్ఠ పరాశర గజేంద్ర వ్యాస సాంబరీష శుక భీష్మ రుక్మాంగదాంజనేయ బలి పుండరీకాదులు త్వత్పాద భక్తిచేత దుఃఖరహితమును, తేజోమయమును, శాశ్వతమయిన నీస్థానమును పొందిరి గనుక ఓ దేవ! సౌఖ్యప్రదము లయిన నీ పాదములకు నమస్కార మాచరించెదనని తాత్పర్యము

శ్లో॥ త్వంవిష్ణు స్త్వందినేశ స్త్వమసి సురపతి స్త్వం విధాతా భవ స్త్వం। త్వంసోమ స్త్వంచసారి స్త్వమసిహుతవహ స్త్వంమఖ స్త్వంఖగాశ్చ। త్వంశైలా స్త్వంద్రుమాద్యా స్త్వమపిచకకుభ స్త్వంసముద్ర స్తథాన్య । త్త్వత్సర్వం త్వత్స్వరూపం జగదఖిలమిదం నైవచాన్యంహరేసి ।

తా॥ ఓ దేవా! నీవే విష్ణువు, నీవే సూర్యుఁడవు, నీవే ఇంద్రుఁడవు, నీవే బ్రహ్మవు, నీవే రుద్రుఁడవు, నీవే చంద్రుఁడవు, నీవే యముఁడవు, నీవే అగ్నిహోత్రుఁడవు, నీవే యజ్ఞము, నీవే పక్షులు, నీవే పర్వతములు, నీవే వృక్షాదులు, నీవే దిక్కులు, నీవే సముద్రములు, ఇది అది యననేమి, జగత్తు అంతయు మీస్వరూపమే, ఇంతకంటె వేఱుగా యేమియు లేదని తాత్పర్యము.

శ్లో॥ నమస్స్వామోభూమ్నా మునిమతిగుహాంతస్థమనిశం తపోభిర్దుశ్చారైః స్త్వత్పదయుగధ్యానకుశలైః । నిబద్ధస్త్వం తస్మిన్ హృదయకమలే సంవిమలే బహిశ్చాంతర్వ్యాప్తం పరమపురుషం దేవసతతమ్ ।

తా॥ ఓ దేవా! నీపాదారవిందధ్యాన కుశలులయిన మానవులచేత దుస్తరతపస్సులచేత హృదయమందు కట్టబడినటువంటివిన్ని, మునిమానసనివాసుఁడవైనటువంటివిన్ని లోపల వెలుపల వ్యాపించినటువంటివిన్ని, పరమపురుషుఁడవైనటువంటి ఓ దేవా! నీకు నిరంతర మనేక నమస్కారములు.

శ్లో॥ పురా విష్ణో చాన్యే భవజలధిముత్తీర్యమధికం మునీంద్రా యోగీంద్రాః స్వభవ విరించ్యాదిదివిజాః । త్వదీయాభక్త్యా స్వప్లవ్యఖిల సుఖనావోపరి విభో తితీర్ణాస్తే నూనం తవపదముపాజగ్మురనఘాః ।

తా॥ ఓ శ్రీమన్నారాయణా! పూర్వమందు మునీంద్రులు, యోగీంద్రులు, శంకర విధాత ఇంద్రాదులు మొదలగు అన్యులును భవసాగరమును దాటుకొనుటకు అశేష సుఖదాయకమయిన త్వదీయ భక్తియను నావ గల్పించుకొని సంసారసముద్రమును దాటి నీ పాదసన్నిధిని జేరిరని తాత్పర్యము.

శ్లో॥ దురాచారో పాపో ఽహ్యహరహని పాపాంశ్చ వివిధాన్ । అజామిళః పూర్వం స్వతనుభవ మోహేన భగవన్ । సవక్రోక్త్యా కాలే తవ విభవనామ్నా పరమగతిం తవాపిత్వం నామ ప్రతిపదసుఖం తే దిశమితి ।

తా॥ పూర్వమందు అజామీళుఁడు దురాచారవంతుఁడై ప్రతిదినము అనేక పాపములను జేయుచు అంత్యకాలమందు తన కుమారునియందయిన మోహముచేత తొట్రుపాటుతో గూడిన వాక్కుచేత నీ నామమును (నారాయణ అను నామమును) ఉచ్చరించి అనంత సుఖదాయకమయిన మోక్షపదమును బొందెను గాన ఓ భగవంతుఁడా! నీనామమహిమను వర్ణింప నెవ్వరితరము

శ్లో॥ స్వతంత్రోద్భూతాయా సకలగుణధారా గుణగణాలావిధిజ్ఞా వేదజ్ఞావిహిత పరశాస్త్రార్థకుశలా । హరే సారునాగ్నేః సకలగతిదానేషు నిపుణా త్వదీయం యద్వ్యర్ణద్వయపరమనామ్నా స్తమహిమా ।

తా॥ శ్రీమన్నారాయణా! స్వతంత్రోద్భూతయైనటువంటివిన్ని, సమస్తగుణధారయైనటువంటివిన్ని, గుణజాలవతిన్ని, విధిజ్ఞయును, వేదజ్ఞయును, శాస్త్రార్థ ప్రవీ

జయమునయిన పార్వతి నీయొక్క అక్షరద్వయాత్మకమయిన రామనామోచ్చారణచేత (రామనామమహిమచేత) మహిమనుపొంది కలియందు సుగతి నాయందు ప్రియురాలాయెను.

శ్లో॥ అనంతానంతేశ స్తవనుతిముపాశ్రిత్య బహుధా తదాసీత్తే తత్పరవరమణిసహస్రాంతవదనః । తథైవానంతారి స్తవసిభగవం స్త్వాం యుగశతం । నశక్తః కృత్వా వశ్చాద్వహతి తవమాహాత్మ్యమనిశమ్ ।

తా॥ ఓ అనంతా! పూర్వము ఆదిశేషుఁడు అనేకములుగా సహస్రముఖముల తోను నిన్ను స్తుతించి నీకు శయనమాయెను అట్లే శేషశత్రువయిన గరుత్మంతుఁడు నూఱు యుగములు తపస్సుచేత నిన్ను స్తుతించి నీకు వాహనమాయెను.

శ్లో॥ నమామితే చారుచరిత్రపావనం పదంసురేశాఖిలదుఃఖహారకం అస్మాన్ సమాలోకయనిర్జరాన్విభో నిశాచరైర్నిర్జితదుఃఖమానసాన్ ।

తా॥ ఓ దేవేశా! చారుచరిత్రలచేత పవిత్రమయినదియు, అశేష దుఃఖనివారకమును నయిన నీపాదములకు వందనములు చేయుచున్నాము. మేము దేవతలము. యుద్ధమందు రాక్షసులచేత వోడిపోయి దుఃఖించుచున్నారము. మమ్ములను దయతో జూడుము

శ్లో॥ ఇదానీ మింద్రలోకేతు ఇంద్రోనాస్తి సురేశ్వరః । కుత్ర యాతీతినశ్శక్రః నవిద్మోవయమత్రహి ।

తా॥ ఓదేవా! వినుము. ఇప్పు డింద్రలోకమం దింద్రుఁడులేడు. మాదేవేంద్రుఁ డెచ్చటనున్నాఁడో మాకు తెలియదు.

శ్లో॥ నాకేనిశాచరైర్యుద్ధ మస్మాకంజాతమత్రతు । యుద్ధేపరాజితాస్త్వాంతు శరణ్యంశరణాగతాః । ఇంద్రంవాన్యథవాచాన్యం సమర్థం స్వర్గపాలనే । పాహ్యస్మాన్ ప్రేషయిత్వాత్వం దేవదేవగణానుగాన్ ।

తా॥ స్వర్గమందు రాక్షసులతో మాకు యుద్ధము సంప్రాప్తమయినది. అందులో మేము పరాజితులమై సర్వలోక రక్షకుఁడవయిన నిన్ను ఆశ్రయించితిమి గాన ఇంద్రునిగాని, మఱియొకనిగాని సమర్థుని స్వర్గపాలనమునకుబంపి నీ అనుచరులమైన మమ్ము రక్షించుము దేవదేవా.

గృత్సమదః । శ్లో॥ ఇతిదేవైస్స్తుతో విష్ణుః స్మృత్వాతేషాం ప్రయోజనం । విదితార్థస్తతో దేవాన్ ప్రసన్నః ప్రాహతాన్మునే ।

తా॥ ఇట్లు దేవతలచేత స్తుతించబడిన విష్ణుమూర్తి వారి కార్యమును తెలిసికొని తెలిసిన వృత్తాంతముగలవాఁడై ప్రసన్నుఁడై వారితో నిట్లనియె

శ్లో॥ యస్మాదత్రాగతా దేవా శృణుధ్వమనుశాసనం । వజ్రపాణిస్సురశ్రేష్ఠః శాపేనమహతా సురాః । పపాత పద్మశైలస్య గుహాయాం గర్దభాననః ॥

తా॥ ఓ దేవతలారా! మీరు వచ్చిన పనిగూర్చి చెప్పెదను వినుఁడు. ఇంద్రుఁడు గాడిదముఖముగలవాఁడై బ్రాహ్మణశాపహతుఁడై పద్మావతి గుహయందు పడియున్నాఁడు.

శ్లో॥ మిత్రమిందుమతీంరాత్రౌ సంభూయగనిర్గతం । దృష్ట్వా మునిశ్శశాపేత్థం శక్తిస్స్వర్గాయనోభవేత్ । శక్తిహీనఃఖరగ్రీవో లజ్జయా నిర్జనేవనే । గుహాయాంపరితప్యాసీద్దుఃఖేనమహతా సురాః ॥

తా॥ ఇంద్రునికి కలిగిన శాపమును చెప్పెదను వినుఁడు. మీ యింద్రుఁడు రాత్రి మిత్రవిందుని భార్యతో సంభోగించి బయలుదేరెను. ఇంతలో ముని చూచి గాడిద ముఖముగలవాఁడవై స్వర్గమునకు పోజాలనివాఁడవగుమని శపించెను. పిమ్మటయింద్రుఁడు గాడిదరూపమునబొంది శక్తిహీనుఁడై సిగ్గుచేతను దుఃఖముచేతను పద్మావతి గుహయందు దాగెను

శ్లో॥ పద్మాద్రిః పశ్చిమేదేశే గోకర్ణస్యోత్తరే తథా । షడ్వింశద్యోజనే దూరే పర్వతే నరశిలోచ్చయః । తస్మిన్ యామ్యే గుహాయాంతు ఖరగ్రీవశ్శచీపతిః । తృణశాకఫలాహారః కృచ్ఛ్రంచండరవేణచ । యూయంగచ్ఛథదేవేంద్రం పద్మాద్రితటవాసినమ్ ॥

తా॥ ఆ పద్మాద్రియు పశ్చిమదేశమందు గోకర్ణక్షేత్రమునకు ఉత్తరమందు షడ్వింశ (౨౬) ఆమడల దూరమందున్నది. ఆపర్వతమందు దక్షిణపైపున నొకగుహయందు గాడిదమెడగలవాఁడై తృణశాకఫలాహారుఁడై తీక్ష్ణమైన యెండలో ఇంద్రుఁడున్నాఁడుగాన మీరు ఆయింద్రునియొద్దకు వెళ్లుఁడు.

శ్లో॥ ఉపాయంపరమంవక్ష్యే తస్యపాపవిశుద్ధయే తేనోపాయేన దేవేంద్రస్స్వశక్తిస్సుముఖస్సురాః । యుష్మాన్త్రిదివంగత్వా పాలయత్యఖిలాన్సురాన్ ॥

తా॥ అట్టి యింద్రుని దోషనివారణకు ఉపాయమును జెప్పెదను వినుఁడు- ఆ యుపాయముచేత యింద్రుఁడు శక్తిగలవాఁడై గాడిదముఖము పోయి యెప్పటిముఖముగలవాఁడై మీతోగూడా స్వర్గమునకువచ్చి మిత్రులనంతోను పాలించగలఁడు

శ్లో॥ మాఘే మకరగేసూర్యే కించిదభ్యుదితే రవౌ। తుంగభద్రాజలేదేవ మానయిత్వా శచీపతిమ్ ॥ కారయధ్వం సురశ్రేష్ఠం స్నానం మాఘజలే సురాః। తేనశక్తిర్భవేత్తస్య ముఖం తత్సుముఖం భవేత్ ॥

తా॥ మాఘమాస మకరార్కోదయమందు మీరు యింద్రుని ఇట్టి తీసికొనివెళ్లి తుంగభద్రా నదీజలమందు మాఘస్నానము జేయించినయెడల ఆ యింద్రుఁడు శక్తిగలవాఁడగును- ఆముఖమును సుముఖమగును.

శ్లో॥ ఇతిదేవా హరేర్వాక్యం శ్రుత్వా విస్మితలాంఛనాః। పునరూచుస్తమాహాత్మ్యం విష్ణుంచ వైదివౌకసః ॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! యిట్లుపలికిన విష్ణుమూర్తియొక్క వాక్యమును విని దేవతలు ఆశ్చర్యముచెంది తిరిగివిష్ణుమూర్తితో నిట్లనిరి.

శ్లో॥ ఖరగ్రీవస్య శక్రస్య శక్తిహీనస్య మాధవ। మాఘేస్మిన్ స్నానమాత్రేణ సుముఖత్వంకథంభవేత్ ॥

తా॥ ఓ మాధవా! మాఘస్నానముచేత గాడిదమెడగల దేవేంద్రునకు స్వర్గలోకమునశక్తి యెట్లు గలుగును.

శ్లో॥ శ్రుత్వా తేషాంవచోవిష్ణు ర్భగవాన్ ప్రత్యభాషత ॥

తా॥ దేవతలమాట విని భగవంతుఁడగు విష్ణుమూర్తి తిరిగి పలుకుచున్నాఁడు.

శ్రీభగవానుః॥ శ్లో॥ కిమాశ్చర్య మిదం దేవాః పురా గాధితనూభవః। భువఃప్రదక్షిణం కుర్వన్ గంగాతీరే మహావనే। తత్రగ్రావా భవత్తస్య గంధర్వస్త్రీనిషేవణాత్ ॥

తా॥ ఓ దేవతలారా! మాఘస్నాన మహిమచేత యింద్రుని గాడిదముఖము పోవుటే ఆశ్చర్యమా? ఇంతకంటే ఆశ్చర్యకరమయిన కథను జెప్పెదను వినుఁడు- పూర్వకాలమందు విశ్వామిత్రుఁడు భూమికి ప్రదక్షిణము జేయుచు గంగాతీరవనమునకువచ్చి

అచ్చట నొక గంధర్వస్త్రీతో సంభోగించి తద్దోషముచేత వానరముఖుఁడై మాఘస్నానముచేత పూర్వరూపుఁడాయెను. ఆ కథను సవిస్తరముగా యిప్పుడు జెప్పెదను వినుడు.

శ్లో॥ గంధర్వాః ఖేచరా స్తస్మిన్ మాఘే గంగాజలే ముదా। సభార్యా స్ససుతాః పుణ్యాః ప్రాతస్స్నాత్వా శుచివ్రతాః॥ మామభ్య ర్చ్యవిధానేన మాధవం మాఘవల్లభం। శ్రుత్వాతే మాఘమాహాత్మ్యం సంతుష్టా స్తే పరస్పరం। పునః ఖమావు ర్గంధర్వాః సభార్యా స్ససుతా స్సురాః॥

తా॥ ఆకాశమార్గ సంచారులయిన గంధర్వులు గంగాతీరమునకు వచ్చి దారాపుత్రాదులతో గంగాజలమందు మాఘస్నానమాచరించి మాఘవల్లభుఁడైన నన్ను విధ్యుక్తముగా బూజించి మాఘమాస వైభవమును విని వొకరిలో నొకరు చెప్పుకొనుచు సంతోషవంతులై తిరిగి దారాపుత్రాదులతో గూడ ఆకాశమార్గమున వెళ్లిరి.

శ్లో॥ గంధర్వస్యస్త్రియా కాచిత్ నకుర్యాన్మాఘమజ్జనం। బలాత్పతినా యాతా గంగాతీరం సుఖప్రియా॥ గంధర్వవల్లభా తస్మిన్ శీతభీతా నమజ్జతి। స్నాత్వా సర్వే యయుర్లోకం సంతుష్టా స్తే పరస్పరం॥ మాఘేస్మిన్ స్నానహీనాయా శ్శక్తిస్సద్యో వినశ్యతి। విచారేణ వినా తాంతు గంధర్వా జాతసంభ్రమాః॥

తా॥ ఈగంధర్వులలో నొక స్త్రీ భర్తతో బలవంతముగా గంగాతీరమునకు వచ్చిన్ని శీతబాధకు భయపడి మాఘస్నానమును విడిచి పెట్టినదాయెను. ఆస్త్రీ మాఘస్నానమాచరించని దోషముచేత నామెకు ఆకాశ గమనశక్తి నశించెను దీనిని విచారించక మిగిలిన గంధర్వులు సంతోషముతో స్నానమాడి తమ లోకమునకు వెళ్ళిరి ఈస్త్రీ తమతో నున్నదా లేదా యను విచారణము వారికిగలుగలేదు.

శ్లో॥ శక్తిహీనాభవత్తత్ర నారీ గంధర్వవల్లభా। గంగాతీరవనే ఘోరే హ్యేకాకీ సంచరన్నురాః। మార్గం ధురంధరం దుఃఖా త్స్వాత చారీ శుభాననా॥

తా॥ ఇట్లు గంధర్వులందఱు వెళ్ళినంతలో మాఘస్నానహీనురాలైన గంధర్వస్త్రీ ఆకాశగమనమునకు శక్తిలేనిదై గంగాతీరమందొక ఘోరమైన వనమందు వంటరిగా తిరుగుచు దుఃఖించుచుండెను.

శ్లో॥ తదా గాధిసుతోయాతః స్నాతుం భాగీరథీ జలే । తతే తస్మిన్ మహారణ్యే నిర్జనే నవయూషిణీం । ఏకాకీం కామసంతప్తః ప్రాహేదం గాధినందనః ।

తా॥ యింతలో గంగా స్నానమునకై విశ్వామిత్రుఁ డచ్చటికి వచ్చెను. అప్పుడు జనశూన్యమయిన మహారణ్యంబున నవమోహనాంగియైన యొక గంధర్వస్త్రీ ఏకాంగియై కామోద్రేకముగా నుండెను. అప్పుడు విశ్వామిత్రుఁడును కామపీడితుఁడై ఆ గంధర్వస్త్రీతో నిట్లనియె.

శ్లో॥ విజనేస్మిన్వనే ఘోరే కాసితే రక్షకఃకుతః । త్వామహం పాలయేభద్రే మాభయం తవ కోమలే ।

తా॥ ఓ కామినీ! నీ వెవ్వతెవు ఈనిర్జనారణ్యమం దుంటున్నావు. నీకు రక్షకుఁ డెచ్చటనున్నాఁడు. నిన్ను నేను కాపాడెదను, నీకేమియు భయము లేదు.

శ్లో॥ అనహా స్త్రత్రవేగేన కామాంధో స్తమతిర్మునిః । తతస్తాం ప్రతిజగ్రాహ బాహుభ్యాం కన్యకాంతదా ।

తా॥ యిట్లు పలుకుచు కామాంధుఁడగుటచేత కామవేగమును సహించలేక మతిహీనుఁడై త్వరగా తన బాహువులచేత ఆ గంధర్వభార్యను బలవంతముగా పట్టుకొని దానితో సంభోగించెను.

శ్లో॥ విశ్వామిత్రోపి తామిత్థం మనుభూయబలాద్వనే । పశ్చాత్తాపమనుప్రాప్తశ్చింతయన్ స్నాతుమాగతః ।

తా॥ విశ్వామిత్రుఁ డిట్లు వనమందు బలాత్కారముగా గంధర్వ భార్యతో సుఖమనుభవించి పశ్చాత్తాపమును బొందినవాఁడై చింతించుచు గంగాజల స్నానము కొఱకు వచ్చెను.

శ్లో॥ మార్గమాణస్తదాభార్యాం గంధర్వః పునరాగతః । మునిం తతస్సమాలోక్య భార్యాం గాధిసుతం మురాః ।

తా॥ యిక్కడ నిట్లుండఁగా అచ్చట గంధర్వుఁడు కొంత దూరముపోయి తన భార్యను గానక తిరిగి పూర్వము స్నానమాచరించిన స్థలమునకు వచ్చి యిటునటు వెదకుచు నొకస్థలమందు తన భార్యనున్ను విశ్వామిత్రునిన్ని జూచెను.

శ్లో॥ జ్ఞాత్వాతదుర్ధురాచారం కౌశికంపాతికోపితః । మునే త్వే

వదనం భూయా ద్వైకారం మర్కటస్యవత్ । పరస్త్రీసంగ దోషేణ తథామందమతిర్భవ । ఇతి గంధర్వశాపేన మర్కటాస్యోభవన్మునిః॥

తా॥ అట్లువారి వారిద్దరియొక్క దురాచారమును తెలిసికొని కోపముగలవాఁడై ఓయీ, విశ్వామిత్రా ! నీముఖము వానర (కోతి) ముఖమై వికారముగా నుండుగాక. నీకు పరస్త్రీసంగ దోషముచేత మతి మందమగుగాక. అని ఆ చిన్నదాని భర్త ఆమునిని శపించెను గంధర్వ శాపముచేత విశ్వామిత్రుండు వానరముఖుఁడాయెను.

శ్లో॥ తతోభార్యాంశశాపాసా నారీంచాప్రియవాదినీం । పాషాణోభవపాపేస్మిన్ భాగీరథ్యాస్తటేశుభే ।

తా॥ ఇట్లు మునికి శాపమిచ్చి తనభార్య భార్యనుజూచి ఓసీ దుష్టా ! నీవు ముందు స్నానార్థము రానని నన్ను కష్టపెట్టి చివరకు బలవంతముమీద నాతోవచ్చి తిరిగి నాలోకమునకు నాతో రాక యిచ్చట దిగబడి యిట్టిపనిని జేసినావు గనుక నీవు యీ గంగాతీరమందే పాషాణమై యుండుమని భార్యకు శాపమిచ్చెను

శ్లో॥ గంధర్వః ప్రయయౌ పశ్చాత్స్వర్లోకం త్రిదశాలయాః । కీశాననో భవేదాశు మందబుద్ధిర్మునీశ్వరః ।

తా॥ గంధర్వుఁడిట్లు శపించి తన లోకమునకు తాను బోయెను. ఓ దేవతలారా ! విశ్వామిత్రుఁ డప్పుడే వానరముఖుఁడై మందబుద్ధిగలవాఁడాయెను.

శ్లో॥ గంధర్వవనితా తత్ర సాబభూవ మహాశిలా । తయోరిత్థం భవేత్తస్మిన్ ద్వాదశాబ్దే వ్యతిక్రమే । నారదఃపర్యటన్నాగాద్గంగాతీరాటవీం మునిః ।

తా॥ గంధర్వభార్యయు నప్పుడే శిలయైయుండెను. ఇట్లు వారిద్దరికి ద్వాదశ సంవత్సరములు గడిచినపిమ్మట నొకనాడు నారదమహాముని తిరుగుచు ఆగంగాతీరమునకు వచ్చెను.

శ్లో॥ విశ్వామిత్రం కపిగ్రీవం దృష్ట్వా విస్మితమానసః । మునిం మందమతిం జ్ఞాత్వా జ్ఞాత్వా తచ్చేష్టితం పురా । చింతయామాసమనసి నారదస్తు మహాయశాః ।

తా॥ యిట్లువచ్చి నారదుఁడు వానరాస్యుడైన విశ్వామిత్రుని జూచి ఆశ్చర్యమునుపొంది అతనివలన వృత్తాంతమును గ్రహించుటకు అతఁడు మందమతియనియెఱింగి వృత్తాంతమును దివ్యజ్ఞానముచేత తెలిసికొని మనస్సులో నిట్లు చింతించెను.

శ్లో॥ అహం మునివరః పుణ్యో మునీనాంగణపూజితః । సోయం పుష్పశరంగేన భ్రష్టోభూత్కామతోవృథా । దుర్జయో మదనః కేన జేతుంనైవహిశక్యతే ।

తా॥ ఈ విశ్వామిత్రుఁడు మునిశ్రేష్ఠుఁడును, మునిసమూహముచేత స్తోత్రము చేయఁబడు నడవడికగలవాఁడు. ఇట్టివాడిప్పుడు మన్మథబాణతప్తుఁడై వృథా భ్రష్టుఁడాయెను. విశ్వామిత్రుఁడే మన్మథుని జయించలేనప్పుడు యింకెవ్వడు జయించును. పరస్త్రీదోషము చెప్ప వీలులేదుగదా.

శ్లో॥ ఏవంసంచింత్యగంగాయాం శీఘ్రేణ నారదః । మాఘే మదోదితేసూర్యే ప్రాతస్స్నానం విధానతః । చకార నారదో దేవాః విశ్వామిత్రాఘశాంతయే ।

తా॥ ఓ దేవతలారా ! నారదమహర్షి యిట్లు వచించినవాఁడై విశ్వామిత్రదోషనివృత్తికొఱకు వెంటనే మాఘమాసంబున సూర్యోదయకాలమున సంకల్పపూర్వకముగా విధ్యుక్తముగా కపిముఖముగల విశ్వామిత్రునియొక్క పాపశాంతికొఱకు గంగాస్నానమాచరించెను.

శ్లో॥ మాఘస్నానేనతుష్టేన మహాగ్రతమువక్త్రికః । ఆసీత్తత్రో మునిర్హాషా చ్ఛిలాయాం తావుభౌసురాః । జపార్థం తావుభౌప్రోక్ష్య స్వకమండలతస్సుచిః । జప్యమానేజపేదేవా శ్శిలాసామృదులా భవత్ । హిత్వా తద్రూపదోరూప మాసీద్గంధర్వవల్లభా ।

తా॥ ఇట్లు నారదకృత మాఘస్నానముచేత మాఘాధిదేవుఁడవయిన కేశవసంతోషించి విశ్వామిత్రునకు వానరముఖమును నశింపజేసి పూర్వముకంటె సుందరమయిన మనుష్యముఖము ననుగ్రహించితిని అంతట నామునులిద్దఱు సంతోషించి గంగాస్నానమాచరించి కమండలోదకమును గ్రహించి జపార్థము గంధర్వశాపముచేతనయిన శిలయందు ఆజలముచేత ప్రోక్షించి జపము చేయుచుండఁగా ఆశిల కఠినరూపమును విడిచి (మృదువయిన పాషాణరూపమును) పిమ్మట పూర్వరూపమును ధరించి గంధర్వభార్యస్వరూపురాలాయెను.

శ్లో॥ దృష్ట్వాతామనఘాంనారీం నారదో విస్మయంగతః । పునః

కృత్వా(జ)లే మాఘే నారీ గంధర్వవల్లభా । స్వర్లోకం ప్రయయా దేవా జగ్మతుస్తౌ స్వమాశ్రియమ్ ।

తా॥ నారదుడు ఆ స్త్రీని జూచి ఆశ్చర్యమును బొందెను. గంధర్వాంగనయు పుణ్య గంగయందు మాఘస్నాన మాచరించి దేవలోకమునకు వెళ్లెను. నారద విశ్వామిత్రులును తమతమ ఆశ్రమములకు వెళ్ళిరి

ఇతి దశమోధ్యాయ స్సమాప్తః.

—♦ అథ ఏకాదశోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీభగవానుః । శ్లో॥ యస్మాద్భాయ శ్శచీనాథం బోధయంతే సురేశ్వరం । స్నానేనానేన మాఘేస్మిన్ ఇంద్రః పూతో భవిష్యతి ।

తా॥ విష్ణువు వచించుచున్నాడు, ఓ దేవతలారా! విశ్వామిత్రాదులను పరిశుద్ధులనుగా జేసిన మాఘ స్నానము మీ యింద్రునిమాత్ర మెందుకు శుద్ధుని చేయదు. మీరు ఇంద్రుని తీసికొనివెళ్ళి మాఘస్నానము చేయించిరేని ఇంద్రుడు పవిత్రుడగును.

శ్లో॥ పౌర్ణమ్యాం మాఘమాసస్య మాఘమజ్జనకృత్పుమాన్ । వృషోత్సర్గం తుయః కుర్యాత్ సోపి పాపైర్నలిప్యతే ।

తా॥ మాఘ వైభవమును జెప్పెదను వినుడు. మాఘ శుక్ల పూర్ణిమనాడు మాఘ స్నానమాడి వృషోత్సర్జనము జేయువాడు పాపములచేత విడువబడును

శ్లో॥ మాఘే నక్రముపాగతే వతరణౌ మజ్జంతి యేమానవాః । అఘౌఘైః పరిముచ్యయాంత్యవిమిషా స్వర్గం మమేష్టాలయమ్ । ప్రాతర్మజ్జ్యచపూజ్య మాధవమిమం శ్రుత్వాతి మాహాత్మ్యకా । స్తోత్రాఖ్యాన మనంతసౌఖ్యచరితం మాఘస్యతే మత్ప్రియాః ।

తా॥ మాఘమార్తాండోదయమున నుదకమందు మునుగువారు ముక్తపాపులై దేవతలై నాకిష్టాలయమయిన స్వర్గమును బొందుదురు. మాఘోదయమందు స్నానమాడి మాధవుని బూజించి మాఘమాసమహిమను వినువారు విశేషఫలమును బొందుదురని తాత్పర్యము.

శ్లో॥ స్నానం యేమాఘమాసేతు మహాపాతకభీరవః । కుర్వంత్యనుదితేసూర్యే తేయాంతి మమ మందిరమ్ ।

తా॥ మహాపాతకములవల్ల భయము నొందినవారు మాఘస్నానము నాచరించినయెడల పాతకములన్నియు నాశమందుచుండును.

శ్లో॥ సితాసితే యత్రతరంగచామరే నద్యావిభాతే మునిభానుకన్యకే। లీలాతపత్ర-వటఏవసాక్షా త్సతీర్థరాజో జయతిప్రయాగః॥

తా॥ ఎచ్చట జహ్నువునకును సూర్యునకును కన్యలైనటువంటివిన్ని తెల్లనిదిని నల్లనిదిని అయినటువంటి రెండునదులు (అనఁగా గంగా, యమున) తరంగములనెడు చామరములను ధరించినవో (అనగా నదులు అను స్త్రీలు తరంగములు అనుచామరములచేత ప్రయాగమను రాజును విసరుచున్నవని భావము) ఎచ్చట వటవృక్షమనెడు ఆతపత్రము గలదో (అనఁగా గొడుగుగలదో ప్రయాగరాజునకు అక్షయవటమే ఆతపత్రమని భావము.) అట్టి ప్రయాగమనెడి తీర్థరాజు జయించుచున్నాఁడని తాత్పర్యము. (సర్వోత్కృష్టత్వేనవర్తత ఇత్యర్థః ॥)

శ్లో॥ మాఘస్నానంపవిత్రాణాం మాఘస్నానమఘాపహం। సర్వమాసోత్తమోమాఘ స్సర్వదేవోత్తమోరవిః। సర్వవృక్షోత్తమోశ్వత్థ స్సర్వదేవోత్తమో హరిః। సర్వశాస్త్రోత్తమో వేద స్సర్వవర్ణోత్తమో ద్విజః। సర్వభూపోత్తమో రామ స్సర్వఋతూత్తమోమధుః। సర్వజప్యోత్తమంరామం సర్వనార్యుత్తమా రమా। సర్వనద్యుత్తమా గంగా సర్వదేవోత్తమో విరాట్। సర్వశైలోత్తమో మేరు స్సర్వదానోత్తమం ధనమ్।

తా॥ మాఘస్నానము ఆపత్తునుండి తప్పింపఁజేయును. మాఘస్నానము దుఃఖము పోఁగొట్టును. ప్రకాశించువారందఱిలో సూర్యుఁడును సర్వవృక్షములలో అశ్వత్థవృక్షమును, భోగభోక్తలయిన దేవతలందరిలోను విష్ణువును, శాస్త్రములన్నిటిలోను వేదమును, సర్వజాతులలోను బ్రాహ్మణుఁడును, రాజులందరిలోను రఘురాముఁడును, అన్నిఋతువులలోను వసంతఋతువును, సమస్తమంత్రములలోను రామతారకషడక్షరీ మంత్రమును, స్త్రీలందరిలోను లక్ష్మియు, నద్యాదులలో గంగయు, శాశ్వతదేవులందఱిలోను విరాట్టున్ను, పర్వతము లన్నిఁటిలోను మేరువును, అన్ని దానములలోను ధనదానమును ఎట్లు శ్రేష్ఠములో అట్లే సర్వమాసములలో మాఘమాసము శ్రేష్ఠము.

శ్లో॥ సర్వతీర్థాధికో మాఘ స్సర్వవ్రతఫలాధికః। దానేభ్యశ్చ క్రతుభ్యశ్చ మాఘస్సర్వఫలప్రదః।

తా॥ సమస్తతీర్థములకంటెను మాఘము గొప్పది. సర్వవ్రతములకంటె మాఘవ్రతము శ్రేష్ఠము. సమస్తదానములకంటెను, సర్వక్రతువులకంటెను మాఘమాసము శ్రేష్ఠమయినది.

శ్లో॥ కృష్ణవేణ్యాం పుష్కరేచ బ్రహ్మావర్తే హిమాలయే । కైవల్యదేవప్రయాగేచ గంగాసాగరసంగమే । గోకర్ణేచ ప్రభాసేచ కావేర్యాం పశ్చిమవాహినీ । దర్శనాద్యామ్యకూపాదా తామ్రపర్ణీ మహానదీ । నర్మదాయాంచ గౌతమ్యాం వాణీ భాస్కరనందినీం । సహ్యపాదోద్భవాం రేవాం చాపి పుష్కరవాహినీ । భద్రాయాం శోణభద్రేచ వేగవాః సరయూస్తథా । యామ్యకైలాసగంగాయాం స్వర్ణముఖ్యాంమహానదీ । చతుర్వింశత్కోటితీర్థే స్నానంచాప్యరుణోదయే । ప్రోచ్యతేదశభిర్వర్షైః నిత్యస్నానేన మానవః । తత్ఫలంలభతే మాఘే భక్త్యా స్నానత్రయేణచ ।

తా॥ కృష్ణవేణి, పుష్కరము, బ్రహ్మావర్తము, హిమాచలము, ప్రయాగ, గంగా, సాగరసంగమము, గోకర్ణము, ప్రభాసము, కావేరి, పశ్చిమవాహిని, దర్శానదీ, యామ్యకూపము, తామ్రపర్ణి, నర్మదా, గౌతమీ, సరస్వతీ, యమునా సహ్యపాద్భవ, రేవానదీచాపము, పుష్కరవాహిని, భద్ర, శోణభద్ర, వేగవతి, సరయూ, దక్షిణకైలాసగంగ, స్వర్ణముఖి, చతుర్వింశతికోటితీర్థము యీనదులయందు పది సంవత్సరములు అరుణోదయకాలమందు నిత్యస్నానము నాచరించువారేమిఫలమును బొందుదురో ఆఫలమును మూడురోజులు మాఘస్నానమాచరించువారు బొందుదురు

శ్లో॥ మాఘాభిషేకం యఃకుర్యాన్మాఘమేకం నిరంతరం । సాలగ్రామనివాసస్థం మామభ్యర్చ్య విధానతః । మాఘే మాం మాధవం దేవాః పూజయంత్వంబుజసన్నిధౌ । పుష్పైః పంకేరుహైః శుభ్రైః కరవీరైస్సితాసితైః । మల్లికాకుసుమైస్సద్యః కోమలైస్తులసీదళైః । మందారైఃపారిజాతైశ్చ చంపకైర్వకుళైశ్శుభైః । భక్త్యాపూజాం విధాస్యంతి యేమాం మాఘప్రియంసురాః । తేయాంతి మత్పదం పుణ్యం పునరావృత్తివర్జితమ్ ।

తా॥ సాలగ్రామనివాసినయిన నాకు నిరంతరముగా మాఘాభిషేకము చేయువారును, మాఘస్నానమాచరించి మాఘదేవుడనయిన నన్ను ఉదకసమీపమందు పద్మ

ములతోను, సితాసితకరవీర (సిత=తెల్లని, అసిత=నల్లని. కరవీర=గన్నేరు) పుష్పములతోను, మల్లెపువ్వులతోను కోమలతులసీదళములతోను, మందారపుష్పములతోను, పారిజాతకుసుమములతోను, చంపకపుష్పములతోను, వకుళకుసుమముల (పొగడపువ్వుల) తోను, భక్తితో బూజించినవారును పునరావృత్తిరహితమయిన విష్ణులోకమును బొందుదురని తాత్పర్యము

శ్లో॥ ధాత్రీస్నానంతు యఃకుర్యా న్మాఘమాస్యుదితే రవౌ । ససర్వపాతకైర్ఘోరై ర్విముక్తోయాతి మత్పదమ్ ॥

తా॥ మాఘోదయమందు ఉసిరికాయలతో స్నానమాచరించువాఁడు అఖిలపాతకముక్తుఁడై వైకుంఠమును బొందునని తాత్పర్యము

శ్లో॥ తులసీ మృదయాలిప్య సర్వాంగే మాఘమజ్జనం । యఃకుర్యాదుదితే సూర్యే సోభూన్మేప్రియకారకః ॥

తా॥ మాఘోదయమందు సర్వాంగమందు తులసిమూలమృత్తికను బూసుకొని స్నానమాచరించువాఁడు నాకు ప్రియుఁడని విష్ణుమూర్తి వచించెను.

శ్లో॥ గోమయాలేపనం కృత్వా ప్రాతర్మాఘే బహిర్జలే । యఃస్నాతి తస్యపాపాని వినశ్యంతి నసంశయః ॥

తా॥ మాఘోదయమందు బహిర్జలంబున శరీరమునకు గోమయము రాచుకుని స్నానమాచరించువాఁడు పాతకముక్తుఁడగును. సందేహము లేదు.

శ్లో॥ యఃకుర్యాన్మంటపేరమ్యే మాఘేస్నాత్వామమార్చనం । సహిసారూప్యమాప్నోతి మే దేవానాత్రసంశయః ॥

తా॥ ఓ దేవతలారా! మాఘోదయమందు స్నానమాచరించి మనోహరమైన మంటపమందు మాఘాధిదేవుఁడనయిన నన్ను (విష్ణుమూర్తిని) పూజించువారు నా సారూప్యమును బొందుదురు. సందియము లేదు.

శ్లో॥ మాఘస్నానవిహీనోయః శూద్రోవాపిద్విజోథవా । తమంతకస్స్వదండేన తాడయేదఘకారకమ్ ॥

తా॥ బ్రాహ్మణుఁడుగాని, శూద్రుఁడుగాని మాఘస్నాన మాచరింపనివానిని యముఁడు స్వకీయ దండముచేత శిక్షించును.

శ్లో॥ సంప్రాప్తేమాఘమాసేతు యానారీ నీరగాహనం । నైవాకరోతిసానారీ భుజ్యతే యమయాతనామ్ ॥

తా॥ మాఘమందు ప్రాతస్స్నానమాచరించని స్త్రీకి యమయాతనలు తప్పవు.

శ్లో॥ యానారీకురుతేస్నానం మత్ప్రీత్యైమాఘవారిణి । సానారీ నరకంప్రాప్య కుంభీపాకే నపచ్యతే ॥

తా॥ స్త్రీకి యితర కారణములచేత నరకము సంప్రాప్తించినప్పటికిని ఆ స్త్రీ మత్ప్రీతిగా మాఘస్నానము చేసియున్నయెడల ఆ స్త్రీకి కుంభీపాకనరకమందు పచనము చేయబడుటలేదని తాత్పర్యము.

శ్లో॥ భర్తృహీనాతుయానారీ ద్విభుక్తినిరతాయదా । మాఘస్నానవిహీనాసా కుంభీపాకేషుపచ్యతే ॥

తా॥ విధవరాలై రెండుఆవర్తులు భోజనపరాయణురాలై మాఘస్నాన మాచరించని స్త్రీ కుంభీపాకమందు వండబడుచున్నది.

శ్లో॥ ద్విజోయఃకురుతేదేవః మాఘస్నానమఘాపహం । ప్రాప్యతేమేమహాపుణ్యం మయాసోపిప్రమోదతే ॥

తా॥ దురితనాశనమయిన మాఘస్నానమాచరించు బ్రాహ్మణుడు నాలోకమునుబొంది నాతోకూడా ఆనందించుచుండును.

శ్లో॥ సంప్రాప్తే మాఘమాసేతు స్నానదానపరాయణః । యామ్యంతునరకంఘోరం మాఘస్నాయీనపశ్యతి ॥

తా॥ మాఘమాసమందు స్నానదానముల నాచరించువాడు భయంకరమైన యమలోకమును జూడడు.

శ్లో॥ మాఘమజ్జనహీనోయ స్సమలాశీనసంశయః ॥

తా॥ ఎవ్వడు మాఘస్నానవిముఖుడో ఆ నరాధముడు మలాశి యగును. (అమేధ్యము తినువాడనుట.)

శ్లో॥ మాఘేస్నాత్వాతుయోశ్నీయా న్మమభృత్య స్సగద్యతే ॥

తా॥ మా మనోహరప్రియమయిన మాఘమందు ప్రాతస్స్నాన మాచరించి భుజించువాడు నాకు భృత్యుడగును.

శ్లో॥ స్నాత్వామాఘేఋషీన్ దేవాన్ పితౄనపిచతర్పయేత్ । మదీయాంసుకథాం శ్రుత్వా సర్వపాపైః ప్రముచ్యతే ॥

తా॥ మాఘస్నానమాచరించి దేవఋషి పితృతర్పణమును జేసి నాకర్ఘ్యమిచ్చువాఁడు పాతకముక్తుఁడగును

శ్లో॥ మాఘేస్నాత్వా శుచిర్భూత్వా ధౌతవస్త్రధరో ద్విజః। దత్వార్ఘ్యం మాం స్మరన్మాఘే మాధవాయమహాత్మనే। పాపైస్సోపి వినిర్ముక్తః ప్రాప్నోతి మమసన్నిధిమ్॥

తా॥ మాఘోదయమందు స్నానముజేసి శుచియై తెల్లని వస్త్రమును ధరించి నన్ను స్మరింపుచు మహానుభావుఁడయిన మాధవునకు అర్ఘ్యమిచ్చు బ్రాహ్మణుఁడు పాపములచేత విడువఁబడినవాఁడై నాసన్నిధికి జేరును. (ద్విజుఁడనఁగా వేదోక్తమైన ఉపనయన సంస్కారమును బొందినవాఁడుగాన బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు ద్విజశబ్దవాచ్యులని అర్థము )

శ్లో॥ సోపిపూజ్యోమయాదేవాః యుష్మాభిఃపూజ్యతేసదా॥

తా॥ అట్టివాఁడు నాచేత పూజింపఁబడుచున్నాఁడు గాన మీరును వానిని పూజింపవలయును

శ్లో॥ మాఘే మకరగేసూర్యే భానోఃపూజ్యాస్తుయేనరాః। నమస్కారార్ఘ్యకైర్దత్తం తన్మామేవప్రపద్యతే॥

తా॥ మాఘమాస మకరమందు రవియుండఁగా నమస్కారములచేతను, అర్ఘ్యములచేతను సూర్యుని బూజించువారు నన్ను బొందుదురు.

శ్లో॥ సమాహితమతిస్స్నాత్వా ప్రాతర్మాఘేబహిర్జలే। పాపైస్సోపివినిర్ముక్తః ప్రాప్నోతిమమసన్నిధిమ్॥

తా॥ మాఘోదయమందు బహిర్జలంబున సావధానమనస్కుఁడై స్నానమాచరించువాఁడు పాతకముక్తుడై నాసన్నిధికి జేరును.

శ్లో॥ యఃస్నాత్వా మాం సమభ్యర్చ్య ప్రాతర్మాఘేబహిర్జలే। అష్టోత్తరశతంవాపి గాయత్రీం వేదమాతరమ్॥

తా॥ ఎవ్వఁడు మాఘస్నాన మాచరించి నన్నుఁ బూజించి ఒక అష్టోత్తరశతమయినను వేదమాతయయిన గాయత్రియొక్క జపమును చేయునో వాఁడు నాకును పూజ్యుఁడు.

శ్లో॥ స్నాత్వా మాఘజలే పుణ్యే జపేద్యా మగ్రతశ్శుచిః । య ద్యాచరతి దేవాశ్చ తస్య ముక్తిః కరేస్థితః ॥

తా॥ పుణ్యోదకమందు మాఘస్నాన మాచరించి శుచియై ముందుగా గాయత్రీ జపమాచరించువానికి ముక్తి కరస్థితమగును.

శ్లో॥ గాయత్ర్యాస్తు సమో మంత్రో మంత్రజాలేషు నాస్తిహి । గాయత్రీ పాపహారిస్యా ద్గాయత్రీ మోక్షదాయినీ । మహాలయప్రదా తద్వ ద్బ్రహ్మలోకప్రదాయినీ । శంభోస్సూర్యహిమాంశోశ్చ గాయత్రీ లోకదాయినీ ।

తా॥ గాయత్రీమంత్రముతో సమానమయిన మంత్రము లేదు. గాయత్రి పాపహారిని. గాయత్రి మోక్షదాయిని. గాయత్రి సాలోకమునిచ్చును. గాయత్రి బ్రహ్మలోకప్రదాయిని. గాయత్రి శివ సూర్య చంద్రలోకములను బొందించును.

శ్లో॥ తస్మాత్తాం మాఘమాసేస్మిన్ స్నాత్వా భక్త్యా జపేన్నరః । సస్నాతస్సర్వతీర్థేషు సర్వక్రతుషుదీక్షితః ।

తా॥ కాఁబట్టి ఎవ్వఁడు మాఘస్నాన మాచరించి భక్తితో గాయత్రీజప మాచరించునో వాఁడు సమస్తతీర్థస్నాతయగును. సర్వక్రతుదీక్షితుఁడగును.

శ్లో॥ యుష్మాభిర్మునిభిర్యాతి స్తూయమానో మహాలయమ్ ।

తా॥ అట్టివాఁడు మీచేతను, మునులచేతను కొనియాడబడుచు నామందిరము చేరును

శ్లో॥ బ్రహ్మయజ్ఞపరో యస్తు మాఘస్నాయీ శుచివ్రతః। బ్రహ్మలోకే చిరంస్థిత్వా తతో మామభిపద్యతే ।

తా॥ మాఘస్నానమాడి బ్రహ్మయజ్ఞ మాచరించువాఁడు బ్రహ్మలోకమందు చిరకాలముండి తరువాత నన్ను బొందును.

శ్లో॥ ప్రణవవ్యాహృతీశ్చోక్త్వా గాయత్రీం వేదమాతరం। పాదం పాదం జపంకృత్వా దక్షిణాంకే కృతాంజలిః । యజ్జప్త్వా మాఘమాసేస్మిన్ మహాపాపైః ప్రముచ్యతే ॥

తా॥ బ్రహ్మయజ్ఞమందు గాయత్రిసముచ్చారణవిధని జెప్పఁబడును. మాఘస్నాన మాచరించి సంధ్యవందన మాచరించి పిదప (వ్యా॥ సవ్యేపాదే దక్షిణంస్థాప్యచోరుం సవ్యేహస్తే దక్షిణంస్థాప్యపాణిం । ఏవంమాసోపస్థ సంజ్ఞానసేస్మిన్ ప్రాగస్యః

స్వాధ్యాయము(శారభేత॥) అని చెప్పినరీతిగా ప్రాఙ్ముఖుఁడై ఎడమపాదమందు కుడితొడవుంచి ఎడమతొడయందు కుడిపాదమునుంచి కుడితొడయందు అంజలిబెట్టి అనఁగా ఎడమచేతి అంగుష్ఠతర్జనీలమధ్యము గా కుడిచేతి నాలుగువ్రేళ్లను వుంచి కుడిచేతి అంగుష్ఠముతో ఎడమచేతి అంగుష్ఠము చుట్టియుండగా ఓం అను ప్రణవమును ఉచ్చరించి తరువాత భూర్భువస్సువః అను వ్యాహృతిత్రయమును ఉచ్చరించి తరువాత గాయత్రిని ఒక్కొక్కపాదముచొప్పున ఉచ్చరించి (అనఁగా తచ్ఛబ్దగ్రహణప్రతస్వర్యామిత్యుక్తరీత్యా) ఒకమాఱు పాదముగా రెండవమాఱు అర్ధముగా మూడవమాఱు సంపూర్ణముగాను ఉచ్చరించి జపించువాఁడు మహాపాతకవిముక్తుఁడగును.

శ్లో॥ మాఘస్నాయీ చాన్నదాయీ మద్యకో బ్రహ్మయజ్ఞకృత్ । మత్కథాశ్రవణరతో నయాతియమాలయమ్ ।

తా॥ మాఘస్నానపరుఁడై బ్రహ్మయజ్ఞమును చేసి మత్కథాశ్రవణ మాచరించి అన్నదాతయయిన నా భక్తుఁడు యమలోకమును బొందఁడు.

శ్లో॥ మాఘే దదాతియోదీపం సాలగ్రామస్యసన్నిధౌ । దుర్లభం జ్ఞానమాసాద్య మత్పదంసోధిగచ్ఛతి ।

తా॥ మాఘమందు సాలగ్రామసన్నిధియందు దీపమునుంచువాఁడు దుర్లభమైన జ్ఞానమునుబొంది దేహాంతమందు నాస్థానమును చేరును.

శ్లో॥ మాఘే స్నాత్వా విధానేన ప్రాతర్మాఘే జలాంతికే । యః పూజయతి మాం భక్త్యా మాధవం మాఘవల్లభం । సకోటికులసంయుక్తో మమలోకేవసేచ్చిరమ్ ।

తా॥ మాఘోదయ స్నానమాచరించి జలసమీపమందు మాఘవల్లభుఁడనయిన నన్ను భక్తితో బూజించినవాఁడు కోటిదేహబంధువులతో సహా నా లోకమందు చిరకాలముండును

శ్లో॥ తులసీమంజరీభిర్వా మాఘే స్నాత్వామమార్చనం! పాత్రర్యాంతికేదేవాః నయాతిమమమందిరమ్ ।

తా॥ మాఘోదయస్నాన మాచరించి తులసిగుత్తులతో ఉదకతీరమందు నన్ను బూజించువాఁడు నాలోకమునుబొందును.

శ్లో॥ తులసీమణిభిర్మాలాం గళే ధృత్వార్చయేచ్చ మాం । గాయత్ర్యాదిజపేన్మాఘే సతిస్యాత్సిద్ధ్యమాధ్యమమ్ ।

తా॥ మాఘోదయస్నానమాచరించి తులసీపూసలదండను కంఠమందు ధరించి గాయత్రీమంత్రజపమాచరించి నన్ను బూజించువాఁడు యమునివలన భయముబొందఁడు.

శ్లో॥ సదా సంధారయేద్యస్తు తులసీమణిమాలికాం । నతంస్పృశంతిపాపాని నచయామ్యభయానివా ।

తా॥ ఎల్లప్పుడు తులసీమణి మాలికను ధరించువానిని పాపములంటవు. యమయాతనాభయములును లేవు

శ్లో॥ మాఘేస్నాత్వా మమాగ్రేతు పురాణానిచయోవదేత్ । మత్ప్రియస్సోపిశుద్ధాత్మా తస్యగేహేవసామ్యహమ్ ।

తా॥ మాఘోదయస్నానమాచరించి నాయగ్రమందు పురాణములను జెప్పువాఁడు నాకుప్రియుఁడు. వానిగృహమందు నేనుందును.

శ్లో॥ మాఘే స్నాత్వాథ మాంపూజ్య ప్రాతర్వారితటేనఘః । పురాణసంహితావక్తా శ్రోత్రియోహ్యభిధీయతే ।

తా॥ మాఘోదయస్నానమాచరించి నదీతీరమందు పైపాపుఁడనయిన నన్ను బూజించి పురాణమును జెప్పువాఁడు శ్రోత్రియుఁడనబడును

శ్లో॥ వాచ్యమానంపురాణంచ శబ్దభావవివర్జితం । శ్రీరాగేణవినా మాఘే నశ్రోతవ్యంకదాచన ।

తా॥ శబ్దభావశూన్యమయినదియు (అర్థములేకుండాను శ్రీరాగములేకుండగను) నయిన పురాణమును ఒకప్పుడును వినఁదగదు

శ్లో॥ సువ్యక్తం సత్కథాంపుణ్యాం గంభీరాంశాస్త్రగర్భితాం । మనోహరేణ రాగేణ వదేత్పురాణసంహితాం । మాఘమాస కథాం మూఢో నశ్రుణోతి సపాతకీ ॥

తా॥ పురాణమును స్పష్టముగాను. సత్కథతోఁ గూడినదానినిగాను, గంభీరమయినదానినిగాను, శాస్త్రసందర్భయుక్తముతోనున్ను, సుందరమయిన రాగముతోనున్ను చెప్పవలెను. ఇట్లు చెప్పఁబడు పురాణమును వినని వాఁడు పాతకి యనఁబడును

శ్లో॥ మాఘేస్నాత్వా మమాగ్రేతు పురాణశ్రవణైశ్చమాం । ప్రీణయంకురుతేభక్త్యా సోహందేవా నసంశయః ॥

తా॥ ఓ దేవతలారా! మాఘోదయ స్నాతుఁడై భక్తితో పురాణ శ్లోకముల చేత నన్నెవఁడు స్తుతిచేయునో వాఁడు నేనే. అనఁగా వాఁడు నాస్వరూపియగునని భావము. ఇందుకు సందియము లేదు.

శ్లో॥ పురాణశ్రవణేబుద్ధిః యస్యపుంసః ప్రజాయతే। మాఘే జలాంతికేఽపి మమసారూప్యతాంగతః।

తా॥ ఎవ్వనికి మాఘజలాంతికమందు పురాణశ్రవణబుద్ధి గలుగునో వాఁడు నాసారూప్యమును పొందును.

శ్లో॥ నశృణోతియదామాఘే పురాణంమోక్షదాయకం। సోఽపి మద్భాషణాద్దేవా శ్యాంతకేన యమాలయే। విష్టాక్రిమియుతే కూపే పతత్యాచంద్రతారకమ్।

తా॥ ఓ దేవతలారా! యెవ్వఁడు మోక్షదాయకమయిన మాఘపురాణమును వినఁడో వాఁడు నాయాజ్ఞచొప్పున యమునిచేత అశుద్ధక్రిమి సంయుక్తమయిన నరకమందు సూర్యచంద్రులుండువఱకు నివసింతురు.

శ్లో॥ సాలగ్రామనివాసస్య మాఘేమేంఘ్ర్యుదకం నరః। పిబేద్వ్రతపరోభక్త్యా సోఽపిపాపైః ప్రముచ్యతే।

తా॥ మాఘమందు మాఘవ్రతపరాయణుఁడై భక్తితో సాలగ్రామనివాసినైన నా పాదోదకమును పానముచేసినయెడల పాతకముక్తుఁడగును.

శ్లో॥ నపిబేద్యదిమూఢాత్మా యోమాఘేమత్పదోదకం। నరకం తస్యవిజ్ఞేయం నాంతం దేవా నసంశయః।

తా॥ ఓ దేవతలారా! మూఢుఁడై మాఘమందు నాపాదోదకమును పానము చేయనివాఁడు నరకమందుండును. వానికి నరకదుఃఖమునకు అంతములేదు. ఇందుకు సంశయములేదు.

శ్లో॥ మాఘవ్రతపరో భక్త్యా మన్నిర్మాల్యంచ మస్తకే। తం నస్పృశంతిపాపాని సఋషిప్రవరోభవేత్॥

తా॥ ఎవ్వఁడు మాఘవ్రతపరాయణుఁడై భక్తితో నా పూజానిర్మాల్యమును శిరస్సున నుంచుకొనునో వానిని పాతకములంటవు. వాఁడు ఋషిశ్రేష్ఠుఁడగును.

శ్లో॥ తస్మాన్మాఘవ్రతం పుణ్యం యుష్మాకమితికీర్తితం। యూయం గచ్ఛధ దేవేంద్రం పద్మాద్రౌ స్తత్రమంజసా।

తా॥ కావున మాఘవ్రతము పుణ్యప్రదమగు. మీ యందరికి కృపచేత చెప్పితిని. మీరిప్పుడే పద్మాద్రియందున్న యింద్రునివద్దకు పొండు.

శ్లో॥ యస్మాయాకీర్తితం మాఘవ్రతమింద్రాయ పాపినే। బోధయధ్వం తతో దేవాః పాపిసాప్రైర్విముచ్యతే। తుంగభద్రాజలే స్నానాత్సుముఖత్వం భవిష్యతి।

తా॥ పోయి నాచే చెప్పబడిన మాఘవ్రతమును పాపవంతుఁడైన పాకశాసనునకు (యింద్రునకు) దెల్పుడు. అతఁడును తుంగభద్రానదీజల స్నానముచేత పాపముక్తుఁడగును. అతని ముఖముగూడ సుముఖమగును.

శ్లో॥ ఇత్యుక్త్వావిష్ణునా దేవాః ప్రహృష్టాః స్తేమురాంతరం। నత్వా యయుశ్శచీనాధం గవేషంతో గిరిం యథా।

తా॥ ఓ జహ్నూ! వినుము. ఇట్లు పలికి హరి అంతర్ధానమాయెను. దేవతలును సంతోషించి విష్ణుమూర్తికి నమస్కరించి యింద్రుని వెదకుచు పద్మాద్రికి వెళ్ళిరి.

శ్లో॥ యదుక్తం హరిణా పూర్వం పద్మాద్రౌ స్నానమావిశత్। పృథక్పృథక్ గవేషంతః తత్రతత్ర సురేశ్వరాః।

తా॥ ఇట్లు వెళ్లుచు విష్ణుమూర్తిచేత జెప్పబడిన పద్మాద్రికిజేరి అచ్చట వేఱువేఱుగా యింద్రుని వెదకుచుండిరి.

శ్లో॥ గవేషమాణాదదృశుః కృకలాసం గిరేస్తటే। స్థూలకాయం సూక్ష్మపాదం సూక్ష్మలాంగూలలోచనమ్।

తా॥ దేవతలిట్లు వెదకుచు పద్మాద్రితటమందు స్థూలశరీరయు, సూక్ష్మపాదయు, సూక్ష్మలాంగూలయు (చిన్నతోకయు) సూక్ష్మనేత్రయునైన ఒక తొండను జూచిరి.

శ్లో॥ చలన్నప్రాణమాత్రంతు స్థూలోపలమివాత్మనః। తాం దృష్ట్వా కృకలాసస్తు జగర్జ ఘననిస్వనః।

తా॥ తొండయు గొప్ప పాషాణమువలె గాంచెనయిన చలించునది కాదు. ఇట్లుండినంతలో దేవతలు దాని సమీపమునకు వెళ్ళిన సమయములో మేఘధ్వనివలె గొప్పగా ధ్వని చేసెను.

శ్లో॥ రాక్షసోయమితి తే దేవా స్సంత్రస్తా స్తేధికం మునే। శనైః కేచి త్తమాలోక్య కృకలాస ఇతీరయుః॥

తా॥ దేవతలు అదివిని వీడు రాక్షసుండని భయమునొందిరి. కొందఱు కొంత కాలమునకు రాక్షసుండు కాడు. ఇది తొండయని వచించిరి

శ్లో॥ తత స్తేవిస్మితా దేవాః స్థూలాంగమతిభీషణం। అగాధస్థం గిరేస్సానౌ లతాభిస్సుదృఢై స్సురాః। వికర్షణోఽద్యమం చక్రుః పుణ్యపాక ముపాగతే।

తా॥ పిమ్మట దేవతలు స్థూలాంగిరియై అతిభయంకరమయిన ఆతొండనుజూచి ఆశ్చర్యమొందిరి. అదియు గిరిపానువునందు పెద్ద పల్లములోనున్నది. ఇంతలో దాని పుణ్యము ఫలించు కాల మాగతమయినందున దేవతలు తీగెలతో దానిని కట్ట నమకట్టిరి.

శ్లో॥ లతాభి స్సుదృఢం బధ్వా విచకర్షు ర్బలాన్వితాః। నచాలయంతి తేకించిత్ కృకలాసం మహాఘనమ్।

తా॥ ఇట్లు నమకట్టి తీగెంతో బలాత్కారముగా ఆతొండనుగట్టిరిగాని కొంచెమయినను కదల్పరైరి. ఆతొండయు మహాఘనమయినది.

శ్లో॥ విశ్రాంతా విబుధాస్సర్వే భాషమాణాః పరస్పరం। మాఘధర్మంసమాలోచ్య పరీక్షార్థం హరేర్వచః। దేవఖాతజలే దేవాః తస్య దేహముదాన్వితాః। ప్రాతర్మాఘేప రేద్యుస్తై హ్యాభ్యషించన్మునీశ్వర।

తా॥ ఓ జహ్నుమహాముని! దేవతలిట్లెంతగా పెనుగులాడినను అద్దానినికదల్చలేక ఆయాసమునుబొంది పరస్పరము సంభాషించుకొని యిది మాఘమాసము విష్ణువు చెప్పిన మాటను పరీక్షింతమని నిశ్చయించుకొని మఱునాడుదయమున మహాసంతోషముతో సమీపముననున్న దేవఖాతజలముందెచ్చి ఆతొండ కభిషేకము జేసిరి

శ్లో॥ కృకలాస స్తతో దేహం హిత్వాఽనంతరంతదా। నారీరూపముపాశ్రిత్య దివ్యభూషణ భూషితా। సురాణా మంతికం గత్వా నారీరూపగుణాన్వితా।

తా॥ ఇట్లు స్నానముచేయించగా నప్పుడు తొండదేహము నశించి దివ్యాలంకారభూషితురాలయిన స్త్రీరూపము దాల్చెను. తరువాత ఆ సుందరాంగి దేవతల కడకు వచ్చెను.

శ్లో॥ తాంధృష్ట్వా విస్మితాదేవాః త్వం కాసీతిబభాషిరే ।

తా॥ ఆ సుందరినిజూచి ఆశ్చర్యమొంది దేవతలు నీ వెవ్వతెవని అడిగిరి.

ఇత్యేకాదశోధ్యాయ స్సమాప్తః.

---

—♦ అథ ద్వాదశోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీగృత్స్నమదః॥ శ్లో॥ దేవానువాచసానారీ సహర్షామునిపుంగవ। దేవానా మగ్రతస్థిత్వా శ్రుణుధ్వంవైసమాహితాః ।

తా॥ గృత్స్నమదమహాముని జహ్నుమహామునితో తిరిగి చెప్పుచున్నాడు. ఈప్రకారముగా దేవతలడుగగా ఆస్త్రీ దేవతలయుందరనుండి సంతోషముతో దేవతలారా! నా చరితమును సావధానమనస్కులై వినుడు. చెప్పెదనని పలికి చెప్పనారంభించెను.

నార్యువాచ॥ శ్లో॥ జాతాకాశ్మీరదేశస్థా సుశీలాఖ్యాద్విజాత్మజా। మాంసమానసగోత్రాయ వివాహమకరోత్పితా ।

తా॥ నేను కాశ్మీరదేశమందు సుశీలుడను బ్రాహ్మణుని కుమార్తెను. మాతండ్రి సమానగోత్రబ్రాహ్మణునకిచ్చి వివాహము చేసెను.

శ్లో॥ పతిరేవ చతుర్థేహ్ని మృతస్సోకనిపాతతః । పితా పశ్చాత్సపత్నీక స్సురురోదాతిదుఃఖితః ।

తా॥ అవివాహ చతుర్థదినమందే నాభర్త పిడుగుచేత మృతినొందెను. అది చూచి నా తల్లిదండ్రులిద్దఱు మిక్కిలి దుఃఖించిరి.

శ్లో॥ తతస్సుధీరువాచేదం దుఃఖాదాకులితేంద్రియః । జన్మకష్టం మనుష్యాణాం స్త్రీజన్మాధికకష్టతా । తత్రాపి బాల్యే వైధవ్యం కష్టాత్కష్టతరాధికమ్ ।

తా॥ తరువాత పండితుడైన నాతండ్రి దుఃఖాకులితుడై యిట్లని పలికెను. మనుష్యులకు మొదట జన్మమే కష్టము. అందులో స్త్రీజన్మ మతికష్టము దానియందును బాల్యవైధవ్యము మిక్కిలి కష్టతరము.

శ్లో॥ భర్తృహీనాం కుమారీంమే మనోద్రష్టుం నరోచతే। బంధుష్వేనాం సుతాం స్థాప్య వనేవాసోపరంమమ ।

తా॥ కాబట్టి ధర్మవిహీనరాలైన యీకుమార్తెను చూచుచుండుటకు నావల్ల ఒప్పలేదు గనుక దీనిని నా బంధువులవద్దనుంచి నే నరణ్యమందుండును.

శ్లో॥ ఇత్యుక్త్వా దుఃఖసంతప్తో బాంధవానాం వశే సుతాం । విధాయవిప్రస్సస్త్రీకః విపినం సముపాశ్రియత్ ।

తా॥ ఇట్లుపలికి దుఃఖముతో కుమార్తెను బంధువులకప్పగించి తానును భార్యయు అరణ్యమునకు వెళ్లెను.

శ్లో॥ సాపి కాలాంతరేరోగా నిర్వాణం ప్రత్యపద్యత ।

తా॥ వెళ్ళి కొంతకాలమునకు రోగముచేత శరీరమును విడిచి మోక్షమును పొందెను.

శ్లో॥ తదాబంధుషు సంస్థాహం నిత్యం కష్టేన పాపిణి । సుతేష్ట బంధుహీనాహం నిత్యంభిక్షాన్నజీవనా ।

తా॥ నే నచ్చట బంధువులందుండి నిత్యము కష్టముతో జీవించుచు సుత, మిత్ర, బంధువిహీననై నిత్యము భిక్షాజీవనము చేయుచుంటిని

శ్లో॥ ససంస్కృతాన్నమల్పంవా భుక్తంపర్యుషితాశనా । క్రయవిక్రియణాదేవ హ్యార్జితా భుక్తశేషతః ।

తా॥ నేనెప్పుడు పరిశుద్ధమయిన అన్నమును కొంచెమునయినను తినుటలేదు. ఎప్పుడును చద్దిఅన్నమునే తినుచుందును క్రయవిక్రయములవల్ల ధనమార్జించితిని. ఎప్పుడును భుక్తశేషమునే భుజించుదానను.

శ్లో॥ మయానాచరితంస్నానం ప్రాతఃపర్యుషితాశనా । నధ్యాతం విష్ణుపాదాబ్జం నశ్రుతా హరిసత్కథా ।

తా॥ నేనెప్పుడును ప్రాతస్స్నాన మాచరించలేదు. ప్రాతఃకాలమందు చద్దిమాత్రము తప్పక తినుదానను. విష్ణుపాదారవింద ధ్యాన మెప్పుడును చేయలేదు హరికథాశ్రవణ మెట్టిదో నాకు తెలియనే తెలియదు.

శ్లో॥ న మయా పుణ్యతీర్థాని స్వప్నేవా సేవితానిచ । జిహ్వాచాపల్యదోషేణ నోపోష్యం విష్ణువాసరే ।

తా॥ నేనెన్నడును స్వప్నమందయినను పుణ్యతీర్థముల సేవించలేదు. జిహ్వాచాపల్యముచేత ఏకాదశీతిథియందు నెన్నడును ఉపవాసమాచరించలేదు.

శ్లో॥ అనుష్ఠితేషు లోకేషు సర్వేష్వేకాదశీవ్రతం। జాగరాద్యైర్హరింపూజ్య హరిభక్తిపరాయణాః। విహసన్వ్యాహసన్నేవం తాః దృష్ట్వా నిందితాస్మ్యహమ్ ॥

తా॥ లోకులందరు ఏకాదశీవ్రతమా నాచరించి జాగరముండి హరిని పూజించుచున్నంతలో వారినిజూచి నేను మాటిమాటికి నవ్వుచు వారిని నిందించుదానను.

శ్లో॥ మమేష్టకారిణః కేచి త్కురుధర్మ మితీరితాః। తతిస్తాన్వ్యాజముత్పాద్య శపతాస్మ్యతికోపతః ॥

తా॥ నాకిష్టులయిన కొందరు ధర్మమాచరింపుమని నాతో చెప్పఁగా దానికి నే నేదో కపటమును పన్ని మిక్కిలి కోపముచేత వారిని తిట్టుదానను. ఎప్పుడును నేను కపటమునే చూపించుచుండ వారు మిక్కిలి కోపముచేత నన్ను తిట్టువారు.

శ్లో॥ ఇత్యహంవివిధైర్ద్రవ్య మార్జయిత్వా దివానిశం। నచోపకారం నోదానం మయా కించిత్కృతం సురాః ।

తా॥ ఈప్రకారముగా రాత్రింబగళ్లు అనేకవిధములుగా ద్రవ్యమును సంపాదించితినిగాని పరులకు కించిత్తయినను ఉపకారమును చేయలేదు, దానమియ్యలేదు.

శ్లో॥ ఇత్యహం ద్రవ్యసంతుష్టా భిక్షాన్నోదరపూరితా। సకేశా స్నానహీనాహం బ్రాహ్మణీగతభర్తృకా ॥

తా॥ ఈప్రకారముగా భిక్షాన్నమును తినుచు ద్రవ్యమార్జించితిని. ద్రవ్యమును చాలా వృద్ధిజేసితిని. దానితో సంతోషించుచు విధవనయినప్పటికి తలవెంట్రుకలుంచుకొని నాయిష్టప్రకారముగా చొప్పన స్వేచ్ఛాచారముగా తిరుగుచుంటిని.

శ్లో॥ ధృత్వాహం ధౌతవసనం పర్యటన్సదనేష్వహం। పరిహాసకథాలాపైః ప్రోక్తాహంవరరూపిణీ। దుర్జయేన స్మరేణాహం సంతప్తా కామచారిణీ ।

తా॥ తెల్లగా పుతికిన వస్త్రమును ధరించి ప్రతియింటికి తిరుగుచు ఉత్సాహముతో పరిహాసల్లాపములనాడుచు జయింపశక్యముగాని మన్మథునిచేత సంతప్తనై కామచారిణినయితిని.

శ్లో॥ యువానంరూపసంపన్నం వైశ్యంమేస్మాత్మకాముకం। మిథో వోచం మయాసంగం కాంక్షసే యది మాచిరమ్। తూర్ణ మాగచ్ఛ

మద్గేహం మహానిశి నసంశయః । తథేత్యుక్త్వా తదాచార స్సమా యాంతో మహానిశి ।

తా॥ ఇట్లు కామేచ్ఛాకలితనై చిన్నవయస్సులో నున్న సుందరుండైన ఒకవైశ్యుని జూచి అతనిని కామించి రహస్యముగా నతనితో నిట్లంటిని. ఓయీ సుందరుండా! నాతో సంగమమును జేయగోరితివేని యీరాత్రి మాయింటికి రమ్ము. ఇందుకభ్యంతరము లేదు ఇట్లు చెప్పగా వైశ్యుడును అట్లేయని ఆరాత్రి నాయింటికివచ్చెను.

శ్లో॥ అన్యోన్యభావసైస్స్నేహ కందర్పోదయహేతుభిః । తేనాహం రతిమత్యుగ్ర విధవాపిచకామినీ । రాత్రిశేషం క్షణమివ మయానీతం దురాసదం । జారోజగామతూర్ణంత ద్గృహాత్సోరుణోదయే ।

తా॥ మన్మథోద్దేశకపోషకములయిన పరస్పరసంభాషణములచేత వైశ్యునితో సంభోగించితిని. నేను విధవనయినను కామోద్రేకమున పాపకార్యముల కిట్లాచరించితిని. ఇట్లా రాత్రియంతయు క్షణముగా వెళ్ళెను. గూఢవిహారియయిన ఆవైశ్యజారుండును అరుణోదయముకాంగానే తన యింటికి వెళ్లెను.

శ్లో॥ ప్రభాతేహం యదాపూర్వం గృహకర్మణిసారవత్ నియుక్తా తత్రలోకైశ్చ తేనతృప్తాస్మినైమురాః ।

తా॥ ఉదయముకాగానే పూర్వమువలెనే గృహవ్యాపారములందు లోకులచేత నియోగించబడి దానితో సంతృప్తినొందుచుంటిని.

శ్లో॥ ఏవందినేదినేపుంభిర్యువభిర్నవయౌవనైః । స్వేచ్ఛాకార్థాతి సంతుష్టా రతినాకువ్యాచారిణే ।

తా॥ ఈప్రకారముగా ప్రతిదినమందు అనేకులైన పురుషులతో సంభోగించుచు వారివలన వశీకరముగా దివ్యములను పుచ్చుకొనుచుంటిని. ఇట్లు గూఢరతిచేత సంతృప్తనగుచు కాలము గడుపుచుంటిని

శ్లో॥ మయానాచరితఃక్వాపి సత్సంగసుఖదాయకః । స్నానాద్యాచారకర్మాణి నిందితాని మయాపురా ।

తా॥ ఇట్లు మన్మథవ్యసనముచేత కాలము గడిపితిని సుఖదాయకమయిన మంచి పని నాచరించ లేదు. స్నానము మొదలయిన ఆచారకర్మలుకూడ నాచరింపబడలేదు. ఇట్టి నిందితకార్యములను చేసితిని

శ్లో॥ మయా విష్ణుకథా నిత్యం నిందితాభ్యాసకా అపి । తతః పం
చత్వమాపన్నా గతేకాలే తతస్సురాః ।

తా॥ నిత్యము హరికథలను, తదభ్యాసకులనున్ను నిందించుదానను. ఇట్లు కొంత కాలము గడచిన తరువాత కాలమాసన్నమై మృతినొందితిని.

శ్లో॥ భుక్త్వా యమాలయే ఘోరే యాతనాం తీవ్రవేదనాం ।
తేనదోషేణ జాతాహం వ్యాఘ్రయోనౌ త్రిజన్మసు ।

తా॥ మృతినొంది నేను యమాలయమునుజేరి అచ్చట తీవ్రమయిన యాతనల ననుభవించి తద్దోషముచేత మూడ్జన్మలు పులిగా జన్మించితిని.

శ్లో॥ త్రివారం మర్కటత్వంచ పంచవారమనడ్వహం । శతవారం పునస్త్రీత్వం గతభర్తృత్వ మంజసా । శ్వానత్వ మష్టవారేషు పిశాచత్వం చతుశ్శతం । తథా కాకేషు ఘూకేషు కీటకేషు ఖగేష్వపి । సర్ప యోనిం సమాసాద్య శతవారం తథా సురాః । పశ్చాజ్జంబుకయోనౌతు ద్విశతం జన్మకుత్సితం । శతత్రయం విడ్వరాహో నకులేషు చతుశ్శతమ్ । తథా పంచశతం జన్మ బిడాలేషు పునః పునః । షట్ఛతం త్వాఖుయోనౌతు కృకలాసీ సహస్రకం। ప్రారబ్ధపుణ్యం వక్ష్యేహం శృణుధ్వం త్రిదశాలయాః॥

తా॥ పిమ్మట క్రమముగా మూడ్జన్మలు కోతిగను, అయిదుమార్లు యెద్దుగను, నూరు మార్లు స్త్రీనై విధవనై యుంటిని. తరువాత యెనిమిదిమార్లు కుక్కనై, నాల్గువందల మార్లు పిశాచముగను, అన్నిమార్లు కాకిగను, గుడ్లగూబగను, కీటకముగను, పక్షిగను, తరువాత నూరుమార్లు పాముగను. తరువాత రెండువందలమార్లు నిందితమైన నక్కగను పుట్టితిని. పిదప మూడువందలమార్లు పూరపందిగను, నాలుగునూరులమారు ముంగిసగను, అయిదునూరులమార్లు పిల్లిగను ఆరువందలమార్లు ఎలుకగను జన్మించితిని. ఓ దేవతలారా! యిప్పుడు మీచే చూడబడిన తొండజన్మము వెయ్యిమారు లనుభవించితిని. ఇట్లు దుర్యోనిసముద్రమగ్నయైన నాకిప్పుడీ పుణ్యదేహప్రాప్తికి కారణమును జెప్పెదను వినుడు.

శ్లో॥ పురాహం బాల్యవైధవ్యే వైశాఖేమధ్యగే రవౌ । పంచ వాసరపర్యాప్తం పథిశ్రాంతాయవై పురా । మయాదత్తం ద్విజాయేత్థం తేనయాయం కృపాకరాః । ముక్తికారణ ముద్యోగం దుర్యోనేర్మమ దేవతాః । కృతం యుష్మాభిరేతద్వః కథితం త్వఘసంచయమ్ ।

తా॥ ఓ దేవతలారా! స్త్రీధర్మముచే బాధపడుచు బాల్యవైధవ్యదోషము కూడ ననుభవించి నేను స్త్రీజన్మమెత్తి మహా వైశాఖమాసంబున పగలు (౧౨) పండ్రెండుఘంటల సమయంబున ద్వాదశీదినంబున సూర్యాతాపముచే వచ్చియుండిన నొక బ్రాహ్మణునకు అయిదుదినముల క్రిందటి చద్దియన్నమును భోజనముపెట్టితిని. అంత మాత్రము చేతనే మీరనుగ్రహించి దయచేసి నాకు సంభవించిన పెద్దయైన సంకటము నుంచి వెంటనే విముక్తిని కలుగజేసిన మహానుభావులని ఋషులు చెప్పెను.

శ్రీకృష్ణ ఉవాచ॥ శ్లో॥ ఇతిశ్రుత్వా తతో దేవా స్తస్యా వాక్యం సువిస్మితాః । తతశ్చక్రుస్సై ప్రవదతు ర్దేవాయరమణీం శుభామ్ ।

తా॥ ఓ జహ్నుమహాముని! వినుము. దేవతలిట్లా స్త్రీ పలుకులు విని ఆశ్చర్య పొందిరి తరువాత నామెను వారిలో నొకనికిచ్చి వివాహము జరిపిరి.

శ్లో॥ కృకలాసోఘదేహోఽపి ప్రాతర్మాఘాంబుబిందుభిః । సంసిక్తో ముముచే శీఘ్రం దివ్యనారీ బభూవహ । సా దేవవల్లభాభూత్వా మాఘ మాసప్రభావతః ।

తా॥ పాపదేహియైన తొండయును మాఘోదయమున నుదకబిందువులచేత తడుప బడి శీఘ్రముగా తొండశరీరమును విడిచి దివ్యవనితయై దేవప్రియ యాయెను. ఇదం తయు మాఘస్నానమహిమవలన కలిగినది.

శ్లో॥ భూయశ్చక్రంగవేషంతః సర్వే బృందారకాముసే । పద్మా ద్రేర్దక్షిణేసానౌ చకారఖరనిస్వనమ్ ।

తా॥ ఇట్లయినతరువాత దేవతలుతిరిగి దేవేంద్రుని వెదుక నారంభించిరి. ఇంద్రుం డును పద్మాద్రి దక్షిణసానువునందుండి గాడిదవలె కూయుచుండెను.

శ్లో॥ ఇంద్రోఽయమితి తే దేవా స్సర్వే జగ్మురరిందమాః । విని ష్క్రాంతం శచీనాథం ఖరగ్రీవం గుహాముఖాత్ । ఉత్సృష్టకర్ణమూర్ధ్వాస్యం దదృశు స్త్రిదశాలయాః ।

తా॥ ఆధ్వని విని యితఁడింద్రుఁడని దేవతలు అచ్చటకు వెళ్ళిరి. గుహలోనుంచి బయిటకు వచ్చినటువంటిన్ని, గార్దభముఖుఁడైనటువంటిన్ని, నిక్కబొడిచిన చెవులుగల వాడైనటువంటిన్ని, ఊర్ధ్వముఖుఁడయిన యింద్రుని జూచిరి.

శ్లో॥ కేచిన్నిశ్శ్వాసమాపన్నాః కేచిత్తంజహసుర్భృశం । కేచి

తూష్ణీంస్థితా స్తదృష్ట్వా దేవనాథం ప్రభుం తథా । ఖరగ్రీవ స్తతో దేవా న్దృష్ట్వాతూర్ణం గుహాంగతః ॥

తా॥ చూచి కొందరు దుఃఖించిరి. మఱికొందరు నవ్విరి కొందరు దేవపతియును, తమకు ప్రభువును నయిన యింద్రుని జూచి యేమియు ననజాలక యూరకుండిరి. గాడిద ముఖముగల యింద్రుడును దేవతలనుజూచి సిగ్గుతో త్వరగా గుహాలోపలకు వెళ్లెను.

శ్లో॥ హ్రియా దుఃఖేన విపులం దేవేంద్ర శ్చింతయ న్నఘం । గచ్ఛంతమనుజగ్ము స్తే మహాంతో దైత్యశత్రవః । కోణే కోణే విలీనో భూదింద్ర స్తే పాపదృశ్యకః । తత స్తేన్వేషమాణాశ్చ దేవా స్తత్రగుహాంతరే । సాంధకారేజగుర్వీక్ష్య సవ్రీడంగర్దభాననమ్ ॥

తా॥ దేవతలనుజూచి యింద్రుడును తన పాపమును స్మరించుచు లజ్జచేతను, దుఃఖముచేతను చూడలేక గుహాలోపలికి వెళ్లెను. ఆదేవతలును యింద్రునితోకూడా బిలములోనికి పరుగెత్తిరి. ఇంద్రుడును వీరికి అదృశ్యుడై మూలమూలల దాగుచుండెను. దేవతలింద్రుని గానక అంధకారముతో గూడిన గుహాయందు వెదుకుటకును సమర్థులుగాక బహు ప్రయాసమీద చీకటిలో గాడిదముఖముతోనున్న యింద్రుని గుర్తించి అతనితో నిట్లనిరి.

శ్లో॥ వజ్రపాణే వయం దేవాః మాభయం మాభయం తవ । తవాగతమఘం సర్వం విష్ణునా బోధితా వయం । అన్వేషమాణా స్త్వా మింద్ర మగ్రీవార్థం ఖరాననమ్ ॥

తా॥ ఓ వజ్రహస్తా ! మేము దేవతలము. నీకు భయములేదు. నీకు భయములేదు. నీపాపమును విష్ణుదేవునివల్ల తెలిసికొని నీ గాడిదముఖమును నశింపజేసి నీకు సుముఖమును గలుగజేయ సంకల్పించి నిన్ను వెదుకుచు వచ్చినాము

శ్లో॥ ఇత్యుక్త్వా తేమరాశ్శక్రం పాణిభిః పాణిమగ్రహీత్ । హిత్వా గుహాం బహిర్గత్వా దేవేంద్రేణ మరాస్సమమ్ ॥

తా॥ ఆ దేవతలిట్లుపలికి సమీపమునకు బోయి తమ చేతులతో తమ నాథుని హస్తము పట్టుకొని యింద్రునితోసహా యింద్రకింకరులు బయటకు వచ్చిరి.

శ్లో॥ శక్తిహీన శ్శచీనాథః ఖరాస్యో నమ్రకంధరః । తుంగభద్రాముపాగచ్ఛ త్సదేవై స్స్వర్గవాసిభిః ॥

తా॥ ఇంద్రుఁడును శక్తిలేనివాఁడై గార్దభముఖుఁడై సిగ్గుచేత తలవంచుకుని దేవతలతోఁగూడా మెల్లగా తుంగభద్రానదీ సమీపమునకు వచ్చెను.

శ్లో॥ ప్రాతర్మందోదకేమార్కే మాఘేనక్రంగతే రవౌ । ప్రతిపత్తిథిమారభ్య మాఘేశుక్లస్యమజ్జనం । త్రింశత్స్వపిహరేష్వేషు తిథిష్వాత్మాఘముక్తయే । తుంగభద్రోదకేశక్ర శ్చకారదివిజైస్సహ ॥

తా॥ అట్లు వచ్చి మకరమందు రవి యుండఁగా మాఘశుక్ల పాడ్యమి మొదలు పాపవినాశములయిన ముప్పది దినములందును తన పాపనివారణార్థము యింద్రుఁడు దేవతలతో సహా తుంగభద్రానదీజలమందు మాఘస్నానమాచరించెను.

శ్లో॥ శాపపాపవినిర్ముక్త శ్శక్రశ్చసుముఖ స్తథా । వినశ్యతిఖరాస్యంతు సుముఖత్వంబభూవహా ॥

తా॥ దేవేంద్రుఁడు మాఘస్నాన మహిమచేత భూదేవశాప పాపవినిర్ముక్తుని డాయెను. అతనిముఖము అప్పుడే సుముఖమాయెను. గాడిదముఖముకనిపించుటలేదు.

శ్లో॥ దేవా దేవపతింద్రుష్ట్వా తుష్టువుస్సాధుసాధ్వితి । శక్తిర్భవేత్తతస్సమ్యక్ స్వర్గాగమనసాధనా ॥

తా॥ దేవతలిట్లు భూదేవశాపముక్తుఁడయిన దేవేంద్రునిజూచి మంచిది. చాలా మంచిదని స్తోత్రము చేసిరి. ఇంద్రునకును స్వర్గగమనసాధనమయిన శక్తికలిగెను.

శ్లో॥ వాసవస్స్వగణైస్స్వర్గం ప్రయయౌ మునిసత్తమ । మాఘమజ్జనమాత్రేణ మాసేస్మి న్నఘహారకే । కృతపావ వినిర్ముక్త శ్శక్రో వశాప్రనోపివా ॥

తా॥ తరువాత యింద్రుఁడు తన దేవగణములతో స్వర్గముచేరెను. జహ్నుమహాముని! వింటివా. మాఘస్నానమహిమచేతనే వశాప్రనుఁడయిన దేవేంద్రుఁడు పాపముక్తుఁడాయెను.

శ్లో॥ ఇతితేకథితో జహ్నో మయామాఘఫలోదయః । యశ్శృణోతీమమధ్యాయం మాఘస్నానపరాయణః । విముక్తోఘైర్హరిం యాతి భుక్త్వాఖిలసంపదః ॥

తా॥ ఓ జహ్నుమహాముని! యీప్రకారముగా నీకు మాఘమాహాత్మ్యమును

చెప్పితిని. మాఘస్నాన మాచరించిన పుణ్యాత్ములు యిహలోకమందనేక సంపదల ననుభవించి అంతమందు హరిని చేరుదురు. వినువారికిగూడ ఫలముగలదు.

శ్లో॥ పంపాతీరే పురా కశ్చిత్ పిశాచో ఘోరదర్శనః । విముక్త స్సుఖమాపేదే శ్రుత్వా మాఘకథాం యథా ॥

తా॥ పూర్వకాలంబున పంపాతీరమందు భయంకరదర్శనుఁడయిన ఒక పిశాచుఁడు మాఘకథను విని పాపముక్తుఁడాయెను.

ఇతి ద్వాదశోధ్యాయ స్సమాప్తః.

---

## అథ త్రయోదశోధ్యాయ ప్రారంభః

శ్రీజహ్నుః॥ శ్లో॥ పాయం పాయం నమే తృప్తి స్త్వత్తో విష్ణుకథామృతం । ఇదం భాగవతం శాస్త్రం భూయఃకథయమే ప్రభో ॥

తా॥ జహ్నుమహాముని తిరిగి అడుగుచున్నాఁడు. ఓగృత్స్నమదమహాత్మా! నీవలన విష్ణుకథామృతమును యెంతగా పానముచేసినను నాకు తృప్తితీరలేదు. భగవత్సంబంధమయిన యీ మాఘకథను తిరిగి నాకు చెప్పవలెను.

శ్లో॥ కోసౌ నిశాచరః పాపః కేన మాఘఫలం శ్రుతం । కథం పిశాచదేహాచ్చ ముక్తిః పంపాతటేనఘ ॥

తా॥ ఆపిశాచుఁడెవ్వఁడు. ఎట్లు మాఘమాహాత్మ్యమును వినెను. ఎట్లు పంపాతీరమందు పిశాచత్వముక్తి గలిగెను.

శ్రీగృత్స్నమదః॥ శ్లో॥ పంపాతీరే పురా కశ్చిత్ వైశ్యో బహుధనాధిపః । సర్వరాజాశ్రియేతస్యా స్తటే పంపాపురాహ్వయే ॥

తా॥ ఇట్లు జహ్నువడుగఁగా గృత్స్నమదుఁడు చెప్పుచున్నాఁడు. పూర్వకాలంబున పంపాతీరమందు సర్వరాజాశ్రయమయిన పంపానగరమందు బహుధనాధిపుఁడయిన ఒక వైశ్యుఁడుండెను.

శ్లో॥ తతః కాలేగతే వైశ్యో మహారమరణాగమే । యస్మాత్తేనార్జితం కించిత్ నశ్యాత్తేనోపహాదితమ్॥ సోఽదత్తే చదోషేణ దరిద్రో భూత్పునర్భువి । దరిద్రాత్తశ్చకారాఘం బహుపాపస్సరశ్చలేత్ ॥

తా॥ కొంతకాలమునకు కాలమాసన్నమై వైశ్యుఁడు యమపురికి జేరెను. అతఁడు జీవించు కాలమందు ఎన్నఁడును స్వార్జితధనమందు కొంచెమయినను సత్పాత్రియందు వినియోగించనందున తద్దోషముచేత నరకాంతమందు తిరిగి భూమియందు దరిద్రుఁడై పుట్టెను. దరిద్రుఁడగుటచేత అనేక పాపములు జేసెను. అందుచేత వాఁడు బహుపాపిష్ఠుఁడై యుండెను. శ్లో॥ అదానదోషేణ భవేద్దరిద్రో దారిద్ర్యదోషేణ కరోతిపాపం । పాపాదవశ్యంనరకంప్రయాతి పునర్దరిద్రః పునరేవపాపీ॥ అన్నట్లు వాఁడు జన్మమెందలి అదానదోషముచేత (దానధర్మములు చేయని పాపాత్ముఁడగుటవలన) దరిద్రుఁడాయెను. దారిద్ర్యనివారణకొఱకు పాపములాచరించెను.

శ్లో॥ తేనదోషేణతత్రైవ మృతస్సోఽనిపాతకః । పంపాతీరేవటే విప్రః పిశాచోభూత్సుదారుణః ।

తా॥ ఆదోషముచేత వాఁడు పిడుగుపడి చచ్చెను. చచ్చి ఆ పంపాతీరమందొక మఱ్ఱిచెట్టుమీద పిశాచమైయుండి ప్రజలకు భయంకరుఁడై యుండెను.

శ్లో॥ భక్షయన్ సర్వజంతూంశ్చ భూచరాన్ ఖేచరానపి । తతస్త్వంతరితే కాలే స్నానార్థీ బ్రహ్మనందనః । వసిష్ఠశ్చాజగామాస్య స్సలిలేచానుగైర్వృతః । స్నాత్వా పంపాజలేపుణ్యే మాఘే సూర్యోదయేమునిః ॥ కృత్వా కర్మాణిసర్వాణి శుచిశ్శుద్ధమతిస్తతః। సమభ్యర్చ్య విధానేన విష్ణుంవిశ్వాఖిలేశ్వరమ్ । వసిష్ఠస్తత్సమీపేతు శిష్యేభ్యోవిష్ణుసత్కథాం । మాఘమాసం మహాపుణ్యం భగవత్ప్రియకారకం । శిష్యానభిముఖాన్కృత్వా శ్రుణుధ్వమితిసోఽబ్రవీత్ ।

తా॥ ఇట్లుండి భూమియందు సంచరించునవియును, ఆకాశమందు సంచరించునవియును నయిన భూతములను భక్షించుచుండెను. ఇట్లుండఁగా కొంతకాలమునకు స్నానముకొఱకు బ్రహ్మపుత్రుఁడయిన వసిష్ఠమహర్షి వచ్చి శిష్యులతోసహా పంపాజలమందు మాఘోదయంబున స్నానముజేసి నిత్యకర్మల నిర్వర్తించి శుచియై విధివిధానముగా విశ్వాధిపుఁడయిన విష్ణువు నారాధించి తత్సమీపమందు శిష్యులకు విష్ణుచరిత్రగర్భితమయిన మాఘవైభవమును జెప్పదలంచి వారిని అభిముఖులనుగా జేసి విఖ్యాత మాఘమహిమను జెప్పనారంభించెను.

శ్రీవసిష్ఠః। శ్లో॥ మాఘేస్మిన్ యే నిమజ్జంతి మార్తాండస్యోదయే

నరాః । తేషాం గురూణిపాపాని ఆర్ద్రశుష్కాణ్యథాపివా । సద్యోవశ్యం త్యశేషాణి యథా సూర్యోదయేతమః ।

తా॥ ఎవ్వరు మాఘోదయమందు స్నానమాచరింతురో వారియొక్క సుకృత దుష్కృతములగు పొడివి తడివి అయిన పాపములు సూర్యోదయమందు చీకట్లువలె నశించును. తడివి అనఁగా యిప్పటివి, పొడివి అనఁగా పూర్వమాచరించినవి అని తెలియవలెను.

శ్లో॥ యేనస్నాతి రవౌమాఘే మకరస్థే నరాధమః । సర్వపాపాలయంవిప్ర తమాహుర్నరకాతిథిమ్ ।

తా॥ ఎవ్వఁడు మాఘోదయస్నాత గాడో వాఁడు సమస్త పాపనిలయుఁడై యుండి వాఁడు నరకమం దతిథియగుచున్నాఁడు. (నరకమనుభవించునని)

శ్లో॥ త్యక్త్వా యజ్ఞాదికర్మాణి తథాన్యాన్యతికృత్స్నశః। కృత్వా మాఘవ్రతంపుణ్యం యస్సయాతి హరేఃపదం ।

తా॥ యజ్ఞాది సమస్త కర్మలను విడిచియైనా మాఘవ్రతము సలుపు వాఁడు మాధవలోక నివాసియగును

శ్లో॥ ఇత్యాదిబహుభిర్వాక్యైః వసిష్ఠో మాఘసత్కథాం। వపాక శ్రోత్రశిష్యేభ్య శ్రావయామాసభక్తితః ।

తా॥ ఈరీతిగా వసిష్ఠుఁడు అనేక వాక్యములచేత మాఘమహిమను కరించి శిష్యులకు చెప్పుచుండెను.

శ్లో॥ శ్రుత్వా క్షణం తటస్థోయం రాక్షసో ఘోరదర్శనః । వటాత్పపాతవిప్రస్య పురతః పుణ్యయోగతః ।

తా॥ యిట్లు మఱ్ఱిచెట్టుక్రింద వసిష్ఠుఁడు మాఘమహిమను చెప్పుచుండఁగా తటస్థుఁడయిన రాక్షసుఁడు విని పుణ్యవశముచేత వటమునుండి వసిష్ఠునియందర పడెను.

శ్లో॥ నివేద్య స్వస్యవృత్తాంతం యత్రాప్తజ్జన్మని చేష్టితం । తం దృష్ట్వా విస్మితోభూత్వా వసిష్ఠో బ్రహ్మనందనః ।

తా॥ యిట్లుపడి తన పూర్వవృత్తాంతమును చెప్పను అతనినిజూచివసిష్ఠుఁడు ఆశ్చర్యమొందెను.

శ్లో॥ పంపాయాస్సలిలేనాయ స్తస్యాఘపరిశుద్ధయే । మాఘే సంస్నాపయామాస కుశైస్సంఘటికాద్వయం ।

తా॥ ఆశ్చర్యకరమైన రాక్షసుని పాపనివారణకొఱకు వసిష్ఠుఁడు మాఘంబున పంపాజలమందు రెండుగడియలకాలము దర్భలచేత స్నానము చేయించెను.

శ్లో॥ తథా విష్ణుకథాయాశ్చ శ్రవణేన నరాశనః । సర్వపాపైర్వినిర్ముక్తః పూర్వకర్మానుబంధకైః । సద్యోదివ్యవపుర్భూత్వా ప్రసాదాచ్ఛ్రీపాణినః । ప్రయయౌవిష్ణుసదనం కోటిసూర్యప్రభాన్వితం ।

తా॥ ఆ మాఘస్నానముచేతనున్ను, హరికథాశ్రవణముచేతనున్ను ఆ రాక్షసుఁడు పూర్వకర్మానురూపములయిన సర్వ పాపములచేత విడువఁబడినవాఁడై అప్పుడే మాధవానుగ్రహముచేత దివ్యదేహధారియై కోటి సూర్యకాంతి సమానమయిన విష్ణుమందిరము చేరెను.

శ్లో॥ యేలోకే హరిగాథబోధమతయః యేవాకథాభ్యాసకాః । యేవాతత్పదపంకజార్చనరతా యేవానిశంపూజకాః । తేతే సాధువరాస్సుకర్మనిరతాః స్వేష్టంచవిష్ణోఃపదం । సమ్యగ్యాంతిమపాకరోతిభగవానంతేస్వయాప్రదః ।

తా॥ ఈలోకమందు యెవ్వరు హరిగాథవిజ్ఞానయుతులో, యెవ్వరు హరికథాభ్యాసకులో, యెవ్వరు హరిపాదకమలార్చకులో, యెవ్వరు నిరంతరము హరిపూజకులో వారును, సుకర్మనిరతులును, సాధుకృత్యపరాయణులును నైనవారందఱు హరిపదనివాసులగుదురు హరియును వారికి తన స్వరూపము నిచ్చును.

శ్లో॥ యోగానేకమఖకర్మకోటిఫలదాం హత్యాద్యఘంహారిణీం । తీర్థస్నానసమస్తపుణ్యగదితాం సుజ్ఞానశీలప్రదాం । నిత్యానందకరీం నిరస్తనిఖిలశ్శశ్వత్ప్రవిత్రాలయాం । మాఘోయోనశృణోతి సోపి నిరయం ప్రాప్నోతివిష్ణోఃకథాం ।

తా॥ యోగాద్యనేక సత్కర్మ ఫలదమును, బ్రహ్మహత్యాది పాపనాశినియు, తీర్థస్నానాది సమస్తపుణ్య సమానమయినదియు లోక పుణ్యప్రదమయినదియు. లోక పుణ్యప్రాప్యయును, సుజ్ఞానసుశీలప్రదమును, నిత్యానందప్రదమును, దేహాభిమానత్యాగులకు నిత్యానందమయినదియునయిన విష్ణుకథను వినని మాఘుఁడు నరకమును బొందును.

శ్లో॥ షడ్వర్ణానేక సబిందుకృంగనవద్రై ర్హీనోపిసల్లక్షణైః । వ్యర్థ్యైస్త్రైఃపరివర్జితోగురుకథాలాపై ర్స్వరైంకాన్వితః ॥ శ్లోకోయర్సతథాపృపాధి కతకై ర్వ్యక్తోపిభక్త్యాముదా । యన్నామాంకిత గద్యవిదమైః శ్రావ్య స్సదా సాధుభిః ।

తా॥ షడవర్ణచింద్వాది దూష్యమయినప్పటికిని, సీసల్లక్షణ విరహితమయినను, కథాసందర్భము గమ్యముగా లేకున్నను, వ్యర్థ్యస్తము గానున్నను, శంకాయుతమయినను, హరినామాంకితమయిన శ్లోకము గాని గద్యము గాని భక్త్యేచ్ఛకులయిన పురుషుల చేత నిరంతరము వినదగినది

శ్లో॥ జన్మానేకతరంగవారిధిమహా గాధా విమగ్నాతురైః । కోధారః కథమస్య కిం పరమహో హాహేతిదుఃఖాన్వితైః ॥ శ్రావ్యార్హాక్షర సత్కథాతిసుఖదా సద్యఃకరాలంబినీ । నో చేద్ఘోరతరం ప్రయాంతికుధియః పాపంద్విజఘ్నోయథా ॥

తా॥ జనన మరణ పరంపరానేక తరంగయుతాగాధసముద్రమందు మునిఁగినను మనకిప్పుడేది ఆధారము, ఎట్లు తరింతుము, దీని కుపాయమేమి, అయ్యో యెంతకష్టమని దుఃఖాతురులయినవారికి అతిసుఖప్రదయు, శ్రావ్యాక్షరయు నైన హరిసత్కథా కాలక్షేపమే ముఖ్యంబగును. ఇట్టి హరికథను వినని వాఁడు బ్రహ్మహత్యవలె ఘోర నరకమును బొందును.

శ్లో॥ తస్మాద్విష్ణుకథాం పుణ్యాం నరా యే సుఖకాంక్షిణః । అభ్యాసమాచరన్నిత్యే స్సర్వపాపవిముక్తయే ।

తా॥ కావున సుఖమును కోరువారును సమస్త పాపనివారణ కాముకులును పుణ్యమయిన పుండరీకాక్షుని కథను అభ్యసించుచుండవలెను

శ్లో॥ విష్ణుగాథావిహీనస్య లోకవార్తారతస్య చ । ముఖంనాలోకయేత్క్వాపి ఆలోక్యాలోకయేద్రవిం ।

తా॥ విష్ణుకథాతిరస్కారుఁడును, లోకవార్తానుముఖుఁడు గానివాఁడును నైన వాని ముఖమును జూడగూడదు. ఒకవేళ చూచుట సంభవించెనేని వెంటనే సూర్యుని జూడవలెను.

శ్లో॥ విష్ణోశ్చజన్మకర్మాది యో వ్యాఖ్యాతి ముదాన్వితః । శ్రోతృభ్యోవక్తి యో భక్త్యా సభవేదచ్యుతస్స్వయం ॥

తా॥ ఎవ్వఁడు విష్ణు చరిత్రలను సంతోషముతో వ్యాఖ్యానము చేయుచుండునో, లేక వినునో, లేక చెప్పునో వాఁడు సాక్షాత్ నారాయణుఁడే యనఁదగును.

శ్లో॥ నిమిషంనిమిషార్ధంవా యశ్శృణోతి హరేః కథాం । సద్యస్సుఖమవాప్నోతి కిమన్యైర్బహుభాషణైః ।

తా॥ నిమిషముగాని, నిమిషార్ధకాలముగాని హరికథను వినువాఁడు సుఖమును బొందును. బహుగా చెప్పుటలో నేమి ఫలమున్నది. ఇదియే రహస్యము.

ఇతి త్రయోదశోధ్యాయస్సమాప్తః.

---

## —♦ అథ చతుర్దశోధ్యాయ ప్రారంభః ♦—

శ్లో॥ వక్ష్యామి శృణు విప్రేంద్ర మార్కండేయోదితం వచః । నైమిశేసుమహారణ్యే సమస్తమునిసేవితే । కదంబనీపవృక్షైశ్చ మధూకైశ్చహరీతకైః । హింతాలసాలపనస చంపాకాగరుగుగ్గులైః । తాలైశ్చామ్రాతకైశ్చైవ శిరీషైఃకుటజైస్తథా తమాలపిప్పలైశ్చైవ న్యగ్రోధైశ్చసుపుష్పితైః । నారికేళైశ్చలికుచైః నింబైర్గాయత్రినాసహ । నైమిశే సుమహారణ్యే గోమతీతీరవాసినీ । నానాద్రుమలతాకీర్ణే సర్వజంతుసుఖావహే । మునీనామభవద్వ్యాజో అన్యోన్యాధిక్యకాంక్షయా ।

తా॥ కృత్స్నమదమహాముని తిరిగి చెప్పుచున్నాఁడు. ఓ బ్రాహ్మణోత్తమా! మార్కండేయుఁడు వచించినప్రకారము నీకు జెప్పెదను వినుము. సర్వము సమస్త మునిబృంద సంసేవితమయినట్టువంటి గోమతీతీరమందున్న నైమిశారణ్యమందు మునీశ్వరులకు పరస్పరాధిక్య కాంక్షచేత కలహము జరిగెను. నైమిశ మెట్టిదనఁగా. చెప్పెదను వినుము. కదంబవృక్షములతోను, కడపచెట్లతోను, ఇప్పచెట్లతోను, హరీతకీహింతాల వృక్షములతోను, మద్దిచెట్లతోను, పనసవృక్షములతోను, చంపకాగరువృక్షములతోను, గుగ్గిలమ్రానులతోను, తాళవృక్షములతోను, ఆమ్రాతకద్రుమములతోను, శిరీషవృక్షములతోను, గిరిమల్లికలతోను, తాపింఛవృక్షములతోను, రావిమ్రానులతోను, వటవృక్షములతోను, నారికేళవృక్షములతోను, లికుచద్రుమములతోను, నిమ్మచెట్లతోను. చంద్రద్రుమములతోను శోభించుచున్నదియును, నానాద్రుమ లతాసంకీర్ణమయినదియును, సమస్తప్రాణులకు సుఖకరమయినదియును. (నైమిశమనఁగా బ్రహ్మనిర్మితస్య ధర్మ

చక్రస్య నేమిః యత్ర వ్యశీర్యత తత నైమిశం నేమిశీర్ణత్వ నైమిశమిత్యస్తారితాయ్య ధర్మ చక్రమయొక్క (నైభాగము) అస్థలము నైమిశమనబడెను )

శ్లో॥ భృగుశ్చాహంతపోనిష్ఠః యోగినాంధురిసంస్థితః । గౌతమ ప్రత్యువాచేదం జరతోహమిదిన్నుతం । బ్రహ్మకల్పే మయాదృష్టో తపో నిష్ఠేన యోగినా ॥

తా॥ మునికులమా మెట్టిదంటే, ముందుగా భృగువు నేను తపోనిష్ఠుడను. యోగులలో నే నగ్రగణ్యుడను. కనుక నే నందరికంటె యెక్కువవాడ నైతిని. అదివిని గౌతముడు నే నందరికంటె వయోధికుడను. నేను బ్రహ్మకల్పమును జూచితిని గాన నే నెక్కువవాడననెను.

శ్లో॥ లోమశః ప్రత్యువాచాథ యోమునీనామహం గురుః । నమయాసదృశః క్వాపి మునిబృందేషు విద్యతే ॥

తా॥ లోమశుడు నేను మునులకు గురువను. నాతో సమానుడు మునిసమూహములలో లేడనెను.

శ్లో॥ సముత్థాయ సభామధ్యే గార్గ్యోపి వృద్ధ స్సగద్గదః । అబ్రవీ ద్వాక్యమార్గోహ మనంతనిగమాలయః । నమయాసదృశః క్వాపి ముని బృందేషు విద్యతే ॥

తా॥ ఇంతలో వృద్ధగార్గ్యుడు లేచి గద్గదస్వరముతో నేను పూజ్యుడను. బహుకాలము శాస్త్రముల చెప్పినవాడను గాన నాతో సమానుడు మునిబృందము లలో లేడనెను.

శ్లో॥ అబ్రవీదథమాండవ్యః కాల్యకర్మప్రవర్తకః । సత్కర్మనిరత శ్శ్రేష్ఠః సర్వశాస్త్రవిశారదః । నమయా సదృశః క్వాపి మునిబృం దేషు విద్యతే ॥

తా॥ పిమ్మట మాండవ్యుడు నేను కాలమునం దాచరించదగిన కర్మలను ప్రవర్తింప జేయువాడను. సత్కర్మనిరతుడను. సర్వశాస్త్రపండితుడను. శ్రేష్ఠుడను గాన నాతో సమానుండు మునిబృందములలో నెచ్చటను లేడనెను.

శ్లో॥ అథాహ కంగనః కోపా త్సభామధ్యేయుజే క్షణః । యోగా భ్యాసరతస్సమ్యక్ సమాధిస్థోహమాత్మవిత్ ॥ నమయా సదృశః క్వాపి మునిబృందేషు విద్యతే ॥

తా॥ అంతలో శంతనుఁడు కోపముచేత కన్నెఱ్ఱజేసి లేచి నేను యోగాభ్యాసముఁడను- సమాధియందున్నవాఁడను- ఆత్మజ్ఞానిని గాన నాతో సమానుఁడు మునిబృందములలో నెచ్చటను లేఁడనెను.

శ్లో॥ ఉవాచాంతర్జ్వల త్కోపా త్పౌలస్త్యో మునిపుంగవః । వేదశాస్త్రార్థవిద్యాద్యై శ్శిక్షితో వృద్ధపూజితః । న మయా సదృశః క్వాపి మునిబృందేషు విద్యతే ।

తా॥ పౌలస్త్యుఁడు లోపల మండుచున్న కోపముచేత నేను వేదశాస్త్రాది విద్యలచేత శిక్షితుఁడను- వృద్ధపూజితుఁడను గాన నాతో సమానుఁడు మునిబృందములలో నెచ్చటను లేఁడు.

శ్లో॥ శౌనకోప్యవదత్తూర్ణ మగ్రగణ్యో మహాత్మవిత్ । పూజ్యోహం మునిభిస్సిద్ధై ర్నకోపి సదృశో మయా ।

తా॥ శౌనకుఁడు వడిగా లేచి నేనగ్రగణ్యుఁడను- ఆత్మజ్ఞానిని- సిద్ధమునుల చేత పూజింపదగినవాఁడను గాన నాతో సమానుఁడు లేఁడు.

శ్లో॥ ఏవమన్యోన్య సంభూతై ర్వాక్యైరుగ్రై ర్మునీశ్వరాః । సంజాతమన్యవస్సర్వే యుయుధుస్తే పరస్పరమ్ ।

తా॥ ఈప్రకారముగా మునీశ్వరులు పరస్పరముగా మాటలాడి కలహవాక్యములతో కోపోద్దీపితులై అన్యోన్యముగా యుద్ధమాడిరి.

శ్లో॥ భృగోస్సమీపమాయాతాః కేచిన్మునివరాజవాత్ । జటాముత్పాటయామాసు ర్ముష్టిభిస్తాడయన్మునే ।

తా॥ ఓ మునిశ్రేష్ఠా! వినుము- వారిలో కొందఱు శీఘ్రముగా భృగుమహర్షి వద్దకుబోయి అతని జటలను పీకి పిడికిళ్లతో గ్రుద్దిరి

శ్లో॥ గౌతమశ్మశ్రురోమాణి సముత్పాట్యముదాయుతామ్ ।

తా॥ మఱికొందఱు గౌతముని గడ్డము పీకిరి.

శ్లో॥ సోపితాన్ వ్యథయామాస ముష్టినా వ్యగ్రబాహునా । అన్యోన్యముష్టిఘాతవ్యథితాః యుయుదుర్బాష్పలోచనాః ।

తా॥ గౌతముఁడును వానిని వడిగా తన పిడికిలిచేత కొట్టెను. ఆ ముష్టిఘాతములచేత బాధితులై కళ్లవెంట నీళ్లుకార్చుచు నేడ్చిరి.

శ్లో॥ తథాన్యేఽపి కోపతంతప్తాః గార్గ్య మాండవ్య ముఖ్యకాః ।
తూర్ణంవిశీర్ణయామాసు శ్శాస్త్రాదీన్ప్రతివాదినః ॥

తా॥ అట్లుగాక అన్యులయిన వృద్ధగార్గ్య మాండవ్యప్రముఖమునీశ్వరులు తమ ప్రతివాదుల కాటులు మొదలయినవాటిని శీఘ్రముగా చించివేసిరి

శ్లో॥ అజినం ఛత్రం కౌపీనం శీతాతప నివారణం । చూర్ణయామాసురగ్రేణ స్వకరస్థం కమండలుమ్ ॥

తా॥ ఇట్లు కృష్ణాజినమును, ఛత్రమును, కౌపీనమును, కమండలమును, కోపముచేత చూర్ణముగా చేసిరి. మఱియు.

శ్లో॥ ద్విధాబభంజురన్యోన్య దండాన్ దండైర్విఘాతితాః॥ దండైః కృష్ణాజినైస్తద్వ న్ముష్టిభి ర్వస్త్రరజ్జుభిః । జటాశ్మశ్రుభిః కేశైశ్చ యుయుధుస్తే పరస్పరమ్ ॥

తా॥ ఒకరిదండముల నొకరు ఖండించిరి. ఇట్లు దండములతోను, అజినములతోను, ముష్టులతోను, వస్త్రములతోను, త్రాళ్లతోను, బాధలు పలుకుచు వారలు యుద్ధము సలిపిరి.

శ్లో॥ రజోగుణవిమిశ్రాస్తే యథామోహాఃపరస్పరం । ఆసీద్ఘోరతరంయుద్ధం విష్ణుమాయావిమోహితాః । సర్వేహంకారదృప్తాస్తే మునయ స్తనుమానినః ॥

తా॥ ఆమునీశ్వరులు రజోగుణస్వభావులై, విష్ణుమాయామోహితులై, అహంకారగర్వితులై, దేహాభిమానగ్రస్తులై మూఢులవలె ఘోరయుద్ధముచేసిరి.

శ్లో॥ తానభ్యేత్య తథావిప్ర నారదః కలహప్రియః । పునశ్చాన్యోన్యయుద్ధాయ ప్రేరయిత్వా పరస్పరం । తతో వైకుంఠమగమ ద్దేవ ద్విష్ణో ర్నివేదితుమ్ ॥

తా॥ ఇంతలో కలహప్రియుఁడయిన నారదమునివరుఁ డచ్చటికి విచ్చేసి తిరిగి యుద్ధమునకు పురికొల్పి యీ సంగతిని విష్ణువుతో చెప్పుటకొఱకు వైకుంఠలోకమునకు వెళ్లెను.

శ్లో॥ నారదస్తత్ర హరయే తస్మై సర్వం న్యవేదయత్ ।

తా॥ ఇట్లు వెళ్ళి నారదుఁ డచ్చట ఈ వృత్తాంతమును హరికి తెలియజేసెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా భగవాంస్తత్ర నారదం పునరబ్రవీత్ । మన్మాయాహృతబుద్ధీనాం మునీనాం విపినౌకసామ్ ॥ యముద్దిశ్య భవేదేషాం కలహో వ్యసనాలయః । ఉపాయే వినా జేతుం న చాన్యైరపి శక్యతే ॥

తా॥ భగవంతుఁ డామాట విని నారదునితో నిట్లనియె. ఓ నారదా! నా మాయచేత మోహితులయిన వనమందుండు మునులకు యిప్పుడు కలిగిన వ్యసనాలయమయిన కలహము ఉపాయముచేత నివర్తించదగినది గాని మఱియొక విధముగా నివారణగాదు.

శ్లో॥ తేషాం జ్ఞానోదయార్థం తు ప్రేషయామి హ మత్ప్రియాన్ । సనకశ్చ సనందశ్చ సనత్కుమార ఏవ చ । సనత్సుజాతశ్చతురాః బాలకాః పంచవార్షికాః । లయోదయయుతా వృత్తి ర్యాభ్యాయోభూయ శ్చతుర్యగాః । బాలకత్వే ప్రవర్తంతే సనకాద్యా మమ ప్రియాః । తదాహం ప్రేషయే వృద్ధం మార్కండేయం మహామతిమ్ ॥

తా॥ కాఁబట్టి వారికి జ్ఞానోత్పత్తికొఱకు నాకు ప్రియులయిన సనకసనందన సనత్కుమార సనత్సుజాతులను పంపెదను. వారెల్లప్పుడును అయిదువత్సరముల బాలురుగానే యుందురు. వీరిబాల్యమందే చతుర్యుగములు ఉదయ లయములను బొందుచుండును. వీరు నాకు మిక్కిలి ప్రియులు. వీరిని పంపునపుడు మహా బుద్ధిశాలియు వృద్ధుఁడును నయిన మార్కండేయునిన్ని బంపెదను.

శ్లో॥ సప్తకల్పస్థాయీ చ జరఠ సాధుసమ్మతః । మార్కండేయస్య చైతేషాం వివాదస్సంప్రవర్తతే ॥ కలహగ్రస్తచిత్తానాం మునీనాం పశ్యతాం మునే । త్వం తూష్ణీం తిష్ఠ దేవర్షే సదస్యేషాం విలోకయన్ ॥

తా॥ ఆ మార్కండేయుఁడు సప్తమహాకల్పముల పర్యంతము జీవించియుండువాఁడు. ముసలివాఁడు. సజ్జనప్రియుఁడు. ఓ నారదా! అచ్చట కలహించుచున్న మునుల సభలో మార్కండేయునకును, సనకాదులకును వివాదము జరుగును. నీవు ఆ సభకువెళ్ళి కొంచెము చూచుచుండుము.

శ్లో॥ ఏవం భగవతా విష్ణో ర్నారద స్సాధుసత్తమః । ప్రతియాతః ప్రియాత్మేన కౌతుకం దర్శనోత్సుకః ॥

తా॥ ఇట్లు భగవదాజ్ఞచేత నారదుండును అవిహానసుంతయు నిఁగోరి త్వరగా వెళ్లెను

శ్లో॥ విష్ణునా ప్రేరితమతిః మార్కండేయుస్సభాంగతః । సర్వాన్ సాంత్వయామాస సాధువాక్యైశ్చ సస్మితైః ॥

తా॥ మార్కండేయుఁడును మాధవప్రేరితుఁడై మునిసభకు వచ్చి సాధువాక్యములచేత మునులకు ఊరడించెను.

శ్లో॥ ఆశ్వస్తా మునివర్యేణ మునయః కలహేధృతాః । తూష్ణీం బభూవుర్విప్రేంద్ర తుండికేనోరగం యథా ॥

తా॥ యిట్లు కలహించుచున్న మునులు మార్కండేయునిచేత అశ్వాదించబడినవారై సర్పమును బట్టుకొన్నట్లు యూరకుండిరి.

శ్లో॥ తత్ర కించిద్గతే కాలే సనకాద్యాః కుమారకాః । ఉచ్చరన్నచ్యుతం విష్ణోర్నామాన్యాదిత్యభాస్వరాః । బ్రహ్మాజ్ఞా భగవద్ధ్యానా స్సమాజగ్ముస్సభాంమునే ॥

తా॥ ఇట్లు కొంచెము కాలము గడచినతరువాత బ్రహ్మపుత్త్రులును, భగవద్ధ్యానలోలులును నయిన సనకాదికుమారులు ఉచ్చస్వరముతో విష్ణునామములను పఠించుచు సూర్యకాంతితో వెలుఁగుచు వచ్చిరి.

శ్లో॥ తాన్ దృష్ట్వా దూరతస్తూర్ణం మృకండుతనయస్సుధీః । సముత్థాయాసనాదేవా మభియాతస్సభాంతరే ॥

తా॥ వారిని దూరముగా జూచి బుద్ధిమంతుఁడయిన మార్కండేయుఁడు శీఘ్రముగా ఆసనమునుండి లేచి వారి కెదురొడ్డెను

శ్లో॥ సమభ్యర్చార్ఘ్యపాద్యైశ్చ మధుపర్కపురస్సరం । తేభ్యో నమోమహాష్టేణ పాదయోస్సపృథక్పృథక్ । దధారశిరసి హ్యేషాం పాదప్రక్షాళనోదకమ్ ॥

తా॥ ఎదుర్కొని అర్ఘ్యపాద్యములచేత బూజించి మధుపర్కమిచ్చి వారి పాదములకు ప్రత్యేకముగా నమస్కరించి పాదప్రక్షాళనము గావించి పాదోదకమును శిరస్సునందు ధరించెను

శ్లో॥ తం దృష్ట్వా విస్మితా స్తత్ర సనకాద్యాః కుమారకాః । మృకండుసుతమాహుస్తే సదస్యస్థిత్ మునీశ్వరమ్ ॥

టీ॥ ఇట్లు పలుకుచున్న మార్కండేయునిజూచి ఆశ్చర్యమొంది సనకాదులు ఆసభలో మార్కండేయునితో నిట్లనిరి

శ్లో॥ భవాన్ వృద్ధో మునిశ్రేష్ఠో మునీనాం ధురిపూజితః । కల్పస్థాయీ తథాసప్త బ్రహ్మాద్యైరభివందితః । అస్మాకమత్రసదసి హ్యర్ఘ్యపాద్యాభివందనం । కథంకరోషివిప్రేంద్ర భగవన్మునిసత్తమ ।

టీ॥ నీవు వయోవృద్ధుఁడవు. మునిశ్రేష్ఠుఁడవు. మునులలో అగ్రగణ్యుఁడవు. సప్తమహాకల్పస్థాయివి. బ్రహ్మాదులకు వందనీయుఁడవు. ఓ మార్కండేయా! యిట్టి నీవు యీసభలో మాకు అర్ఘ్యపాద్యాదుల నెందుకుచేసితివి. (కృత త్రేతా ద్వాపర కలియుగ చతుష్టయం మహాయుగం భవతి ఏతద్దేవదివ్యయుగ మిత్యుచ్యతే మహాయుగ సహస్రం బ్రహ్మణోహః తావానేవరాత్రికాలః ఏతాదృశాహోరాత్రాణి షష్ట్యుత్తర త్రిశతాని బ్రహ్మణోవత్సరః (౩౬౦) తాదృశసంవత్సరాశ్శతం బ్రహ్మణఆయుష్కాలః తదా బ్రహ్మకాయోద్భవతి తతో బ్రహ్మాదిసృష్టిర్నశ్యతి యావంతంకాలం బ్రహ్మ వర్తతే తావత్సంఖ్యాకకాలో బ్రహ్మభావే నవర్తతే బ్రహ్మభావకాల ఏవ మహాకల్ప ఇత్యుచ్యతే ॥ అనఁగా కృతాది యుగ చతుష్టయము మహాయుగమనఁబడును. వెయ్యి మహాయుగములు బ్రహ్మకు పగలు. అంతరాత్రి. యిట్టి మూడువందల అఱువదిరోజులు ఒక సంవత్సరము. ఇట్టి నూఱుసంవత్సరములు బ్రహ్మయుష్కాలము. తరువాత బ్రహ్మాదులు నశింతురు. అదియే మహాకల్పమనఁబడును. బ్రహ్మకాలమందు మహాకల్పకాలము యిట్టి సప్తమహాకల్పములు మార్కండేయుని ఆయుష్కాలము

శ్లో॥ అభ్యుత్థానాభిగమనం వయోవృద్ధశ్చ వందనం । నకుర్యాద్బాలకేభ్యశ్చ శ్రుతిరేషాప్రవర్తతే ।

టీ॥ వయోవృద్ధుఁడు బాలులకు అభ్యుత్థానాభిగమనమును వందనమును చేయకూడదు ఈలాగున శ్రుతియున్నది.

శ్లో॥ వయంత్వైవిప్రశార్దూల బాలకాః పంచవార్షికాః ।

టీ॥ బ్రాహ్మణోత్తమా! మేము పంచసంవత్సరముల వయస్సుగల బాలులము మీరు వయోధికులు సప్తకల్పస్థాయులు. ఇట్టి మీరు మాకు వందనాదులు చేయవచ్చునా

శ్లో॥ ఇత్యుక్తస్సనకాద్యైశ్చ తైస్తథా పంచవార్షికైః । మార్కండేయోథతానాహ సభాయాం సూనృతంవచః ।

తా॥ ఈప్రకారముగా పంచవత్సరముల బాలునిచేత పలుకబడి మార్కండే యుఁడు ఆ మునిసభలో వారితో సత్యమయిన వాక్యమును వక్ష్యమాణప్రకారముగా పలికెను.

శ్రీమార్కండేయః । శ్లో॥ శృణ్వంతు భగవద్గానాః ప్రవక్ష్యా మ్యత్రసంసది । ఆయుః ప్రయాతి జంతూనాం వాసరే వాసరే గతే । యస్మాత్స్వవ్రణసంయుక్త కుంభస్రావోదకం యథా ।

తా॥ మార్కండేయుఁడు వచించుచున్నారు. ఓ భగవద్గాన మునులారా! (యత్ర ఇతరవ్యాపారాన్విహాయ నిరంతరం భగవంతం గాయంతి తే భగవద్గానా ఇత్యుచ్యతే॥) సమస్త వ్యాపారములను విడిచి నిరంతరము భగవంతుని గానముజేయువారు భగవద్గానులని చెప్ప బడుచున్నారు. కనుక యీసభలో చెప్పెదను. సమస్తప్రాణులకును ప్రతిదినమందు సూక్ష్మవ్రణసంయుక్తఘటోదకమువలె ఆయువు క్షీణించుచుండును

శ్లో॥ ఏకవింశతికల్పాంవా యేజీవంతి తతోమృతిః । నానృతంతు భవేత్క్వాపి యస్మాత్కాలాదిజీవనమ్ ।

తా॥ ఇరువదియొక మహాకల్పకాలము జీవించినను తిరిగి వారికి చావు తప్పదు. ఇందులో అసత్యమేమియు లేదు.

శ్లో॥ వార్ధక్యేనాథవాగ్ర్యేణ వేదశాస్త్రేణకర్మణా । యోగేన యోగధర్మేణ తపసా కిం సమాధినా । జ్ఞానహీన గుణత్వేన కేవలం చిరజీవినా ।

తా॥ ముసలితనముతో నేమిఫలము. వేదశాస్త్రపఠనతో నేమిఫలము. కర్మత త్వముతో నేమిఫలము. సమాధితో నేమిప్రయోజనము. తపస్సుతో నేమిఫలము. జ్ఞానహీనమయినచో యిదంతయు వ్యర్థము. జ్ఞానహీనునకు చిరంజీవిత్వముతో నేమి ప్రయోజనము.

శ్లో॥ స్వాత్మానుకాలక్షపణా ద్దుర్గతీనాంచ జీవనం। వ్యర్థమాయా ర్నసందేహః తస్మాత్ జ్ఞానం సుదుర్లభమ్ ।

తా॥ వృథాగా ఆయుష్కాలముగడచుటచేత దుర్మతులజీవనము వ్యర్థమగును. ఇందుకు సందేహములేదు. కాఁబట్టి జ్ఞానము దుర్లభముగాన జ్ఞానసంపాదకుఁ డెక్కువ వాఁడుగాని వ్యర్థముగా కాలముగడుపు వృద్ధుఁడు యెక్కువవాఁడుగాఁడు.

శ్లో॥ నానాకాలేనసమాపన్న జంతుర్లోకభయంకరః । కర్మాకర్మ ఫలాభ్యాంచ భుక్త్వాభూయస్తనుంవిశేత్ ।

తా॥ జంతువు నానాకాల మాసన్నమైనట్టు లోకభయమును బొంది పైలోక మందు సుకృతదుష్కృతములకు ఫలము ననుభవించి తిరిగి శరీరధారి యగును.

శ్లో॥ అనిత్యేనైవదేహేన కింతస్మాన్మూఢబుద్ధినా । విష్ణోఃకథా విహీనేన కోటికల్పేషుజీవినా ।

తా॥ కాఁబట్టి అనిత్యమయిన దేహమును ధరించి విష్ణుకథాశ్రవణాది విహీన ముగా కోటికల్పములు జీవించినను ఫలములేదు.

శ్లో॥ కించిన్నాస్తిఫలంతస్మా దన్యత్రస్తిమహాత్ఫలం । కైటభారి కథాలాపః నితరాంఫలదాయకః ।

తా॥ కాఁబట్టి యిట్టివాని బ్రతుకు నిరర్థకమయినది. హరికథా కలాపముచేత జీవించువాని బ్రతుకు సఫలమయినది.

శ్లో॥ నిమిషంనిమిషార్ధంవా యేశృణ్వంతిహరేఃకథాం । తేనరా హ్యగ్రగణ్యాశ్చ మునీనాం భువిపూజితాః ।

తా॥ ఎవ్వరు నిమిషమునుగాని, నిమిషార్ధకాలమునుగాని కాలము పోనివ్వక విష్ణుకథలను వినుచున్నారో వారు మునులకందర ముందుగా పూజించతగినవారు.

శ్లో॥ యూయందివానిశంవిష్ణో ర్ధ్యానార్చాలాపవందనైః । నివస త్యనిశం చక్రీ యుష్మాకం హృదయాంబుజే ।

తా॥ మీరు రాత్రింబగల్లు విష్ణుధ్యానపూజాకథాలాప పాదవందన నామకీర్త నాదులతో కాలమును గడుపుచుందురు. అందుచేత హృషీకేశుఁడు మీహృదయకమల మందు నిత్యనివాసము చేయును.

శ్లో॥ నచాస్మాభిఃక్షణార్ధంవా శ్రుత్వా విష్ణుకథా శుభా ।

తా॥ మేమయితేనో క్షణకాలమును విష్ణుసత్కథ వినినవారముగాము.

శ్లో॥ విష్ణోఃకథా విహీనోయః సోతి వృద్ధోపి బాలకః । బాలకస్త త్కథాసక్తః సవృద్ధఃపూజితస్సురైః ।

తా॥ యిట్లు మార్కండేయుని యొక్కయు, సనకాదుల యొక్కయు పాదములకు నమస్కరించి యిట్లనిరి- మీవలన మేము శిక్షింపబడితిమి- జ్ఞానప్రదమయిన విష్ణు కథను వినగోరితిమి గాన ఓ మార్కండేయా! మాకు చెప్పుమని అడిగిరి.

శ్లో॥ ఇతి తేషాం వచశ్శ్రుత్వా నారదాద్యా హరిప్రియాః॥ అను జ్ఞాతాయయుస్సర్వే శౌనకాద్యైర్హరేః పదమ్ ॥

తా॥ యిట్లు వారిమాట విని నారదాది నారాయణభక్తులు శౌనకాదులవలన అనుజ్ఞ బొంది హరినిలయము చేరిరి.

శ్లో॥ వ్యవేదయన్ముకుందాయ తేసర్వే నారదాదయః । సోపి శ్రుత్వా స్వయంజ్ఞాత్వో వ్యాసరూపీ జనార్దనః । సూతాయ జ్ఞాపయామాస వేదార్థం విశ్వతోముఖః । తతస్సూతముఖాత్సర్వే శుశ్రువుర్వై హరేః కథామ్ ।

తా॥ అచ్చటకు వెళ్ళి సమస్త వృత్తాంతమును విష్ణువునకు చెప్పిరి. వారివలన హరియు విని వ్యాసరూపుడై వేదార్థము నంతను సూతునకు చెప్పెను. తరువాత సూత ముఖమువలన అందరు హరికథను వినిరి.

శ్లో॥ శౌనకాద్యాస్తతస్సర్వే సాధుశాంతధియోభవన్ । వినా గురుప్రసాదేన సుజ్ఞానం నైవలభ్యతే ।

తా॥ తరువాత శౌనకాది తపోధనులందరు శాంతులైరి- కాబట్టి గురుప్రసాదములేక సుజ్ఞానమును పొందబడదు.

శ్లో॥ అష్టావదేన కృతకే బహు జంతవస్తే కర్మానురూప గుణ కారణ లబ్ధసంజ్ఞాః । పంచత్వమేత్యనకలా వ్యచిరేణ తస్మిన్ జ్ఞానేన తేన సుఖలబ్ధివిచారణం కిమ్ ।

తా॥ జంతువులు కర్మానురూపములయిన గుణ కారణములచేత లబ్ధసంజ్ఞులై బహుప్రకారములై తిరిగి ఉత్పత్తిస్థానమందే లయమొందును. ఇంతమాత్రమునకు సుఖ లాభేచ్ఛతో నేమి ప్రయోజనమున్నది- కటకమకుటాదులెట్లు సువర్ణమునుంచి ఉత్పన్నములై తిరిగి అచ్చటనే లయింపునో అట్లే జంతూత్పత్తిలయములు కాంగను.

శ్లో॥ శాంతస్య సర్వగుణశీలరతస్య వేద వేదాంగపంచకమహాత్మ్య

గురోః ప్రసాదాత్ । సంశ్రుత్య వైష్ణవకథా మఘకోటిహంత్రీం వక్త్రా త్ప్రకాశమతిమాన్ సముపైతిముక్తిమ్ ।

తా॥ సుందరుఁడైనటువంటిన్ని, సద్గుణశీలుఁడైనటువంటిన్ని, వేదవేదాంగముల నభ్యసించినటువంటిన్ని, గురువుయొక్క కటాక్షమువలన పాపనాశనకరమైన పద్మాత్ముని కథను విని ప్రకాశితబుద్ధియై ముక్తినొందును.

శ్లో॥ ఇతి తేకథితా జహ్నో కథా కౌతూహలాన్వయా । ఇత్థం యచ్ఛృణుతేసోపి ముక్తిమాప్నోత్యసంశయః ।

తా॥ ఓ జహ్నుమహాముని! ఈప్రకారముగా విష్ణుకథాశ్రవణ ముక్తపిశాచ కథాప్రసంగముచేత విష్ణుకథామహిమ సంతోషదాయకమైనందున వేడుకచేత ఆవిష్ణుకథను నీకు చెప్పితిని. ఈకథను వినువాఁడు నిశ్చయముగా ముక్తినొందును.

ఇతి చతుర్దశోధ్యాయస్సమాప్తః.

---

## —॥ అథ పంచదశోధ్యాయ ప్రారంభః ॥—

శ్రీగృత్సమదః॥ శ్లో॥ వక్ష్యామి భూయో గోవింద మాహాత్మ్య మఘనాశనమ్ ।

తా॥ ఓ జహ్నుముని! వినుము. విష్ణుకథాశ్రవణముచేత పిశాచుఁడు ముక్తినొందెనని చెప్పటచేత విష్ణుకథాప్రసంగ కౌతూహలమధికమై ప్రస్తుత మాఘధర్మమును విడిచి మాధవకథాప్రసంగమూలమగు మాని కలహాచరిత్రను చెప్పితిని. ఇంకను గోవింద కథాప్రసంగమును గూర్చిన మఱియొక పద్మాత్మునికథను చెప్పెదను. (క॥ యేకథలయందు పుణ్య, శ్లోకుఁడు హరి చెప్పబడును సూరిజనులచే, నాకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్॥)

శ్లో॥ రజస్తమోగుణాభ్యాంచ నిబద్ధౌ శంభువాక్పతీ । అస్మిన్న హంకారకలహే త్వన్యోన్యాధిక్యకాంక్షిణౌ । మత్తో నాస్త్యధికో బ్రహ్మా మత్తో నాస్త్యధిక శ్శివః ।

తా॥ పూర్వము బ్రహ్మమహేశులు రజస్తమోగుణావృతులై అన్యోన్యాధిక్యకాంక్షచేత కలహించుకొని నాకంటె అధికుఁడు లేఁడని బ్రహ్మయును నాకంటె అధికుఁడు లేఁడని శివుఁడును అనుకొనిరి.

శ్లో॥ సర్వేషా మేవ లోకానాం కర్తాహం సురవల్లభః । నాన్యః కర్తాస్తిలోకేషు భూర్భువస్స్వాదిషు ప్రభుః । ఇత్యాహ శంకరం బ్రహ్మా బ్రహ్మాణంచ శివ స్తథా । ప్రావర్తత తయోరేవం వివాద స్సుమహాన్ సురాః ।

తా॥ నేను సర్వలోకములకు కర్తను. దేవేశ్వరుఁడను. ఈ పదునాలుగులోకములలో నాకంటె కర్తలేదు. ఈప్రకారముగా శివునితో బ్రహ్మ పలికెను. ఇట్లే బ్రహ్మతో శివుఁడు పలికెను. ఇట్లుగా వారిద్దఱికి గొప్పగా కలహము జరిగెను.

శ్లో॥ కుర్వతోః కలహం నిత్య మాసన్ సాహస్ర వార్షికాః । అన్యోన్యగర్వనాశార్థం వాదకాలే తయోర్హరిః ప్రాదుర్బభూవ భగవాన్ విరాడ్రూప స్స్వయంప్రభుః ।

తా॥ ఈప్రకారముగా కలహించుచున్న వారికి వేయి సంవత్సరములాయెను. అప్పటికిని వివాదము నశించలేదు. అంతలో వారి గర్వనాశనముకొఱకు విరాడ్రూపుఁడును, స్వయంప్రభువును నయిన విష్ణువు (ప్రాదుర్భవించెను) ప్రత్యక్షమాయెను.

శ్లో॥ అనేకాదిత్యసంకాశః సహస్రవదనో వరః । సహస్రబాహుచరణః సహస్రనయన స్స్వరాట్ । స్వలోకాన్ సర్వతోవృత్వా ఉవ్య త్యతిష్ఠ ద్దశాంగుళమ్ ।

తా॥ ఆవిష్ణువు అనేకసూర్య సమాన కాంతిగలవాఁడును, అనేక ముఖములుగలవాఁడును అనేక బాహువులుగలవాఁడును, అనేక పాదములుగలవాఁడును, అనేక నేత్రములుగలవాఁడును, స్వయంప్రభువును, (అత్రసహస్రశబ్దోఽనంత్యవాచీ సర్వప్రాణినాంయాని ముఖబాహుచరణనయనాని తానిసర్వాణి విరాడ్రూపస్యాస్య దేహాంతఃపాతిత్వాదేతదీయాన్యేవేతి సహస్రవదనాదిత్వమస్యేతిబోధ్యం) ఆ పురుషుఁడు సర్వలోకములను వ్యాపించి బ్రహ్మాండ బహిఃప్రదేశమునున్న వ్యాపించియున్నాఁడు. (అత్రదశాంగుళశబ్దేన బ్రహ్మాండ బహిఃప్రదేశో వివక్ష్యతే)

శ్లో॥ దర్శయన్నిజలోకానాం విష్ణుర్వ్యాపకమాత్మనః। దదర్శతౌ స్తితౌ దేవౌ విరాడ్రూపమయం హరిం । దివ్యగంధానులేపాంగం దివ్యభూషణభూషితమ్ ।

తా॥ ఇట్లు లోకములకు తనయొక్క వ్యాపకత్వము చూపించువాఁడుగా వచ్చెను. (లోక చూపించువాఁడై వచ్చెననియు అర్థము.) తఱువాత బ్రహ్మ మహే

లుడు విరాజమానుడును, దివ్యగంధానులేపనము చేసికొన్నవాడును, దివ్యాలంకార భూషితుడును నయిన విష్ణుపురుషుని జూచి

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా । యత్కర్ణ కోటరస్థానౌ ధాతృగౌరీపతీ తథా । తం దృష్ట్వా విస్మితౌ భూత్వా తావుభౌ దివ్యలోచనౌ । చక్రతుస్సమయం తత్ర అన్యోన్యాధిక్య కర్మణి । ఆద్యాన్యస్య పురుషస్యాభ్యా మాద్యంతౌ యదిదృశ్యేతే । పురుషస్యావయో రంత మాదింయః పశ్యతేధికః । స ఏవ చాధికః కర్తా సర్వలోకానామధీశ్వరః ॥

తా॥ అనేకములుగా విభక్తమైన యీ సమస్తప్రపంచము ఆవిష్ణుపురుషుని యొక్క ఏకదేశమందే యున్నది. బ్రహ్మమహేశ్వరులు అతని కర్ణవివరములలో నుండిరి. (వివరమనగా బిలము.) ఇట్టి మహాపురుషుని దివ్యనేత్రములతో జూచి అన్యోన్యాధిక్య కలహమందు వారు ప్రతిజ్ఞను చేసికొనిరి. ఎట్లనగా మనయిద్దరిలో నెవ్వడు యీ మహాపురుషుని ఆద్యంతములను జూచునో వాడు అధికుడు. వాడే లోకములకు కర్తయు, అధిపతియు నగును

శ్లో॥ ఇతితౌ సమయం కృత్వా అనంతం ద్రష్టుముత్సుకౌ । ఆద్యంత మ్మృగయంతౌ తౌ పురుషస్య మహాత్మనః ॥

తా॥ బ్రహ్మేశులిట్లు ప్రతిజ్ఞ జేసికొని అంతములేని ఆ మహాపురుషుని ఆద్యంతములను జూచుటకు బయలుదేరిరి

శ్లో॥ విదిక్షు దిక్షు సర్వాసు ఆద్యంతౌ పురుషస్యతు । అధశ్చోర్ధ్వంచ సర్వత్ర దివ్యవర్ష సహస్రకమ్ । గవేషమాణావపితౌ నాద్యంతౌ తస్యనేక్షితౌ । పునస్స్వాశ్రయమాపన్నౌ విశ్రాంతావిదమూచతుః ॥

తా॥ ఇట్లు బయలుదేరి సమస్త దిక్కులయందును, విదిక్కులయందును, క్రిందను, మీదను సర్వప్రదేశములయందును, సహస్రసంవత్సరములు వెదకి తుది మొదలు గానక అలసి తిరిగి స్వాశ్రయమునకు వచ్చి యిట్లనిరి. మనుష్యులసంవత్సరము దేవతల కొకదినము. ఇట్టిదినములు మూడువందల అరువది ఒక సంవత్సరము. ఇట్టి సంవత్సరములు వెయ్యి అనగా మనుష్య సంవత్సరములు (3౬0000) అయితే దివ్యసంవత్సరములు వెయ్యి.

శ్లో॥ పురుషోయం జగత్కర్తా సృష్టిస్థితిలయాదికః । గుణాధికో గురుర్గోప్తా స్వయంభూ రఖిలేశ్వరః । స్వయంజ్యోతి స్సురాధ్యక్ష స్సర్వ జంతుహృదాలయః ॥

తా॥ మనమిద్దరము అధికులముగాము. కర్తలముగాము. ఈశ్వరులముగాము. ఈ మహాపురుషుఁడే జగత్కర్త. ఇతనివలననే సృష్టిస్థితిసంహారములు జరుగుచున్నవి. ఇతఁడే సనాతనుఁడు. గురువు. రక్షకుఁడు. స్వయంభువు. స్వయంపరిపాలకుఁడు. అఖిల లోకనాథుఁడు. సకలసురాధిపతి సర్వభూతహృదయాలయుఁడును.

శ్లో॥ తావేవంనిశ్చితాత్మానా వ్యక్తపాదానుభేక్షణా । ప్రసన్న హృదయాదేవా విరించిగౌరివల్లభా । విష్ణుతత్త్వమలజ్ఞానా ఇదం స్తోత్ర మథోచతుః ।

తా॥ ఆ ఈశ్వరుఁడును బ్రహ్మయును యిట్లు నిశ్చయించుకొని వ్యక్తప్రకాశులై సుభేక్షణులై ప్రసన్నచిత్తులై విష్ణుతత్త్వజ్ఞానాదయులై విష్ణువును యీప్రకారము స్తోత్రము చేసిరి

బ్రహ్మేశానవూచతుః॥ శ్లో॥ హే విష్ణోనంతమూర్తే తవభువ నిఖిలాకార మాద్యస్వరూపం । సర్వాధారం సురేశం దినపతిమాలతభుకోటి సూర్యప్రకాశమ్ । ఆవాభ్యామత్రిదృష్టం సకలమునిమనోవాస మబ్జాయ తాక్షం। చిద్రూపం స్వాత్మశక్త్యాకురు నిఖిలగురో సర్వరూపం త్విదానీమ్॥

తా॥ ఓ విష్ణూ ! అనంతమూర్తీ ! ఆద్యస్వరూపమై, సర్వాధారమై, కోటి సూర్యప్రకాశమై, కోటివహ్నితేజోవిరాజితమై, సకలమునిమనోవాసమై, తామరపద్మములవంటి నేత్రములంగలదై వెలుంగు నీ స్వరూపమును యిప్పుడు మాకు ప్రత్యక్షము చేయవే దయానిధీ.

శ్లో॥ నమస్తేవిశ్వాత్మన్ విధిహరసురేంద్రాదివిబుధైః త్రియీ శాస్త్రాలాపైర్నిగదిత పదాంభోజయుగం । పరంమంత్రంయంత్రం పరమపదబీజతియః సకాత్తాకార్పాహూవ్యం ప్రజతితపదే వేశసతతం ॥

తా॥ ఓ విశ్వాత్మకా, బ్రహ్మ హర దేవేంద్రాది సుర వందితా, వేదత్రయీ ధ్యేయా, విబుధవందితా, నీకు నమస్కారము. పరమమంత్రమై, పరమయంత్రమై, పరమపదబీజమై వెలుంగు నీపాదారవిందమును సేవించువాఁడు నీసారూప్యమును బొందును

శ్లో॥ త్రిలోకకర్తా భువనస్యభర్తా హా మహద్రూప మనేకతేజాః॥ గురుర్గురూణాంవరదోవరాణాం· మహాగ్నిపాంబూపలజస్త్వమేవ ।

తా॥ హరి ! నీవు మూఁడులోకములకు కర్తవు. భర్తవు. అనంతతేజుఁడవు.

మహారూపుఁడవు. గురువులకు గురువువు. కోటిసవారికి కోటికలిచ్చువాఁడవు. నీవే గొప్పసముద్రములో పుట్టిన రత్నమువంటివాఁడవు

శ్లో॥ త్రిదేవదేవామర రాజయష్ట శిష్టేష్టతుష్ట త్రిదివేసనిష్ఠ। దృష్టామృతాస్వాద్యమితాత్మపాణే సురాసురాణా మఖిలేశ్వర స్త్వమ్॥

తా॥ త్రిమూర్తి దేవాసురరాజపూజ్యా, సజ్జనమనోరథప్రదా, స్వర్గనివాసా, దృష్టాస్వాద్యామృతపాణీ, నీవే సురాసురులకు ఈశ్వరుఁడవు.

శ్లో॥ లక్ష్మీపతి స్త్వంతు సుఖవ్యగోప్తా గుహాశయః పంకజపత్రనేత్ర। త్వంపంచవక్త్రశ్చతుర్ముఖశ్చ చరాచరేశో భగవన్నమస్తే॥

తా॥ ఓ పద్మనేత్రా! లక్ష్మీపతివయిన నీవు సుఖ్యరక్షకుఁడవు. సర్వభూత హృదయగుహాయందుండువాఁడవు. నీవే పంచవక్త్రరూపుఁడవు. నీవే చతుర్ముఖుఁడవు. నీవే స్థావరజంగమేశుఁడవు. ఓ మహాదేవా, నీకు నమస్కారము

శ్లో॥ సృష్టింవిశాలాం సృజసి త్వమేవ హ్యైశ్వర్యవాన్ సర్వగుణాశ్చ దేవ। త్వమేవభూమ్యాధి కృతప్రవేశః తథాద్యభూతం విదధాసియుక్తన్॥

తా॥ ఓ దేవా! నీవే అనేకవిధమైన సృష్టిని చేయుచున్నావు. నీవే ఐశ్వర్యవంతుఁడవు సమస్తసద్గుణనిధివి. సమస్తనిలయమయిన భూమికి ఆధారము నీవే. నీవే భూతభవిష్యద్వర్తమాన కాలములలో సృష్టిచేయుచున్నావు మహాప్రభో.

శ్లో॥ త్వమగ్ని స్సూర్యో పవన స్త్వమేవ యమో ధనాన్యైశ్రవణ స్త్వమేవ। త్వమేవ శక్ర స్సురలోకనాథః నాథాది మస్త్వం భగవన్ నమస్తే।

తా॥ ఓ దేవా నీవే అగ్నివి. నీవే సూర్యుఁడవు. నీవే వాయువు. నీవే యముఁడవు. నీవే కుబేరుఁడవు. ఓ నాథా! నీవే సురనాయకుఁడవయిన యింద్రుఁడవు. నీవే ఆదిపురుషుఁడవు. ఓ భగవంతుఁడా నీకు నమస్కారము.

శ్లో॥ పరమం పరాణాం పరమం పవిత్రం పురాణకర్తార మనంత మాశ్రియం। త్వాం వేదమూలాః కవయ స్సుబుద్ధ్యా నమోస్తు తే పన్నగవైరికేతో।

తా॥ సుబుద్ధితో కవులు ఆలోచించి శ్రేష్ఠులలో శ్రేష్ఠుఁడవనిన్ని, పవిత్రములలో పవిత్రుఁడవనిన్ని, పురాణకర్తయనిన్ని, అనంతాశ్రయుఁడవనిన్ని చెప్పుచున్నారు

మఱియు వేదస్వరూపము మీచే చెప్పఁబడినది. సర్పములకు శత్రువైన గరుత్మంతుఁడు ధ్వజమందు గలిగిన ఓ దేవా నీకు నమస్కారము.

శ్లో॥ వేదాశ్చ వేద్యశ్చ దిగంతరాళం యష్టామఖస్థాన మథి త్వమేవ। కర్మాణ్యనంతాని సుఖప్రదాని ఋచశ్చ వాచో నిగమాశ్చ సర్వే॥

తా॥ నీవే వేదములు. నీవే వేద్యుఁడవు. నీవే దిగంతరాళము. నీవే యజమానుఁడవు. నీవే స్వర్గము, నీవే అనంత కర్మలు, నీవే ఋక్కులు, నీవే వాక్కులు. నీవే సర్వవేదములు.

శ్లో॥ నదీషు గంగా హిమవాన్ నగేషు మృగేషుసింహో భుజగేష్వనంతః। రత్నేషు వజ్రం జలజేషు చంద్రః క్షీరోదధి శ్చాపి యథా తథా త్వమ్॥

తా॥ నీవు నదులలో గంగవు, పర్వతములలో హిమవంతము, మృగములలో సింహము, సర్పములలో శేషుఁడవు, రత్నములలో వజ్రము జలజాతములలో చంద్రుఁడవు సముద్రములలో పాలసముద్రము.

శ్లో॥ అహం ప్రభు స్త్వద్య దహంప్రభుశ్చ సంస్పర్ధమానా బహువర్షమాణాం। తస్మా దిదానీం పరిహర్తుమేవం స్వయం ప్రభు స్త్వం కరుణైకరాశిః॥

తా॥ ప్రభుత్వ అహంభావత్వము మాదే నను అనేక సంవత్సరములనుంచి పోరుచుంటిమి స్వయంప్రభువును దయామూర్తివి నయిన నీవిప్పుడా కలహమును నివారించుగాక.

శ్లో॥ తేనాత్ర తే దర్శనశుద్ధబుద్ధి రాసీత్కృపాళో భగవన్నమస్తే। తూర్ణం జగన్నాథ మహత్స్వరూపం భూత్వా పునస్సౌమ్యవపుః ప్రసీద॥

తా॥ కృపానిధీ! నీ దర్శనముచేత మాకు స్వచ్ఛమైన బుద్ధి గలిగినది. ఓ దేవా! నీకు నమస్కారము జగన్నాథా! శీఘ్రముగా మహత్స్వరూపమును విడిచి సౌమ్యమయిన ఆకారమును వహించుము. మమ్మును కటాక్షించుము

శ్రీగృత్సమదః॥ శ్లో॥ ఏవం తయోర్వచశ్శ్రుత్వా విష్ణుర్విశ్వాఖిలేశ్వరః। భూయస్సౌమ్యవపుర్భూత్వా తావాహ భగవాన్ హరిః॥

తా॥ ఓ జహ్నుమహామునీ! వినుము. విశ్వేశుఁడయిన విష్ణు విట్లు వారి మాటలను విని సౌమ్యశరీరుఁడై బ్రహ్మేశానులతో నిట్లనెను.

శ్రీ భగవానుః। శ్లో॥ బ్రహ్మేశానా యదుద్దిశ్య యువాభ్యాం బహువాసరం। ప్రవర్తమానే కలహే పరిహర్తుమహం తదా। ప్రభూతోఽస్మి మహద్రూపం మాద్యాద్యంతవివర్జితమ్ ।

తా॥ ఓ శివ విధాతలారా! మీరిద్దఱు దేనినిగుఱించి యింతకాలము కలహించుచుంటిరో దాని నివారించుటకు నే నాద్యంతశూన్య మయిన మహద్రూపముతో వచ్చితిని.

శ్లో॥ నచేక్షమాణా విశ్రాంతౌ సంత్యక్త కలహోద్యమౌ। ప్రసన్నహృదయౌ పశ్చాత్త్వస్నేహేన పరస్పరం। మామిత్థం యువయోరగ్రే స్తోతుం సంజాతు తేమనః ।

తా॥ ఇట్టినన్ను దర్శించుటకు సమర్థులు గాక విశ్రాంతులై కలహము మాని ప్రసన్నహృదయులై నన్నిట్లు స్తుతించిరి.

శ్లో॥ యువయోరితి యద్వాదం కేనేదం జాయతే విభు। తదహం సంప్రవక్ష్యామి దుర్నివార్యం సురాసురైః ।

తా॥ ప్రభువులారా! మీకిట్టివివాద మెందుకు గలిగెనో దానిని జెప్పెదను వినుఁడు. ఆ కారణము సురాసురలకు నివార్యముగాదు.

శ్లో॥ సత్వంరజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః। తద్గుణై ర్బద్ధచిత్తానాం నకించిత్ప్రాప్యతే సుధీః ।

తా॥ సత్వము రజము తమము అను నీ మూఁడుగుణములు ప్రకృతివల్ల పుట్టినవి. ఆగుణములచేత బద్ధులయినవారికి నేదియు బ్రాప్తించదు.

శ్లో॥ గుణత్రయోదితంకర్మ వక్ష్యామి సురవల్లభా ।

తా॥ శివ బ్రహ్మలారా! ఆ త్రిగుణములవలన పుట్టెడు కర్మలను జెప్పెదను విశదముగా వినుఁడు.

శ్లో॥ తత్రసత్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయం। సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన దేహినమ్ ।

తా॥ వాటిలో సత్వము స్వచ్ఛమైనదగుటచేత ప్రత్యక్స్వరూపావభాసకమును అవిక్షిప్తమును అజడమును. ఈ సత్వము ఆత్మకు శమదమ దయాహింసాజ్ఞా

కాన్త్యాది సద్గుణములను గలుగఁజేసి పారలౌకికసుఖమును గలుగఁజేయును. ఇంతే కాదు- పరమేశ్వరగుణ కథాశ్రవణభజన కీర్తనాద్యాసక్తినిన్ని కలుగఁజేయును.

శ్లో॥ రజోరాగాత్మకంప్రోక్తం తృష్ణాసంగోదితంమహత్। తన్నిబధ్నాతియత్నేన కర్మసంగేన దేహినమ్ ।

తా॥ రజోగుణము రాగస్వరూపకము ఆశాసంగములవలన పుట్టునదిన్ని లేక ఆశాసంగములకు జన్మస్థానమయినది. ఈ రజోగుణము ఆత్మకు ప్రయత్నపూర్వకముగా కర్మసంగమును గలుగఁజేయును. అనఁగా స్వస్వరూపానుభూతిని తప్పించి కేవలైహికాముష్మికార్థ ప్రయోజనములైన కర్మలయందే ఆసక్తిని గలుగఁజేయునని భావము.

శ్లో॥ తమస్త్వజ్ఞానజం ప్రోక్తం మోహనం సర్వదేహినాం। ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతిదేహినమ్ ।

తా॥ తమోగుణము అజ్ఞానమువల్ల పుట్టినది. ఈ తమోగుణము బ్రహ్మాస్తంభాంతజీవులకు సదసద్వివేకజ్ఞానమును తప్పించేయును. ఈ తమోగుణము జడజన్యమగుట వలన ఆత్మకు ప్రమాదమును ఆలస్యమును నిద్రను గలుగఁజేయును. ఎట్లనిన.

వా॥ ప్రమాదోనామ ప్రయత్నేన కర్తవ్యే కార్యే విస్మృతిః ఆలస్యం నామ కర్తవ్యేపిచ కార్యే శ్రద్ధావైధుర్యే నోత్సాహాభావః, నిద్రానామబుద్ధిజాడ్యాధిక్యేన కర్తవ్యం పరిత్యజ్యస్వాపః ।

తా॥ యత్నముచేత చేయఁదగిన కార్యమును మరచుట ప్రమాదము. చేయఁదగిన కార్యమందు శ్రద్ధ లేకపోవుటచేత నయిన ఉత్సాహాభావము ఆలస్యము. బుద్ధిజాడ్యమధికమగుటచేత చేయఁదగిన కార్యమును విడిచి నిద్రించుట నిద్రయనఁబడును. ఈ త్రిగుణబద్ధత్వమును కొంచెము విషయసుఖాసక్తిచేత సత్త్వముచేతనున్న, విషయములందు రాగోదయముచేతను, బుద్ధిజాడ్యముచేతను, ప్రమాదాలస్యనిద్రాదులచేత తమోగుణముచేతనున్న ఆత్మబద్ధుఁడగును. కనుక బ్రహ్మవేత్త గుణత్రయ వికారములకు లోబడక ప్రతియోగి గుణావలంబనముచేత గుణదోషములను విడిచి సదాత్మానుభూతి యందే యుండవలెను.

శ్లో॥ ఇదమద్యమయా లబ్ధమిమంప్రాప్స్యేమనోరథం। ఇదమస్తీదమపిమే భవిష్యతిపునర్ధనమ్ । అసౌమయాహతశ్శత్రుర్హనిష్యేచాపరా

నపి । ఈశ్వరోహం మహాభోగీ సిద్ధోహం బలవాన్ సుఖీ । ఆఢ్యోభిజన
వానస్మి కోన్యోస్తి సదృశోమయా ।

తా॥ నేనిప్పుడు నామనోరథమును తృప్తిబొందగలను. ఇప్పుడు ధనమున్నది. ఇకముందర ధనమురాగలదు. ఇప్పుడీ శత్రువును సంహరించితిని. ఇంకా కొందఱు శత్రువులను చంపగలను. నేను విద్యాధనాదులచేత ఈశ్వరుఁడను. భోగిని. పుత్రపౌత్రధనాదులతో నిండియున్నవాఁడను. నేనే బలవంతుఁడను. సుఖిని. నాకుచాలా ధనమున్నది. గొప్పవంశమందు పుట్టితిని. నాతోసమానుఁ డెవ్వఁడున్నాఁడు. ఇవంతయు రజోగుణ తమోగుణముల ప్రభావము.

శ్లో॥ ఏవం రజస్తమోభ్యాంచ నిబద్ధా యూయం సురేశ్వరా । తత్తద్గుణప్రభావేన రజస్తమసోర్యువామ్ । వివాదమాశ్రితౌ దేవౌ సాక్షాదీశ్వరకావపి । గుణప్రభావమోహేన కలహస్త్వభివర్ధతే ।

తా॥ దేవతలారా! మీరీతీఱుంగా రజస్తమోగుణములచే బద్ధులైరి. ఇట్లయినప్పటికీ రజస్తమోగుణ ప్రభావముచేత వివాదములుపడిరి. గుణప్రభావ మోహముచేత మీకు కలహము వృద్ధినొందినది.

శ్లో॥ ఆదౌనంతమసిప్రాప్తే పంచభూతవివర్జితే । తదాహం సర్వసర్గార్థ మాత్మశక్తిసమన్వితః । సువర్ణపిండవద్భూత్వా కనైస్సర్వాంగసంచయః । సోహంత్రివిధో భూత్వా కార్యార్థంచ యువామహమ్ । సృష్టిస్థితిలయాదీనాం కర్తృత్వమధికల్పితం । యుష్మాస్వన్నయావయోర్భేదః కథిదానాం సురేశ్వరా ।

తా॥ మొందుగా మహాంధకారమై పంచభూతములు లేనంతలో నేను సృష్టికొఱకు ఆత్మీయశక్తిచేత సువర్ణపిండమువలెనుండి కొంతకాలమునకు సర్వాంగములుగలిగి కార్యార్థమై మూఁడుగా నేర్పడితిని. ఆ మువ్వురు మీరిద్దఱును నేనును. ఇట్లేర్పడి సృష్టిస్థితిసంహారములకు కర్తలమైతిమి. సృష్టికర్తా బ్రహ్మ, పోషణకర్తా అహం, లయకర్తా శివః, కాఁబట్టి ఒకవస్తువులోనుంచి వచ్చిన మీకిద్దఱికిని భేదము లేదు. లేదటలేని భేదము యిప్పుడెట్లు వచ్చెను.

శ్లో॥ పభుర్భవాన్సర్గ్యజనస్సకర్తా ప్రభుస్సురాణాం నిగమాలయస్త్వం । సమస్తయజ్ఞాధిపతిశ్శరణ్య స్సమస్తలోకేశ్వర దాసదక్షః । తత

స్స్వశక్త్యా ప్రతిపన్నయోగో విచింత్యమానేస్య సృష్టిగతః పునస్త్వం । నాభే స్సముత్థాయవినిర్గతోసి బాలార్కవర్ణః కమలోదయశ్చ ।

తా॥ ఓబ్రహ్మ ! నీవు విభుఁడవు. సర్వప్రాణులకు కర్తవు. సురలకు ప్రభుఁడవు. వేదములకు స్థానభూతుఁడవు. యజ్ఞపతివి. రక్షకుఁడవు. సమస్త లోకములకు ఐశ్వర్యమిచ్చువాఁడవు. నీవు స్వశక్తిచేత బొందబడిన యోగము గలవాఁడవై నాభిలోనుండి ఆలోచించి బాలార్కవర్ణుఁడవై నాభికమలమందుదయించితివి

శ్లో॥ వృథానమేభేదికభేదవాద స్త్వేకోప్యనేకత్వముపాగతోహం। భవాన్నమస్తైర్మునిభిస్సురాద్యైః పూజ్యోసినిత్యం పురుషేషుముఖ్యః॥

తా॥ ఈ భేదమున్నదనే వాదము వృథా. నీకును నాకును భేదము లేదు. నేను ఒకఁడనయినను అనేకత్వమును అవలంబించితిని. నీవు సమస్త సురమునిబృంద వందిత పాదారవిందుఁడవు. పురుషోత్తముఁడవు.

శ్లో॥ ఇత్థంవిధాతారమనంతశక్తి రుక్త్వాథవిష్ణుః ప్రజగాదరుద్రమ్।

తా॥ అనంతశక్తుఁడైన హరి యిట్లు బ్రహ్మతో చెప్పి శివునితో నిట్లని పలికెను.

ఇతి పంచదశోధ్యాయస్సమాప్తః.

—॥ అథ షోడశోధ్యాయ ప్రారంభః ॥—

శ్రీభగవానుః॥ శ్లో॥ శంభో భవానర్కహిమాంశువహ్ని నేత్ర త్రియస్త్వఖిలలోకకర్తా । తథాసమస్తామరపూజితాంఘ్రిః సంసేవ్యమానస్సురయోగిబృందైః ।

తా॥ ఓ శంకరా ! నీవు రవి శశి శిఖి నేత్రుఁడవు. సమస్తలోక కర్తవు. సర్వ దేవతా సంసేవితపాదారవిందుఁడవు. యోగిబృందసంసేవితుఁడవును.

శ్లో॥ నచాస్తికించి త్తవమిత్రభేద స్త్వహం త్వమేవ త్వం సురనాథ నిత్యం। వేదాంతవేద్యప్రముఖానికాంత్వాం సన్యాసినస్స్వర్గవిముక్తిహేతుం। వదంతితస్త్వాంభజంతిశంభో ప్రయాంతి ముక్తించ తవప్రసాదాత్ ।

తా॥ ఓ శంకరా ! నీకును నాకును భేదమించుకయును లేదు. నీవే నేను. నేనే

నీవు. వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులయిన సన్న్యాసులు నిన్ను ముక్తికారణునిగా చెప్పుచున్నారు. అట్లు సేవించుచున్నారు. సేవించి నీప్రసాదమువలన ముక్తులగుచున్నారు.

శ్లో॥ సర్వభేదవినిర్ముక్తః సర్వభేదాశ్రయో భవాన్ । త్వం త్వధిష్ఠాయ లోకేస్మిన్ మహాదేవో మహేశ్వరః ।

తా॥ నీవు సర్వభేద వినిర్ముక్తుండవు. సర్వభేదముల కాశ్రయుండవు. లోకాధిష్ఠానకర్తవు. మహాదేవుడవు. మహేశుండవు. (మహాంశ్చాసౌ దేవశ్చ మహాంశ్చాసౌ ఈశ్వరశ్చేతి విగ్రహేణ) గొప్ప దేవుండవు. గొప్పప్రభువువు

శ్లో॥ త్వమేవపరమానంద స్త్వమేవాభయదాయకః॥ త్వమక్షరం పరంబ్రహ్మ త్వమేవహి నిరంజనః । శివ స్సర్వగత స్సూక్ష్మః పరబ్రహ్మసనాతనః ।

తా॥ శంకరా, నీవే పరమానందుండవు, నీవే అభయదాతవు, నీవే అక్షరపరబ్రహ్మవు నీవే నిరంజనుండవు, శివుండవు, సర్వగతుండవు సూక్ష్మరూపుండవు, పరబ్రహ్మవు శాశ్వతుండవు.

శ్లో॥ త్వంశక్ర సర్వదేవానాం బ్రహ్మ బ్రహ్మవిదామసి । ఋషీణాంచవసిష్ఠ స్త్వం వ్యాసో వేదవిదామసి । సాంఖ్యానాం కపిలో దేవః రుద్రాణామసి శంకరః । ఆదిత్యానా ముపేంద్ర స్త్వం వసూనాంచహి పావకః । వేదానాం సామవేద స్త్వం సావిత్రీఛందసామసి । అధ్యాత్మ విద్యా విద్యానాం గతీనాం పరమాగతిః ॥ మాయాత్వం సర్వశక్తీనాం కాలః కలయతామసి । ఓంకార స్సర్వగుహ్యానాం వర్ణానాంచ ద్విజోత్తమః । ఆశ్రమాణాంచ గార్హస్థ్యం ఈశ్వరాణాం మహేశ్వరః । పుంసాం త్వమేకః పురుషః సర్వభూత హృదిస్థితః । సర్వోపనిషదాం దేవ గుహ్యోపనిష దుచ్యతే । కల్పానాంచ మహాకల్పః యుగానాం కృతమేవచ । ఆదిత్య స్సర్వమార్గాణాం వాచాం దేవీసరస్వతీ । త్వంలక్ష్మీ శ్చారురూపాణాం విష్ణుర్మాయావినామసి। అరుంధతీసతీనాంచ ♦ సువర్ణః వ్రతినామసి । సూక్తానాం పౌరుషంసూక్తం బ్రహ్మసి బ్రహ్మవేదినామ్ । సావిత్రీజాపిజాప్యానాం యజుషాం శతరుద్రియః । పర్వతానాం మహామేరుః అనంతో భోగినామసి । ♦ (గరుత్మతంచ పక్షిణాం)

తా॥ ఓ శంకరా, నీవు దేవతలలో ఇంద్రుండవు బ్రహ్మవేత్తలలో బ్రహ్మవు,

ఋషులలో వసిష్ఠుఁడవు, వేదవేత్తలలో వ్యాసుఁడవు, సాంఖ్యులలో కపిలాచార్యుఁడవు, ఏకాదశరుద్రులలో శంకరుఁడవు, ఆదితేయులలో వామనుఁడవు, వసువులలో పావకుఁడవు, వేదములలో సామవేదము, ఛందస్సులలో గాయత్రివి, విద్యలలో అధ్యాత్మవిద్యవు, గతులలో పరమగతివి, శక్తులలో మాయవు, శుభాశుభవృద్ధిక్షయములను చూచువారిలో కాలుఁడవు, గుహ్యములలో ఓంకారము, వర్ణములలో బ్రాహ్మణుఁడవు, ఆశ్రమములలో గృహస్థాశ్రమము, ఈశ్వరులలో మహేశ్వరుఁడవు, పురుషులలో సర్వభూతహృదయస్థుఁడయిన పురుషుఁడవు, ఉపనిషత్తులలో గుహ్యోపనిషత్తు, కల్పములలో మహాకల్పమును, యుగములలో కృతయుగమును, గ్రహములలో సూర్యుఁడవును, వాక్కులలో సరస్వతీదేవివి, సుందరులలో లక్ష్మివి, మాయావంతులలో విష్ణువు, పతివ్రతలలో అరుంధతివి, పక్షులలో గరుత్మంతుఁడవు, సూక్తములలో పురుషసూక్తము, బ్రహ్మవాదులలో బ్రహ్మవు, మంత్రములలో గాయత్రీ మంత్రమును, యజుస్సులలో శతరుద్రీయమును, పర్వతములలో మేరువును, నాగులలో అనంతుఁడవును అయితివి

శ్లో॥ సర్వేషాం త్వం పరంబ్రహ్మ త్వన్మయం సర్వమేవహి ।
యథైవాహం తథాత్వంహి సర్వముఖ్యేషు శంకర ।

తా॥ శంకరా! అందఱికి నీవే పరబ్రహ్మవు. సమస్తము నీస్వరూపము. నావలె నీవును అందఱిలో ముఖ్యుఁడవు. (విష్ణుముఖ్యత్వముక్తం గీతాసు)

శ్లో॥ తేమేనకించిద్భేదోఽస్తి విదుర్వేదాంతవేదినః । నారదాయ పురాశంభో మాహాత్మ్యమఖిలంతవ । మయానిగదితం శ్రుత్వా త్వాం ద్రష్టుమిహ నారదః । నిశ్చలశ్చింతయన్ త్వాంతు తతాపపరమంతపః ।

తా॥ శంకరా! నీకును నాకును కించిత్తయినను భేదములేదు. వేదాంతవేత్తలిట్లు తెలిసికొనుచున్నారు. పూర్వమందు నారదుఁడు నావలన నీమహాత్మ్యమును విని నిన్ను చూచుటకొఱకు నిశ్చలమయిన మనస్సుతో నిన్నుగూర్చి గొప్ప తపస్సుజేసెను.

శ్లో॥ తుష్టస్త్వం తస్య దేవేశ ప్రసన్నస్త్వం తదాభవః । త్వాం దృష్ట్వానారదస్తుష్ట స్తుష్టావజగదీశ్వరమ్ ।

తా॥ నీవు నారదునకు ప్రసన్నుఁడవై దర్శనమిచ్చితివి. జగదీశుఁడవైన నిన్ను జూచి సంతోషించి నారదుఁడు స్తుతిజేయసాగెను.

శ్రీనారదః॥ శ్లో॥ రూపంతవాశేషకళాభిగుప్త మగోచరం నిర్మల మేకరూపం। అనాది మధ్యాంత మనంత మాద్యం నమామి దేవం తమసః పరస్తాత్ ।

తా॥ (నారదశ్చతుర్దశభిశ్శంకరంస్తౌతిశంకరా) అశేషకళాగుప్తమై, అగోచరమై, నిర్మలమై. ఏకమై, ఆదిమధ్యాంతశూన్యమై, అనంతమై, ఆద్యమై, స్వయం ప్రకాశమై తమస్సుకుమీదనుండి వెలుంగు నీరూపమునకు నమస్కారము గావించెదను.

శ్లో॥ త్వాం దేవపశ్యంతి జగత్ప్రసూతిం వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః। ఆనందమాత్రంప్రణవాభిధానం తదేవరూపం శరణంప్రపద్యే॥

తా॥ శంకరా! వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థులయినవారు నిన్ను సకల ప్రపంచమునకు కారణకర్తగా చూచుచున్నారు. ఆనందస్వరూపమును, ప్రణవనామధేయమును నయిన నీరూపమును శరణుజెందుచున్నారు.

శ్లో॥ అశేషభూతాంతర సన్నివిష్టం ప్రధానసంయోగ వియోగ హేతుం। తేజోమయం జన్మవినాశహీనం ప్రాణాభిధానం ప్రణతోస్మి రూపమ్ ।

తా॥ శంకరా! సమస్తభూతాంతస్థమును ప్రధానసంయోగ వియోగములకు కారణమును, తేజోరూపమును, జననాశనశూన్యమును, ప్రాణాభిధేయమును నయిన నీరూపమునకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో॥ ఆద్యంతహీనం జగదాత్మభూతం విభిన్నసంస్థం ప్రకృతేః పరస్తాత్ । కూటస్థ మవ్యక్త వపు స్తథైవ నమామి రూపం పురుషాభిధానమ్ ।

తా॥ శంకరా! ఆద్యంతహీనమును, జగత్స్వరూపమును, భిన్నసంస్థితియును, ప్రకృతికి పరమును, కూటస్థమును, అవ్యక్తశరీరమును, పురుషనామధేయమును నయిన నీ రూపమునకు నమస్కారము చేసెదను.

శ్లో॥ సర్వాశ్రయం సర్వజగ ద్విధానం సర్వత్రగం సర్వ తను ప్రవిష్టం। సూక్ష్మం విచిత్రం త్రిగుణం ప్రసన్నం నతోస్మి తే రూప మలుప్తభేదమ్ ।

తా॥ శంకరా! సర్వాధారమును సర్వజగత్తును చేయునదియును, సర్వమును, సర్వశరీరప్రవిష్టమును, సూక్ష్మమును, విచిత్రమును, త్రిగుణాత్మకమును, ప్రసన్నమును, అభేదమును నయిన నీరూపమునకు నమస్కారము గావించెదను.

శ్లో॥ ఆద్యంమహాత్మే పురుషాత్మరూపం ప్రకృత్యవస్థం త్రిగుణాత్మ బీజం। ఐశ్వర్యవిజ్ఞానవిరాగధర్మై స్సమన్వితం దేవ నతోస్మిరూపమ్ ॥

తా॥ శంకరా! సర్వాద్యమును, మహాత్మ్యమందు పురుషాత్మరూపమైనదియు, ప్రకృతియందుండునదియు, త్రిగుణాత్మబీజమును, ఐశ్వర్య విజ్ఞాన వైరాగ్య సమన్విత మును నయిన నీరూపమునకు నమస్కారము చేసెదను.

శ్లో॥ ద్విసప్తలోకాత్మక మంబుసంస్థం విచిత్రభేదం పురుషైక నాథం। అనంతభూతైరధివాసితం తే నతోస్మ్యహంత జ్జగదండసంస్థమ్ ॥

తా॥ శంకరా! చతుర్దశభువనాత్మకమును, ఉదకస్థితమును, విచిత్రభేదమును, పురుషనాథమును, అనంతభూతాధివాసితమును, బ్రహ్మాండసంస్థమును నయిన నీరూప మునకు నమస్కారము.

శ్లో॥ అశేషదేవాత్మక మేక మాద్యం స్వతేజసా రూపిత లోక భేదం। త్రికాలహేతుం పరమార్థరూపం నమామ్యహం త్వాం రవి మండలస్థమ్ ॥

తా॥ శంకరా! సమస్తదేవ స్వరూపమయినటువంటియు, ఏకమును ఆద్యుండ వును నయినటువంటిన్ని, స్వతేజోనిరూపిత లోకహేతుండవును, త్రికాలహేతువును, పరమార్థరూపుండవును నై సూర్యమండలమధ్యస్థుండవై వెలుగుచున్న నీకు నమస్కా రము చేసెదను.

శ్లో॥ సహస్రమూర్ధాన మనంతశక్తిం సహస్రబాహుం పురు షం పురాణం। శయాన మంత స్సలిలే తథైవ నారాయణాఖ్యం ప్రణ తోస్మి నిత్యమ్ ॥

తా॥ శంకరా! సహస్రవదనుండవును, సహస్రబాహుండవును, అనంతశక్తియు పురాణపురుషుండవును, ఉదకమందు శయనించువాండవును నయిన నారాయణస్వరూ పుండవయిన నీకు నమస్కారము చేసెదను.

శ్లో॥ దంష్ట్రాకరాళం త్రిదశాది వంద్యం యుగాంత కాలా నల

కాలరూపం । అశేషరూపాండ వినాశహేతుం నమామి రూపం తవ కాలసంజ్ఞమ్ ॥

తా॥ శంకరా! దంష్ట్రాకరాళమును, దేవాదివంద్యమును, ప్రళయకాలానల కాలరూపమును, సమస్త రూపాండవినాశహేతువు నయిన నీయొక్క కాలసంజ్ఞ రూపమునకు నమస్కారము చేసెదను.

శ్లో॥ ఫణాసహస్రేణ విరాజమానం భోగీంద్రముఖ్యై రభిపూజ్యమానం। జనార్దనప్రీతి మహత్కరం త్వాం నతో౽స్మి రూపంతవ శేషసంజ్ఞమ్॥

తా॥ శంకరా! సహస్రఫణాశోభితమును, భోగీంద్రప్రముఖసేవితమును నారాయణప్రీతికరమును నైన నీయొక్క శేషసంజ్ఞరూపమునకు నమస్కారము.

శ్లో॥ అవ్యాహతైశ్వర్య మయుగ్మనేత్రం బ్రహ్మామృతానంద రసజ్ఞమేకం । యుగాంతశేషం దివినృత్యమానం నతో౽స్మ్యహం త్వామితి రుద్రసంజ్ఞమ్ ॥

తా॥ శంకరా! అవిహతబలైశ్వర్య సంపన్నుఁడవును, విషమనేత్రుఁడవును, బ్రహ్మామృతానందరస వేదివిని, ముఖ్యుఁడవును, ప్రళయకాలమందు మిగిలియుండెడు వాఁడవును, ఆకాశమందు నాట్యమాడువాఁడవును నయిన ఓ రుద్రమూర్తీ! నీకనంత నమస్కారములు చేసెద.

శ్లో॥ ప్రక్షీణశోకం విమలం పవిత్రం సురాసురై రర్చితపాదయుగ్మం । సుకోమలం సాంద్ర సుశుభ్రదేహం నమామ్యహం త్వా మఖిలాధినాధమ్ ॥

తా॥ శంకరా! క్షీణశోకుఁడవును, విమలుఁడవును, పవిత్రుఁడవును, సురాసురవందితపాదారవిందుఁడవును, కోమలాకారుఁడవును, శుభ్రదేహుఁడవును, అఖిలాధినాథుఁడవును నయిన నీకునమస్కారములు చేసెదను.

శ్లో॥ చతుర్భుజం శూల మృగాగ్ని పాణిం ప్రయత్నతో భక్తవరప్రదానం । వృషధ్వజం త్వాం గిరిజార్ధదేహం నతో౽స్మ్యహం దేవ కృపాకరేశమ్ ।

తా॥ శంకరా! చతుర్బాహుఁడవును, శూలమును మృగమును ధరించినవాఁడ

వును, భక్తప్రదాయకుఁడవును, వృషభవాహనముగలిగిన కృపాకరుఁడవును, పార్వతీ దేహార్థధారివిని అయిన నీకు నమస్కారము.

శ్లో॥ శ్రుత్వేత్తమవ్యక్తమమోఘమాద్య మవాప్తసంతోషమజ స్రమేవ । తదామునీంద్రా బహవోపినిత్యం భజంతి నానావిధిభిర్మహేశ॥

తా॥ ఓ శంకరా! ఈప్రకారము నారదస్తుతిని విని నీవు మిక్కిలి సంతోషించితివి. ఈస్తుతి అమోఘము. దీనిని అనేకమునులు విని దీనితో నిన్ను స్తుతించుచు అనేకవిధులతో నిన్ను సేవించుచుండిరి.

శ్లో॥ తస్మాన్మాం త్వాం విధాతారం యేమూఢా భేదబుద్ధినా । పశ్యంతియాంతినరకం యావచ్చంద్రదివాకరమ్ ।

తా॥ కాఁబట్టి యే పురుషులు నిన్నును నన్నును బ్రహ్మనన్ను భేదబుద్ధితో జూచుచున్నారో వారు సూర్యాచంద్రమసులుండువఱకు నరకమందు నివసింతురు.

శ్లో॥ గుణాభ్యాంయువయోరేవం వివాదస్సంప్రవర్తతే। హిత్వా వివాదం దేవేశ సుఖేన పరివర్తయ ।

తా॥ శంకరా! రజస్తమోగుణములచేత మీకిద్దరికి యీవివాదము సంభవించెను. ఇప్పుడు వివాదమును మాని సుఖానుండుఁడీ.

శ్రీగృత్సమదః॥ శ్లో॥ ఇత్యుక్త్వా భగవాన్విష్ణుస్తయోర్వాదం జనార్దనః । పరిహృత్య యయావశ్చా దంతర్ధానం మహాపతిః ।

తా॥ జహ్నుమహాముని! భగవంతుఁడును, జనసంతోషదాయకుఁడును, మహాభర్తయునైన విష్ణువు యిట్లు వారి వివాదమునుమాన్పి అచ్చటనే అంతర్ధానమాయెను.

శ్లో॥ తతశ్చాశ్రమమాపన్నౌ వాగీశ వృషభధ్వజౌ ।

తా॥ తరువాత బ్రహ్మయు శివుఁడును తమతమ నిలయములను జేరిరి.

శ్లో॥ గుణాభ్యామనుబద్ధాభ్యాం నిశృహీతౌ విధిరీశ్వరౌ । చక్రతుః కలహం తస్మాద్బహువర్షసహస్రకమ్ ।

తా॥ ఇట్లనుబద్ధ రజోగుణ తమోగుణములచేత విధి శివులు బద్ధులై అనేకసహస్ర వర్షములు కలహమాచరించిరి.

శ్లో॥ ప్రవర్తమానే కలహే తయోరేవం హరిస్స్వయం । మా
యావీపరివ్రాత్యేత్థం తయోస్సౌఖ్యమకల్పయత్ ॥

తా॥ ఇట్లు బ్రహ్మ ఈశ్వరులకు కలహ మధికమైనంతలో మాయావియయిన మాధవుఁడు ఉపాయముచేత కలహమును నివారించి వారిద్దరికి సౌఖ్యమును గలుగఁజేసెను.

శ్లో॥ ఏతస్మాదాత్మమతయ స్తమేవ శరణంవ్రజేత్ ॥

తా॥ ఈ కారణముచేత ఆత్మవిచారణపరులు యీ ప్రపంచ పోషకుఁడయిన విష్ణువునే శరణుజేయుచున్నారు.

శ్లో॥ నసౌఖ్యంలభతే విప్ర తద్విష్ణోః కరుణారసాత్ ।

తా॥ అట్లు శరణుజొచ్చినవారు విష్ణుదేవుని అనుగ్రహముచేత సౌఖ్యమును బొందుదురు.

శ్లో॥ ఆర్తోవావ్యథవాసాధు ర్వ్యస్యార్చాలాపవందనైః । యే య
జంతిమునిశ్రేష్ఠ తేవిష్ణోః పార్శ్వవర్తినః ॥

తా॥ మునిశ్రేష్ఠా! ఆర్తికలుగలవారుగాని, సాధువులుగాని, పూజా కథాలాపవందనాదులచేత మాధవు నర్చించువారు దేహాంతమందు విష్ణుపార్శ్వవర్తు లగుదురు.

శ్లో॥ అహంకారం పరిత్యజ్య హిత్వాలజ్జాం తథైవచ । ధ్యానా
ర్చాలాపసేవాద్యై రర్చయేత్సతతంనరః ॥

తా॥ నరుఁడు అహంకారమునున్ను సిగ్గునున్ను విడిచి ధ్యానార్చనకథా సల్లాపాదులచేత హరిని పూజించవలెను.

శ్లో॥ అహంకారోతిదుఃఖాయ తస్మాత్తాంపరివర్జయేత్ । అహం
కారేణసుజ్ఞానం నశ్యతేనాత్రిసంశయః ॥

తా॥ యెందు అహంకారమువలన దుఃఖముగలుగును గాన దానిని విడువవలెను. అహంకారమువలన విజ్ఞానము నశించును. ఇందుకు సందేహములేదు.

శ్లో॥ తస్మాద్గర్వం పరిత్యజ్య తథాలజ్జాం విహాయచ । మాధ
వప్రీతం చరేద్ధీమాన్ శ్రుణుయాద్వైష్ణవత్కథామ్ ॥

తా॥ కాఁబట్టి నేను శ్రేష్ఠుఁడనని గర్వమును మాని యీ కార్యార్థకము

వలన లోకులు నవ్వుచుండినను సిగ్గునుగూడ విడిచి బుద్ధిగలిగినవారై మాఘవ్రతమును ఆచరించవలెను. మాఘపుకథాశ్రవణమే చేయఁదగును,

ఇతి షోడశోధ్యాయ స్సమాప్తః.

---

## —♦ అథ సప్తదశోధ్యాయ ప్రారంభః ♦—

శ్లో॥ బ్రహ్మన్ భూయోపి మిచ్ఛామి కర్మగ్రంథివిమోచనం । మోక్షోపాయ మిదానీంతు తత్వంశో బోద్ధుమర్హసి ॥ మాఘ ధర్మేణ మజ్ఞానం నరాణాం లభ్యతేకథం । జ్ఞానస్యలక్షణం యత్ర జ్ఞాతుంమే యతతేమతిః ॥

(శ్రవణాజ్జహ్నుస్తత్వోపదేశంప్రార్థయతి = జహ్నువు కథాశ్రవణమువలన తత్వోపదేశమును చేయుమని ప్రార్థించుచున్నాఁడు.)

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా ! తిరిగి కర్మగ్రంథి విమోచనమును వినగోరితి ఇదిగాక మోక్షోపాయమును తత్వముతో నాకు బోధింపుము. (అనఁగా మోక్షసాధన తత్వోపదేశమును చేయుమని అర్థము.) ఇదిగాక మాఘధర్మముచేత నరులకు సుజ్ఞానమెట్లు లభించును. నాయందు దయయుంచి అవిధిని చెప్పుము.

గృత్సమదః ॥ శ్లో॥ జహ్నో తవమతి స్సాధు ర్జనార్దన కథామిమాం । శ్రోతుంప్రవర్తతేతస్మా న్మనేత్వం యోగినాంవరః ॥

తా॥ గృత్సమదుఁడు ద్రశ్నలనువిని సమాధానమును జెప్పుచున్నాడు. జహ్నూ నీబుద్ధి మంచిది. జనార్దనకథను వినగోరితివి కాఁబట్టి నీవు యోగులలో ఉత్తముఁడవు.

శ్లో॥ అనేకజన్మసంస్కారై ర్మాఘపవిత్రపురస్సరైః । వాసుదేవం కథాంశ్రోతు నరాణాంజాయతేమతిః ॥

తా॥ మాఘవ్రతపూర్వకానేక పవిత్రపుణ్యము లనేకజన్మములయం దాచరించినగాని మానవులకు మాఘపుకథాశ్రవణ యోగ్యత గలుగదు.

శ్లో॥ జన్మకోటిషుసంస్కారై స్తపోదానాదిభిర్మునే । సహస్రైవ వృథస్నానై ర్యజ్ఞైస్త ద్విధిపూర్వకైః । మాఘపస్య (మానవస్య) భవే

ద్బుద్ధి ర్మాఘవ్రత మనుష్ఠితం । తత్కథా శ్రవణే తస్య తత్కర్తుం నేతరైర్మనే ॥

తా॥ అనేక జన్మకోటులయందు నాచరించిన తపోదానాది సత్కారములచేతను విధిపూర్వకముగా చేయబడిన అనేక యజ్ఞములచేతను, మాధవ ప్రీతికరమయిన మాఘవ్రత మనుష్ఠించుటకును, మాధవ కథా శ్రవణము చేయుటకును బుద్ధికలుగును. అన్యథా కానేరదు.

శ్లో॥ మాఘవ్రతఫలోత్పన్న జ్ఞానతత్త్వకథాంమునే । కథయామీతితేప్రీత్యా సావధానమనాశ్రుణు ॥

తా॥ ఓ మునిశ్రేష్ఠా! మాఘవ్రతఫలోత్పన్న తత్త్వజ్ఞానకథను నీయందలిప్రీతితో చెప్పెదను. నీవు సావధానుడవై వినుము.

శ్లో॥ గంగాతీరేపురావిప్రో వేదాఢ్య స్సత్యభాషణః । శాంతో దాంత స్సదాచార స్సర్వభూతదయానిధిః ॥

తా॥ పూర్వంబున గంగాతీరమందు ఒక బ్రాహ్మణుడుండెను ఆబ్రాహ్మణుడు వేదపండితుడును, సత్యవాక్యుడును, శాంతుడును, దాంతుడును. (అంతరింద్రియనిగ్రహవాన్ శాంతః, బహిరింద్రియనిగ్రహవాన్ దాంతః ఇత్యభియుక్తోక్తిః) సదాచారసంపన్నుడును, సర్వభూతదయాళువును నై యుండెను.

శ్లో॥ నీతిమాన్ జ్ఞానసంపన్నో తపస్వీ విజితేంద్రియః । అపుత్రశ్చింతయన్ దుఃఖా త్ప్రాహ ప్రాణప్రియోం సతీమ్ ॥

తా॥ నీతిమంతుడును, జ్ఞానియు తపోవంతుడును, జితేంద్రియుడును. ఇట్టి బ్రాహ్మణుడు సంతానములేనివాడై దుఃఖించుచు పతివ్రతయు ప్రాణప్రియయునైన భార్యతో నిట్లనెను.

శ్లో॥ ఏకోపిగుణవాన్ పుత్రో న మే సంజాయతే ప్రియే । పుత్రహీనస్య మేభద్రే సుగతిర్నాస్తి శాశ్వతీ ॥

తా॥ ఓ ప్రియా! నాకు గుణవంతుడయిన కుమారు డొకడు కలుగలేదు. పుత్రహీనుడనయిన నాకు శాశ్వతమయిన సుగతిలేదుగదా.

శ్లో॥ ఏవం భర్తృవచశ్శ్రుత్వా పునఃప్రాహ పతింతదా । త్వయా పురాణశాస్త్రేభ్యో దానం పుత్రప్రదాయకం । దత్తంకస్మా దిదానీంతు పుత్రసంజాయతేకథమ్ ॥

తా॥ ఇట్లు పతిమాట విని భార్య పలుకుచున్నది. పూర్వజన్మమందు నీవు పుత్రప్రదమయిన దానమును సత్పాత్రులగు బ్రాహ్మణోత్తములకు యివ్వనందున మనకు సంతాన మెట్లుకలుగును.

శ్లో॥ ఇతి భార్యావచశ్శ్రుత్వా పునః ప్రాహ ప్రియాం మునే। తపసా దుస్తరేణాపి తోషయిత్వా జనార్దనం। పుత్రంప్రాప్స్యే ప్రియత్నేన ప్రసాదాచ్చక్రపాణినః।

తా॥ ఇట్లు భార్యయొక్క వాక్యమును విని భర్త యిట్లనిరి. దుస్తరమైన తపస్సుచేత విష్ణువును సంతోషింపజేసి అతని ప్రసాదమువలన పుత్రునిబొందవలెను.

శ్లో॥ కర్మణాం దుస్తరేణాపి యోగేనాపి సమాధినా। పుత్రం ప్రాప్స్యేత్వయి మయా ప్రయత్నేనమృకండువత్।

తా॥ మహాదుర్లభమయిన కర్మలచేతగాని, యోగముచేతగాని, సమాధిచేతగాని నీయందు నేను మృకండుమునివలె పుత్రునిబొందుదును.

శ్లో॥ తౌదంపతీవిచార్యేత్థం గంగాతీరేవనేమునే। వామైకపాదాంగులినా భూమావ్యస్యోర్ధ్వదర్శనః। మార్తాండేన్యస్తదృష్ట్యాచ చలన్నైవాణుమాత్రకం। ఊర్ధ్వబాహ్వంజలింకృత్వా ధ్యాయన్ హృత్కమలే హరిం జపన్నష్టాక్షరంమంత్రం ప్రణవాద్యమతంద్రితః।

తా॥ ఆ భార్యాభర్తలిద్దరిట్లు విచారించుకొని గంగాతీరమందుండు చెట్లవద్ద తపస్సుచేయుటకు వెళ్ళిరి. వెళ్ళి ఆబ్రాహ్మణుడు వామపాదాంగుళిగా భూమియం దుంచి ఊర్ధ్వదర్శనుడై సూర్యునియందు దృష్టి నిలిపి కొంచమయినను చలించక మీదికి బాహువులెత్తి అంజలిబట్టి హృదయకమలమందు కమలాపతిని ధ్యానించుచు నారాయ ణాష్టాక్షరీ మంత్రమును జాగరూకతతో జపించుచుండెను.

శ్లో॥ ఏవంకృతేతు తపసి పుత్రకామనయా మునే। మాసద్వయాంతరేవిష్ణుః ప్రాదురాసీచ్ఛుభేక్షణః।

తా॥ ఇట్లు పుత్రకోరికచేత తపస్సుచేయుచున్న బ్రాహ్మణునకు రెండుమాసములు గడచిన తరువాత శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమాయెను.

శ్లో॥ శంఖచక్రాంబుజగదా పాణిర్బాహుచతుష్టయః। వనమాలీ పీతవాసాః కౌస్తుభాభరణోదరః। కోటిసూర్యప్రకాశేన కిరీటేన విరా

జితః । సితాబ్జవదనశ్శ్యామః స్ఫురన్మకరకుండలః । అనేకాదిత్యసంకాశః కాంతానేకశశిప్రభః । స్తూయమానో నారదాద్యై ర్గీయమానోప్సరో గణైః । సేవ్యమానో మునిశ్రేష్ఠైః ప్రసన్నోభూత్పురోభువి । సలక్ష్మీశ్చ గరుడారూఢః సమస్తవరదాయకః ।

తా॥ విష్ణువు నాలుగుచేతులతో శంఖమును, చక్రమును, పద్మమును, గదను ధరించినవాఁడును, రొమ్మునందు వనమాలను ధరించినవాఁడును, (వనమాలాలక్షణము తులసికుంద మందార పారిజాతాంబుజైస్తథా । పంచభిర్గ్రథితామాలా వనమాలేతి కీర్త్యత ఇతి॥) పచ్చని పట్టువస్త్రమును ధరించినవాఁడును, కౌస్తుభమణితో ప్రకాశించుచున్న వక్షస్థలముగలవాఁడును, కోటిసూర్యప్రకాశ కిరీట శోభితుఁడును, తెల్లతామర పువ్వువంటి ముఖముగలవాఁడును, శాంతుఁడును, కర్ణములయందు ప్రకాశించుచున్న మకరకుండలములు గలవాఁడును, అనేక సూర్యకాంతితో సమాన కాంతిగలవాఁడును, కాంతియందు కోటిచంద్రసమాన శోభావంతుఁడును, నారదాది దేవర్షులచేత స్తోత్రము చేయఁబడుచుండువాఁడును అప్సరస్త్రీలచేత గానము చేయఁబడుచుండువాఁడును, మునిబృందసంవందిత పాదారవిందుఁడును, అభీష్టవరదాయకుఁడును, లక్ష్మీసహితుఁడును, గరుడారూఢుఁడునై బ్రాహ్మణునిముందర ప్రసన్నముఖముతో ప్రత్యక్షమాయెను. అహహా ! బ్రహ్మాదుల కగోచరమయినట్టి దివ్యస్వరూపము బ్రాహ్మణునకు ప్రత్యక్షమాయెను. అతనిభాగ్యమింతని వర్ణింపతరము.

శ్లో॥ తతఃకుర్వాణ మనఘం దుష్కరం రోమహర్షణం । భగవానాహవిప్రేంద్రం ప్రహసన్భక్తవత్సలః ।

తా॥ ఇట్లు ప్రత్యక్షమై భక్తవత్సలుఁడైన భగవంతుఁడు దుష్కరతపశ్చర్యాతత్పరుఁడైయున్న బ్రాహ్మణునితో నిట్లనెను.

శ్రీభగవాను॥ శ్లో॥ మాంవిద్ధి వరదం విప్ర తే దాస్యామీప్సితం వరం । తుష్టోస్మితపసా తేద్య ప్రసన్నో మునిసత్తమ ।

తా॥ ఓ బ్రాహ్మణుఁడా ! నీకు నేను వరములనిచ్చుటకు వచ్చితిని. నీతపస్సుకు సంతోషించి నీకుప్రసన్నుఁడనయితిని. వరముగోరుము.

శ్లో॥ ఏవంబ్రువాణే దేవేశే విశ్వలస్త్వైరధీర్మునిః । బాహ్యాత్మత్య మజానన్సా తతోపవరమంతపః ।

తా॥ విష్ణువిట్లుచ్చరించినను నిశ్చలచిత్తుఁడైన బ్రాహ్మణుఁడు బాహ్యకృత్యము తెలియనివాఁడై విష్ణువాక్యమును వినినవాఁడై తీవ్రముగా తపమాచరించుచుండెను.

శ్లో॥ తస్యమానేతపోఘోరే బాహ్యకృత్య వివర్జితే । స్వయం జహారతచ్చిత్తం వరందాతుంవరప్రదః ॥

తా॥ బ్రాహ్మణుఁడిట్లు బాహ్యకృత్యములు విడిచి తపస్సు చేయుచుండఁగా విష్ణువు వరముల నివ్వదలచి అతని చిత్తమును ఆకర్షించెను.

శ్లో॥ చిత్తే విచలితే పశ్చా దున్మీలితదృశో మునిః । స్వాత్మస్థం పురతో దృష్ట్వా హరిం పంకజలోచనమ్ । సర్వాభరణసంయుక్తం సాక్షా ద్భక్తేష్టదాయకం । ప్రసన్నం నిర్మలమతిః తుష్టావ జగదీశ్వరమ్ ।

తా॥ ఇట్లు విష్ణువుచేత చిత్తమాకర్షించబడి చలించగా బ్రాహ్మణుఁడు కన్నులు తెరచి చూచి ధ్యానమందు తనహృదయంబున శోభించు దివ్యపురుష విగ్రహమును బహిర్దృష్టియందు తిరిగి సందర్శించి ఆనందపారావారమగ్నుఁడై దేహమును మఱచి కొంతకాలమునకు లబ్ధప్రపంచజ్ఞానుఁడై తనముందరనున్నటువంటిన్ని, పద్మలోచనుఁడైనటువంటిన్ని, సర్వాభరణభూషితుఁడైనటువంటిన్ని, భక్తేష్టదాయకుఁడైనటువంటిన్ని చతుర్దశభువనేశుఁడైనటువంటిన్ని చక్రపాణియయిన లక్ష్మీకాంతుని ముఖ్యవాక్యములతో స్తుతించసాగెను.

బ్రాహ్మణః ॥ శ్లో॥ నమస్తే దేవ దేవేశ నమస్తే భక్తవత్సల । నమస్తే కరుణారాశే నమస్తే ఽనంతవిక్రమ ।

తా॥ ఓ దేవదేవా ! నీకు నమస్కారము. భక్తవత్సలా ! నీకు నమస్కారము. కరుణాసింధో ! నీకు నమస్కారము. అనంతవిక్రమా ! నీకు నమస్కారము.

## తత్ర అష్టోత్తరశతనామ స్తోత్రమ్.

శ్లో॥ గోవిందాయ సురేశాయ అచ్యుతాయా ఽవ్యయాయచ । కృష్ణాయ వాసుదేవాయ సర్వాధ్యక్షాయ సాక్షిణే । లోకస్థాయ హృదిస్థాయ అక్షరాయాత్మనేనమః । అనంతా యాదిబీజాయ ఆద్యాయాఖిలరూపిణే । యజ్ఞాయయజ్ఞపతయే మాధవాయ మురారయే । జలస్థాయ స్థలస్థాయ సర్వగాయామలాత్మనే । సచ్చిద్రూపాయ సౌమ్యాయ నమస్సర్వాఘనాశినే । నమఃకాలాయకలయె కామితార్థప్రదాయచః నమో

దాంతాయ శాంతాయ విష్ణవే జిష్ణవేనమః । విశ్వేశాయ విశాలాయ వేధసే విశ్వవాసినే । సురాధ్యక్షాయ సిద్ధాయ శ్రీధరాయనమోనమః । హృషీకేశాయ ధైర్యాయ నమస్తే మోక్షదాయినే । పురుషోత్తమాయ పుణ్యాయ పద్మనాభాయ భాస్వతే । అగ్రేసరాయ తూలాయ అమృతాయాత్మనేనమః । జనార్దనాయ జైత్రాయ జితామిత్రాయ జీవినే । వేదవేద్యాయ విశ్వాయ నారసింహాయతేనమః । జ్ఞానాయ జ్ఞానరూపాయ జ్ఞానదాయాఖిలాత్మనే । దురంధరాయ ధుర్యాయ ధరాధారాయతేనమః । నారాయణాయ శర్వాయ రాక్షసానీకవైరిణే । గుహ్యాయ గుహ్యపతయె గురవే గుణధారిణే । కారుణ్యాయ శరణ్యాయ కాంతాయామితమూర్తయె । కేశవాయనమస్తేస్తు నమో దామోదరాయచ । సంకర్షణాయ శర్వాయ నమస్త్రైలోక్యపావనే । భక్తప్రియాయహరయే నమస్సర్వార్తినాశినే । నానాభేద విభేదాయ నానారూపధరాయచ । నమస్తే భగవన్ విష్ణో పాహిమాం కరుణాకర ।

తా॥ ఈ చెప్పినవన్నియు భగవంతుని నామములు. కనుక ఆబ్రాహ్మణుడు స్తోత్రముచేసెను. మఱియు ప్రతివారు స్తోత్రముచేయుట శ్రేయస్కరము.

శ్రీగృత్సమదః॥ శ్లో॥ ఏవమష్టోత్తరశతై ర్నామభి ర్జగదీశ్వరం । తుష్టావమునిశార్దూలో భక్త్యావిష్ణుం కృతాంజలిః ।

తా॥ ఈప్రకారముగా బ్రాహ్మణోత్తముడు కృతాంజలియై భక్తితో అష్టోత్తరశతనామములతో విష్ణువును ప్రార్థించెను.

శ్లో॥ తమాహ భగవాన్ జహ్నో వరయేతివరంమునిమ్ ।

తా॥ జహ్నూ! భగవంతుడీస్తుతికి మిక్కిలి సంతోషించి వరమాగోరుమనెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా సోపి విప్రేంద్రః పుత్రకామస్త మబ్రవీత్ । త్వద్భక్తిమచలాందేహి తథామేత్వత్పదంవిభో । పుత్రందేహీహమేవిష్ణో పరత్రచ పరాంగతిమ్ ।

తా॥ ఆమాటవిని బ్రాహ్మణుడు ఓ దేవా! నాకు నిశ్చలమయిన నీపాదభక్తి నొసగుము. ఈలోకమందు పుత్రునిమ్ము పరలోకమందు మోక్షమిమ్మని పలికెను.

శ్లో॥ ఇతి తస్య వచశ్శ్రుత్వా భగవాన్ భక్తవత్సలః । తథాస్త్వితి వరందత్వా ప్రత్యువాచ మునీశ్వరమ్ । త్వయా కృతేన స్తోత్రేణ యో మాం స్తౌతి చ మానవః । తస్యామే సుప్రసన్నత్వం శీఘ్రంభవతి నిశ్చితం । ఇత్యుక్త్వా భగవాన్ తత్ర అంతర్ధానంగతో మునిః ।

తా॥ ఇట్లు విప్రవాక్యములను విని భక్తవత్సలుండైన భగవంతుడు బ్రాహ్మణోత్తమా ! నీవు కోరినప్రకార మగుగాక. నీచే చెప్పబడిన యీ అష్టోత్తరశతనామ స్తోత్రమును పఠించువారికి నేను శీఘ్రముగా ప్రసన్నుండనగుదునని పలికి అచ్చటనే అంతర్ధానమాయెను.

శ్లో॥ చింతయన్ శ్రమంప్రాప్తో లబ్ధనష్టధనోయథా । అథకాలే గతేతస్య స్వభార్యాయాంజాయతేసుతః ।

తా॥ ఆ బ్రాహ్మణుడు దీనినంతయు విచారించుచు పూర్వస్థానమునకు జేరి అచ్చట సొమ్ము దొరికినవానివలె సంతోషించుచుండెను. తరువాత కొంతకాలమునకు స్వభార్యయందు పుత్రోదయమాయెను.

శ్లో॥ తన్నిశమ్య మునిస్తుష్టః కుమారజననంమునే ।

తా॥ పుత్రుడు కలుగుటవిని ఆబ్రాహ్మణుడు సంతోషించెను.

శ్లో॥ తతోంతరిక్షాదభ్యేత్య నారద స్సాధుదర్శనః । తమాహాతే సుతస్యాస్య ద్విషడాయుర్విశిష్యతే । ద్వాదశాబ్దే వ్యతిక్రాంతే మృత్యునాగ్రస్యతేసుతః ।

తా॥ తరువాత కొంతకాలమునకు ఆ బ్రాహ్మణునివద్దకు నారదముని వచ్చి నీ కుమారునకు పన్నెండుసంవత్సరములు ఆయుష్కాలము. తరువాత మృతుడగునని చెప్పెను.

శ్లో॥ తమిత్యుక్త్వాతతో విప్ర ఖేచరత్వంగతేమునౌ । తచ్ఛ్రుత్వా దీనవదనౌ దంపతీ బహుదుఃఖితౌ ।

తా॥ నారదుడిట్లు చెప్పి పోయిన తరువాత ఆమాట విని ఆదంపతులు మిక్కిలి శోకించిరి,

శ్లో॥ మునిర్దుఃఖార్ణవేమగ్న శ్చింతయన్ మౌనమాస్థితః ।

తా॥ బ్రాహ్మణుడు దుఃఖమహోదధి మగ్నుడై చింతించుచు మౌనముతో నుండెను.

శ్లో॥ బాలసూర్యప్రతీకాశ ముత్సంగేన్యస్య బాలకం । పాణినోపస్పృశన్మాతా దుఃఖాద్బాష్పాకులేక్షణా । బహుధా దుఃఖితా సాధ్వీ భూయోభూయోవినిశ్వసత్ ।

తా॥ బాలసూర్యశోభాశోభితుండైన బాలుని తన తొడయందుంచుకొని తల్లి అనేకముగా దుఃఖించుచు, కన్నీళ్లు కార్చుచు, చేతులతో కుమారుని స్పృశించుచు, హాయనా యనుచు, మాటిమాటికి నేడ్చుచు నిట్టూర్పులిచ్చుచుండెను.

శ్లో॥ బభూవామ్లానవదనా నభుంక్తేన్నం కదాచన । పాలవద్దుఃఖితా సాధ్వీ శిశుందృష్ట్వాశ్వసన్ముహుః ।

తా॥ వాడిన ముఖముగలదై అన్నముతినుట మాని పిల్లవానిని చూచుచు యీప్రకారముగా దుఃఖించుచుండెను.

శ్లో॥ పతిర్మమాతితపసా పుత్రంలబ్ధ్వా ముదాన్వితః । దినే దినే బాలకోయం వర్ధమానోర్ధచంద్రవత్ । బాలక్రీడాదికాన్దృష్ట్వా కృతోపనయనంసుతం । అధీతసర్వవిద్యంచ బ్రహ్మచర్యపరాయణమ్ । ద్వాదశాబ్దైర్వ్యతిక్రాంతే బాలకో ధర్మపాలకః । మృత్యునా గ్రస్యమానస్సన్ మరణంత్వధిగచ్ఛతి। మృతేను తే తతో దుఃఖం నసహిష్యే కదాచన ।

తా॥ నాభర్త కష్టముతో తపమాచరించి యీ పుత్రునిపొంది సంతోషించెను. బాలుడును ప్రతిదినము శుక్లపక్షచంద్రునివలె వృద్ధిబొందుచుండె. బాలక్రీడసలిపి విధివిధానముగా ఉపనయనమును బొంది విద్యలభ్యసించి బ్రహ్మచర్యమును గడుపుచుండగా ౧౨ సంవత్సరములు సంప్రాప్తించుటచేత మాచిన్నవాడు మరణించును. ఇప్పుడు నేను పుత్రశోకమెట్లు సహింతును.

శ్లో॥ తస్మాదత్యధికం నాథ పుత్రశోకం సుదుస్సహం । అతోహం నసహామీదం త్యక్ష్యామ్యస్మిన్ జలేతనుం । మమాజ్ఞాపయతే సౌఖ్యం భవిష్యతి మహామతే ।

తా॥ ఓ నాథా! సహింపశక్యముగాని పుత్రశోకసాగర మీదుటకు నేను సమర్థురాలనుగాను. కావున నాకాజ్ఞనిమ్ము. ఈజలమందుబడి ప్రాణములను విడుతును. నీకు సౌఖ్యముగలుగును.

శ్లో॥ ఇతి భార్యా వచశ్శ్రుత్వా బాష్పపర్యాకులేక్షణః । భూయోతిదుఃఖార్తాంతాం విచింత్య నతకంధరః । తదిత్థోత్పన్నమజ్ఞానా దిదమాహ సతీం మునిః ।

తా॥ ఇట్లు భార్యావాక్యమును విని ఆదంపతులు కన్నీళ్లుకార్చుచు దుఃఖించుచు తలవంచుకొని మిక్కిలి యేడ్చుచున్న భార్యను జూచి జ్ఞానోపదేశము చేయదలంచి భార్యతో నిట్లనెను. పుత్రశోకము భార్యాభర్తలకిద్దఱికి సమానము. తల్లి పుత్రోదయమును గుఱించి మిక్కిలి శ్రమనొందినందున దుఃఖమధికము. ఆలాగైనప్పటికిని తాను పురుషుఁడగుటచేత దుఃఖమును కొంత నివారించుకొనెను. ఆమె స్త్రీయగుటచేత కని పెంచిన దుఃఖమును ఆపుకొనలేదాయెను. దీనిని విచారించి యిప్పుడు యీశోకసాగర మీదుటకు తత్వజ్ఞానమే రాదగని మఱియేదియు లేదుగాన యిదినిశ్చయించుకొని ఉభయులకు దుఃఖోపశమనార్థము జ్ఞానకథాప్రసంగ మారంభించెను. ఉత్తరాధ్యాయమందు జ్ఞానోపదేశకథనము చెప్పఁబడును.

ఇతి సప్తదశోధ్యాయస్సమాప్తః.

---

## —◆ అథ అష్టాదశోధ్యాయ ప్రారంభః ◆—

## తత్వోపదేశః.

ముని రువాచ । శ్లో॥ వృధా కిం కురుషే శోక మనంతం కాయ శోషణం । కించిదప్యత్రవక్ష్యామి సతే శోకస్యకారణమ్ ।

తా॥ భర్త భార్యతో చెప్పుచుండె. శరీరశోషకమయిన అనంతశోకమును వ్యర్థముగా యెందుకు అవలంబించితివి. నీవిప్పుడిట్లు శోకించుటకు కొంచమయిన కారణము లేదు.

శ్లో॥ అహోనఖలుఃశోకస్తే వర్తతే యమహేతుకః । కేచిచ్ఛతాయుషోమర్త్యా భవంత్యల్పాయుషః పరే ।

తా॥ ఇప్పుడు నీకు కారణములేని శోకము సంభవించినది. ఎంత ఆశ్చర్యము. కొందఱు నూరేండ్లు బ్రతుకుదురు. మఱికొంద రల్పాయువ్యంతు లగుదురు.

శ్లో॥ శిశో స్త్రిమాట శేవర్తే మృతికాలో భవిష్యతి । అగోచరో వశశ్చకాస్య స్వల్పోర్భ్రదేమహానపి ।

తా॥ పిల్లవానికి పదమూఁడవ సంవత్సరమున మృతియని శోకించెదవా? ఎంత గొప్పవాఁడయినను మృత్యువు గోచరుఁడుగాకుండునా.

శ్లో॥ తవాపిభవితా మృత్యు రతిశోకేన కింతవ। తస్మాదుత్పన్న సత్వస్య మృత్యుః కేననివార్యతే।

తా॥ పుత్రమృతికి దుఃఖించెదవు. నీకును మృత్యువు తప్పదు గనుక శోకించకుము. పుట్టినజంతువుకు నాశము తప్పదు.

శ్లో॥ మృతస్యజంతోరుత్పత్తి స్తస్మాచ్ఛోకమిమంత్యజ॥

తా॥ చచ్చినవానికి ఉత్పత్తి తప్పదుగనుక యీశోకమును విడువుము.

శ్లో॥ ఏవ్యత్సుఖేవా దుఃఖేవా హర్షశోకా నవందితః। కురుతే సత్యమవ్యత్ర నశోకం కర్తుమర్హసి।

తా॥ పండితుఁడు దైవవశముచే వచ్చెడు సుఖదుఃఖములకు హర్షశోకముల బొందడు. నీవును ఈవిషయమై శోకమును బొందకుము.

శ్లో॥ యద్భావ్యంతద్భవత్యేవ యదభావ్యం నతద్భవేత్। ఏవం హ్యపరిహార్యేర్థే వృథాకిమనుశోచసే।

తా॥ రానున్నది రాకపోదు. పోనున్నది పోకపోదు. ఇట్లపరిహార్యవిషయమై వృథాగా నెందుకు శోకించెదవు.

శ్లో॥ నశోక స్తవభార్యేత్ర భవితవ్యం నివారయేత్। నాన్యథా వ్యతఏవత్వం నశోకం కర్తుమర్హసి॥

తా॥ నీశోకము రాఁగలదానిని నివారించదు. ఇంకేమయినను నివారించదుగాన శోకమును మానుము.

శ్లో॥ జాయతేకర్మణా జంతుః స్థీయతే మ్రియతేతథా। మాయాయుక్తంజగత్సర్వం దృష్టం నష్టస్వరూపకమ్।

తా॥ జంతువు కర్మవల్ల పుట్టును. కర్మవల్ల వుండును. కర్మవల్ల చచ్చును. మాయాయుక్తమై చూడబడుచున్న సమస్తజగము నశించును. (యద్దృష్టం తన్నష్టమితి న్యాయాత్)

శ్లో॥ లోకేవృత్తానుసారేణ శోకాభావస్తథోదితః । పరమార్థ విచారేణ నశోకస్సతరాం భవేత్ ।

తా॥ లోకదృష్టానుసారముచేత నీకు యీశోకము కూడదు పరమార్థవిచారణ చేత పూర్తిగా శోకము వదలివేయుము.

శ్లో॥ ఇదంశరీరమేవేశం ప్రాణినాం కిం నిరీక్ష్యతే । వినాశిత్వా చ్ఛరీరస్య నతే శోకస్య కారణమ్ ।

తా॥ ఈ దుఃఖము శరీరమును గురించి వచ్చినదా, లేక ఆత్మనుగురించి వచ్చినదా. శరీరమునుగురించి వచ్చినదైతే శరీరము నశించు స్వభావముగలది గనుక దుఃఖముతో పనిలేదు

శ్లో॥ యదిచేదత్ర మీమాంసా శరీరాద్వ్యత్యసేభిధాం । తదా త్మాశ్రయశ్శోకః తపకల్యాణి జాయతే ।

తా॥ శరీరము అశ్వరము యికనీ కెందుకుశోకము.

శ్లో॥ పుంస్త్రీ మైథున సంజాతం రేతోబిందు మచేతనం । శుక్ల శోణితసంయోగా చ్ఛరీరం భూతపంచకమ్ । తచ్ఛరీర మిత్థం త్వ ముద్దిశ్య కిలశోచసి ।

తా॥ శరీరము స్త్రీపురుష సంయోగజాతము. రేతోబిందు స్వరూపము. అచేతనము. పంచభూతసంభవమును, శుక్లశోణిత సంయోగముగలదైనది. ఇట్టి శరీరమునుగురించిగదా నీవు శోకించెదవు

శ్లో॥ భూతైః పంచభిరావిద్ధం శరీరం దుఃఖభాజనం । విణ్మూత్ర పూయ మాంసాఢ్యం దృష్ట్వాకః ప్రీతిమాప్నుయాత్ ।

తా॥ పంచభూతసంబద్ధమును, దుఃఖస్థానమును మలమూత్రపూయమాంసాది నిలయమును నయిన శరీరమునుజూచి యెవ్వఁడు ప్రీతినొందును.

శ్లో॥ అనిత్యేస్మిన్ శరీరేతు తృష్ణయా దుఃఖమావితం । తస్మా చ్ఛరీరతృష్ణాం త్వం త్యజేచ్ఛపి సుఖంయది ।

తా॥ అనిత్యమైన యీ శరీరమందున్న ఆశచేత దుఃఖము సంభవించినది. కనుక నీవు సుఖమును గోరితివేని శరీరమం దాశను విడుపుము.

శ్లో॥ యాప్రీతి స్తవకల్యాణి జాయతేస్మిఙ్ కళేబరే । సైవేహ దుఃఖహేతుస్సైత్యజాఽనర్థకరీఃశుభే ।

తా॥ నీకీ శరీరమందే ప్రీతికలిగెను. ఆ ప్రీతియే నీకు దుఃఖహేతువాయెను. గనుక అనర్థకారిణియయిన ప్రీతిని విడిచివేయుము.

శ్లో॥ ఆత్మన్యనాత్మబుద్ధిస్తే జాయతేశోకకారణం । తదభావమైవ శోకస్య భవేదంతకరీ శుభే ।

తా॥ అనాత్మయైన శరీరమందు కలిగిన ఆత్మ బుద్ధి శోకకారణమగును. ఆత్మబుద్ధ్యభావమే శోకనాశకమగును.

శ్లో॥ ఆత్మాదృశ్యో మతో యస్మాత్ప్రియమాత్మై రిహ సర్వదా । ప్రత్యక్షేణోపలభ్యంతే యథాహాత్రిఘటాదయః ।

తా॥ ఆత్మ అదృశ్యము ఘటాదులెట్లు ప్రత్యక్షోపలభ్యములో అట్లే ఆత్మ ప్రమాణోపలభ్యము.

శ్లో॥ అనాత్మ న్యాత్మబుద్ధీయాఙ్ సాసిద్ధాహ్యవిచారతః । నిర్ధార్యతే విచారేణ తత్కర్తవ్యమితోబుధైః ।

తా॥ అనాత్మయందయిన ఆత్మబుద్ధి అవిచారమువల్ల వచ్చినది. విద్వాంసులు విచారముచేత కర్తవ్యమును నిశ్చయించుచున్నారు.

శ్లో॥ దేహస్తావదనాత్మాయం దృశ్యత్వాద్ఘటివచ్ఛుభే। యథోపలభ్యతేదేహో దృశ్యోనాత్మా భవేద్ధ్రువమ్ ।

తా॥ దేహమాత్మగాదు. దేహము ఘటాదులవలె దృశ్యమై ప్రత్యక్షోపలభ్యము గనుక నిశ్చయముగా ఆత్మగాదు.

శ్లో॥ యథవేచ్చక్షురప్యాత్మా కరణత్వా త్ప్రదీపవత్ । అథాత్మానభవత్యన్యా నీంద్రియాణీవ శోభనే ।

తా॥ చక్షువు ఆత్మగాదు. దీపమువలె కరణము. అనగా ప్రదీపమెట్లు చూడదగినవస్తువునుగూర్చి సాధనమగునో అట్లే నేత్రేంద్రియమును దృశ్యసాధనము గనుక ఆత్మగాదని అర్థము ఇట్లే సమస్తేంద్రియములు కరణములగుటవలన ఆత్మగావు.

శ్లో॥ ఆత్మామనోఽపి నభవే త్కరణత్వాచ్చక్షురాదివత్ । ప్రాణో వ్యనాత్మా విజ్ఞేయ స్సుషుప్తౌ చేతనంయుతః ।

తా॥ మనస్సున్ను దీపమువలె సాధనమగుటచేత ఆత్మ గాదు. ప్రాణము ఆత్మ గాదు. సుషుప్తియందు చేతన ములేమింగాన ప్రాణమును ఆత్మ గాదు.

శ్లో॥ అహంకారో వ్యనాత్మా స్యా ద్వ్యభిచారా ద్ఘటాదివత్ । కృశాది ధర్మయుక్తత్వా త్సుఖదుఃఖ సమన్వయాత్ । ఈర్ష్యాది ధర్మ యుక్తత్వా న్నస్యాత్తాత్వమహంకృతేః ।

తా॥ అహంకార మాత్మ గాదు. ఘటాదులవలె సంకరమగుటవలనను, శరీర ధర్మయుక్తమగుటవలనను, సుఖదుఃఖసంబంధముగలిగినదగుటవలనను, ఈర్ష్యాది సంయుక్తమగుటవలనను అహంకార మాత్మ గాదు.

శ్లో॥ ఏతైర్విముక్తస్స్యాదాత్మా ప్రకృతే స్త్వపరో మతః । నిత్య తృప్తస్సదానంద శ్శుద్ధో బుద్ధశ్చ శాశ్వతః । తస్మాత్తస్య శరీరేణ సంబంధో విద్యతేఽనఘ ।

తా॥ ఆత్మ ఏతాదృశధర్మరహితుడును, ప్రకృతికి పరుడును, నిత్యతృప్తుడును, సదానందుడును, శుద్ధబుద్ధస్వభావుడును, శాశ్వతుడును కాబట్టి ఆత్మకు శరీరముతో సంబంధము లేదు.

శ్లో॥ శరీరమస్యదగ్ధత్వా ద్యత్త్వముద్దిశ్య శోచసే । నమే శరీర ధర్మోఽపి గుణధర్మాశ్చనైవహి । కథం మృత్యుర్భవం భవే ద్యస్మా ద్దేహనిమిత్తతః ।

తా॥ నీ వే శరీరమునుగూర్చి శోకించుచున్నావో ఆశరీర మాత్మకంటె వేరై నది. నీకు శరీరధర్మములు లేవు. గుణధర్మములు లేవు. ఇట్టిదానికి మృత్యువెట్లువచ్చును. అది దేహధర్మము.

శ్లో॥ శరీరస్యాత్మధర్మోఽపి యదిచేద్విద్యతేఽనఘ । తతస్స్యాద్దేహ ధర్మోఽపి భవితా నాత్రసంశయః ।

తా॥ శరీరమునకు ఆత్మధర్మ ముండినయెడల ఆత్మకును శరీరధర్మ ముండును. సందియము లేదు.

శ్లో॥ నాత్మనోన్యస్యధర్మేణ సంబంధో హేతురిష్యతే । తతశ్శరీరిణో ధర్మః శరీరస్య నవిద్యతే ॥

తా॥ ఆత్మకు అన్యధర్మసంబంధ మెంతమాత్రమును లేదుగనుక ఆత్మధర్మసంబంధము శరీరమునకు లేదు.

శ్లో॥ తస్మాచ్ఛవతు వామోరు శరీరస్యాస్యవైమృతిః । త్వంతు శోకంపరిత్యజ్య స్వస్థచిత్తాభవాయతే ॥

తా॥ కాబట్టి శరీరమునకు మృతి సంభవించుగాక, ఆత్మ కేమి భయములేదు. నీవు శోకమునువిడిచి స్వస్థచిత్తతోయుండుము.

శ్లో॥ కిమనేన శరీరేణ ప్రతిక్షణవినాశినా । త్వమాత్మానం ధ్రువంనిత్యం ప్రతిబుధ్య స్వభామిని ॥

తా॥ క్షణభంగురమయిన యీశరీరముతో నేమి ప్రయోజనమున్నది నీవుఆత్మను నిత్యమని తెలిసికొని సుఖముగానుండుము.

శ్లో॥ అనిత్యమేతత్సంసార మితిజ్ఞాత్వా మనీషిణః । ప్రవ్రజంతి కృతోద్వాహాః వైరాగ్యంపరమాస్థితాః ॥

తా॥ విద్వాంసు లీసంసార మనిత్యమని తెలిసికొని కృతోద్వాహులై వైరాగ్యము నవలంబించి సన్యసింతురు. వివాహమాడి పుత్రోత్పత్త్యాదిక్రమేణ చతుర్థాశ్రమము బొందుచున్నారు. యద్వా కృతోద్వాహు లయినప్పటికి వైరాగ్యోదయము కాంగానే సన్యసించుచున్నారు.

శ్లో॥ అజ్ఞానినస్తు సంసారే రాగాంధతమసావృతాః । భ్రమంత్యంధానుగాంధేన నియమానాస్సదాతురాః ॥

తా॥ అంధుని వెంటబడిపోవుచు అంధులెట్లు గమ్యమును గానలేక తిరుగుచుందురో అట్లు అజ్ఞానులు రాగాంధులై దరిగానలేక సంసారమందే తిరుగుచుందురు.

శ్లో॥ న ముక్తిర్విద్యతే తేషాం జన్మకోటిశతైరపి । న తేషాం జ్ఞానదీపోభూత్సంసారతిమిరాపహః ॥

తా॥ అట్టివారికి కోటిశతజన్మలకు ముక్తిలేదు. రాగాంధతమావృతు లెన్నటికిని సంసారచీకటి నాశనకరమయిన జ్ఞానదీపమును బొందలేరు.

శ్లో॥ సంసారసాగరే మగ్నా మాయామోహితబుద్ధయః। ముక్తిభాజో న జాయంతే కదాచిదపి మానవాః॥

తా॥ సంసారసముద్రములో మునిగిన మాయామోహిత మానవులు ఒకనాటికిని ముక్తినొందుటకు సమర్థులు గారు.

శ్లో॥ యావదేవ న మాయేయం నివర్తేతాతిమోహినీ। తావదేవహి సంసారో ముక్తిరస్యా విపర్యయే॥

తా॥ మోహకారియయిన మాయ యెంత కాలముండునో అంత కాలమే సంసారముండును. మాయ నశించినంతలో ముక్తిగలుగును.

శ్లో॥ అహో తే సుదృఢా బుద్ధిర్జాయతేస్మిన్ కళేబరే। అనిత్యే౽శుచిసంపూర్ణే నాభిజానాసి కేవలమ్॥

తా॥ అనిత్యమయిన అపవిత్రమయిన యీ శరీరమందు నీకు నిశ్చలమయిన బుద్ధి గలిగెను. ఎంత ఆశ్చర్యము. నీకు బొత్తుగా తెలియకపోయెగదా.

శ్లో॥ మాంసాస్థిపూయదుర్గంధే విణ్మూత్రక్రిమిసంకులే। ప్రీతిరస్మిన్ శరీరే తే న కర్తవ్యా కదాచన॥

తా॥ మాంసముతోను, ఎముకలతోను, దుర్గంధితమయినదియు, మలమూత్రభాజనమైనదియు, క్రిమిసంకులమయినదియునయిన యీ శరీరమందు ఒకప్పుడును ప్రీతినుంచకుము.

శ్లో॥ కిం న పశ్యసి దేహం తే జరయా పరిపీడితం। అవస్థాంతరసంప్రాప్తం గచ్ఛంతమతిచంచలమ్॥

తా॥ నీ యీ శరీరమును ముదిమిచేత చెడినదియు, అవస్థలను బొందినదియును, చంచలమును, నశించునదియు నయినదానినిగా నెంచుకు జూడవు.

శ్లో॥ మానుష్యం దుర్లభం ప్రాప్య స్వమోక్షస్యైకసాధనం। మహాదైవకిం వృథానర్థ తపస్యైహైవ కేవలమ్॥

తా॥ మోక్షసాధనమయిన దుర్లభ మానుషదేహమును బొంది మహాధనమై వ్యర్థముగా చెందుకు పరితపించెదవు.

శ్లో॥ యది తే రోచతే భద్రే ముక్త్యుచ త్త్వదామ్యహమ్॥

తా॥ నీవు నామాట విన నిశ్చయించితివేని చెప్పెదను వినుము.

శ్లో॥ అనాత్మన్యాత్మభావోఽయం త్యక్తవ్యోఽయం త్వయానఘ ।
శబ్దాదీన్విషయాన్పంచ త్యజసంగంవిశేషతః ॥

తా॥ శుద్ధచరితా! అనాత్మయైన శరీరమం దాత్మభావమును విడిచివేయుము. శబ్దస్పర్శరూపరసగంధ పంచవిషయసంగమును త్యజించుము.

శ్లో॥ ధ్యాయంత్యావిషయాంస్తత్ర తేషాం సంగోఽభిజాయతే । సంగాత్కామ స్తథా క్రోధః క్రోధాత్ మోహోఽభిజాయతే । తతః స్మృతిభ్రమః తస్మాద్బుద్ధేర్నాశోఽథ వేద్ధ్రువం । అనర్థహేతుభూతేస్మిన్ బుద్ధేర్నాశే వ్యవస్థితే । వినశ్యసిజాయేత్వం తతస్తేసంసృతిర్ధ్రువమ్ ।

తా॥ విషయధ్యానమువలన విషయసంగముగలుగును. అట్టి సంగమువలన నాకిది కావలయునను కామముకలుగును. ఆకామము హతమైనప్పుడు దానివలన క్రోధము కలుగును క్రోధమువలనయుక్తాయుక్త వివేకశూన్యతారూప సమ్మోహమును గలుగును. అట్టి సమ్మోహమువలన స్మృతినాశనముగలుగును. స్మృతియనఁగా వేదాంత శ్రవణజన్యజ్ఞానముచేత నేను బ్రహ్మనని పునఃపునః శ్రుతిస్వానుభవజన్యమై తదాకార వృత్తిగామియయిన బుద్ధి వృత్తి విశేషము. ఆ స్మృతినాశనమువలన బ్రహ్మవిషయబుద్ధి నశించును. స్వవిషయకస్మృతి నశించుటచేత తానును నశించును. కిరీటి! యిట్లు అనర్థమూలమయిన బుద్ధినాశనము గలుగగానే నీవు నశించుదువు. అనఁగా సంసార కారాగృహమందు పడుదువని భావము. తరువాత నీకు సంసారము తప్పదుగదా.

శ్లో॥ తస్మాత్సంగోఽసకర్తవ్యో విషయేషుజయోఽనదా । విషయాజయినస్సర్వే త్యక్త్వావిషయాచ్ఛుభే ।

తా॥ అందువల్ల విషయసంగము త్యజింపదగినది. విషయములను జయించవలెను. విషయములను జయించనివారు దేశమునుంచి వెళ్లగొట్టతగినవారు.

శ్లో॥ ఇంద్రియాణీంద్రియార్థేభ్యః ప్రత్యాహార విధానతః ।
మనసాసన్నియమ్యాథ రుధ్రేద్యోగయుతోభవః ।

తా॥ ఇంద్రియములను విషయములనుంచి తప్పించి మనస్సుచేత ఇంద్రియముల నియమించి యోగమునవలంబించవలెను.

శ్లో॥ ముక్తసంగేన మనసా నిశ్చలేన దృఢవ్రతే । హృదయస్థం స్వమాత్మానం ప్రతిబుధ్యస్వ భామిని ।

తా॥ సంగమును విడిచి నిశ్చలమయిన మనస్సుతో హృదయస్థితమయిన తన ఆత్మను తెలిసికొనుము.

శ్లో॥ అహమష్టాంగయోగేన జ్ఞాత్వాత్మానం పరం ధ్రువం । అస్మిన్నేవ లయంగచ్ఛే ద్విహాయేదం కళేబరమ్ ।

తా॥ అష్టాంగయోగముచేత పరాత్మను తెలిసికొని యీశరీరమును విడిచి యిప్పుడే లయమును బొందవలెను.

శ్లో॥ మయిసర్వాణిభూతాని తేషుచాహ ముపస్థితః । మత్తః పరతరం నాన్య ద్విద్యతేహ మతః పరమ్ ।

తా॥ నాయందు సర్వభూతములున్నవి. సర్వభూతములయందు నేనున్నాను. నేనే గొప్పవాడను. నాకంటె అన్యము యేమియు లేదు.

శ్లో॥ జాయేతస్మా చ్ఛరీరేస్మిన్ మమత్వం పరివర్జయ । అహంకారం తథాత్యక్త్వా సుఖ వ్రజ చిరం శుభే ।

తా॥ కావున ఈశరీరమందు మమతను విడువుము. (మమేదంభావో మమత్వం) అట్లుగా అహంకారమును విడిచి సుఖమును బొందుము

శ్లో॥ త్యజానర్థకరం శోకం తృష్ణాసంగసముద్భవం । శోకహేతుం మృతస్యాస్య హ్యల్పాయు ర్భయద్భయం శుభే । హరిష్యామి హరిం పూజ్య తూష్ణీం తిష్ఠ సుఖం వ్రజ ।

తా॥ తృష్ణాసంగజన్యమై అనర్థకమయిన శోకమును విడువుము. పుత్రుడు చనిపోవునని గదా నీవు శోకించెదవు. నీకు భయములేదు. హరిని పూజించి పుత్రమరణభయమును నివారింతును. నీవు సుఖముగా వెళ్ళుము

శ్రీగృత్సమదః॥ శ్లో॥ ఇత్యుక్త్వాసముని ర్బ్రహ్మా తూర్ణం భాగీరథీతటే । ఆవాహ్యార్చయామాస రవిమండలమధ్యగమ్ । విష్ణుం లోకేశ్వరం భక్త్యా కుసుమాగరుచందనైః । ధూపైర్దీపైశ్చ నైవేద్యై స్తాంబూలఫలవారిభిః ।

తా॥ జనకా! ఆముని యిట్లు భార్యతోకూడ శీఘ్రముగా గంగాతీరమందు రవిమండల మధ్యవర్తియైన విష్ణువును ఆవాహనచేసి పాద్యార్ఘ్య స్నాన వస్త్రాభరణ చందనపుష్ప ధూపదీపనైవేద్య తాంబూలాదులతోను పూజించుచుండెను.

శ్లో॥ తతోఽకవిశ్వ తస్యాగ్రే జజాప జగదీశ్వరం। భక్తకాంతః ప్రసన్నోభూ త్తద్భక్త్యాతోషితో హరిః ॥

తా॥ తరువాత వారి సందర గూర్చుండి నారాయణాష్టాక్షరీ మంత్రమును జపించెను. భక్తులకు ప్రియుండగు లక్ష్మీకాంతుండు సంతోషితాంతఃకరణుండై ఆబ్రాహ్మణునిముందర ప్రత్యక్షమాయెను.

శ్లో॥ తందృష్ట్వా దండవద్భూమౌ నత్వా స్తుత్వా మునీశ్వరః। తమాహ కరుణాసింధుః స్వభక్తా వత్సలేశ్వరః ॥

తా॥ ఇట్లు ప్రసన్నుండైన విష్ణువునకు మునీశ్వరుండు నమస్కరించి ప్రార్థించెను. తరువాత తపసితో తాపసవల్లభుండైన తామరసాక్షుం డిట్లనియె.

ఇతి అష్టాదశోధ్యాయ స్సమాప్తః.

---

## — అథ ఏకోనవింశోధ్యాయ ప్రారంభః —

శ్రీభగవానుః। శ్లో॥ మాం పున స్త్వత్ర సంపూజ్య మదాగమన కాంక్షయా। కిమిదానీం మునే బ్రూహి యత్తే మనసి వర్తతే ॥

తా॥ ఓ మునీశ్వరా! నారాకను గోరి తిరిగి యిప్పుడిచ్చట తపమాచరించుచుంటివి. యేమిగోరి తపమాచరించితివో చెప్పుము.

మునిరువాచ॥ శ్లో॥ భగవన్ యత్త్వయాదత్తం వరంమే సుఖదాయకం। వరప్రదానసంజాత స్తనయః కరుణానిధే ॥

తా॥ భగవంతుండా! దయచేత నీవు నాకు సుఖప్రదమయిన పుత్రప్రాప్తివరము నిచ్చితివి. నీవరమువలన నాకుపుత్రుండుదయించెను.

శ్లో॥ మాంగత్వా నారదశ్శ్రీమా న్నానావర్ణాం మునిసత్తమః ।

తనయస్తే మునే దేవ ద్వాదశాబ్దాంతరే తతః । మృత్యునా గ్రస్యతే నూన మిత్యుక్త్వా ప్రయయౌ మునిః ।

తా॥ ఇట్లుండఁగా ఒకనాఁడు నారదుఁడొచ్చి నాతో నీ కుమారుఁడు పన్నెండేండ్లకు మృతినొందునని చెప్పి వెళ్లెను. అందువల్ల నిన్నుగుతించి తిరిగి తపమాచరించు చుంటినని చెప్పెను

శ్రీభగవానువాచ॥ శ్లో॥ ద్వాదశాబ్దాంతరే విప్ర త్వత్పుత్రస్య మహాత్మనః । త్వద్భార్యాకృత దోషేణ గండస్తస్య భవిష్యతి । తద్దోషమభిధాస్యామి సావధానమనాశృణు ।

తా॥ ఆమాట విని భగవంతుఁడు చెప్పుచున్నాఁడు. ఓ బ్రాహ్మణుఁడా! నీ పుత్రునకు పన్నెండు సంవత్సరములకు గండముగలదు. ఆగండము నీభార్య చేసిన పాపమువల్ల గలిగినది. ఆపాపమును చెప్పెదను వినుము.

శ్లో॥ తవజాయా పురా విప్ర తపోనిష్ఠాత్మజా మునే । జ్ఞానశర్మ ప్రియాభార్యా రూపశీలగుణాన్వితా ।

తా॥ నీ భార్య పూర్వమందు తపోనిష్ఠునికూతురు. జ్ఞానశర్మునిభార్య. మంచి రూపముగలిగినదియు సత్స్వభావము గలిగినదియును.

శ్లో॥ సదాచారసమాపన్నా పతిశుశ్రూషణే రతా । సర్వభూత దయాయుక్తా పాతివ్రత్యపరాయణా ॥

తా॥ సదాచార యుక్తాయుక్త పతిసేవాపరాయణియు, సర్వభూతదయావతియు, పాతివ్రత్యపరాయణియును.

శ్లో॥ తమాహ జ్ఞానశర్మాయం మాఘే మకరగే రవౌ । రవావభ్యుదితే ప్రాతః కురుస్నానం శుచిప్రదమ్ ।

తా॥ ఇట్టిభార్యతో భర్త యిట్లనెను. ఓ ప్రియా! మాఘమున మకరమందు మార్తాండుఁడుండఁగా మాధవప్రీతిగా మాఘస్నానమాచరించుము. మాఘోదయస్నానము శుచిప్రదము.

శ్లో॥ పతివాక్యమిదం శ్రుత్వా లీలాహాసేతి సమాచరేత్ । పౌర్ణ

ఘ్యాం మాఘమాసస్య పాయసందానముత్తమం। నాకరోత్తేనదోషేణ పతినా ప్రతిబోధితా ।

తా॥ ఇట్లు పతి పలుకగా నరేయని అట్లు చేసెనుగాని, మాఘపూర్ణిమనాడు పాయసదాన మాచరించుమని పతి వాక్కు చెప్పినను పాయసదానమాచరించలేదు.

శ్లో॥ గతేతజ్జన్మనిమునే సాత్వంతిహ భవేజ్జనిః । అప్యేషా తవ జాయాభూ దపుత్రీ మునిసత్తమ ।

తా॥ ఆజన్మ గతించగానే ఆమె యిచ్చట జన్మించెను. ఆమెభర్తయు నీవై జన్మించితివి. ఇట్లు మీరిద్దరు జన్మించి తిరిగి దంపతులైతిరి గాని పతివాక్యోల్లంఘన దోషముచేత నీభార్యకు సంతానము గలుగలేదు.

శ్లో॥ తస్మాత్తే మాఘధర్మేణ మద్భక్తిరచలాభవత్ ।

తా॥ కావున నీవు మాఘధర్మ మాచరించినందున నీకు నాయందు నిశ్చలమైన భక్తి గలిగెను

శ్లో॥ మద్భక్త్యాసిత్తపశ్శక్తి స్తపసా తోషితస్తవ । మయాపుత్ర వరందత్తం పరత్రేహసుఖప్రదమ్ ।

తా॥ నీకు నాయందుగల భక్తిమహిమచేత తపశ్శక్తి గలిగెను. ఆతపస్సుచేత నేను సంతోషించి యిహపరసుఖప్రదమయిన పుత్రవరము నిచ్చితిని.

శ్లో॥ పాయసేనవ్యాదత్తేన మాఘ్యాంవై పౌర్ణమాదినే। పూర్వ జన్మనివిప్రేంద్ర దోషాదేషాహ్యపుత్రిణీ ।

తా॥ బ్రాహ్మణుడా! పూర్వజన్మమందు మాఘపూర్ణిమనాడు పాయసదానము చేయని దోషముచేత నీభార్య అపుత్రిణిగావలసివచ్చెను.

శ్లో॥ త్వయాదానంకురుష్వేతి శ్రుత్వా తమతిలంఘయేత్ । త్వద్వాక్యోల్లంఘనాద్దోషా ద్ద్వాదశాబ్దాంతరే సుతః । మృత్యునా గ్రస్యతే త్వాహ నారదస్సత్యభాషణః ॥

తా॥ పాయసదాన మాచరించుమని నీవు చెప్పితివి. దానిని విని అట్లు నీభార్య ఆచరించలేదు. నీవాక్యోల్లంఘన దోషముచేత పన్నెండు సంవత్సరములకు పుత్రుడు మృత్యువాతపడవలసివచ్చెను. నారదుడు దీని తెలిసికొనిమీకు చెప్పెను. ఇది సత్యము.

శ్లో॥ తస్మాత్తత్తనయం బాలం మాఘ్యాం గంగోదబిందుభిః । ప్రాతస్స్నపయ విప్రేంద్ర తస్యాయుఽభివర్ధతే ।

తా॥ కాఁబట్టి నీతనయుని మాఘోదయమందు గంగోదకబిందువులచే తడుపుము. అట్లయిన బాలునకు ఆయుష్య మభివృద్ధినొందును.

శ్లో॥ ఆయుష్య మతి చారోగ్య మైశ్వర్య మతులప్రదం । పుత్రపౌత్రప్రదంనౄణాం మాఘస్నానం మహామునే ।

తా॥ మాఘస్నానము మనుష్యులకు ఆరోగ్యకరము, ఐశ్వర్యప్రదము, పుత్రపౌత్రప్రదమును నగును.

శ్లో॥ సంప్రాప్తె మాఘమాసేతు నారీవా పురుషోపివా । న కుర్వంతి మునిశ్రేష్ఠ తేజ్ఞేయాత్మప్రఘాతినః ।

తా॥ స్త్రీలుగాని, పురుషులుగాని, మాఘవ్రతము సలుపనివారు పుత్రఘాతకు లగుదురు.

శ్లో॥ బ్రహ్మహాస్తేపి విజ్ఞేయా భ్రూణహాః పశుఘాతుకాః । మిత్రఘ్నాస్తే కృతఘ్నాస్తే పీరహాస్తే గురుద్రుహాః । పుత్రఘ్నాః పాపిన స్తేతు యేమాఘవ్రత వర్జితాః ।

తా॥ ఎవ్వరు మాఘవ్రతమును విడతురో వారు బ్రహ్మహంతకులు. వారే భ్రూణహంతకులు. వారే పశుహంతకులు. వారే మిత్రఘాతకులు. వారే కృతఘ్నులు. వారే పీరహత్యాకరాయణులు. వారే గురుద్రోహులు. వారే పుత్రహింసకులు. వారికంటె పాపాత్ములు భూమిలో లేరు.

శ్లో॥ జన్మజన్మార్జితే పుణ్యే సమ్యక్పాక ముపాగతె । మాఘవ్రతేషుధర్మేషు భవేదాత్యంతికీమతిః ।

తా॥ అనేక జన్మార్జితపుణ్యాలు పక్వములయినప్పుడు మాఘవ్రతసమాచరణ బుద్ధి కలుగును.

శ్లో॥ సంప్రాప్తెమాఘమాసేతు మకరస్తేదివాకరే । రోగహీనో దృఢాంగోయః స్నానం నకురుతే ద్విజః । సయాతి నరకం ఘోరం పునరావృత్తివర్జితమ్ ।

తా॥ మకరమందు మార్తాండుఁడుండఁగా మాఘమందు రోగాదులులేక దృఢాంగుఁడై స్నానమాచరించనివాఁడు పునరావృత్తిరహితమయిన నరకమును బొందును. (స్నాతః పునరావృత్తిరహిత వైకుంఠలోకే తిష్ఠతి, అస్నాతః పునరావృత్తిసహిత నరకే తిష్ఠతి)

శ్లో॥ మాఘస్నానం మహీదేవ మహాపాపహారకమ్ ।

తా॥ ఓ భూదేవా! మాఘస్నానము మహాపాపనాశకము.

శ్లో॥ మాఘమాసప్రియో విప్ర మాధవోహం సుఖప్రదః । నానుష్ఠితస్య జంతోశ్చ దుఃఖదోహం నచాపరః ।

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! నేను మాఘమాసప్రియుఁడను గనుక మాఘవ్రతపరాయణునకు సుఖమిత్తును. మాఘవ్రతవిముఖునకు దుఃఖమునిత్తును.

శ్లో॥ స్నానదానవిహీనోయః సత్యాచారవివర్జితః । మాఘమాసే మునిశ్రేష్ఠ తమాహు ర్నరకాతిథిమ్ ।

తా॥ మాఘమాసమందు స్నానదానరహితుఁడును, సత్యాచారవివర్జితుఁడును నయినవానిని నరకమునకు అతిథియని చెప్పుదురు

శ్లో॥ బాలోవాపి జడోవాపి రోగివా సజరాన్వితః । మాం ధ్యాయన్ సేచయేద్వారి ప్రాతర్మాఘే తనుం మునే । బాలో దీర్ఘాయురభవ జ్జడోభూయా త్పటుస్తథా । రోగీ నిరామయోభూయా ద్వృద్ధో విష్ణుపదం లభేత్ ।

తా॥ మాఘోదయ జలమందు మాధవ ధ్యానమును చేయుచు బాలుఁడును, పాపాత్ముఁడును, రోగియు, ముసలివాఁడు స్నానమాచరించిరేని బాలుఁడు దీర్ఘాయుష్మంతుఁడగును. మందమతిగలవాఁడు సమర్థుఁడగును. రోగి నిరోగియగును. వృద్ధుడు విష్ణులోకమును చేరును.

శ్లో॥ యోయంకామయతే విప్ర తమాప్నోతి నసంశయః ।

తా॥ ఈవిషయమునుగూర్చి యింకేమి చెప్పుదును. బ్రాహ్మణోత్తమా! ఎవ్వఁడు దేనినికోరునో వాఁడు దానిని బొందును.

శ్లో॥ బ్రహ్మావేత్తి హరోవేత్తి లక్ష్మీర్వేత్తి తథాశివా । తథా

సరస్వతీవేత్తి శక్రోవేత్తి సురేశ్వరః । వసిష్ఠోవేత్తి జనకో దిలీపో నారద స్తథా । సమ్యగేతే విజానంతి నజానంతి తథాపరే ।

తా॥ మాఘస్నానమహిమ బ్రహ్మకు తెలియును. శివునకు తెలియును. లక్ష్మికి తెలియును. పార్వతికి తెలియును. సరస్వతికి తెలియును. ఇంద్రునకు తెలియును. వసిష్ఠునకు తెలియును. జనకమహారాజునకు తెలియును. దిలీపమహారాజునకు తెలియును. నారదఋషికి తెలియును. తదితరులకు తెలియదు. అనఁగా వీరికి సంపూర్ణముగా తెలియును. ఇతరులకు తెలియుట దుర్లభము. పాద్మాంతర్గత మాఘమాహాత్మ్యములో దిలీపవసిష్ఠసంవాదమందు యీవిషయము సంపూర్ణముగా గలదు.

శ్లో॥ క్వచిజ్జానంతి కేచిచ్చ కేచిజ్జానంతి నక్వచిత్ । మాఘవ్రత ఫలం విప్ర నజానంతి బహుజ్ఞ్రజాః ।

తా॥ మాఘవ్రతఫలములో కొందఱు కొంతభాగమును తెలిసికొనుచున్నారు. మఱికొందఱికి పూర్తిగా తెలియదు. కాఁబట్టి బహుమందికి మాఘవ్రతఫల మహిమ తెలియదు.

శ్లో॥ మద్భక్తా మాంవిజానంతి మాఘవ్రతపరాయణాః। జానంతి మాఘధర్మంతు కేచిజ్జానంతి నేతరాః ।

తా॥ నాభక్తులు నన్ను తెలిసికొనుచున్నారు. మాఘవ్రతపరాయణులు మాఘధర్మమును తెలిసికొనుచున్నారు గనుక మాఘమహిమ కొందఱికే తెలియునుగాని అందఱికి తెలియదని తాత్పర్యము.

శ్లో॥ అనేకజన్మ సాహస్ర స్నానార్చా శ్రవణాదిభిః । మాఘ మాసే సమభ్యర్చ్య ధర్మం ధర్మవిదుత్తమః । తస్య సంజాయతే బుద్ధి ర్మాఘస్నానే మునీశ్వర ।

తా॥ అనేక సహస్రజన్మలయందు మాఘంబున స్నానార్చన శ్రవణాదుల చేత నన్ను అర్చించినవారికి మాఘస్నానబుద్ధి గలుగును.

శ్లో॥ తస్మా దనిత్యే దేహేస్మి మాఘస్నానం సమాచరేత్ । విజ్ఞేయం తస్యనరక మచిరా న్నాత్రసంశయః ।

తా॥ కాఁబట్టి అనిత్యమయిన దేహమును నమ్మకొని యెవ్వఁడు మాఘస్నాన మాచరించఁడో వానికి తప్పక త్వరగా నరకము గలుగును.

శ్లో॥ ప్రాతర్మాఘోదకం విప్ర శిశోరు పరిసేచయ । తేన తే తనయః పుణ్య స్సత్యం దీర్ఘాయుర్భవిష్యతి ॥

తా॥ మాఘోదయమందు నీకుమారుని గంగోదకముతో తడుపుము. దానంజేసి బాలుఁడు దీర్ఘాయుష్మంతుఁడగును. పుణ్యాత్ముండును నగును.

శ్లో॥ ఇత్యుక్త్వా భగవాన్ జహ్నో తత్రైవాంతర్గతో హరిః । ముని స్తతోతివార్ధేణ మాఘే గంగాజలం తథా ॥ బహిర్గత్వా మునిశ్రేష్ఠ శిశోరుపరిసేచయేత్ । తతో వృద్ధింగతో బాలః క్రమాత్కాలేగతేగతే ॥

తా॥ భగవానుఁడిట్లుచెప్పి అచ్చటనే అంతర్ధానమాయెను. తరువాత మునియు సంతోషముచేత గంగాజలము బయిటకుదెచ్చి పిల్లవానిమీద నుంచెను. వాఁడునుమాఘ గంగోదక స్నానముచేత క్రమముగా వృద్ధిబొందుచుండెను.

శ్లో॥ తృతీయవర్షే చౌలంచ చకార విధివత్తదా । జాతకర్మాది కర్మాణి తథాన్యాని మునీశ్వరః ॥ కుమారస్యాష్టమేవర్షే చాకరోన్మౌంజి బంధనం । స్వశిష్యయుక్తాతవిప్రః వేదశాస్త్రాదికాంతథా ॥

తా॥ తండ్రియయిన ముని తృతీయసంవత్సరమందు చౌలకర్మ జేసెను. కుమారుని జననము మొదలు జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలాదికర్మలు యథాకాలముగాజేసి అష్టమ సంవత్సరమందు ఉపనయనము జేసి వేద శాస్త్రములను చక్కగా పఠింపజేసెను.

శ్లో॥ ద్వాదశాబ్దేసమాయాతే బాలకస్య మహాత్మనః । తతోతిక్రమణే మృత్యు స్స్వయంనశ్యతి తస్మనే ॥

తా॥ పన్నెండు సంవత్సరములకు రాదగిన మృత్యువు నశించెను. కుమారుఁడు చిరంజీవుఁడాయెను.

శ్లో॥ సపుత్రోయం ముని ర్జహ్నో సుఖేన పరిమోదతే। ఆరూఢయోగతః కాలే మునే స్తస్య కళేబరం ॥ విష్ణుసాయుజ్య మాప్నోతి పునరావృత్తివర్జితమ్ ॥

తా॥ జహ్నూ! మునియును, మునిభార్యయును పుత్రునితోగూడా సుఖముగానుండిరి. పిమ్మట యోగాభ్యాసముచేత ముని కళేబరమువిడిచి విష్ణుసాయుజ్యము

పొందెను. అనఁగా మాని ఆరూఢయోగుఁడై శరీరమును విడిచి పునరావృత్తిరహిత విష్ణు సాయుజ్యముక్తిని పొందెనని భావము.

శ్లో॥ నాస్తి లోకే సమం దేవో మాఘవ్రతసమో వరః। విష్ణుప్రీతికరః పుణ్యః సర్వపాపౌఘనాశకః। యజ్ఞాదికర్మ ఫలదః మాఘోయం నాత్రసంశయః।

తా॥ మాఘవ్రతముతో సమానమయినది మరియొకటి లోకమందు లేదు సందేహము లేదు. మాఘము మాధవప్రీతికరము. మాఘము పుణ్యప్రదము. మాఘము సర్వపాపక్షయకరము. మాఘము యజ్ఞాది కర్మ ఫలప్రదము. ఇందుకు సందేహము లేశమయినను లేదు.

శ్లో॥ మోక్షమార్గప్రదో మాఘః సుజ్ఞానైశ్వర్యదాయకః। మోక్షకామో లభేన్మోక్షం కర్మభిర్నసలభ్యతే।

తా॥ మాఘస్నానము మోక్షప్రదము. సుజ్ఞానదాయకము. ఐశ్వర్యప్రదము. మోక్షార్థియైన మానవుఁడు మాఘవ్రతమనుష్ఠించెనేని మోక్షమును పొందును. కర్మలచేత మోక్షము పొందబడదు.

శ్లో॥ యత్పృష్టం మాం మునిశ్రేష్ఠ తన్మయాకథితం తవ। యశ్శృణోతిదమాఖ్యానం మానవో మాఘధర్మవిత్। జ్ఞానంలబ్ధ్వా లభేన్ముక్తిం నిత్యానందప్రదాయినీమ్।

తా॥ జహ్నూ! నీవు నన్నడిగినప్రకారము నీకు జ్ఞానతత్వమును మాఘధర్మము వలన జ్ఞానసిద్ధిని, మోక్షోపాయమును చెప్పితిని. ఈ యుపాఖ్యానమును వినిన మాఘవ్రతి జ్ఞానమును పొంది తద్వారా నిత్యానందప్రదమయిన మోక్షమును పొందును.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియోవాపి వైశ్య శ్శూద్రోథవాసతీ। ఇదమాఖ్యానమాద్యంతం యశ్శృణోతి మునీశ్వర। కృతపాపైర్వినిర్ముక్తస్సోపియాతి పరాంగతిమ్।

తా॥ బ్రాహ్మణుఁడుగాని, క్షత్రియుఁడుగాని, వైశ్యుఁడుగాని, శూద్రుఁడుగాని, స్త్రీగాని యీపురాణమును ఆద్యంతసహితముగా వినువారు పాపవినిర్ముక్తులై పరమపదమును పొందుదురు.

ఇతి ఏకోనవింశోధ్యాయస్సమాప్తః.

## — అథ వింశోధ్యాయ ప్రారంభః —

శ్రీగృత్సమదః॥ శ్లో॥ అశ్వమేధాధ్వరకృన్మాఘవ్రతపరాయణః । ఏకాదశీవ్రతేనిష్ఠః ససామ్యం ఫలమశ్నుతే ।

తా॥ (ఏకాదశ్యుత్పత్తిం తత్ప్రయాణ ప్రజ్ఞప్త బీజభూతాం పారిజాతోత్పత్తిం కథయతి) జహ్నూ! వినుము- అశ్వమేధయాగకర్తయు, మాఘవ్రతపరాయణుఁడును, ఏకాదశీవ్రతనిష్ఠాగరిష్ఠుఁడును సమానఫలమును పొందుదురు.

శ్లో॥ ఏకాదశీవ్రతోపోష్యం మాఘేస్మిన్ యస్సమాచరేత్। సోశ్వమేధఫలంప్రాశ్య ప్రాప్నోతి పరమాంగతిమ్ ।

తా॥ మాఘమాసమందు ఏకాదశ్యుపవాస మాచరించువాఁడు అశ్వమేధయాగ ఫలమునుపొంది తుదకు పరమపదమును పొందును.

శ్లో॥ మాఘేస్మిన్ కురుతే భక్త్యా సోపి స్వర్గపతిర్భవేత్ । యో మాఘమాస ద్వాదశ్యాం బ్రాహ్మణైః పారణాం చరేత్ । అన్నం యచ్ఛతివిప్రేంద్ర తస్యపుణ్య మనంతకమ్ ।

తా॥ మాఘైకాదశ్యుపవాసి స్వర్గపతియగును మాఘద్వాదశినాఁడు బ్రాహ్మణులతోఁగూడా పారణచేయువాఁడును. అన్నదాన మాచరించువాఁడును, అనంతపుణ్యభోక్తలగుదురు.

జహ్నుః॥ శ్లో॥ దినేషు బహుతిష్ఠత్సు తేష్వేవైకాదశీ శుభా । సాకస్మా దశ్వమేధానాం సహస్రాణాం ఫలప్రదా । కథం పురాకృతా బ్రహ్మన్ కథం కేన ప్రకాశితా । తత్సర్వంవద విప్రేంద్ర శ్రోతుకామాయ సాంప్రతమ్ ।

తా॥ జహ్నువడుగుచున్నాఁడు- ఓ గృత్సమదమహామునీ! అనేక దినము లుండఁగా ఏకాదశియే యట్లు అశ్వమేధసహస్ర ఫలప్రదమాయెను- పూర్వమెట్లుచేయఁ బడినది- ఎవరిచేత ప్రకాశింప చేయఁబడినది- ఈ సర్వవృత్తాంతమును వినగోరిననాకుఁ జెప్పుము.

శ్రీగృత్సమదః॥ శ్లో॥ శృణు జహ్నో ప్రవక్ష్యామి కథాం పాప ప్రణాశినీం । ఆయురారోగ్యమైశ్వర్యం పుత్రపౌత్రప్రదాయకమ్ ।

తా॥ జహ్నో! వినుము. పాపములు పోగొట్టునదియు, ఆయురారోగ్యైశ్వర్య ప్రదయు, పుత్రపౌత్రప్రదయు నయిన కథను జెప్పెదను.

శ్లో॥ పురా క్షీరార్ణవం విప్ర మమంథు ర్భాగ్యకారణం । మహా మేరుం మహాయత్నాత్ కృత్వా మంథానమవ్యయం । రజ్జుంవిధాయ నాగేంద్రం వాసుకిం సింధుమంథనే ।

తా॥ పూర్వకాలమందు దేవ దానవులు భాగ్యార్థులై క్షీరసముద్రమును మథించిరి. అప్పుడు మేరుపర్వతము కవ్వముగను, వాసుకియను నాగేంద్రుడు కవ్వపుత్రాడుగనై యుండెను

శ్లో॥ దానవా శ్చామరా స్సర్వే ద్విధాభూతా మునీశ్వర । వాసుకింతేత్రిధాకృత్వా హేమాద్రిం గగనస్పృశమ్ ॥ గృహీత్వా దానవా వక్త్రం పుచ్ఛం త్వనిమిషా స్తథా । విచకర్ష స్తతో న్యోన్యం మమంథుః క్షీరసాగరమ్ ।

తా॥ మేరుపర్వతమునకు వాసుకిని మూడుచుట్లు త్రిప్పి దేవదానవులు రెండు తెగలుగా నేర్పడి దేవతలు వాసుకి తోకనున్ను, రాక్షసులు శిరస్సునున్ను పుచ్చుకొని సముద్రమును మథించిరి. (అత్ర హేమాద్రి ర్మంథదండత్వోక్తి స్సర్వపురాణ కథా విరుద్ధా మంథానం మందరం కృత్వేత్యాది వాక్యత్ర పర్వత మందరస్యైవ మంథదండత్వోక్తేరతస్సమాధానం చింతనీయమ్॥)

శ్లో॥ మథ్యమానేసముద్రేచ శ్రీర్జాతా పంకజాననా । సాప్యాసీద్విష్ణుపత్నీచ తతశ్చోచ్చైశ్శ్రవాహయః । కామధేనుః కల్పతరుః సుధాకుంభాదయో మునే। బహవోపిసముత్పన్నా స్సురాణాం ప్రీతిదాయకాః॥ తాన్‌దదా భగవాన్‌విష్ణు రింద్రాయ స్వర్గవాసినే ।

తా॥ ఇట్లు దేవదానవులు క్షీరసముద్రమును మథించుచుండగా సముద్రమందు పద్మనిలయురాలై లక్ష్మి జన్మించెను. ఆలక్ష్మి విష్ణువుకు భార్యయాయెను. తరువాత ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును, కామధేనువును, కల్పవృక్షమును, అమృతకుంభమును మొదలయినవి అనేకములు జన్మించెను. విష్ణువు వాటినన్నిటిని ఇంద్రునకిచ్చెను.

శ్లో॥ మథ్యమానేపునస్సింధౌ గరళశ్చాగ్నిసన్నిభః । సముత్పన్నో దహన్‌సర్వ ఖండితో భూమిమండలమ్ ॥

తా॥ తిరిగి మథించుచుండఁగా అగ్నివలెను తేజస్సుగలిగిన విషము పుట్టెను. ఆ విషము భూమిని ఆకాశమును, దిక్కులను వ్యాపించి సర్వమును దహింపసాగెను.

శ్లో॥ తదా దేవాసురాస్సర్వే సంత్రస్తాః ప్రాణకాంక్షిణః । శరణ్యం శరణం జగ్ముశ్శంకరం శూలపాణినం । తుష్టువుశ్చన్ద్ర దాకారం దేవాస్తే దానవాస్తదా ।

తా॥ ఆవిషమును జూచి దేవ దానవులు భయమునొంది రక్షకుఁడైన శంకరుని శరణు పొంది స్తోత్రములతో స్తుతించిరి.

శ్లో॥ నమో భవాయ రుద్రాయ శర్వాయ సుఖదాయినే। నమో గిరాం విదూరాయ నమస్తే గిరిధన్వనే ।

తా॥ జగత్కారణుఁడును, సుఖదాయకుఁడును నయిన రుద్రదేవునకు నమస్కారము. వాగగోచరుఁడును, మేరుధన్వుఁడును నైన ఈశ్వరునకు నమస్కారము.

శ్లో॥ నమశ్శివాయ శాంతాయ నమస్తే వృషభధ్వజ । నమో నిత్యాయ దేవాయ నిర్మలాయ గుణాత్మనే ।

తా॥ శాంతుఁడవైన ఓ ఈశ్వరా ! నీకు నమస్కారము. వృషభకేతూ ! నీకు నమస్కారము. నిత్యనిర్మలుఁడవును. గుణాత్ముఁడవునునయిన దేవా నీకు నమస్కారము.

శ్లో॥ త్రిలోకేశాయ చేశాయ నమస్తే త్రిపురాంతక। త్రియంబక నమస్తేస్తు నమస్తే త్రిగుణాత్మనే ।

తా॥ త్రిలోకనాథుఁడవును, జగదీశ్వరుఁడవును నయిన ఓ త్రిపురాంతకా ! నీకు నమస్కారము. ఓ త్రియంబకా ! నీకు నమస్కారము. త్రిగుణస్వరూపా ! నీకు నమస్కారము.

శ్లో॥ త్రయీధర్మైక సాధ్యాయ త్రిరూపా యోరురూపిణే । అరూపాయ సరూపాయ వేదవేద్యాయ తేనమః ।

తా॥ వేదత్రయధర్మసాధ్యుఁడవును, రూపహీనుఁడవును, రూపసహితుఁడవును, వేదవేద్యుఁడవునునయిన నీకు నమస్కారము.

శ్లో॥ హరిప్రియాయ హంసాయ నమస్తే భయహారిణే। మృత్యుంజయాయ మిత్రాయ నమస్తే భక్తవత్సల ।

తా॥ విష్ణుప్రియుండవును, శాంతరూపుండవును, భయనాశనుండవును నయిన నీకు నమస్కారము. మృత్యువును జయించినటువంటిన్ని, మిత్రుండవైనటువంటిన్ని, ఓ భక్తవత్సలా! నీకు నమస్కారము.

శ్లో॥ పాహ్యస్మాన్ కృపయా శంభో విషాద్వైశ్వానరోపమాత్। ఇత్యార్తైస్సంస్తుత శ్శంభు రార్తత్రాణపరాయణః। విదారితాస్యస్తత్క్ష్వేళం పపౌ కంఠేన్యసేద్ధరః। తమాహు ర్నీలకంఠేతి నీలిమత్వాద్విషస్య చ।

తా॥ (శంసుఖమస్మాద్భవతీతి శంభుః తస్య సంబుద్ధిః) హే శంభో! భక్తశుభంకర దయాళూ! మమ్ముల రక్షింపుము. ఈ ప్రకారముగా దేవతలార్తులై స్తుతించగా ఆర్తత్రాణపరాయణుండయిన ఈశ్వరుండు నోరు తెరచి విషమును మ్రింగి కంఠమందుంచు కొనెను విషము నల్లనిదిగనుక విషమును కంఠమం దుంచినందున శివునకు నీలకంఠనామమును చెప్పిరి

శ్లో॥ సముద్రమథనం హిత్వా దేవేంద్రాద్యా స్సురాఽసురాః। తేతు దృష్ట్వామృతం పాత్రే మన్యోన్యాహరణేచ్ఛవః।

తా॥ అంతలో దేవదానవులు మథనము మానకొని అమృతపాత్రను చూచి నాక నీకు, నీకుగాక నాకు హరింతమని యిచ్ఛకలిగియుండిరి.

శ్లో॥ మాయయాపి భగవాన్ విష్ణు ర్నారీరూప మధారయత్।

తా॥ ఇట్లుండగా మాయలలోనగ్రగణ్యుండగు విష్ణువు స్త్రీరూపమును ధరించెను.

శ్లో॥ సానారీ సర్వజంతూనాం నయనోత్సవకారిణీ। పీనోరుచారు జఘనా పీనోన్నత పయోధరా। వికస చ్చంపకా నాసా విమలాయత లోచనా। మృదుబాహు ర్లతాంగీ సా సాంద్ర దీర్ఘ శిరోరుహా। సర్వాభరణసంయుక్తా భాస్వత్పీతాంబరావృతా। అనేకరత్నసంయుక్త విలస త్కుండల ద్వయా। విలస చ్ఛ్వలనా చారు మనాసాభరణోజ్జ్వలా। చపలాపాంగనయనా సానారీ సర్వమోహినీ। మధ్యస్థా తానువాచాథ హే దేవా దానవా ఇతి।

తా॥ (చతుర్భిశ్శ్లోకైః కలాపకేన నారీం వర్ణయతి) ఆ స్త్రీ సర్వ జంతువులకు నయనానందకారిణియు, గొప్ప తొడలుగలిగినదియు, సుందరములయిన పిక్కలుగలిగి నదియు, బలిసి ఉన్నతములుగానున్న స్తనములు గలిగినదియును, చంపకపుష్ప సమాన

నాసికయు, అమలవిశాలనేత్రయు, కోమలహస్తయు, లతావద్యాంగియు, చిక్కనై దీర్ఘములయిన కేశములు గలిగినదియు, అనేకాభరణసంయుక్తప్రకాశమాన పీతకౌశేయ వస్త్రధారిణియు, వక్షోజసంయుక్త కుండలద్వయవతియు, సుందరగమనయు, శోభన నానాభూషయు, చంచలాపాంగనయనవతియునై సర్వమోహినియై యుండెను. ఇట్టి స్త్రీ దేవదానవులమధ్యనుండి వారితో నిట్లనియె.

శ్లో॥ అహం పాత్రస్థ మమృతం యుష్మాకం సమభాగతః । దాస్యామ్యుపవిశంత్వత్ర పార్శ్వయోరుభయోరపి ।

తా॥ ఓ దేవతలారా! ఓ రాక్షసులారా! నామాటవినుఁడు. ఈకలశములో నున్న అమృతమును నేను మీకు సమభాగములుగా పంచిపెట్టెదను. ఇచ్చట దేవతలొకప్రక్కను, రాక్షసులు లొకప్రక్కనున్ను కూర్చుండుఁడు.

శ్లో॥ తస్యాస్తె తద్వచశ్శ్రుత్వా తథాస్త్వితివచోబ్రువన్ । సర్వే సుసమ్మతా దేవా దానవాః పంక్తిమాశ్రియః ।

తా॥ జగన్మోహిని యిట్లు పలుకగా దేవదానవులు అట్లేనని పలికి అందఱు అంగీకరించి పంక్తులుదీర్చి కూర్చుండిరి.

శ్లో॥ సుధాపాత్రముపాదాయ హస్తాభ్యాం సర్వమోహినీ । కృత్వా ద్విపార్శ్వమేకస్య పాత్రస్యార్ధేమృతం మునే । తత్రైవార్ధే సురాంపూర్య ఏకస్మిన్ సపినాసతీ । సురాణాం దానవానాంచ మధ్యస్థా సాముసీశ్వర । సవ్యాపసవ్యం ప్రదదా కామత్యేనా ఉమరాంగనా । అసురాణాం సురాంశ్చైవ సురాణా మమృతంతథా ।

తా॥ అంత జగన్మోహిని అమృతకలశమును హస్తములతో ధరించి, దానిలో రెండుభాగములు కల్పించి, ఒకభాగమందు అమృతమును, రెండవభాగమందు కల్లునున్ను పూరించి, దేవదానవ మధ్యవర్తియై, కపటముచేత దేవతల కమృతమును, రాక్షసులకు కల్లునున్ను యిచ్చెను. ఉభయులను యిరుప్రక్కల కూర్చుండబెట్టి తాను మధ్యనుండి రాక్షసులున్నవైపున కల్లుతో పూరించి దేవతలున్నవైపున అమృతముతో పూరించి, పంక్తికి పోయుట ఆరంభించి రాక్షసులకు కల్లును, దేవతలకు అమృతమున్ను ఒకేమాఱుగానే యిటునటు దిరుగుచు యిచ్చెను. కల్లును అమృతకలశములోనుండి వచ్చుటచేత రాక్షసులు అమృతమేనని నమ్మిరి.

శ్లో॥ నుధ్వన్నూపురధ్వానైశ్చ రణత్కంకణనిస్వనా । వ్యామోహయచ్ఛుక్రశిష్యాన్ సా నారీప్రవదదావితి ।

తా॥ బరువుగా మ్రోయుచున్న అందెల చప్పుళ్లతోను, కంకణధ్వనితోను, ఆస్త్రీ శుక్రాచార్యశిష్యులయిన రాక్షసులు మాయకులైనప్పటికిని తాను జగన్మోహిని గాన రాక్షసుల మోహింపజేసి యిట్లు సురాపానప్రశ్నను జేసెను.

శ్లో॥ తేదేవా దానవా స్సర్వే హస్తైధృత్వామృతం మునే । హస్తస్థంపాతుముద్యుక్తా స్తూర్ణమింద్రాదయస్సురాః । తత స్తత్కపటం జ్ఞాత్వా రాక్షసౌ దేవరూపిణౌ । హిత్వా రా వసుం శ్రేణిం సురాణాం శ్రేణిమాశ్రితౌ ।

తా॥ ఇట్లు విష్ణుమూర్తి అమృతము యిచ్చినప్పుడు దేవదానవులు అంజలులు బట్టి వాటిలో పోయించుకుని పానము జేయుచుండిరి. ఇంద్రాదిదేవతలు హస్తగతమైన అమృతమును పానము జేయుట కుద్యోగించు సమయమున వారి చేసిన యీకపటమును యిద్దరు రాక్షసులు తెలిసికొని రాక్షసపంక్తిని విడిచి దేవరూపములను ధరించి దేవపంక్తిలో జేరిరి.

శ్లో॥ తదజ్ఞాత్వా తదాప్యేషా తయోర్హస్తేమృతందదా । తదా పాతుంసముద్యుక్తౌ హస్తస్థ మమృతం జవాత్ । చక్రతుః పాన మసురౌ దృష్ట్వాతత్కపటంసతీ। చక్రంసంస్మృత్యతచ్చక్రా ద్వ్యచకర్త తయోశ్శిరః॥

తా॥ ఈ రాక్షసకపటమును విచారించక వారి హస్తమందును అమృతమునుంచెను. రాక్షసులును త్వరగా పానము జేయుచుండిరి. ఇంతలో యీకపటమును తెలిసికొని స్త్రీ చక్రమును స్మరించి ఆచక్రముచేత రాక్షసులిద్దరి శిరస్సులను ఖండించెను.

శ్లో॥ యత్పీత మమృతం తాభ్యాం న యావద్గర్భగం భవేత్ । తావచ్ఛిచ్ఛేదచక్రేణ మాయావీ మధుసూదనః ।

తా॥ రాక్షసులు అమృతపానము జేయుచున్నంతలో అమృతము వారిగర్భము లోనికి పోకముందు మాయావియయిన మాధవుడు చక్రముచేత వారిద్దరి శిరస్సులను ఖండించెను.

శ్లో॥ తదాచంద్రాదయస్తూర్ణం హస్తస్థమమృతంపపుః । హాహాకారోమహానాసీ ద్దానవైరమరైస్తతః ।

తా॥ అంతలో త్వరగా ఇంద్రాదిదేవతలు హస్తగతమయిన అమృతమును పానము చేసిరి. తదుపరి దేవదానవులచేత హాహాకారమాయెను. దానవులు మనకమృతపానము లేకపోయెననియు, దేవతలు మనతో యుద్ధమున రాక్షసులు అమృతపాన మాచరించిరనియు హాహాకారమాయెను.

శ్లో॥ తతస్తు దానవాస్సర్వే భగ్నాశాః ప్రాణకాంక్షిణః । నారాయణస్తు భగవాన్ హిత్వా నారాయణీం తనుమ్ । విష్ణోర్ముఖం సమాగత్య చతుర్భుజమథోచతుః । నవ్వృత్తి రుపజీవత్వ మావయో ర్వద కేశవ ।

తా॥ అంత దానవులు చింతాక్రాంతులై నిరవగ్రహజీవనాశానిరాశులై ప్రాణరక్షణకాంక్షులై తమతమ నివాసములకు త్వరగా పోయిరి. భగవంతుడయిన నారాయణుడును నారీరూపమును విడిచి విష్ణురూపమును ధరించెను. తదుపరి చక్రఖండిత రాక్షసులు విష్ణువుతో నిట్లనిరి. కేశవా! మాకు చావు బ్రతుకు గాకుండావున్నది. మాగతి యేమిచెప్పితివి. మాకు ఆహారమేమి.

శ్లో॥ తాభ్యాం నిగదితస్త్వేవం భగవాన్ ప్రత్యభాషత । భాగతః ప్రాప్తకాలే తే ప్రతిపత్పర్వసంధిషు । సూర్యచంద్రాశనం కృత్వా యువయోర్భవవృత్తిః । ఇతిబ్రువాణే దేవేశే ఖంగతే దేవవైరిణౌ ।

తా॥ ఇట్లు రాక్షసులడుగగా భగవంతుడు మీకు భాగములప్రకార మాయాకాలములయందు పర్వప్రతిపత్సంధులయందు (పూర్ణిమ అమావస్య పాడ్యమి సంధులలో) సూర్యచంద్రులను భక్షించుచు జీవించుచుండుడని చెప్పగా రాక్షసులిద్దఱు ఆకాశమునకు వెళ్ళిరి. (రాహుపాదత్రిద్వావిత్యుక్తమప్యత్ర త్వేక ఏవశిరశ్ఛేదనానంతరం ద్విధాభూతఇత్యుక్తం.)

శ్లో॥ తతస్త్విన్ద్రాదయో దేవా బ్రహ్మేశానజనార్దనాః । అక్షయ్యం త్వమృతం పాత్ర మాదాయ స్వాశ్రయం యయుః ।

తా॥ తదుపరి బ్రహ్మ విష్ణు మహేశులును, ఇంద్రాదులును, అమృతకలశమును పుచ్చుకొని తమస్థానములకు సుఖముగా చేరిరి.

శ్లో॥ తతో తస్మిన్ సముద్రస్య యత్రతిష్ఠో మృతాశ్రయః । కలశ స్తత్ర విప్రేంద్ర దైవాద్బిందూని పేతతుః ।

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! వినుము. అక్షీరోదధి తీరమందు అమృతకలశము నుంచిన కావున దైవవశముచేత కొన్నిబిందువులు భూమియందు పడినవి.

శ్లో॥ సుధాబిందురసముత్పన్నౌ కోమలావంకురాకృతీ । ఆసీదేకః పారిజాత ఏకోఽపితులసీ మునే ।

తా॥ అమృతబిందువులు పడిన స్థలమందు మృదువులైనవి రెండువృక్షము లుద్భవించినవి. అందులో ఒకటిపారిజాతము. ఒకటి తులసి.

శ్లో॥ తతశ్చాంతరితే కాలే కశ్చిజ్జలమకల్పయత్ । సత్యజిన్నామ శూద్రోఽసౌ పాలకః పుష్పవాటికామ్ । తులసీ పారిజాతౌ చ యతోద్భూతౌ చతత్రహి । చకారాయంపుష్పవాటీం భాగధేయేనభూసుర ।

తా॥ కొంతకాలమునకు సత్యజిత్తను శూద్రుఁడొకఁడు వాటికి నీళ్లు పోసెను. తులసీ పారిజాతోత్పత్తి స్థానమందు పుష్పవాటికను నిర్మించెను. అదృష్టవశముచేత వాడిట్లు చేసెను.

శ్లో॥ అదూరగ్రామవాసేన తేన శూద్రేణ యత్నతః । కృత్వా పరివృతింతస్యాః పాలయామాసవాటికామ్ ।

తా॥ శూద్రుఁడు తాను సమీపగ్రామమం దుంటచేత వాటిని పెంచి మట్టి ఆవరణ రచించి చక్కగా పరిపాలించుచుండెను.

శ్లో॥ తేనోపజీవనంకుర్వన్ ఆసీత్సోఽయం దినేదినే । తులసీ భూరుహ స్తత్ర సుకోమలదళైర్వృతః । మనఃప్రీతికరం దృష్ట్వా పాలయన్ సముదాన్వితః । పారిజాతఃప్రవృద్ధోఽభూ త్పుష్పఫలకోరకః ।

తా॥ వాఁడిట్లు ప్రతిదినమందు ఉదకమునుబోసి పెంచుచు వాటివల జీవనము చేయుచుండెను. తులసీవృక్షము కోమలదళలతో మనఃప్రీతికరముగా నుండెను. పారిజాతముగూడ పుష్ప ఫలాదులతోగూడి సొంపుగా నుండెను.

శ్లో॥ పారిజాతస్యకుసుమం సర్వేషాంప్రీతిదాయకం । నానారత్నప్రభాభాతి తద్వై రంతస్థకేసరైః । సుగంధాఢ్యస్సుఖరస స్సర్వశాఖాసమావృతః । ఏవంభూతానిపుష్పాణి సర్వశోభోద్భవానిచ ।

తా॥ పారిజాతపుష్పము అందఱికి సంతోషప్రదము. లోపలనున్న కేసరములు

చేత నానారత్నములచేత ప్రకాశించుచున్నది. ఆపారిజాతముయొక్క సర్వశాఖలయందు ఉత్పలించిన పుష్పములు సుగంధయుక్తములైన, మధురాస్వాద్యములును నైయుండెను.

శ్లో॥ సంపూర్ణఫలపుష్పాఢ్యం పారిజాతద్రుమం మునే। శక్రో దదర్శ దేవేశస్సదేవైః పార్శ్వవర్తిభిః॥

తా॥ ఇట్లు ఫలపుష్పసహితమయిన పారిజాతమును సపరివారుఁడయిన దేవేంద్రుఁడు చూచెను.

శ్లో॥ గచ్ఛన్ దానవశిక్షార్థం మత్తశ్చైరావతవాహనః। సదేవః పుష్పవాటీం స ప్రవిశ్యకుసుమానిచ। పారిజాతస్య పుష్పాణి సమాహృత్య శచీపతిః। సహర్షాత్ప్రయయౌస్వర్గం దాతుంస్త్రీణాంసదైవతః॥

తా॥ ఇంద్రుఁడిట్లు రాక్షససంహారార్థము మదించిన ఐరావతమునెక్కిపోవుచు పారిజాతమునుజూచి దిగి పుష్పవాటికను జేరి పుష్పములనుగోసి ఆనందముతో దేవతాస్త్రీలకిచ్చుటకు స్వర్గమునకు బోయెను.

శ్లో॥ శచ్యాదీనాం సురస్త్రీణాం పుష్పాణి ప్రదదౌ మునే। తాస్సర్వాః పారిజాతస్య పుష్పాణ్యాలోక్యహర్షితాః॥

తా॥ పిమ్మట శచీదేవి మొదలయిన దేవస్త్రీలకిచ్చెను. వారందఱు పారిజాతపుష్పములను జూచి సంతోషమును బొందిరి.

శ్లో॥ తానిపుత్రిణ్యః పునశ్శక్రం ప్రోచుః ప్రీతమనా మునే। దేవనాథసదాస్మాకం పుష్పాణిప్రేషితానివై॥

తా॥ సంతోషించి వారివృత్తాంతమును విని ఇంద్రునితో యీ పుష్పములు మాకు చాలా ఆనందకరములుగా నున్నవిగాన యెల్లప్పుడును మాకు తెప్పించి యిచ్చుచుండుమని కోరిరి

శ్లో॥ ఇతితాసాంవచశ్శ్రుత్వా తథేత్యాహశచీపతిః। గుహ్యకం ప్రేషయిత్వాతు పారిజాతద్రుమస్యచ। పుష్పాణ్యాహృత్య తుష్టోభూచ్చౌరవృత్త్యాదినేదినే॥

తా॥ ఇట్లు స్త్రీలమాటలను విని ఇంద్రుఁడు అట్లేనని ఒక గోప్యునిపంపి ప్రతిదినము చోరవృత్తిచేత పారిజాతపుష్పములను తెప్పించుకొనుచు సంతోషించుచుండెను.

శ్లో॥ పాలకః పుష్పవాటీనాం పుష్పహాన్యం దినేదినే। దృష్ట్వా విచింత్యబహుధా వ్యవిజ్ఞాయాథ గుహ్యకమ్॥ సోపి వ్యలోకయ ద్దుర్గే నిత్యం పుష్పాపహారకం। విలీనస్సర్గస్థితస్తత్ర స్థితేహ్యారామపాలకే।

తా॥ ఇట్లు ప్రతిదినము గుహ్యకుఁడు పుష్పములను హరించుచుండెను. సత్యజిత్తును ప్రతిదినము పుష్పములు లేకుండుటకు కారణము బహుగా విచారించియు తెలిసికొనలేక పుష్పవాటికలో నొక పొదలో దాగి చూతునని ఒకనాఁడు రాత్రిపొదలో దాగియుండెను.

శ్లో॥ తతస్స్వర్గాత్సమాయాతో గుహ్యవశ్చాపరేనిశి। పారిజాత తరుంప్రాప్య పుష్పావచయకారకమ్।

తా॥ ఇట్లుండఁగా అర్ధరాత్రియందు దేవయోని (గుహ్యకుఁడు) వచ్చి పారిజాత కుసుమములను గోయుచుండెను.

శ్లో॥ సత్యజిత్తత్ర తందృష్ట్వా పుష్పాపహారిణంమునే। తమభ్యేత్యాశుసంగృహ్య ఖేచరస్తత్కరాచ్చ్యుతః। ఖంగతస్స్మృతివేగేన ఇంద్రాయైతన్నివేదయత్।

తా॥ అంతలో రాజపుత్రుఁడుఁజూచి త్వరగా బోయి పట్టుకొనెను. గుహ్యకుఁడు సత్యజిత్తుయొక్క హస్తమునుంచి విడిపించుకొని శీఘ్రముగా ఆకాశమున కెగిరి యీ వృత్తాంతమును యింద్రునకు చెప్పెను.

శ్లో॥ సఇంద్రః ఖేచరేణోక్తో విహస్యేదమువాచహ।

తా॥ దేవేంద్రుఁడీసంగతిని విని దేవయోని (గుహ్యకుని) తో నిట్లనియె.

శ్లో॥ ఖేచరస్య న తేభీతి స్తస్మాద్గచ్ఛ యథాసుఖం। నిత్యమాహృత్యపుష్పాణి తాన్యస్మాకందదస్వహ।

తా॥ ఓయీ! నీవు ఆకాశసంచారివి. నీకేమియు భయములేదుగనుక మామూలుగాబోయి నిత్యము పుష్పములఁదెచ్చి మాకిచ్చుచుండుము.

శ్లో॥ తథేత్యుక్త్వాయయావశ్చా ద్గుహ్యక స్స్వాత్రియంమునే। విచింతయత్తతో దుఃఖా న్నమేపుష్పా ణ్యసంశయః। దేవాస్తే ఖేచరా

స్త్వస్మాత్పుష్పాణ్యపహరంతి వా । కల్పయేఽహ ముపాయంతు తస్య రక్షణకర్మణి ।

తా॥ గుహ్యకుఁడట్లేఁచని తనయింటికి వెళ్లెను. తరువాత నిచ్చట శూద్రుఁడును దుఃఖించుచు యికముందు యీపుష్పములు నాకు లభించవు. సందేహము లేదు. దేవతలు ఆకాశవిహారులు. నేను భూస్థితుఁడను. వారిని బట్టుటకు నాకు వీలులేదు. వారు పుష్పములను పుంచరు గనుక ఒక ఉపాయమును కల్పింతునని నిశ్చయించెను.

శ్లో॥ హరే ర్నిర్మాల్య మాదాయ పుష్పవాట్యా బహిస్థ్సలే । పారిజాతస్య శాఖాసు వికిరత్యంతరోమ్యహమ్ ।

తా॥ విష్ణుపూజానిర్మాల్యమును పుష్పవాటిక బయిటను, పారిజాత శాఖలయందును సర్వత్రచల్లుదును.

శ్లో॥ ఇత్యాలోచ్యాథ నిర్మాల్యం పాలకోఽయం వరేఽహని । సర్వత్రవ్యకిరత్తత్ర పుష్పవాట్యాస్సమంతతః ।

తా॥ ఇట్లాలోచించి పాలకుఁడు మఱునాడు హరిపూజానిర్మాల్యమును దద్ని పుష్పవాటికయం దంతటను జల్లెను.

శ్లో॥ పూర్వవద్గుహ్యకో హ్యాగా త్పుష్పాణ్యాహర్తుమాదరాత్ । పుష్పాపహారకే చోరే పారిజాతతరూపరి । తస్మిన్విష్ణోశ్చ నిర్మాల్యం పాదస్పర్శో భవన్మునే । శాఖా చ్ఛాఖాంతరం గచ్ఛన్ గర్త్యై వోల్లంఘితో భవత్ ।

తా॥ గుహ్యకుఁడును పూర్వమువలె పుష్పములుగోయుట కాలోచించి పారిజాతవృక్షముమీద నెక్కి పుష్పములగోయ నారంభించెను. అప్పుడు అచ్చట నిర్మాల్యముకు పాదస్పర్శ గలిగెను. తరువాత కొమ్మనుంచి కొమ్మకుబోవు సమయమున స్పర్శమేగాక ఉల్లంఘనముగూడా సంభవించెను.

శ్లో॥ తత స్తద్దోషత స్తస్య ఖేచరత్వ ముపాగతం । భూచరత్వేపి పంగుత్వ మభవన్మునిసత్తమ ।

తా॥ ఆదోషముచేత వానికి ఖేచరత్వము అనఁగా ఆకాశగమనము నశించెను. భూమిమీద నడుచుటకుగూడ కుంటివాఁడాయెను. తస్మాత్ పిచ్చివాఁడని చెప్పుదురు.

శ్లో॥ పపాత పారిజాతస్థో జాలబద్ధో మృగోయథా । పుష్పపాలః పుష్పచోరం గత్వోపాయేనతంపురః । నిగృహ్య బాఢమాహేదం కో భవాన్ కస్యకింకరః । తస్మాత్సర్వాణి పుష్పాణి హృత్వాహృత్వా దినే దినే । కస్య దేయాని తాన్యద్యం యత్త్వయా వద తస్కర । ప్రత్యాహ గుహ్యక స్సత్యం పుష్పవాటీశ్వరం మునే ।

తా॥ ఈచోరుఁడు వలలోఁబడిన మృగమువలె పారిజాతమునుండి క్రిందబడెను. పుష్పపాలకుఁడిట్లుపాయముచేత పుష్పచోరునిసమీపించి గట్టిగాపట్టుకొని యిట్లనిరు. ఓరిదొంగా! నీవెవ్వఁడవు. ఎవ్వరివాఁడవు. ఎందుచేత యీ సమస్తపుష్పములను ప్రతిదినము హరించుచుంటివి. వీటి నెవ్వరికిచ్చుచుంటివి చెప్పుము. అని అడుగగా గుహ్యకుఁడు యథార్థముగా నిట్లు చెప్పదొడంగెను.

శ్లో॥ ఖేచరోఽహంమహాబుద్ధే గుహ్యకస్త్వింద్రసేవకః । అజస్రాహం సురేంద్రేణ పుష్పాహరణేవిధా । మయాపహృత్యపుష్పాణి దత్తానీంద్రస్య సర్వశః ।

తా॥ నే నాకాశసంచారిని. గుహ్యకుఁడను. ఇంద్రునిసేవకుఁడను. ఇంద్రాజ్ఞ మీఁద పుష్పముల నపహరించి ఇంద్రునకిచ్చితిని. గుహ్యకుఁడనగా దేవయోనివిశేషము. (విద్యాధరోప్సరోయక్ష రక్షోగంధర్వకిన్నరాః । పిశాచోగుహ్యకస్సిద్ధో భూతోమీ దేవయోనయః ఇత్యమరః మహాబుద్ధే) అని పుష్పపాలకసంబోధనము. (మహతీబుద్ధిర్యస్య సమహాబుద్ధిరితి) నేను ఆకాశసంచారినయినను నన్ను పంగుని (కుంటివాని) గా జేసితివిగాన నీవు మహాబుద్ధిమంతుఁడవనే అభిప్రాయముచేత గుహ్యకుఁడు పాలకుని మహాబుద్ధియని సంబోధించెను

శ్లో॥ ఇత్యుక్తస్సత్యజిత్తేన తం హిత్వా స్వగృహంగతః । పంగుభూతోగుహ్యకోఽయం తత్రోవాస దినత్రయమ్ ।

తా॥ ఈ మాటవిని వానినివిడిచి సత్యజిత్తు తనయింటికి వెళ్లెను. గుహ్యకుఁడు కుంటివాఁడై అచ్చటనే మూఁడుదినములుండెను.

ఇతి వింశోధ్యాయ స్సమాప్తః.

—♦ అథ ఏకవింశోధ్యాయ ప్రారంభః ♦—

శ్రీగృత్సమదః॥ శ్లో॥ అనాగతేషు పుష్పేషు పారిజాతేషు దేవ రాట్। అపృష్ట్వా గుహ్యకం శక్రశ్చింతయన్ అహ పార్శ్వగాన్।

తా॥ గుహ్యకుడెల్లిందుటచేత పారిజాతపుష్పములు రానందున దేవేంద్రుడు ఏమిటా పుష్పములు రాలేదు. గుహ్యకుని విలంబమని విచారించి తానట చింతించిన వాడై సమీపమునన్న దేవతలతో నిట్లనెను.

శ్లో॥ కస్మాన్నాభ్యాగతో దేవాః గుహ్యకః పుష్పహారకః। విచారణీయః సోస్మాభి స్తస్మాదాయాంతుమాచిరమ్॥

తా॥ ఓ దేవతలారా! పుష్పములను దెచ్చు గుహ్యకుడు రాలేదు. కారణము తెలియదుగనుక కారణమును విచారించవలెను. నేను వెళ్లుచున్నాను. మీరును నాతో త్వరగా రండు.

శ్లో॥ ఇత్యుక్త్వామత్తమాతంగ మారుహ్య త్రిదశైర్వృతః॥ ఇంద్ర స్సమాయయౌ శీఘ్రం పారిజాతద్రుమాలయమ్।

తా॥ ఇంద్రుడు యిట్లుపలికి ఐరావతమును (తెల్లయేనుగను) యెక్కి దేవగణములతోగూడ శీఘ్రముగా పారిజాతవృక్షమున్న స్థలమునకు వచ్చెను.

శ్లో॥ ఇంద్రాదయో౽మరా స్సర్వే ప్రావిశన్ పుష్పవాటికాం। హరంతసర్వపుష్పాణి పారిజాతముఖానిచ।

తా॥ ఇంద్రాది సర్వదేవతలు పుష్పవాటికను జేరి పారిజాతాది సమస్తపుష్పములను త్వరగా కోసిరి.

శ్లో॥ పాదస్పర్శ భవేత్తేషాం విష్ణోర్నిర్మాల్య లంఘనాత్। అనశ్యత్ఖ చరత్వంచ తస్మాత్పంగుత్వమాపసః। ఇంద్రాద్యయు స్సురగణా స్సవాహా స్తత్రతేమునే। నకించిచ్చంచల న్నానః దుఃఖితాస్తే పృథక్ పృథక్।

తా॥ ఇట్లు పుష్పములనుగోయు దేవేంద్రాదులకు విష్ణునిర్మాల్యము మీదుగా దాటుట సంభవించెను. ఆదోషముచేత వారికి ఆకాశగమన మడుగింటి కుంటితనము సంభవించెను. ఇట్లు యింద్రాదులు వాహనములతోగూడా యెంతమాత్రము కదలలేక అచ్చటనేపడియుండి యెవరికి వారే దుఃఖించుచుండిరి.

శ్లో॥ తతస్తాన్ సత్యజిద్దృష్ట్వా వజ్రిపాణిపురస్సరాన్ । విస్మిత శ్చింతయిత్వైవ నత్వాథ తాన్ కృతాంజలిః ॥

తా॥ తరువాత సత్యజిత్తు యీదురవస్థను జెందియున్న దేవేంద్రాదులను జూచి ఆశ్చర్యమొంది యిదియేమిరాయని చింతించి వారికి నమస్కరించి కృతాంజలియై వారితో నిట్లనియె.

సత్యజిత్తు॥ శ్లో॥ ఇంద్రాద్యా స్త్రిదశా స్సర్వే యూయం కుత్ర ప్రయోజనే । నిబద్ధ్యదుఃఖితా స్తస్మా త్స్వల్పకం సర్వం భవేద్ధ్రువమ్ ॥

తా॥ ఓ ఇంద్రాది దేవతలారా! మీరు స్వల్పప్రయోజనముకొఱకు బద్ధులై దుఃఖమును బొందుచుంటిరి గాన మీకు ఘాతుకత్వదోషము తప్పదు.

శ్లో॥ ఇతి శ్రుత్వా ఉమరా స్తత్ర తమూచుః నమ్రకంధరాః । పుష్పకేశ్యా వయం తత్ర పతితా బలవర్జితాః । వైనతేయాది విహగా హ్యనాగతిపథా అపి । యథా వతేయ స్త్వాదిన్యాం జాతే చామిషలోలుపాత్ । తతో స్మాకం కథం త్వద్య వద మానవ మాచిరమ్ ॥

తా॥ ఈమాటవిని దేవతలు తలవంచుకొని వైనతేయ (గరుడ) ప్రముఖ పక్షులు మాంసాహారముకొఱకు భూమియందుబడి యెంత చింతపడునో అట్లు పుష్పకేశిచేత మేమిచ్చట బలహీనులమై పడితిమి గనుక మాకు గతియేమో త్వరగా చెప్పుమనిరి.

శ్లో॥ ఇతి తేషాం వచశ్శ్రుత్వా తూష్ణీం స్వాశ్రమమాగతః ॥

తా॥ ఇట్లు దేవతలమాటవిని సత్యజిత్తు మాట్లాడక తన ఆశ్రమమునకు వెళ్లెను.

శ్లో॥ స్థితాశ్చేంద్రాదయ స్తత్ర దుఃఖాద్దేవాదశోఽహాని । న తేషా మమృతాహారో నైవకామధుఘా చ భూః ॥

తా॥ ఇంద్రాదులు అచ్చటనే దుఃఖముతో పదికొండుదినము లుండిరి. వారి కమృతాహారములేదు. కోరిన కోరికలనిచ్చు స్వర్గము లేదు గాన నిరశనులై భూమియందుఁబడియుండిరి.

శ్లో॥ తస్మాదింద్రాదయో దేవాః క్షుధార్తాశ్చామృతాశనాః । భగ్నేంద్రియబలా స్సర్వే మూర్ఛితా స్తత్ర తత్ర హి ॥

టీ॥ అమృతాహారులగుయిన యింద్రాదులు క్షుధార్తులై యింద్రియబలహీనులై అచ్చటనే మూర్ఛనొందియుండిరి.

శ్లో॥ భూయస్తాన్ సత్యజిద్దృష్ట్వా తైస్సహానశనవ్రతం । చకార దశాహితు సభార్య స్సదయాన్వితః । సర్వత్రిసమ్యక్సంమార్జ్య విష్ణుర్నిర్మాల్యమన్వహా ।

టీ॥ సత్యజిత్తు తిరిగి వారినిజూచి సర్వత్రి విష్ణునిర్మాల్యమును ఊడిచివేసి దయావంతుండై తానును భార్యతోగూడా దేవతలతోపాటు ఉపవాసమును జేసెను.

శ్లో॥ తతశ్శేషాస్స్వర్గపాలా ఇంద్రస్యాగమనం చిరం । ఇతి విజ్ఞాయ తేజగ్ముః పుష్పవాటీం మునీశ్వర ।

టీ॥ తరువాత స్వర్గమందు మిగిలిన దేవతలు యింద్రుండింతకాలము రాకపోయెనని చింతించి వారందఱును పుష్పవాటికకు వచ్చిరి.

శ్లో॥ తత్రదృష్ట్వా సురగణాన్ మూర్ఛితాన్ భువి కృత్స్నశః । దృష్ట్వాతే కోపసంతప్తాః పారిజాతతరుం రుషా । ఉత్పాటనోద్యమంచక్రుస్సమూలం సత్వదర్పితాః ।

టీ॥ వచ్చి అచ్చట భూమియందు మూర్ఛితులై పడియున్న దేవతలనుజూచి కోపించినవారై బలమున్నదనే గర్వముతో పారిజాతమును సమూలముగా పీకుటకు యత్నించిరి.

శ్లో॥ నకించిచ్చలతేతైస్తైః పారిజాతస్సభూరుహః । తత్యజుర్భగ్నసంకల్పాః పశ్చాద్వ్యథితపాణయః ।

టీ॥ ఇట్లు వారెంతగా పెనుగులాడినను పారిజాతము కొంచమైనను చలించలేదు. కొంతసేపు లాగి చేతులు నొప్పిచేత లాగుట మానిరి.

శ్లో॥ ఆకాశాన్నారదో దృష్ట్వా వ్యథితాన్మూర్ఛితాన్సురాన్ । విస్మితఃప్రయయావిష్ణుం శేషైర్నాకనివాసిభిః ।

టీ॥ నారదుండు ఆకాశమునుండి దీనినంతయు జూచి, దేవతలు మూర్ఛితులై దుఃఖించుచుండుటజూచి ఆశ్చర్యమొంది దురవస్థానివారణకొఱకు మిగిలిన దేవతలతో సహా విష్ణులోకమునకు వెళ్లెను.

శ్లో॥ నారదస్తం నమస్కృత్య నారాయణమనామయం। తుష్టావ కరుణారాశిం మూర్ధ్నిన్యస్తకృతాంజలిః ॥

తా॥ పిమ్మట నారదుఁడు అచ్చట కరుణాపారీణుఁడయిన నారాయణమూర్తిని జూచి నమస్కరించి శిరస్సునందు అంజలిఁబట్టి స్తోత్రముఁ జేసెను.

శ్రీనారదః॥ శ్లో॥ ఆర్తత్రాణపరాయణాయ భవతే నారాయణాయాత్మనే । గోవిందాయ సురేశ్వరాయ హరయే శ్రీశాయ చేశాయచ। మిత్రానేకహిమాంశుపావక మహాభాసాయ సౌఖ్యప్రదే । శ్రీమత్పంకజపత్రనేత్రవిలసత్కృష్ణాయ తుభ్యంనమః ॥

తా॥ కృష్ణా ! ఆర్తరక్షణదీక్షితుఁడవును, ఉదకమందు శయనించువాఁడవును, గోపాలకుఁడవును, దేవకుఁడవును, మహాహరుఁడవును, లక్ష్మీశుఁడవును సమస్తజగదీశుఁడవును అనేక సూర్యచంద్రవహ్ని భాసావిభాసితుఁడవును, సౌఖ్యప్రదుఁడవును, పద్మపత్రనేత్రుఁడవును నయిన నీకు నమస్కారము.

శ్లో॥ అచ్యుతా యాదిదేవాయ పురాణపురుషాయచ । సర్వలోకనిధానాయ నమస్తే గరుడధ్వజ ॥

తా॥ కృష్ణా ! నాశరహితుఁడవును, ఆదిదేవుఁడవును, పురాణపురుషుఁడవును, సర్వలోకనాయకుఁడవును, గరుడధ్వజుఁడవును నయిన నీకు నమస్కారము.

శ్లో॥ నమోఽనంతాయ హరయే క్షీరసాగరవాసినే । భోగీంద్రతల్పశయన లక్ష్మ్యాలింగితవిగ్రహః ॥

తా॥ ఓ కృష్ణా ! అనంతుఁడవును, విష్ణుమూర్తివిని, క్షీరసాగర శయనుఁడవును, శేష తల్పమందు లక్ష్మీదేవిని ఆలింగనము జేసికొని శయనించిన వాఁడవయిన నీకు నమస్కారము.

శ్లో॥ నమస్తే సర్వలోకేశ నమస్తే విశ్వసాధన । సర్వేశ సర్వగస్త్వంహి సర్వాధార సురేశ్వర ॥

తా॥ ఓకృష్ణా! సర్వలోకేశుఁడవును, విశ్వసాధనుఁడవును, సర్వేశ్వరుఁడవును, సర్వగతుఁడవును, సర్వాధారుఁడవును, సురేశ్వరుఁడవును నైన నీకు నమస్కారము.

శ్లో॥ సర్వం త్వమేవ సృజసి సత్వరూపస్త్వమేవహి । పురుషోఽసి గుణాధ్యక్ష గుణాతీతస్సనాతనః ॥

తా॥ కృష్ణా! ప్రపంచమంతయు నీవే సృజించుచున్నావు. నీవే సత్యరూపుడవు నీవే పురుషుడవు. నీవే గుణాధ్యక్షుడవు. గుణాతీతుడవు. శాశ్వతుడవు

శ్లో॥ పరబ్రహ్మాసి విష్ణు స్త్వం బ్రహ్మాసి భగవాన్ భవః । సృష్టిస్థితిలయాదీనాం కర్తా త్వం పురుషోత్తమ ।

తా॥ కృష్ణా! నీవే పరబ్రహ్మవు. నీవే విధాతవు. నీవే విష్ణుడవు. నీవే శివుడవు. పురుషోత్తమా! నీవే సృష్టిస్థితిలయకర్తవు.

శ్లో॥ త్రిగుణోసి గుణాధార స్త్రిమూర్తి స్త్వం త్రయీతనుః । ఆసీ త్త్వన్మాయయాసర్వం జగత్స్థావరజంగమమ్ ।

తా॥ కృష్ణా! త్రిగుణుడవు. గుణాధారుడవు. త్రిమూర్తివి. త్రయీశరీరుడవు నీవే. నీమాయవలన స్థావరజంగమరూప ప్రపంచ ముత్పన్నమాయెను.

శ్లో॥ త్వమేవైకార్ణవే జాతే జగత్యస్మిన్ జగత్పతే । జగత్త్వం హృత్వా సకలం శేషః శేషాంగసంశ్రయః ।

తా॥ కృష్ణా! శేషశయనుడవయిన నీవే ప్రళయమున ఏకార్ణవమైనంతలో జగత్తును సంహరించి మిగిలేవాడవు. అనగా మహాప్రళయమందు మిగిలియుండువాడవు నీవేనని అర్థము

శ్లో॥ త్వమేవాస్మిన్ జగత్యేక శ్శాశ్వత స్స్వప్రకాశకః । జగద్యోని స్త్వమేవాద్య జగతోంతర్బహిర్విభో ।

తా॥ కృష్ణా! ఈజగత్తులో నీవే ముఖ్యుడవును, (లేక నీవొక్కడవే) శాశ్వతుడవు స్వప్రకాశుడవు, జగత్కారణమునీవే. జగదంతర్బహిర్వ్యాపకుడవునీవే.

శ్లో॥ త్వంవ్యాప్య సర్వతస్థిత్వా భావేష్వేతేషు భాసకః । త్వమేవ సర్వలోకానాం మాతా త్వం వా పితా విభో ।

తా॥ కృష్ణా! నీవు సర్వమును వ్యాపించి జగద్భావాభావములయందు భాసకుడవగుచున్నావు. నీవే లోకములకు తల్లివి. నీవే తండ్రివి

శ్లో॥ గురు స్త్వం సర్వభూతానాం శిక్షక స్సుఖదాయకః । ప్రతిష్ఠిత మిదంసర్వం పూర్ణం స్థావరజంగమమ్ ।

తా॥ ఓ కృష్ణా! నీవు రక్షించి సుఖములనిచ్చు గురుఁడవు. ఈ స్థావరజంగమాత్మకమయిన సర్వప్రపంచము నీయందే యున్నది.

శ్లో॥ ప్రసీద పాలయవిభో నమస్తే సురవల్లభ ।

తా॥ కృష్ణా! మాంపాలయ, రక్షింపుము. ఓ ప్రభో నీకు నమస్కారము. దేవనాథా నీకు నమస్కారము చేసెదను.

శ్లో॥ ఏతత్ స్తోత్రమిదం శ్రుత్వా నారదేన సమీరితం । ప్రీత్యాప్రీత్ హృషీకేశో నజానన్నివ నారదమ్ ।

తా॥ ఇట్లు నారదస్తుతిని నారాయణుఁడు విని తెలియనివాఁడువలె నారదునితో నిట్లనెను.

శ్రీభగవాను॥ శ్లో॥ కిమర్థ మేతద్విప్రేంద్ర స్వాగతం సాంప్రతం తవ । తత్కరోమ్యచిరా త్సౌఖ్యం దుర్లభంవా సురాసురైః ।

తా॥ ఓ నారదా! క్షేమమా. ఇప్పుడెందుకువచ్చితివో చెప్పుము. నీవు కోరిన కార్యము దేవదానవులకు దుర్లభమైనదయినను తప్పక త్వరగా చేయుచున్నాను.

శ్లో॥ ఇత్యుక్తః ప్రాహకృష్ణేన నారదో నమ్రికంధరః । ఆపదామాగయంకర్మ కృతమింద్రాదిభిస్సురైః ।

తా॥ కృష్ణుఁడిట్లు పలుకఁగా విని నారదుఁడు వచ్చిన కార్యమును చెప్పుటకు లజ్జించి తలవంచుకొని కృష్ణా యేమని చెప్పుదును ఇంద్రాదులు అపకారమయిన కర్మనాచరించిరి.

శ్లో॥ కశ్చిద స్తిక్షితౌ దేవాః పారిజాతమహీరుహః। తస్యపుష్పాణి రమ్యాణి మనఃప్రీతికరాణిచ ।

తా॥ కృష్ణా! వినుము. భూలోకమందు క్షీరసముద్రతీరమందు పారిజాతమను నొక వృక్షముగలదు. దాని పుష్పములు చాలా మనోహరములును, మనఃప్రీతికరములును నై యుండెను.

శ్లో॥ తానికృష్ణా శచీనాథః సదేవై ర్వన్నయంగతః । శక్రోఽప హృత్యపుష్పాణి చోరవృత్త్యా దినేదినే । అనుభూయ హ్యత్యప్రసుర

రంభాద్యైః పరిబోధితః । నాకాద్భూలోకమభ్యేత్య దేవేంద్రః సహదైవతైః । పతిత స్తరుమూలేతు కలభః పావకే యథా ।

తా॥ అప్పుడు అనంతాది ఐశ్వర్యములుగల దేవేంద్రుడు దరిద్రుడుగా చోర వృత్తిలో ప్రతిదినము పుష్పములను దెచ్చి అనుభవించియు తృప్తుఁడు గాక రంభాదుల మాటమీద భూలోకమునకు దేవతలతోఁగూడా వెళ్ళి ఆపారిజాతవృక్షము మొదట అగ్ని యందు మిడుతవలె బడియుండెను.

శ్లో॥ పావకాగ్నిర్యథావాన్ విష్ణో నిత్యం పీయూషవృత్తిభిః । నైవాహారోస్తి కించిచ్చ దినే ష్వేకాదశేషుచ ।

తా॥ ఇట్లు పడియున్న అమృతాహారులయిన దేవతలకును, దేవతలకు ప్రభువైన దేవేంద్రునికిని పదకొండుదినములనుంచి కొంచమైనను ఆహారము లేదు.

శ్లో॥ ఇత్యేతేవ్యధితా దేవా మార్త్యాం ప్రాప్య వ్యాపోపమాం । తస్మాత్త్వద్యభగవన్ పాహీంద్రాదీన్ తవానుగాన్ ।

తా॥ కృష్ణా! ఈప్రకారముగా దేవతలు పీడితులై చావుతో సమానమయిన మార్గము పొందియుండిరిగనుక భగవంతుఁడా, నీకింకరులైన యింద్రాదులను రక్షింపుము

శ్లో॥ శ్రుత్వా దేవర్షి వాక్యం స భగవాన్ భక్తవత్సలః । ప్రత్యువాచ మునిశ్రేష్ఠం విష్ణుర్విశ్వామరేశ్వరః ।

తా॥ ఇట్లు నారదునిమాట విని భక్తవత్సలుఁడైనటువంటిన్ని, సమస్తామర నాథుఁడైనటువంటిన్ని, భగవంతుఁడైనటువంటిన్ని విష్ణువు నారదునితో నిట్లనియెను. శ్లో॥ ఉత్పత్తించ విపత్తించ భూతానామాగతింగతిం । వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి ॥ శాస్త్రోక్త్ భూతానాముత్పత్తిలయాగమనగమనాని విద్యావిద్యేచజానాతి సభగవానితి కథ్యతే॥ అనఁగా భూతోత్పత్తిలయములను ఆగమనాగమనములను విద్యా అవిద్యలను అను యీ ఆఱింటిని తెలిసికొనువాఁడు భగవంతుఁడని ఫలితార్థము.

శ్లో॥ మునే పీయూషబిందుభ్యా ముత్పన్నౌ తరుభూరుహౌ । తులసీ పారిజాతౌచ శుచీరా వహ్నికోద్భవా ॥

తా॥ నారదా! అమృతబిందువులవలన సముద్రమునందు తులసీ పారిజాతములను రెండువృక్షములు జనించినవి. ఆ వృక్షములు అమృతసంజాతములు గనుక పవిత్రములయినవి.

తా॥ సత్యజిత్తు యింద్రాదులఁజూచి యింక నెవ్వరికేమి కలుగునో యను భయముచేత నా నిర్మాల్యమును తుడిచెను.

శ్లో॥ ప్రతీకారమజానంత స్తద్దోష స్యాధికస్యచ । నివత్యేంద్రాదయ స్తత్ర వ్యధితాజీవనంవినా ॥

తా॥ ఇంద్రాదులు ఆదోషమునకు ప్రతీకారము తెలిసికొనలేక అచ్చట ఆహారశూన్యముగా బడియుండి దుఃఖించుచుండిరి.

శ్లో॥ ప్రతిప త్తిథిమారభ్య ఆషాఢస్య మహామునే । తేషామానీచ్ఛుక్లపక్షే దినే ష్వేకాదశేషుచ । నిరాహాః పృథివ్యాంతే దేవాః క్షీయామవర్జితాః ॥

తా॥ ఆషాఢశుక్ల పాడ్యమి మొదలు పదకొండుదినములు అమృతాహారులయిన దేవతలకు భూమియందు ఆహారము లేకపోయెను.

శ్లో॥ తురాషాడమరైస్సార్ధం మూర్ఛామాప మృత్యూపమాం । ఆలోక్యానశనాన్ దేవాన్ సభార్యస్సత్యజి త్తదా । శక్రాద్యైస్త్రిదశైస్స్వయం చకారానశనవ్రతం । తేషా ముజ్జీవనార్థంతు ప్రత్యహం మాం సమర్చయేత్ ॥

తా॥ ఇట్లాహారములేక ఇంద్రుడు దేవతలతోగూడా చావుతో సమానమయిన మూర్ఛనుబొందెను. సత్యజిత్తును దేవతల కాహారము లేకుండుటజూచి తానును సభార్యగా ఉపవాస వ్రతమును వలంబించి దేవోజ్జీవనార్థముగా నన్ను ప్రతిదినమందు పూజించుచుండెను.

శ్లో॥ తిథిరేషా తదారభ్య క్రమా దేకాదశీ స్మృతా । మాం తస్యాం విధినాపూజ్య షోడశద్రవ్యార్హణైస్సుభిః । తదగ్రే మామకం మంత్రం జపన్ జాగరణోత్థితః । మయాతస్య ప్రసన్నత్వం తేనసర్వం భవిష్యతి ॥

తా॥ ఇంద్రాదులు మూర్ఛనొందినది మొదలు యీతిథి ఏకాదశీతిథి. ఈదినము సత్యజిత్తు భక్తితో షోడశోపచారములతో మాపూజజేసి తదగ్రమందు నారాయణమంత్రమును జపించుచు జాగరణముండెనేని ఆతనికి ప్రసన్నుడనగుదును. తరువాత సకలము సిద్ధించగలదు.

శ్లో॥ ఇత్యుక్తో విష్ణునా తూర్ణం నారదః ప్రయయౌ దివమ్ ।

తా॥ హరి యిట్లు ఆజ్ఞనివ్వగా హరిపరాయణుండైన నారదుడును హరిసంజీవ నార్థము హరిని పూజించి ఆకాశమార్గముగా వెళ్లెను.

ఇతి ఏకవింశోధ్యాయ స్సమాప్తః.

---

## —॥ అథ ద్వావింశోధ్యాయ ప్రారంభః ॥—

శ్రీగృత్సమదః॥ శ్లో॥ సత్యజి త్కేశవం భక్త్యా ఏకాదశ్యాం స్వ వేశ్మని । సభార్యస్సమ్యగభ్యర్చ్య కుసుమాగరుచందనైః । ధూప దీపై స్సనైవేద్యై ర్భక్త్యావం మయామునే । జపన్ తద్గ్రతో మంత్రం గోవిం దేతి నిరంతరం । చక్రే జాగరణం జహ్నో దేవానాంహితకాముకః ।

తా॥ గృత్సమదమహాముని తిరిగి చెప్పుచున్నాడు. అట్లు సత్యజిత్తు దేవ తలమేలుగోరి ఏకాదశినాడు తన మందిరమందు సభార్యుండై గోవిందుని పుష్ప చం దన ధూప దీప నైవేద్యాదులచేత భక్తితో పూజించి స్వామిముందర గోవిందనామమును జపించుచు ఆరాత్రి జాగరణ మాచరించెను.

శ్లో॥ పూర్వయామే ప్రసన్నో భూ ద్దేకాదశ్యాం జనార్దనః । సత్యజి త్సదనే తస్య వ్యాఘ్రే భక్తేష్టదాయకః ।

తా॥ ఇట్లు సేవించబడిన హరి ఆసత్యజిత్తు గృహమందు ఏకాదశినాడురాత్రి ప్రథమయామమునందు సత్యజిత్తుకు యిష్టార్థముల నిచ్చుటకై విష్ణుమూర్తి ప్రత్యక్ష మాయెను.

శ్లో॥ నీలజీమూతసంకాశో నీలాలకకలావృతః (ఘనావృతః) । పుండరీకవక్త్రనయనో లలాటతిలకోజ్జ్వలః । కుండలాభ్యాం విచిత్రాభ్యాం విలసద్గండమండలః । అనేకాదిత్య సంకాశ కిరీటేన విరాజితః । హార గ్రైవేయకటక రగ్రైన్యా త్రికకోటిభిః । విరాజమాన సర్వాంగో విచి త్రైస్సర్వభూషణైః । పీతాంబరేణ దివ్యేన కటిసూత్రేణసంయుతః । చతు ర్భిర్బాహుభిర్భాస్వ చ్ఛంఖచక్రగదాంబుజః । చారుజంఘోరు జఘనో

శ్లో॥ సానుగస్య సురేంద్రస్య ఖేచరత్వం దదస్వహ। దేవపీయూష వృత్తీనాం కురు శాంతిం కృపారసాత్ ॥ అతస్త్వత్సన్నిధిం దేహి సభార్యస్య మమప్రభో। తథైవాస్త్వితి సంశ్రుత్య హరి స్తం ప్రత్యభాషత ॥

తా॥ ఓ దేవా! దేవేంద్రునకును నతని కింకరులకును ఆకాశసంచారశక్తినిమ్ము. అమృతాహారముచేత దేవతలకు శాంతిని జేయుము. తరువాత నాకును నా భార్యకును నీ సాన్నిధ్యమును యిమ్ము. ఇట్లని అడిగెను. అట్లనంగా ఆవాక్యమును అంగీకరించి విష్ణుమూర్తి తిరిగి అతనితోనిట్లనిరి.

శ్రీహరిః॥ శ్లో॥ సమస్తపుణ్య ఫలదా హ్యేషా హ్యేకాదశీతిథిః। అస్యాంతవప్రసన్నోహ మేషా మత్ప్రీతిదా భవేత్ ।

తా॥ ఓ భక్తుండా! యీ ఏకాదశీతిథి సమస్తపుణ్య ఫలములను యిచ్చునది. ఈతిథియందు నీకు నేను ప్రసన్నుండనైతిని గనుక యీ ఏకాదశీతిథి నాకు సంతోషకారిణి యగును.

శ్లో॥ త్వం తస్మా ద్భార్యయా సాకం పారిజాతద్రుమం తవ। ఉత్పాట్య దేహి శక్రాయ సానుగాయ మహాత్మనే ।

తా॥ కావున నీవు నీభార్యతోసహా యీ పారిజాతవృక్షమును వ్యయముగా తీసి సపరివారుండయిన ఇంద్రునకు యిమ్ము

శ్లో॥ దేహి మే తులసీం శుద్ధాం మత్ప్రియాం వనవాసినీం। తస్మాత్తవ భవేచ్ఛ్రేయో నాత్రకార్యా విచారణా ।

తా॥ ఇచ్చి పవిత్రియు, వనవాసియు, మత్ప్రియయు నయిన యీ తులసిని నాకిమ్ము. అట్లయినచో నీకు మేలుకలుగును. సందేహించవలదు.

శ్లో॥ తథేత్యుక్త్వా యయౌ సోపి పారిజాతద్రుమాలయం। నిశాం నీత్వోదితే సూర్యే సభార్య స్సత్యజిన్ముదా ।

తా॥ అట్లే చేయుదునని సత్యజిత్తు తన భార్యతోసహా రాత్రిని వెళ్లదీసి సూర్యోదయముకాగానే పుష్పవాటికకు వచ్చెను.

శ్లో॥ సభార్య స్తము ముత్పాట్య దేవేంద్రాయ దదౌ మునే। తులసీం విష్ణవే దత్వా ఇంద్రాదీన్ ప్రత్యబోధయత్ ।

తా॥ అచ్యుతుఁడు తన భార్యతోఁ దనే వెళ్ళి పారిజాతమును పెళ్లగించి ఇంద్రున కిచ్చి తులసిని లక్ష్మీ ప్రతికిచ్చి ఇంద్రాదులను మేలుకొలిపెను.

శ్లో॥ సహాహః ప్రీతశాన్యో శక్రాద్యా దేవతాగణాః॥ దృష్ట్వా హరింపవిత్రేము స్తే సర్వేచాప్యాయితేంద్రియాః ।

తా॥ యింద్రాది దేవతలు తమ వాహనములతోఁగూడా శేది సుందరమున్న గోవిందుని జూచి తృప్తినిబొందిన యింద్రియములుగలవారై నారాయణునకు నమస్కారములు గావించిరి.

శ్లో॥ శృణ్వత్సు శక్ర ముఖ్యేషు విబుధేషు జనార్దనః । స్వభక్త మూహ సస్మేరం స్మయమానముఖాంబుజః ।

తా॥ తరువాత ఇంద్రాది దేవతలు వినుచుండఁగా నవ్వుచున్న ముఖముతోఁ గోవిందుఁడు సభార్యుఁడయిన సత్యజిత్తుతోఁ నిట్లనియె.

శ్లో॥ ఏషా హ్యేకాదశీనామ నరాణా మఘనాశినీ । యత్త్వయా చరితంపుణ్య మగ్ర్యమేకాదశీవ్రతమ్ ।

తా॥ పుణ్యప్రదమును, శ్రేష్ఠమును నయిన యీవ్రతము నీచేత నాచరింపబడినది, యిది ఏకాదశీవ్రతము. ఈ ఏకాదశీవ్రతము మానవులకు పాపనాశనకారియగును.

శ్లో॥ మానవా మందమతయో మృత్యుపాశవశంగతాః। ప్రతిప ద్వాదితిథిషు ద్వివంచ ను దినేషుచ । వినాన్నేనా వ్రతక్యత్వా నైవ కుర్వంత్యుపోషణమ్ ।

తా॥ మందబుద్ధులై మృత్యుపాశవశమును బొందిన మానవులు ప్రతిపత్తు మొదలు పదిదినములు అనఁగా పాడ్యమి మొదలు దశమివఱకు ప్రతిమనూగా భోజనము చేయుచుండువారు దగుటచే (౧౧) ఏకాదశి తిథియందు ఉపోష్యమును జరుపుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ తానిహాత్ర మత్ప్రసాదా దేకాదశ్యాముపోషణం । యే కుర్వంతిజనాభక్త్యా జాగరార్చ్య స్మమార్చనం । తేయాంతిమత్ప్రసాదేన మమాగారం మహాసుఖమ్ ।

తా॥ ఆ పదిదినములను విడిచి నాప్రసాదము వలన దొవ్వరు ఏకాదశియందు

శ్లో॥ యే భుంజంత్యన్న మజ్ఞానా దేకాదశ్యాం మహామతే । నాన్నంభవతి యత్కించి త్తదన్నం క్రిమిసంకులమ్ ।

తా॥ అజ్ఞానముచేత ఏకాదశినాడు అన్నమును భుజించినయెడల ఆయన్నము అన్నముగాదు. అది క్రిమిభోజనమనఁబడును.

శ్లో॥ మద్వాసరే మహాపుణ్యే కృత్వోపోష్యమతంద్రితః । మా మభ్యర్చ్యవిధానేన యశ్చరే జ్జాగరాదిభిః । మత్ప్రియస్సోపి దేహాంతే మద్రూపమధిగచ్ఛతి ।

తా॥ పుణ్యప్రదమైన హరివాసరమందు ఉపవాసముచలిపి జాగరణముండినన్ను విధివిధానముగా పూజించినవాఁడు నాకు ప్రియుఁడై దేహాంతమందు నారూపమును పొందును.

శ్లో॥ ఏషా హ్యేకాదశీపుణ్యా కులకోట్యుద్ధరక్షమా । మహాపాప ప్రశమనీ మహాక్రతుఫలప్రదా ।

తా॥ ఈ ఏకాదశి పుణ్యమైనది. కోటికులముల నుద్ధరించును. మహాపాతకముల నశింపఁజేయును. క్రతుఫలమునిచ్చును.

శ్లో॥ బ్రాహ్మణః క్షత్రియో వాపి వైశ్య శ్శూద్రో థవా సతీ । సన్యాసినోపి యతయః వానప్రస్థపరాయణాః । బాలకా జరతాశ్చైవ యేదాన్యేతనుధారిణః । ఏకాదశ్యాం నభోక్తవ్యం మోహాద్వా వచసా సకృత్ ।

తా॥ బ్రాహ్మణుఁడుగాని, క్షత్రియుఁడుగాని, వైశ్యుఁడుగాని, శూద్రుఁడుగాని, స్త్రీగాని, సన్యాసిగాని, యతిగాని, వానప్రస్థుఁడుగాని, బాలుఁడుగాని, ముసలివాఁడుగాని, యింకెవ్వరుగాని శరీరధారు లందఱు నామాటప్రకారముగా ఒక్కమారైనను మోహమువలనైనను ఏకాదశియందు భుజించతగదని తాత్పర్యము.

శ్లో॥ అజ్ఞానా దథవాజ్ఞానా దేకాదశ్యాం నరాధమః । భుంక్తే మచ్ఛాసనాల్కోపాత్ యమశ్శిక్షాం విధాస్యతి ।

తా॥ తెలిసిగాని, తెలియకగాని ఏకాదశినాఁడు భుజించినవానిని నా యాజ్ఞచొప్పున యముఁడు కోపముతో దండించును.

శ్లో॥ ఏకాదశ్యాన్తు భోక్తారో భుంజతే నరకం చిరం। తే పునర్భువి సంప్రాప్య జాయంతే కష్టయోనిషు।

తా॥ ఏకాదశినాఁ డన్నముతినువారు నరకమును చిరకాల మనుభవించి తిరిగి భూమియందు కష్టయోనులందు పుట్టుదురు.

శ్లో॥ స్త్రీణా మాలింగనం నిద్రా మన్న మేకాదశీదినే। త్యక్త్వా మాంభక్తితః పూజ్య యః పిబేన్మత్పాదోదకం। సహాస్నాత్సుఖమాప్నోతి పరంబ్రహ్మాధిగచ్ఛతి।

తా॥ ఏకాదశినాఁడు వనితాలింగనమును, నిద్రను, అన్నమును విడిచి భక్తితో నన్ను పూజించి నా పాదోదకమును పానముచేయువాఁడు సుఖమును బొంది పరబ్రహ్మము బొందును.

శ్లో॥ తస్మాత్సర్వేషుమాసేషు యదా ప్యేకాదశీభవేత్। తదా సమాచరేద్ధీమా నుపోష్య మఘనాశకమ్।

తా॥ కాఁబట్టి సర్వమాసములయందు ఏకాదశియందు ఉపోష్యముగావించిన మనుష్యులకు సర్వపాపములు నశించును.

శ్లో॥ కృచ్ఛ్రచాంద్రాయణైశ్చైవ తథాన్యై రపి సువ్రతైః। యత్ఫలం ప్రోచ్యతే సద్భిః తదస్యాం సముపోషణాత్।

తా॥ కృచ్ఛ్ర చాంద్రాయణములచేతను, యితరవ్రతములచేతను యేఫలమును బొందబడునో ఆఫల మీ ఏకాదశ్యుపవాసముచేత బొందబడును.

శ్లో॥ ఏషా హ్యేకాదశీపుణ్యా లోకే ప్రఖ్యాతిమేష్యతి। ప్రోవాచోర్ధ్వభుజోవిష్ణు ర్భగవాన్ గరుడధ్వజః।

తా॥ ఏకాదశి మహాపుణ్యప్రదమని లోకమందు ఖ్యాతిగలదు. అని భగవంతుఁ డిట్లు చేతులు పైకెత్తి గట్టిగా చెప్పెను

శ్లో॥ మనుజా మునయో వాపి యోగినోపి మదాశ్రయాః। నభోక్తవ్యం నభోక్తవ్యం సంప్రాప్తే మచ్ఛుభేదినే। సత్యం సత్యేషుమాసేషు పక్షయో రుభయోరపి। ఏకాదశ్యాం నభోక్తవ్యం యోభుంక్తే సహిపాతకీ। ఏకాదశ్యన్నహీనో యః సప్తజన్మాన్యుపేష్యతి।

తా॥ మానవులు, పశువులును, రోగులును, సాధిక్తులును, యింకెవ్వరుగాని ఏకాదశియందు భుజించగూడదు. సర్వోపాసనములయందును, రెండుపక్షములయందును, ఏకాదశియందు భోజనము చేయగూడదు. భుజించినవాడు పాతకి యనఁబడును. సందేహములేదు. ఈ తపాస మాచరించువాఁడు నన్ను బొందును. నామాట సత్యమని భగవంతుఁడు చేతులు పైకెత్తి కట్టిగా పలికెను.

ఇతి ద్వావింశోధ్యాయ స్సమాప్తః.

---

## —॥ అథ త్రయోవింశోధ్యాయ ప్రారంభః ॥—

శ్రీకృష్ణ ఉవాచ॥ శ్లో॥ అథాబ్రవీత్సహస్రాక్షం భగవాన్మధుసూదనః । కృపయాపరయావిష్ట సానుగం సురనాయకమ్ ।

తా॥ తరువాత దేవదేవుఁడయిన దామోదరుఁడు దేవేంద్రునిజూచి పరమకృపాపూర్ణుఁడై యిట్లనెను.

శ్లో॥ ఇంద్రత్వంసాంప్రతందివ్యం పారిజాతమహీరుహం। గచ్ఛత్వమచిరాద్దేవ గృహీత్వాత్వనికేతనమ్ ।

తా॥ ఇంద్రుఁడా! నీ విప్పుడు అతిశీఘ్రముగా పారిజాతమును తీసుకొని నీయింటికి పొమ్ము,

శ్లో॥ తథేతిసుప్రీమ మాదాయ స్వానుగైర్మఘవానః । నమస్కృత్య హరింభక్త్యా స్వాలయం ప్రియయాముదా ।

తా॥ అలాగేనని దేవేంద్రుఁడు హరికి నమస్కరించి తనయింటికి వెళ్లెను.

శ్లో॥ గతేతు స్వానుగైస్స్వర్గం శక్రే స్వసదనం మునే । అథైనం తులసీ విష్ణుం వాచా మానుష్యయుక్తయా ।

తా॥ ఇంద్రుఁడు స్వర్గమునకు వెళ్లగానే తులసి మనుష్యవాక్కుతో విష్ణువుతో నిట్లనెను.

శ్లో॥ పాహిమాం కృపయా విష్ణో త్వత్పాదకమల ప్రియాం । త్వాంవినామగతిర్నాస్తి త్వ త్సన్నిధిచేన్నివసామ్యహం ।

తా॥ ఓ విష్ణూ! నేను నీ పాదారవింద మాశ్రయించినదానను. నన్ను రక్షింపుము. నీవుగాక వేఱు గతిలేదు. ఉన్నతము కోరుదాననుగాను

శ్లో॥ తస్యాం వాక్య మిదం శ్రుత్వా హరి స్తాం పునరబ్రవీత్ । తులస్యమృతసంభూతే ధరణీతలవాసినీ ॥ మత్ప్రియా భవ మాం యాహి ధారయే త్వాం హృది ప్రియామ్ । మా శంకాం భజ కల్యాణి పవిత్రే శుద్ధకారిణి ॥

తా॥ ఇట్లు తులసీవాక్యమును విని హరి యిట్లనియె. భూమియందు అమృతసముత్పన్న వయిన తులసీ! నీవు నాకు ప్రియురాలవు కమ్ము. నన్ను బొందుము. నిన్ను హృదయమందు ధరింతును. నీకేవిషయమందు అనుమానము కూడదు.

శ్లో॥ కోమలాం సదళాం త్వాం తు యే పశ్యంత్యఘహారిణి । సద్యః పవిత్రతాం యాంతి గంగాయాం స్నాయినో యథా ॥

తా॥ పాపనాశినియయిన తులసీ! దళములతోగూడి సుందరముగానున్న నిన్ను జూచువారు గంగాస్నాన మాచరించినవారువలె అప్పుడే పవిత్రులగుదురు.

శ్లో॥ మదర్చనం విధాస్యంతి దళైస్త్వేవ కోమలైః । తేపి మద్రూపతాం యాంతి నభూయః కాయధారిణః ॥

తా॥ కోమలములయిన నీదళములతో నన్ను బూజించువారు నారూపమును ధరింతురు. తిరిగి వారికి పునర్జన్మ లేదు.

శ్లో॥ తులస్యమృత సంభూతే యః కుర్యాత్తవకోమలైః । దళైర్మాలాం విధాయైవ మత్కంఠే యస్సమర్పయేత్ ॥ కల్పకోటిసహస్రాణి కల్పకోటిశతానిచ । వైకుంఠే మోదతేనిత్యం సపశ్చాన్మయిలీయతే ॥

తా॥ అమృతోత్పన్నవయిన తులసీ! కోమలములయిన నీదళములచేత దండను రచించి నా కంఠమం దర్పించువాఁడు సహస్రకోటి కల్పములును, శతకోటి కల్పములును వైకుంఠలోకమందు సుఖముతోనుండి తరువాత నాయందు లీనుఁడగును.

శ్లో॥ యే త్వాం గృహే వనే వాపి పాలయంత్యంబుసేచనైః । తేషా మత్యుగ్రపాపాని నస్పృశంతి కదాచన ॥

తా॥ ఎవ్వరు నిన్ను గృహమందుగాని, వనమందుగాని ఉదకము చేత కాచుదురో వారిని మహాపాతకము లంటవు.

శ్లో॥ ప్రాతర్నిద్రావసానేతు యఃకుర్యాత్తవదర్శనం । దినంతత్సుదినంప్రోక్తం నరస్సుఖమవాప్నుయాత్ ॥

తా॥ ప్రాతఃకాలమందు నిద్రలేచి నిన్ను దర్శించినదినమే సుదినము అట్టివాఁడు సుఖమును బొందును.

శ్లో॥ తవదేవియదాలోకే దళసంమిశ్రవారిభిః । సర్వాంగే సేచయేద్యస్తు హ్యశుచిశ్శుద్ధిమాప్నుయాత్ ॥

తా॥ నీదళములతోఁగూడిన యుదకమును శరీరమందంతటను చల్లుకొనినచో వాఁడు అపవిత్రుఁడయినను పవిత్రుఁడగును.

శ్లో॥ త్వన్మూలమృత్తికాం యస్తు లలాటే ధారయేన్నరః । సర్వత్ర సుఖమాప్నోతి నయక్షాద్యైర్భయంనకృత్ ॥

తా॥ నీమొదటనున్న మృత్తికను లలాటమందు ధరించువాఁడు సుఖమును బొందును. వానికి ఎక్కడను యక్ష రాక్షస భూతాదులవల్ల భయములేదు.

శ్లో॥ దేవి పీయూషసంభూతే సదా త్రైలోక్యపావనీ । పశ్యామి తుల్యబుద్ధ్యాహం త్వాంలక్ష్మీం త్వత్సహోదరీమ్ ॥

తా॥ అమృతసంభూతమును, త్రిలోకపావనివిని అయిన తులసీ! నిన్నును లక్ష్మీదేవిని సమానముగా జూతును. నీవును లక్ష్మీదేవియును సహోదరులుగాన, మీయిద్దఱిని సమానముగ జూతును. లక్ష్మీదేవియును క్షీరసముద్రజాత, తులసియును ఆ తీరమందు జన్మించినదిగాన ఉభయులకు సహోదరీభావము.

శ్లో॥ ఇతితస్యై వరం దత్వా తులస్యై పరమేశ్వరః । తతస్తాం తులసీంభక్త్యా శాఖానవకశతావృతామ్ । హస్తాభ్యాంశంతమాభ్యాంచ హ్యుపస్పృశ్యాదరాద్ధరిః । చక్రపాణికరస్పర్శాత్సురూపాసాబభూవహ ॥

తా॥ ఇట్లు తులసికి వరమిచ్చి లక్ష్మీదేవి పెనిమిటి అనేకశాఖలతోఁ గూడిన తులసిని సుఖకరములైన తనచేతులతో తాకెను. చక్రిహస్తస్పర్శవల్ల ఆతులసి శోభనరూపయయ్యెను.

శ్లో॥ సాభూత్వా తులసీసాధ్వీ నారీరూపగుణాన్వితా । సర్వాం

ఘ్రివతకజంపార్శ్వా ద్విష్టో స్తస్యమహాత్మనః । అథ సా ప్రావ శీఘ్రేణ వ్యాచ్యుతాంఘ్రి మథూపహా ।

తా॥ ఆతులసి రూపగుణాన్వితయైన స్త్రీయాయెను. తరువాత మహాత్ముఁడైన మాధవుని పాదారవిందములకు నమస్కరించి శీఘ్రముగా గోవిందాంశమును బొందెను.

శ్లో॥ ప్రఖ్యాత్తై ర్భగవా న్పశ్చా త్తులసీం లోకపావనీం। హితా య సర్వలోకానాం మనుష్యాణాందురాత్మనామ్ । స్థాపయామాస తాం దేవీం మాయావీ జగధీశ్వరః ॥

తా॥ తరువాత భగవంతుఁడును, మాయావియు, జగదీశుఁడునునయిన లక్ష్మీ నారాయణుఁడు లోకపావనియైన తులసిని దురాత్ములయిన మనుష్యులకొఱకు ప్రఖ్యా తిగా స్థాపించెను.

శ్లో॥ కృష్ణస్య వామహ స్తేన స్పృష్టాయాతులసీశుభా । తత్పా ర్శ్వగతశాఖాసు కృష్ణవర్ణాబభూవహ ।

తా॥ కృష్ణుని వామహస్తముచేత నెచ్చట స్పృశింపబడినదో ఆపార్శ్వమందున్న కొమ్మలయందు కృష్ణవర్ణముగలదాయెను.

శ్లో॥ సాథ వేత్కృష్ణవర్ణాఖ్యా తులసీ లోకపావనీ । యత్రైవం తులసీపార్శ్వ పవిత్రాః క్షుద్రభూరుహాః । ఆశ్రిత్య తులసీ మాపుః పవి త్రంపరమంశుభం । తస్మాత్సాతులసీపుణ్యా భువిసర్వత్ర భూరుహాః ॥

తా॥ ఇట్లు తులసి కృష్ణతులసియనిన్ని ఖ్యాతిజెందెను. ఈ తులసీ పార్శ్వభాగ ములందున్న వృక్షములును పవిత్రములయినవి. కాఁబట్టి భూమియందు తులసి పవిత్ర మైనదనియు, పుణ్యప్రదమైనదనియు చెప్పఁబడెను.

శ్లో॥ యత్ర స్థితాచ తులసీ భూమి స్తద్దురితాపహా । తులసీం కోమలాకారాం పుష్పాణా మతిసుందరీం । లబ్ధ్వాతామథ విశ్వాత్మా భక్తమాహాత్మపాలయః ।

తా॥ ఈ తులసి యెచ్చట నివసించునో ఆభూమియు పాపనాశిని యగును. సుందరాకారమయినటువంటిన్ని, సమస్త పుష్పములకంటె మనోహరమయినదియు నయిన తులసీదళమును గ్రహించినపిమ్మట విష్ణువు తన భక్తుఁడయిన సత్యజిత్తుతో నిట్లనియె.

శ్లో॥ త్వం భుంక్ష్వేతః పరమిహ మా మభ్యర్చ్య విధానతః । ద్వాదశ్యాం బ్రాహ్మణైస్సార్థం మాకుర్వ్యత్ర విలంబనమ్ ।

తా॥ శీఘ్రముగా నా పూజను జేసి పిమ్మట బ్రాహ్మణసమారాధనము సంతృప్తి జేసి నీవును భోజనమును చేయుము. ఆలస్యము చేయకుము.

శ్లో॥ ఇత్యుక్తో దేవదేవేన పూజయిత్వా పురస్థితం । అహార్ష్ట రగ్హాయామాస తచ్ఛేషం ప్రాశ్నసీర్పయన్ ।

తా॥ విష్ణువిట్లువచించగా సత్యజిత్తు వెంటనే తనకు ప్రత్యక్షమై తనముందర నున్న భగవంతుని బూజించినవాఁడై మిగిలినప్రసాదమును తాను స్వీకరించినవాఁడాయెను.

శ్లో॥ కృత్వైవం వ్రతసంపూర్తిం భగవాన్ గరుడధ్వజః । సపత్నీకేనభక్తేన సతులస్యా జనార్దనః । పశ్యతాం సర్వభూతానాం స్వధామ ప్రయయౌ హరిః ।

తా॥ గరుడవాహనారూఢుండయిన భగవంతుఁడు యీప్రకారముగా ఏకాదశీ వ్రతమును పూర్తిజేయించి పిమ్మట తనభక్తుఁడయిన సత్యజిత్తునిన్ని, అతని భార్యయున్ను తులసిసమేతముగా గరుత్మంతునిమీద నెక్కించుకొని సర్వభూతములకు దర్శనమిచ్చుచు నివాసస్థానమయిన వైకుంఠమునకు ప్రవేశించినవారైరి

శ్రీకృష్ణ ఉవాచ । శ్లో॥ ఏవ మేకాదశీ జాతా హ్యశ్వమేధ ఫలప్రదా । ఏతత్తేకథితం జహ్నో యత్పృష్టంమాం మహామతే ।

తా॥ ఓ జహ్నూ ! ఏకాదశీవ్రతము యిట్లు అశ్వమేధఫలప్రదమైనది. నీవు నన్ను అడిగినప్రకారము ఏకాదశీజననమును ఏకాదశీ మహాత్మ్యమును సంపూర్ణముగా చెప్పితిని

శ్లో॥ తథాప్యత్యంతసుఖదా మాఘే హ్యేకాదశీ శుభా । యస్తు శుక్లైకాదశీం మాఘే హ్యుపోష్య కమలాపతిమ్ । సమభ్యర్చ్య విధానేన జాగరాద్యైర్జనార్దనం । సోపయే త్సుఖమాప్నోతి సభవే దచ్యుత స్స్వయమ్ ।

తా॥ వస్తుతః ఏకాదశీవ్రతము సుఖదాయకమైనది. అందులో ఈ మాఘైకాదశి అత్యంత సుఖప్రదమైనదిగనుక మాఘశుక్ల ఏకాదశియందు ఉపవాసమాచరించి

జాగరణముండి పుండరీకాక్షుని పూజించినవాఁడు ఇహమందనేకసౌఖ్యములననుభవించి దేహాంతమందు విష్ణుసాయుజ్యమును బొందును.

శ్లో॥ మాఘే మకరగే సూర్యే యశ్శుద్ధైకాదశీం నరః । ఉప
వాస మకుర్వాణః సభవే ద్బ్రహ్మరాక్షసః ।

తా॥ మాఘమకరమందు శుద్ధ ఏకాదశియం దుపవాసమాచరించని మానవుఁడు దేహాంతమందు బ్రహ్మరాక్షసుఁడగును.

శ్లో॥ ఏకాదశ్యాం మాఘమాసే మార్తాండస్యోదయే యథా ।
స్నాత్వా మాధవమభ్యర్చ్య దివారాత్రం హరేఃకథాం । యశ్శృణోతి
హరేర్భక్త్యా సభవే దచ్యుతస్స్వయమ్ ।

తా॥ మాఘైకాదశియందు మార్తాండోదయంబున మాఘస్నానమాచరించి మాధవుని పూజించి దివారాత్రియును మాధవకథాశ్రవణ మాచరించిన మానవుఁడు విష్ణుసాయుజ్యము బొందును

శ్లో॥ ఏకాదశ్యా ముపోష్యైవం మాఘే ఒస్మి న్నఘహారకే ।
ద్వాదశ్యామాచరేద్విప్రైః పారణ్యాంతు వరేహని । సదస్య సమభాగీ
స్యాత్క్రమస్యై ర్బహుభావ్యైః ।

తా॥ పాపనాశనమయిన మాఘమందు ఏకాదశ్యుపవాస మాచరించి మఱునాఁడు ద్వాదశినాఁడు బ్రాహ్మణులతోఁగూడా పారణ సలిపినవాఁడు వానికి సమభాగి యగును. ఇంకను విస్తరించి చెప్పఁదగినదిలేదు.

శ్లో॥ ద్వాదశ్యాం మాఘమాసస్య సవత్సాం గాం ప్రయచ్ఛతి ।
విప్రాయ శుచిశీలాయ శ్రోత్రియాయ కుటుంబినే । భూదానం వస్త్ర
దానంచ హిరణ్యం దానముత్తమం । సాలగ్రామశిలాదానం తిలదానం
తథైవచ । ఫలదధ్యన్న తాంబూల ముపవీతం సదక్షిణం । యఃప్రయ
చ్ఛతిమాఘస్య ద్వాదశ్యాం భక్తితత్పరః । ససార్వభౌమాధిపత్యం । ప్రా
ప్నోతి వరమంసుఖం । అంతే విష్ణుపదం యాతి మోదతే విష్ణునాచిరమ్ ।

తా॥ ఇట్లు మాఘ ద్వాదశియందు మాధవప్రీతిగా దూడతోఁగూడిన పాడియావును శ్రోత్రియుఁడును, కథాశ్రవణశీలుఁడును, కుటుంబియునయిన బ్రాహ్మణునకు

దానమిచ్చువాఁడును, ఈద్వాదశినాడే భూదాన, వస్త్రదాన, హిరణ్యదాన సాలగ్రామదాన, తిలదాన, ఫలదాన, దధిదాన, అన్నదాన, తాంబూలదాన, యజ్ఞోపవీతదానములను సదక్షిణముగా చేయువారును, దేహాంతమందు స్వర్గమనుభవించి తిరిగిభూలోకమందు జన్మించి చక్రవర్తి సుఖమునుబొంది తద్దేహాంతమందు విష్ణులోకమును బొంది అచ్చట విష్ణువుతోగూడా నిత్యానందమును బొందుదురు.

శ్లో॥ ఇతితేకథితంవిప్ర చరితం త్రైలోక్యపావనం । పృచ్ఛత స్తవ విప్రేంద్ర పరత్రచ సుఖప్రదమ్ ॥

తా॥ బ్రాహ్మణోత్తమా ! నీ వడిగినప్రకారము త్రిలోకపావనమయిన చరితమును నీకుఁ జెప్పితిని. ఇది ఐహికాముష్మికసుఖప్రదము.

శ్లో॥ యఇదం శృణుతే భక్త్యా వ్యాఖ్యాన మఘహారకం । సద్య స్సుపూతో భవతి సచాప్యంతే హరింవ్రజేత్ ॥

తా॥ పాపనాశనమయిన యీ కథను వినువాఁడు అప్పుడే పవిత్రుఁడై అంతమందు విష్ణుసన్నిధికి చేరును.

శ్లో॥ య శ్శృణోతీమ మధ్యాయం యోవాభక్త్యా హరేఃపురః । ససర్వసుఖమాప్నోతి పరత్రచ నసంశయః ॥

తా॥ ఈ అధ్యాయమును హరిముందర భక్తితో వినువాఁడును, పఠించువాఁడును ఇహమందనేక భోగములననుభవించి అంతమందు మోక్షమును బొందును.

ఇతి త్రయోవింశోధ్యాయ స్సమాప్తః.

---

## — అథ చతుర్వింశోధ్యాయ ప్రారంభః —

గృత్సమదః॥ శ్లో॥ భూయ స్తే కథయామ్యద్య మాఘస్నానప్రభావజం । ధీమతే శ్రద్ధధానాయ యోనవక్తి సపాతకీ ॥

తా॥ జహ్నో ! తిరిగి మాఘస్నానమహిమను జెప్పెదను వినుము. బుద్ధిమంతుఁడైనవాఁడు శ్రద్ధాళువయినవానికి చెప్పనివాఁడు పాతకి యనఁబడును.

శ్లో॥ తస్మా త్తవాభిధాస్యామి శ్రోతుమిచ్ఛో హరేః కథాం ।

మహాపాతకయుక్తో వా యుక్తో వాప్యుపపాతకైః । మాఘవ్రతేన విప్రేంద్ర ముచ్యతే నాత్ర సంశయాత్ ।

తా॥ రాజశ్రేష్ఠ కేవల ధారిని మహాపాలాయ ప్రచిత్తుఁడవయిన నీకుఁ జెప్పె దను. మాఘవ్రతముచేత మహాపాతకయుక్తుఁడుగాని, ఉపపాతకయుక్తుడుగాని, శీఘ్ర ముగా పాతకము క్రుంగఁ జనును.

శ్లో॥ యుక్త్యాదాజ్ఞానతః ప్రాప్తం మహాపాపం దురాసదం। వసత్య శ్శుద్ధిమాయాతి ప్రవేశాత్స్నిన్నమష్టితే ।

తా॥ ఈమాఘవ్రతనిష్ఠునకు అజ్ఞానమువల్ల సంప్రాప్తించిన మహాపాతకము నశించును.

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసం పురాతనం । అజ్ఞానతో మహాపాపాః పురా కేచిద్దురాత్మయాః। చక్రుః కళింగదేశస్థా స్తద్వక్ష్యా మ్యతివిస్మయమ్ ।

తా॥ ఈ విషయమునందు పురాతనకథను చెప్పెదను వినుము. పూర్వమందు కళింగ దేశస్థులు కొందఱు అజ్ఞానమువల్ల మహాపాతకములను చేసిరి. ఆచరిత్ర వినదగినదిగాన దానిని చెప్పెదను వినుము.

శ్లో॥ కశ్చిద్వ్యాధో స్థితస్తత్ర సదైశ్వర్యగణసమన్వితః। దాసీభృత్య జనైర్యుక్త శ్శూరశ్చాపాసిబాణభృత్ । సజాతిభిశ్చ దుష్టైః బహుభిః పరివారితః । సంప్రాప్య గహనారణ్యం నానాద్రుమలతాయుతమ్ ।

తా॥ కళింగదేశమందు బహుధనసంయుతుఁడైన ఒక కిరాతకుఁడు గలఁడు. శూరుఁడయిన ఆ కిరాతకుఁడు నిత్యము దాసీదాసవర్గయుతుఁడై ధనుర్బాణాసి ఖడ్గము లను ధరించియుండువాఁడొకనాఁడు దుష్టులయిన తన జ్ఞాతులతో గూడుకొని అనేక వృక్షములతోను, లతలతోను గూడిన యొక మహారణ్యమును జేరెను.

శ్లో॥ సమృగాన్ మృగయామాస శ్వవాగురికసాధనైః । బంధైశ్చ లేపనైశ్చైవ పాశైర్నిసచారకైః॥ ఖనన్నైశ్చ మృగమార్గేషు విచిత్రై ర్ధ్వనిభిస్సనే । సారంగాన్ మహిషాన్ వ్యాఘ్రాన్ భల్లూకాన్ వారిణా నపి । మృగానాన్యాన్ నానావిధాన్ హత్వా ఖగానపి సహస్రశః । ఇతస్తతో భ్రమన్నగ్రే వనాచ్చైవ వనాంతరమ్ ।

టీ॥ వాఁడు కుక్కలతోను, వాగుర = మృగములను బట్టే వలలతోను, మృగములను బట్టువారు. అరణ్యమందు మృగములను వెదకెను. ఇట్లు వెదకి బంధనముల చేతను, లేపనముల చేతను (జిగురు లేపనముల చేతను) పూత్కారముల చేతను, గుల్మాదులయందు దాగుట చేతను, గోతుల చేతను, మృగసంచారమార్గములయందు నానావిధధ్వనుల చేతనున్ను, సారంగములను (యేనుగులను) దున్నపోతులను, పెద్దపులులను, భల్లూకము (ఎలుగుగొడ్డు) లను, ఇఱ్ఱులనున్ను, అనేకమృగములనున్ను, అనేకపక్షులనున్ను జంపి వనమునుండి మఱియొక వనమునకు బోవుచు ఇటునటు తిరుగుచుండెను.

శ్లో॥ తదా కశ్చిద్ద్విజో దృష్ట్వా మార్గక్లాంతో మహావనే। సగచ్ఛన్నాతపక్లాంత స్స్నానార్థీ నర్మదాజలమ్। ఆలోక్యాథ వటచ్ఛాయాం సద్యః శ్రాంతాపహారిణీం। యావదార్తి నివృత్తిస్స్యాత్ తావ త్తత్రోప విశ్యచ। పునర్గంతుమథోద్యుక్తం విప్రం వేదాంతపారగమ్।

టీ॥ అంతలో దైవవశమున వేదాంతపారావారపారీణుఁడైన ఒక బ్రాహ్మణుఁడు అరణ్యమార్గమున బోవుచు మార్గాయాసమును జెంది ఆతపము (యెండ) చేత అలసినవాఁడై అచ్చటనున్న నర్మదాజలమందు స్నానమాచరింపదలఁచి స్నానము సేయుటకు శ్రాంతి శ్రమనివారిణియైన మఱ్ఱిచెట్టు నీడనుజూచి కొంతకాల మచ్చట విశ్రమించి ఆయాసము పోగొట్టుకొని తిరిగి వెళ్లుటకు ప్రయత్నించెను. ఇచ్చట నర్మదాజలమందు స్నానమాచరించి వటచ్ఛాయయందు విశ్రమించినాఁడను అర్థమును కొందఱు చెప్పుచున్నారు. 'పునర్గంతుమిత' తిరిగి వెళ్లుటకు యత్నించెనని చెప్పుటచేత పునర్గమనమనఁగా మార్గగమనమని అర్థమును నిశ్చయించి ఇట్లు చెప్పుచున్నారు. స్నానార్థీ అను పదమును బట్టి స్నానేచ్ఛ వచ్చుచున్నది గాని స్నానసమాచరణము ప్రాప్తమగుట లేదు గనుక స్నానాచరణమునకు ముందు ఆయాసమునకు వటచ్ఛాయయందు విశ్రమించెనని కొందఱు వచించుచున్నారు.

శ్లో॥ వ్యాధో౽యం క్రూరయా దృష్ట్యా సాయుధ స్సం ప్రపద్యత। సర్వాణి సంజహారాను వస్త్రాదీని ద్విజస్యచ। ఉపానహౌ ఛత్రదండ కౌ తథా పాలం కమండలుం। అపహృత్యాథ తం భూయః ప్రాబ్రవీదతి తం మునే।

టీ॥ అంతలో క్రూరుఁడయిన కిరాతకుఁడు సాయుధుఁడై ఆ బ్రాహ్మణుని వద్దకు వచ్చి ఆతని వస్త్రములను, పాదుకలను, ఛత్రమును, దండమును, అక్షమాలను, కమండలువు మొదలయిన సమస్త వస్తువులను దొంగిలించి యింకా బ్రాహ్మణునితో నిట్లనియెను.

శ్లో॥ దేహి మే గోపితం విత్తం నోచేత్ఖడ్గేన ఘాతయేత్ । తేనేత్యుక్తః పునః ప్రాహ వ్యాధం క్రూరమతిం మునిః । న మయా గోపితం ద్రవ్యం నచాప్యల్పధనం హి యత్ । దరిద్రస్య మమేదానీం కుత్ర తిష్ఠతి వై ధనమ్ ।

తా॥ ఓ బ్రాహ్మణుఁడా! యింకా దాచినసొమ్ము నిమ్ము. అట్లుగానిచో నిన్ను కత్తిచేత చంపెదనని కిరాతకుఁడు పలుకగా బ్రాహ్మణుఁడు క్రూరుఁడయిన కిరాతకునితో నేనెన్నఁడును కొంచెమయినను ధనము దాచలేదు. దరిద్రుఁడనయిన నాకు ధనమెట్లు సంభవించును. కనుక నావద్ద కొంచమైనను ధనములేదని చెప్పెను.

శ్లో॥ ఇతీరితోఽథ విప్రేణ పాపాత్మా లుబ్ధకో హ్యయం । ఖడ్గేన తచ్ఛిరశ్ఛిత్వా సానుగైః ప్రయయౌ గృహమ్ ।

తా॥ ఇట్లు బ్రాహ్మణుఁడు చెప్పఁగా క్రూరుఁడయిన కిరాతుఁడు తనఖడ్గముతో బ్రాహ్మణునిశిరము త్రుంచి పరివారసమేతుఁడై తనగృహమునకు వెళ్లెను.

శ్లో॥ సురాపః కష్టజన్మాసౌ సురాం ప్రతిదినే పిబత్ । వథాచ చోరవృత్త్యా సౌ సర్వమార్గేషు సంతతమ్ । పట్టణాద్యవకూలేషు గ్రామేష్వన్యేషు భీరుషు । చోరవృత్త్యా హరద్ద్రవ్యం వ్యాధోఽయం ద్రవ్యతస్కరః ।

తా॥ కష్టజన్ముఁడైన కిరాతుఁడట్లు ప్రతిదినము కల్లుత్రాగుచు మార్గచోరుఁడై సర్వమార్గములయందును, పట్టణప్రాంతములయందును, భయపడు గ్రామములయందును చోరవృత్తిచేత చాలా ద్రవ్యమును హరించెను.

శ్లో॥ ఏతాదృశస్య వ్యాధస్య ఆసీత్పుత్రత్రయం మహత్ ।

తా॥ ఇట్టి కిరాతునకు కొంతకాలమునకు గొప్పపుత్రత్రయము కలిగెను.

శ్లో॥ వ్యాధం తం ప్రతిపద్యాథ కశ్చిత్స్వర్ణాపహారకః । స్వర్ణకారః క్రూరమతి స్స్వాత్మపోషణలంపటః ।

తా॥ బంగారమును హరించువాఁడును, క్రూరుఁడును, ఆత్మపోషణపరాయణుఁడును నగు నొక స్వర్ణకారుఁడు (కంసాలివాఁడు) ఆకిరాతునిదగ్గఱకు చేరెను.

శ్లో॥ కిరీటకటకాదీనాం నిర్మాణసమయేష్వికం। ఉపయానేకకుశలః స్వర్ణం ప్రతిదినే హరత్ ।

తా॥ వాఁడు అనేకోపాయశీలుఁడు గాన ప్రతి దినమందు కిరీట కటకములు మొదలయిన భూషణముల నిర్మాణ సమయమందు బంగారమును హరించుచుండెను.

శ్లో॥ బ్రహ్మక్షత్రియవైశ్యానాం శూద్రాదీనాంతథైవచ। సర్వాలంకారనిర్మాణై ర్వ్యాహార చ్చోరవృత్తినా ।

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదుల కలంకారములను జేయుచు చోర వృత్తిచేత బంగారమును హరించుచుండెను.

శ్లో॥ వ్యాధేన తిర్యగ్రక్షేన యద్విత్తం నిత్యమానరే। తత్సర్వం ప్రతిజగ్రాహ సవిక్రయవిచక్షణః ।

తా॥ కిరాతుఁడు దొంగతనముచేత నిత్య మెంత సంపాదించునో దానినంతయు వాఁడు విక్రయార్థము కొనికొనుచుండెను. అందు తాను కపటముచేత లాభమును పొందుచుండెను.

శ్లో॥ స్నేహో వివర్ధతే తాభ్యాం లుబ్ధక స్వర్ణకారయోః ।

తా॥ ఇట్లు క్రయవిక్రయములచేత కిరాత స్వర్ణకారులకు స్నేహ మభివృద్ధిగా నుండెను.

శ్లో॥ కశ్చిచ్ఛూద్రాధమ స్తస్మిన్ కామాంధః క్రూరమానసః । విత్తపోహీనధర్మజ్ఞః పరస్త్రీరతిలాలసః ।

తా॥ అచ్చట కామాంధుఁడును, క్రూరచిత్తుఁడును, ధనవంతుఁడును ధర్మహీనుఁడును, పరస్త్రీలోలుఁడునునగు నొక శూద్రుఁడుండెను.

శ్లో॥ గతే తత్పితరి స్వర్గం తస్యభార్యా శుచిస్మితా। రూపాఢ్యా సా విశాలాక్షీ దుశ్శీలా వ్యభిచారిణీ ।

తా॥ వానితండ్రి చనిపోయినతరువాత సౌందర్యవతియు, శుచిస్మితయు, విశాలలోచనయు నయిన తల్లి దుశ్శీలయై వ్యభిచారవృత్తిఁ గలదాయెను.

శ్లో॥ కదాచి త్స్వగృహాంహిత్వా కృష్ణపక్షాష్టమీదినే। జారా

జారగృహం గత్వా సాంధకారేష్వవేశ్మని । ప్రతీక్షమాణా జారం సా జారోనాగాచ్ఛ తద్దినే ॥

తా॥ ఒకప్పుడు అజారిణి కృష్ణపక్షాష్టమీదినమందు కామేచ్ఛచేత జారునిగృహమునకు వెళ్ళి అచ్చట చీకటిలో జారునిరాకను గోరుచు యుండెనుగాని ఆదినమందు జారుఁడు రాలేదు.

శ్లో॥ తదా తస్మిన్ దినే రాత్రౌ సుతోऽస్యాః కాముకో మునే । పిత్యాయయౌ తత్సుఖత్వాత్ ధ్వాంతాగారేచ నిద్రితే ॥

తా॥ అప్పుడారాత్రి దీనికొడుకును కాముకుఁడై దీనిజారుఁడు తనకుస్నేహితుఁడగుటచేత వానియింటివద్ద తనకు యథేచ్ఛాసంభోగము కలుగునని దీనిజారునియింటికి వెళ్ళి యిదియున్న చీకటిస్థలమునకే తానువెళ్ళి పరుండెను. ఇట్లిద్దఱును కొంతతడవు వఱకు నిద్రించిరి.

శ్లో॥ ఏకాకీ మథ హస్తాభ్యాం సంస్పృశ్యాలోక్య కాముకః । కామాంధోऽపిమహాంధేచ కామాలింగ్యానుభూయతి ॥

తా॥ ఇట్లు నిద్రించిన కుమారుఁడు కొంతసేపటికి లేచి తనజారిణి వచ్చెనదేమో చూతునని చేతులతో యిటునటు తాకిచూచెను. తాకఁగా ఒక స్త్రీ నిద్రించియుండెను. అంధకారమగుటచేతను, కామాంధుఁడగుటచేతను, తాను తల్లియని తెలిసికొనక దాని నాలింగనము చేసికొని సంభోగము నారంభించెను.

శ్లో॥ సాజారమితినిశ్చిత్య గతనిద్రా సుతేనచ । కృత్వాలింగన మప్యేషా హ్యత్యన్త్యం క్షణికేసుఖే ॥

తా॥ ఇంతలో జారాగమన ప్రతీక్షిణియైన అది నిద్రలేచి రతిసౌఖ్యమును పొంది తెలిసికొనజాలక తనతో సంభోగించువాఁడు తన జారుఁడేనని నిశ్చయించి తానును కుమారుని ఆలింగనము చేసికొనెను. ఇట్లిరువురు క్షణికసుఖము కొఱకు యింత పని సలిపిరి.

శ్లో॥ సాపి రేతో విసర్గాంతే హిత్వాలింగన మాశుచ । విచార్య మాణేన్యాసి తన్మాతోऽనంతదుఃఖతా ॥

తా॥ వాఁడు యిట్లు సంభోగించి రేతస్సు పడలగానే ఆలింగనమును విడిచి

యిది యెవ్వరని విచారించగా తన తల్లియయ్యెను. అదియు నెఱుఁగదని తెలిసికొని దుఃఖించెను.

శ్లో॥ భ్రాతరం పితరం పుత్రం మనుజం శిష్యమేవవా । ఏకాంత సమయే స్త్రీణాం యోనిక్లిద్యతి సర్వదా ।

తా॥ జనకా ! వినుము. స్త్రీల కేకాంతమందు అన్నయగాని, తండ్రిగాని కుమారుఁడుగాని, తమ్ముఁడుగాని, శిష్యుఁడుగాని చూచినయెడల యోని ద్రవించును.

శ్లో॥ స్త్రియ స్తస్మాదశక్యాహి దేహాంతేనపి రక్షితుం । యుంతమా లింగ్యవినన్యై తస్యా క్షణంరంజాయతే మతిః ॥

తా॥ కావుట్టి స్త్రీలు తమకేకాంతమందు పురుషులు లభించినయెడల కాపాడి దేసికమును అభ్రకాన సమర్థులుగాక వానితో ఆలింగనపూర్వకముగా సంభోగము చేయ నుద్యోగింతురు కావుట్టి భార్యాభర్తలు గానివారయిన స్త్రీపురుషులొక్కచోట నేకాంత మందు కలియఁగూడదు.

శ్లో॥ తావిదార్యాథలోకేమ లోకభీత్యా మహామునే । సతత్రి త్యాపితాకర్మ వరత్ర వ్యవసాయతః ।

తా॥ మహాపురుషులెట్లన నట్లు తెలిసికొని. వర్ణించిన లోకులు నిందింతు రను లోకభయముచేత అజుగుప్సితకర్మను వర్జించవలెను. అయినను పరలోకదుఃఖము తప్పదు. ఈలోకము వెన్నటికి తెలియకుండును గాని పరకాసుధన సభయమందు సాక్ష్యమిచ్చువారు పదుగురున్నారు. వారెవ్వరన. శ్లో॥ ఆదిత్య చంద్రావనిలో నలశ్చ ద్యౌర్భూమిరాపో హృదయంయమశ్చ। అహశ్చరాత్రిశ్చ ఉభేచసంధ్యే ధర్మశ్చ జానాతినరస్యవృత్తిమ్॥ సూర్యుఁడు, చంద్రుఁడు, వాయువు, అగ్ని, ఆకాశము, భూమి ఉదకము, చిత్తము, యముఁడు, అహస్సు, రాత్రియు, ప్రాతస్సంధ్యయు, ధర్మము, ఈ పదునలుగురు స్త్రీపురుషుల పుణ్యపాపములను జూచుచుందురుగాన అపాయమును దాచినయెడల లోకనింద సంభవించదుగాని పరలోకబాధ తప్పదుగదా.

శ్లో॥ బహుధావ్యధగన్నాతా పశ్చాత్తాపముపాగతా। విచార్య గంగాసలిలే వివత్యమరణంయయౌ ।

తా॥ తాని తానితల్లి అనేకవిధములుగా పరితపించి విచారించి గంగలో పడి మృతినొందెను.

శ్లో॥ గతభీరథపాపాత్మా పరస్త్రీసంగలోలుపః । నష్టే పిత్రార్జితే ద్రవ్యే వ్యాధభృత్యో౽భవత్ప్రియః ।

తా॥ ఆ దుర్మార్గుడు భయములేక సంచరించుచు నిత్యము పరస్త్రీసంగలోలుడై యుండెను కొంతకాలమునకు పితార్జితధనమంతయు నశించగా పూర్వోక్త కిరాతునకు ప్రియభృత్యుడాయెను.

శ్లో॥ యదుక్తం లుబ్ధకేనాసౌ తచ్చ సర్వం నిరంతరం । కృత్వార్థ ముదరస్యైవం దురాత్మా గురుతల్పగః ।

తా॥ మాతృసంభోగ తత్పరుడయిన ఆ దురాత్ముడు వాని వద్దనే ఉదర పోషణార్థమై కిరాతుడు చెప్పిన పనులన్నిటిని చేయుచుండెను.

శ్లో॥ ఇత్థం త్వ్యాధముఖ్యేషు మహాపాపకృతాత్మసు । కశ్చిద్విశృంఖలో నామ విప్రక్షేత్రసంభవః । వృత్తిహీనో వ్యాధమేకం సమాశ్రిత్యాత్మపోషకః । అజస్రమస్యనికటే హ్యువాసీనో౽శుచిర్ద్విజః ।

తా॥ ఇట్లు బ్రాహ్మణహంత, సువర్ణస్తేయి, గురుతల్పగామి, మ్లేచ్ఛులను కలసి మహాపాపాత్ములతో నున్నంతలో ఆదేశస్థుడయిన విశృంఖలుడను నొక బ్రాహ్మణుడు వృత్తిహీనుడై ఆత్మపోషణకొరకు యీ కిరాతుని ఆశ్రయించి వీనిని సేవించుచు అశుచియై వీనివద్దనే నిత్యము నివసించియుండెను.

శ్లో॥ సంత్యజ్య కాలకర్మాణి స్నానాదీని సదుర్మతిః । తత్ప్రసాదార్థకామస్సన్ నిత్యం తస్యానుగో౽భవత్ ।

తా॥ ఆ దురాత్ముడైన బ్రాహ్మణుడు స్నానసంధ్యాది కాలములయందును, కిరాతానుగ్రహమును పరీక్షించుచు నిత్యము వానికి అనువర్తనుడైయుండెను,

శ్లో॥ పౌరోహిత్యేన మార్గేణ పుణ్యకాలే స్వయం ద్విజః । ప్రతిగృహ్ణా తేనదత్తం తథాతత్పార్శ్వవర్తిభిః ॥

తా॥ బ్రాహ్మణుడు ఆకిరాతకులందరికి పురోహితుడై పుణ్యకాలములయందు ఆకిరాతకులందరివద్దను దానములు పుచ్చుకొనుచుండెను.

శ్లో॥ సంసర్గమిత్థైర్వ్యస్త విప్రో౽యం వత్సరద్వయం। బ్రహ్మఘ్నేన

సురాపేన స్తేయినా చాతిపాతినా । గురుతల్పగ దుష్టేన సర్వపాపాధికేన చ । ఏతైస్సంసర్గత స్తస్య మహాపాతకపంచకమ్। బభూవవర్షాత్తద్బ్రాహ్మణ్యం సకలంవిలయంయయౌ ।

తా॥ ఇట్లు బ్రాహ్మణుఁడు రెండుసంవత్సరములు వానితోనుండెను. ఇట్లు బ్రాహ్మణఘాతకునితోను, సురాపునితోను, సువర్ణస్తేయితోను, గురుతల్పగామితోను, సంసర్గమాచరించినందున పంచమహాపాతకములు సంభవించెను. తరువాత బ్రాహ్మణతేజమంతయు నశించెను. ఇందులో బ్రహ్మహంతయు, సురాపుఁడును, ఘాతుకుఁడు, సువర్ణస్తేయి (బంగారమును దొంగిలించువాఁడు) గురుతల్పగామి, దుష్టుఁడు, తత్సంసర్గ బ్రాహ్మణుఁడు యిట్లు పంచమహాపాతకులు కలిసిరి. (శ్లో॥ బ్రహ్మహాచ సురాపశ్చ స్తేయీచగురుతల్పగః । మహాపాతకినస్త్వేతే తత్సంసర్గీచపంచమః ॥)

శ్లో॥ మహాపాతకసంసర్గ దోషేణాస్యద్విజస్యవై । బ్రాహ్మణ్యం సకలంనష్టం నిశ్శేషేణ ద్విజోత్తమ ।

తా॥ ఓ బ్రాహ్మణా ! యీ బ్రాహ్మణునకు మహాపాతకి సంసర్గదోషముచేత బ్రాహ్మణ్యమంతయు నిశ్శేషముగా నశించెను.

శ్లో॥ మహాపాతకిభిస్సార్థం దినమేకంతుయోద్విజః । నివసేత్సాదరంతస్య తత్క్షణాద్వై ద్విజన్మనః । బ్రాహ్మణస్య తురీయాంశో నశ్యత్యేవ నసంశయః ।

తా॥ ఎవ్వఁడు మహాపాతకులతో ఆదరముతో నొకదినము సంసర్గమాచరించునో అట్టి బ్రాహ్మణునకు పుణ్యములో నాలుగవభాగము అప్పుడే నశించును.

శ్లో॥ ద్విదినంసేవనాత్సర్వా చ్ఛయనాసనభాషణైః । భోజనాత్సహపంక్త్యాచ మహాపాతకిభిర్జనే । ద్వితీయభాగో నశ్యేత బ్రాహ్మణస్య నసంశయః ।

తా॥ రెండుదినములు మహాపాతకులతో సాంగత్యమాచరించిన అనఁగా వానిని సేవించుటవలనను, తాకుటవలనను, వానితో శయనించుటవలనను, వానితో సహా కూర్చుండుటవలనను, వానితో సంభాషించుటవలనను, సహపంక్తియందు భోజనము చేయుటవలననున్న ద్వితీయభాగము బ్రాహ్మణ్యము నశించును. అనఁగా బ్రాహ్మణ్యమందర్ధము నశించునని యర్థము.

శ్లో॥ త్రిదినాచ్చ తృతీయాంశో నశ్యత్యేవ న సంశయః ।

తా॥ మూఁడుదినములు సాంగత్యమాచరించిన మూఁడుభాగములు నశించును

శ్లో॥ చతుర్దినాచ్చతుర్థాంశో విలయం యాంతి హి ధ్రువమ్ ।

తా॥ నాలుగుదినములు సాంగత్యమాచరించిన నాలుగుభాగములు నశించును. అనఁగా అంతయు నశించునని యర్థము. ఈ చెప్పిన చాతుర్భాగము నిశ్చయముగా నశించును. ఇందులో సందేహములేదు.

శ్లో॥ అతఃపరంతు తైస్సార్థం శయనాసనభోజనైః॥ తత్తుల్యపాతకీ భూయా న్మహాపాతకసంగమాత్ ।

తా॥ ఇంతకంటె యెక్కువరోజులు మహాపాతకిసంసర్గ మాచరించి వారితో సహ శయనాసనభోజనాదు లాచరించినచో యతఁడు వారితో సమానమయిన పాతకమాచరించిన వాఁడగును. అనఁగా యతఁడును మహాపాతకియనఁబడును.

శ్లో॥ మృతస్సంయమనీం ప్రాప్య నతస్మాన్నివర్తతే ।

తా॥ ఈపాపి చచ్చి యమలోకముఁజేరి అచ్చటనుండి తిరిగి రానేరఁడు.

శ్లో॥ జ్ఞానాజ్ఞానకృతానాంచ పాపానాం క్షుద్రకర్మణాం। ప్రాయశ్చిత్తాంతరం ప్రోక్తం మన్వాద్యైస్స్మృతిభిస్స్మృతౌ । విప్రహత్యాది పాపస్య జ్ఞానేనైవకృతస్యచ । విచార్యమాణే మునిభిః ప్రాయశ్చిత్తం నచోదితమ్ ।

తా॥ జ్ఞానాజ్ఞాన సంకలితముగా చేయఁబడిన క్షుద్రపాపములకు మన్వాదులచేత ధర్మశాస్త్రమందు ప్రాయశ్చిత్తము విధింపఁబడి యున్నది గాని జ్ఞానముతో చేయఁబడిన బ్రహ్మహత్యాది మహాపాపములకు ప్రాయశ్చిత్తమెన్నటను చెప్పఁబడలేదు.

శ్లో॥ జ్ఞానతో యత్కృతం పాపం మహదప్యల్పమేవవా । తద్భుక్త్వా క్రమశో భూయః సభూయా బ్రహ్మరాక్షసః । బ్రహ్మకల్ప సహస్రాంతే నిష్కృతిస్తస్య విద్యతే ।

తా॥ జ్ఞానముతో చేయఁబడిన పాపము గొప్పదిగాగాని, స్వల్పముగాని, ఆపాప ఫలమును క్రమముగా అనుభవించి తరువాత భూమియందు బ్రహ్మరాక్షసుఁడై సహస్ర బ్రహ్మకల్పములుండిన పిమ్మటగాని ప్రాయశ్చిత్తము చెప్పఁబడదు.

శ్లో॥ అజ్ఞానతఃకృతంపాపం మహదప్యల్పమేవవా। ప్రాయశ్చిత్తాదిభిస్సర్వం పశ్చాత్తాపనశుద్ధ్యతి।

టీ॥ అజ్ఞానముతో జేయఁబడినపాపము గొప్పదిగాని, చిన్నదిగాని, ప్రాయశ్చిత్తముచేతను, పశ్చాత్తాపముచేతను శుద్ధినిపొందును. పశ్చాత్తాపమనఁగా పాపము చేసినతరువాత విచారించి అయ్యో నేనెందుకిప్పుడీ పాపమాచరించితిని దైవమా, యింకెన్నటికిని యిట్టిపాపమాచరించను. నాకు బుద్ధివచ్చినది ఈదోషము నివారించుమయా గోవిందా యని యుచ్చరించుట.

శ్లో॥ వ్రతోపవాసనియమైః కృచ్ఛ్రచాంద్రాయణైస్తథా। నరః పాపైర్విముచ్యేత గంగాస్నానపరో యథా।

టీ॥ అట్లుగానే వ్రతములచేత, ఉపవాసములచేత, ఆగంతుకసాధనములయిన నియమములచేత, కృచ్ఛ్రములచేత, చాంద్రాయణములచేత మనుజుఁడు గంగాస్నానపరుఁడువలె పాపవిముక్తుఁడగును. కృచ్ఛ్రములు పాదకృచ్ఛ్రము, అర్ధకృచ్ఛ్రము, తప్తకృచ్ఛ్రము మొదలయిన అనేకప్రకారములుగా నుండును. ఇట్లే చాంద్రాయణము అనేకవిధములు. వాటివిస్తారము ధర్మశాస్త్రములందు జూడఁదగినది.

శ్లో॥ సోపివర్షద్వయస్యాంతే విప్రోసౌ వ్యాధపార్శ్వతః। దిష్ట్యా గ్రామాంతరంగచ్ఛన్ కిరువ్యాధోదితంవచః।

టీ॥ ఆబ్రాహ్మణుఁడిట్లు కిరాతునివద్ద రెండుసంవత్సరములుండి దైవవశమున నొకనాఁడు తనిమీద కిరాతుఁడు తంపగా మఱియొకగ్రామమునకు వెళ్ళెను.

శ్లో॥ దదర్శ తంచ విప్రేంద్రం నామ్నా వీరవ్రతాహ్వయం। రుద్రాక్షమాలాభరణం భస్మోద్ధూళితవిగ్రహం। కృష్ణాజినాంబరధరం కుశపాణిం కృపాకరం। చరంతం పుణ్యతీర్థాని ముక్తిదాని మనీషిణాం। వదంతంవిష్ణునామాని కృష్ణనారాయణేతిచ।

టీ॥ వెళ్ళి అచ్చట రుద్రాక్షమాలను ధరించినవాఁడును, శరీరమంతయును విభూతిని బూసుకొనినవాఁడును, కృష్ణాజినమును ధరించినవాఁడును, దర్భపాణియును, దయావంతుఁడును, విద్వాంసులకు మోక్షప్రదములయిన పుణ్యతీర్థముల సేవించువాఁడును, "కృష్ణానంతముకుంద మురారె వామన మాధవ గోవింద। శ్రీధర కేశవ రాఘవ విష్ణో లక్ష్మీనారాయణ సంసేవ్యా" అన్నవాఁడుగా విష్ణునామముల నుచ్చరించువాఁడును అగు వీరవ్రత నామధేయుఁడైన నొక బ్రాహ్మణోత్తముని జూచెను.

శ్లో॥ తంపరిక్రమ్య పాపాత్మా నమస్కృత్య ద్విజాధమః । తస్యాగ్రేభిముఖ స్థిత్వా తూష్ణీం బద్ధాంజలిర్వ్యసే ॥

తా॥ చూచి పాపాత్ముఁడైన బ్రాహ్మణాధముఁడు అతనికి ప్రదక్షిణమాచరించి నమస్కరించి బద్ధాంజలియై అతనికెదురుగానిలచి యూరకుండెను.

శ్లో॥ తం దృష్ట్వాథ ద్విజశ్రేష్ఠో బ్రహ్మతేజో వివర్జితం । విస్మితః ప్రత్యువాచేదం కోభవాన్ కుత్రగచ్ఛసి ॥

తా॥ ఆబ్రాహ్మణుఁడు బ్రహ్మతేజోవిహీనుఁడైన విశృంఖలబ్రాహ్మణాధముని జూచి ఆశ్చర్యమొంది నీవెవ్వఁడవు. యెచ్చటికిఁబోయెదవని అడిగెను.

శ్లో॥ ఇత్యుక్తస్తేనసోప్యాహ బ్రాహ్మణోహం మహామతే । జీవనోపాయరహితో వ్యాధపార్శ్వవసామ్యతః ॥

తా॥ విశృంఖలుఁడీమాటనువిని మహానుభావా, నేను బ్రాహ్మణుఁడను. నాకు జీవనోపాయములేక ఒకకిరాతునివద్ద చేరితిని.

శ్లో॥ ఇతితస్య వచశ్శ్రుత్వా విస్మితః పాత్రవారిణా । సంప్రోక్ష్య నేత్రేతత్రైవ ధ్యాత్వాసఘటికాద్వయమ్ ॥ ప్రత్యువాచాథవిప్రేంద్రో బ్రహ్మతేజోవివర్జితమ్ ॥

తా॥ వీరవ్రతుఁడిట్లు విశృంఖలవాక్యమును విని ఆశ్చర్యమొంది కమండలూదకముచేత నేత్రములు తుడుచుకొని రెండుఘడియలకాలము ధ్యానించి చూచి బ్రహ్మతేజోవిహీనుఁడైన విశృంఖలునితో నిట్లనెను.

ఇతి చతుర్వింశోధ్యాయః సమాప్తః.

---

## —॥ అథ పంచవింశోధ్యాయః ప్రారంభః ॥—

వీరవ్రత ఉవాచ॥ శ్లో॥ త్వదాయాతి మఘం సర్వం ప్రవక్ష్యేహం ద్విజాధమ । శ్రుణుత్వంసావధానేన యస్మాయాగదితం ద్విజ ॥

తా॥ ఓరి బ్రాహ్మణాధమా ! నీ సమస్తపాపములను చెప్పెదను. సావధానుఁడవై వినుము.

శ్లో॥ స్వామిం త్వఘకర్తాహం బ్రహ్మఘ్నః పాపినాంవరః । సురాపఃకూరధీర్విప్రః స్వర్ణస్తేయాదిపాతకీ । తత్సఖస్స్వర్ణకారోధూర్తస్సదాస్వర్ణాపహారకః॥ తయోరాసీత్సఖాశూద్రః కశ్చిద్వైగురుతల్పగః ।

తా॥ నీప్రభువు పాతకిని, బ్రహ్మహంత, సురాపానుఁడు, స్వర్ణాస్తేయాది పాతకిని. నానిమిత్రుఁడు కంసాలి. నిరంతరము బంగారము హరించువాఁడు. వీరిద్దరికి తల్లితో సంభోగించు నొక శూద్రస్నేహితుఁడుంగలఁడు.

శ్లో॥ తేషాంసంసర్గతోనష్టం త్వద్దేహాబ్రహ్మవర్చసం । తేభ్యస్త్రిగుణంపాప మాసీదత్యంతదుస్సహం ।

తా॥ వారితో సాంగత్యమాచరించుటచే నీదేహమందు బ్రహ్మవర్చస్సు నశించినది. ఇంతేగాదు. వారిముగ్గురిపాపము నీకు సంక్రమించినది కాఁబట్టి నీపాపము చాలా దుస్సహమైనది.

శ్లో॥ మహాపాపరతైశ్చైవ కృతైర్వాచోపపాతకైః । బలాత్స్వభావాద్దైవాద్వా కృత్యర్థలాభాత్తథాపివా । దర్శనస్పర్శనాలాపైః సంసర్గం యస్సమాచరేత్ । సోపితత్పాపమశ్నాతి వినావైదర్భపాణినా । అభాషితంయదాతైస్తు కృత్వాకుశమంతసా ।

తా॥ ఎవ్వఁడు బలవంతముచేతగాని, స్వభావముచేతగాని, దైవవశమువలన గాని, అర్థలాభమువలనగాని, మహాపాతకోపపాతకులతో దర్శన స్పర్శ నాలాపముల నాచరించునో వాఁడు తత్తుల్య పాతకియగును. ఒకవేళ వారితో సంభాషింపవలసిన కార్యముండినయెడల హస్తమందు కుశలనుంచుకొని మాట్లాడినయెడల ఆపాపము అంటదు. అట్లుగాదేని పాపసంబంధము తప్పదు.

శ్లో॥ సశయ్యాలాపసంస్పర్శాత్తత్కథాలాపభోజనైః । తేభ్యః సంసర్గకర్తౄణాం కః పాపంగదితుంక్షమః ।

తా॥ అట్టి మహాపాతకులతో కలిసి శయనాసనభోజన స్పర్శనాలాపముల నాచరించువాని పాపములు జెప్పుటకు యెవ్వఁడు సమర్థుఁడగును. అట్టి సంసర్గపాతకము వర్ణించుటకు సమర్థులెవ్వరును లేరు.

శ్లో॥ తస్మాత్త్వాసీత్సంసర్గ మజస్రం లుబ్ధకాదిభిః । వర్జయామో భాషణంచ మత్వా తత్సంసర్గకపాతకాః ।

తా॥ కావున కిరాతకులతో నీ వెల్లప్పుడు సాంగత్య మాచరించితివి గాన నీతో మాట్లాడగూడదు.

శ్లో॥ బ్రహ్మహాచ సురాపశ్చ స్తేయీచ గురుతల్పగః । మహాపాతకినః ప్రోక్తా స్తత్సంసర్గీతు పంచమః ॥

తా॥ బ్రాహ్మణుని వధించినవాఁడును, కల్లు త్రాగినవాఁడును, బంగారము నపహరించినవాఁడును, అగమ్యాగమన మాచరించినవాఁడు మహాపాతకులనఁబడుదురు. వీనితో సహవాసము చేయువాఁడు అయిదవ మహాపాపి.

శ్లో॥ మహాపాతకినః పంచ యః సంసర్గంచ రేద్యది । జ్ఞానేనాభ్యాసమాపన్న స్సంత్యాజేశాత్యజం యథా । తమిత్యుక్త్వాథ వక్తూష్ణీం మునిర్వ్రతపరాయణః ॥

తా॥ ఈ పంచమహాపాతకులతో నెవ్వఁడు తెలిసి సంసర్గాభ్యాస మాచరించునో వానిని చండాలునివలె దూరముగా విడువవలెను. ఓహో ! వినుము. వ్రతపరుఁ డిట్లుపలికి యేమియును మాట్లాడకయుండెను.

శ్లో॥ అథ ద్విజాధమో భీత్యా పశ్చాత్తాపేన తం మునిం । ప్రకంపితతనుర్భూత్వా ప్రత్యువాచ పురస్థితమ్ ॥

తా॥ అనంతరము విశృంఖల బ్రాహ్మణాధముఁడు పశ్చాత్తప్తుఁడై భయమునంది కంపితశరీరుఁడై ముందరనున్న మునీశ్వరునితో నిట్లనియె.

శ్లో॥ పాహి మాం కృపయా బ్రహ్మన్ దయాళో దీనవత్సల । కథం మే నిష్కృతిర్భూయాత్ పాపా ద్ఘోరతరాదిహ ॥ సర్వపాపక్షయకరం ప్రాయశ్చిత్తం ప్రకల్పయ ॥

తా॥ బ్రాహ్మణోత్తమా, దయానిధీ, దీనవత్సలా, నన్ను రక్షింపుము. నాకీ ఘోరమయిన పాపమువలన యెట్లు విముక్తి గలుగును. నాకు సర్వపాపక్షయకరమైన ప్రాయశ్చిత్తము చేయించుము.

శ్లో॥ ఇతీరితస్తత స్తస్య సర్వభూతదయానిధిః । మన్వాదిస్మృతిభిః ప్రోక్తం ప్రాయశ్చిత్తము వాచహ ॥

తా॥ విశృంఖలుఁ డిట్లు కోరఁగా విని వ్రతపరుఁడు సర్వభూతదయాళువు గాన

అతనియందు దయగలవాఁడై మన్వాది ధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడినప్రకారము అతనికి ప్రాయశ్చిత్తము చెప్పదొడంగను

శ్లో॥ త్వయా పాతకసంసర్గ పంచమస్యాపి సత్తమ । ప్రాయశ్చిత్తం ప్రవక్ష్యామి తత్సమ్యగవధారయ ।

తా॥ విప్రోత్తమా! నీచే చేయఁబడిన మహాపాతకసంసర్గమను పంచమమహాపాతకమునకు ప్రాయశ్చిత్తము చెప్పెదను శ్రద్ధతో వినుము.

శ్లో॥ పాపాత్ ప్రతిపదం నిత్యం తథా తీర్థానివర్త్యటన్ । గ్రామాద్గ్రామాంతరం గత్వా ద్వాదశాబ్దం గృహేగృహే । భిక్షాన్న మింతి యాచిత్వా తద్భుక్త్వా వ్రతమాశ్రితః ।

తా॥ నిత్యము పాపముల నుచ్చరించుచు తీర్థయాత్ర చేయుచు, ప్రతిదినము గ్రామమునకు వెళ్లుచు, ప్రతియింటికిఁబోయి భిక్షమును యాచించి తెచ్చుకొని భుజించుచు పన్నెండుసంవత్సరములిట్లు వ్రతమును సలుపుము.

శ్లో॥ తతాత్వం ప్రతివర్షేషు మాఘే మకరగే రవా । ప్రయాగే మజ్జనంకృత్వా కురు మాధవదర్శనమ్ ।

తా॥ ప్రతి సంవత్సరము మాఘమాసమందు ప్రయాగయందు ప్రాతస్స్నానమాచరించి ప్రయాగ మాధవుని దర్శించుచుండుము.

శ్లో॥ ప్రయాగస్మరణాన్ముక్తిర్న జానే స్నానజంఫలం । మహాపాతకయుక్తోవా యుక్తోవా ఉపపాతకైః । ప్రయాగ స్నానమాత్రేణ మాఘే మకరగే రవా । సద్యశ్శుద్ధిమవాప్నోతి నాత్రకార్యా విచారణా ।

తా॥ ప్రయాగస్మరణముచే ముక్తిలగును. స్నానమువల్ల నేమిఫలము కలుగునో తెలియదు. మహాపాతకిగాని ఉపపాతకిగాని, మాఘ మకరమందు ప్రయాగస్నానమాచరించిన యెడల అప్పుడే పవిత్రుఁడగును. ఈవిషయమై విచారణతో పనిలేదు.

శ్లో॥ తస్మాత్సర్వేషు తీర్థేషు ద్వాదశాబ్దం నిరంతరం । తస్మాత్త్వం ప్రయతో భూత్వా సదా భిక్షాన్నజీవనః ।

తా॥ కాఁబట్టి నిరంతరముగా పన్నెండుసంవత్సరములు నియమముతో తీర్థాటనము చేయుచు సదా భిక్షాన్నమునే భుజించుచుండవలెను.

శ్లో॥ ఆదావంతేతథామధ్యే ష్వేకస్మిన్ వత్సరేపివా । మాఘే మకరగేసూర్యే ప్రయాగస్నానమాచర ॥

తా॥ ద్వాదశాబ్దములుగాని, లేక ఆదియందుగాని, లేక మధ్యయందుగాని, లేక అంతమందుగాని, మూడుసంవత్సరములుగాని, లేక ఒకసంవత్సరముగాని, ప్రయాగ మాఘస్నానమాచరించుము.

శ్లో॥ యద్గోభక్షితకాల్యాద్యైః పక్వాన్నం దైవమానకం । భక్షయిత్వాతతశ్శుద్ధి స్త్రివత్సరంభవిష్యతి ॥

తా॥ ఇట్లాచరించి గోభక్షిత కాల్యాదులచేత పక్వమయిన అన్నమును ఒకమాసమును భక్షించిన తరువాత పరిశుద్ధుండ వగుదువు. ఇది నిశ్చయము. నామాటనమ్ముము.

శ్లో॥ ఇతితస్యవచశ్శ్రుత్వా మునేర్వీరపతిస్యచ । తథేత్యుక్త్వా పునఃప్రాహ దీనగద్గదభాషణః ॥

తా॥ ఇట్లు వీరపతినిమాట విని నిశ్శంకులుండు అట్లే చేయుదునని గద్గదస్వరముతో తిరిగి యిట్లనెను. (అను కరుణశబ్దోయం.)

శ్లో॥ ఉపకారాయహిఖలు ప్రసాదస్తుమహాత్మనాం । లుబ్ధక ప్రముఖానాంచ మహాపాతకినాంమునే । ప్రాయశ్చిత్తం ప్రకల్ప్యాద్య వద మాం కరుణానిధే । యత్త్వయోక్తమహం తేషాం తత్రగత్వానివేదయే । ఉపకారాయసాధూనా మటనంధర్మదర్శనం । ఇత్యుక్త్వాపాదయోస్తస్య నిపపాతముహుర్ముహుః ॥

తా॥ మహాత్ములప్రసాదము లోకోపకారముకొఱకగుచున్నది. నాకు ప్రాయశ్చిత్తమును చెప్పితిరి కిరాతాదులకును ప్రాయశ్చిత్తమును విధించి చెప్పుము. ఓదయానిధీ! వారియందు దయయుంచి ప్రాయశ్చిత్తమును చెప్పితివేని మీరు చెప్పినప్రకారము నేనుపోయి వారితో చెప్పుదును. మీవంటి సజ్జనుల పర్యటనము లోకోపకారముకొఱకుగదా, దయచేయుమని మాటిమాటికి వీరపతిని పాదములయందుబడెను.

శ్లో॥ తతస్తద్వచనాద్ధృష్ట స్తం జగాద దయానిధిః । యన్మయా కథితం పూర్వం ప్రాయశ్చిత్తంతవాఖిలం । తదేవతేషాం తత్సర్వం వద త్వంమావిళంబనమ్ ॥

మాఘస్నానప్రభావేన తస్యనాస్నాధవస్యచ । శుద్ధిమాప్తస్త్రియస్తేతు కృతపాపైస్తస్సాధ్యధైః ।

తా॥ తరువాత నాగందరు కేయుకేయుగా తీర్థసేవకులోయి సమస్త తీర్థములలోను స్నానముచేసి శుద్ధచిత్తులై దానిచేత ప్రయాగస్నానేచ్ఛగలిగి పన్నెండు సంవత్సరములు నియమముగా నిరంతరముగా ప్రయాగయందు మాఘస్నానమాచరించి ప్రయాగమాధవుని దర్శించి కిరాత స్వర్ణకార శూద్రులు మగ్గురు మహాపాతకముక్తులైరి

శ్లో॥ తత్పంచగతతోఽప్యాన పంచమో బ్రాహ్మణాధమః । స్నాత స్సర్వేషు తీర్థేషు ప్రిగతః సంచరన్భువమ్ । ప్రావిష్య కాశీపురీం పశ్చా ప్రయాగాం త్రైలోక్యపావనీం । మాఘే మకరగే భానౌ ప్రయాగ స్నానమాచరత్ ।

తా॥ వారి సాంగత్యమాచరించిన యీ పంచమపాతకీయగు బ్రాహ్మణాధముఁడు సమస్తతీర్థములందు స్నానమాచరించి ప్రీతస్థుఁడై భూమిని పరిభ్రమించుచు క్రమేణ త్రైలోక్యపావనియును, రమ్యమైనదియు నయిన కాశీపురిఁజేరి అచ్చట కొంతకాల ముండి తరువాత ప్రయాగఁజేరి అచ్చట మాఘస్నాన మాచరించెను.

శ్లో॥ సర్వేషామేవ తీర్థానాం యాశక్తి పాపహారిణీ । మాఘే ప్రయాగస్నానస్య సాశక్తి ర్మోక్షదాయినీ ।

తా॥ సమస్తతీర్థములకుగల పాపనాశనశక్తి యీ మాఘ ప్రయాగస్నానమునకే చెప్పఁబడినది. ఇంతేగాదు. మోక్షప్రదశక్తియు యీ ప్రయాగకు గలదు.

శ్లో॥ ప్రయాగమజ్జనం కుర్వన్ మాసమేకం నిరంతరం । భక్ష యిత్వా పచితాన్నం గోగర్భగతతండులైః । ముష్టిత్రయమితంకృత్వా తతః మాఘవ్రతం చరేత్ ।

తా॥ ఒకమాసంబునగాని, లేక రెండుమాసములుగాని ప్రయాగయందు స్నానమాచరించి పిమ్మట గోవుయొక్క గుదద్వారమునుండి విడువఁబడు తండులములను మూఁడు గుప్పెళ్ళు లెక్కపెట్టుకొని భక్షింపుచు మాఘమాసవ్రతము విధిగా చేసినవాఁడాయెను.

శ్లో॥ ఇత్యేవం చరత స్తస్య వ్రతమత్యంతదుస్తరం । వినిర్యయు ర్ద్వాదశాబ్దా స్తత పూతోఽభవద్ద్విజః । తస్య క్షీరవ్రతం పుణ్యం నైమిశా రణ్యావాసినం । సంప్రాప్యత్ధపరిక్రమ్య నమస్కృత్యగురుంముదా ।

టీ॥ ఇట్టత్యంత దుష్టచరిత్రయగు పన్నెండు సంవత్సరములు జరిపి విశృంఖలుండు పవిత్రుండై మెల్లగా సైకతాంజ్యమందున్న వీరవ్రతునియొద్దకు చేరి ప్రదక్షిణ నమస్కారముల నాచరించి సంతోషముతో నుండెను.

శ్లో॥ వీరవ్రతస్తతంస్పృష్ట్వా పాదప్రణతమాదరాత్ । పృష్టస్తత్కుశలంప్రీత్యా తంపునర్వాక్యమబ్రవీత్ ।

టీ॥ వీరవ్రతుండిట్లు దుష్టచరిత్రమును సలిపి పవిత్రుండై వచ్చి పాదములందు బడి యున్న విశృంఖలుని దయతో జూచి శిరసెత్తి క్షేమవృత్తాంతమును అడిగి సంతోషముతో నతనితో నిట్లనియె. (దయతో జూచి అతనిచేత కుశలమును అడుగబడినవాడై తిరిగి సంతోషముతో నతనితో నిట్లనియె)

ఇతి పంచవింశోధ్యాయస్సమాప్తః.

---

## — అథ షడ్వింశోధ్యాయ ప్రారంభః —

శ్రీకృష్ణ ఉవాచ॥ శ్లో॥ అథ వీరవ్రతోవిప్ర స్సంచిత్య ఘటికాద్వయం । వచఃప్రత్యబ్రవీత్ప్రీత్యా స్వపురస్థితమాత్మవిత్ ॥

టీ॥ తరువాత వీరవ్రతుండు రెండుగడియలు ఆలోచించి సంతోషముతో నిట్లనిరి.

వీరవ్రతః॥ శ్లో॥ తవాఘమఖిలంవిప్ర నిశ్శేషంవిలయం యయౌ । ప్రయాగ స్నానమాత్రేణ తత్సంసర్గమపి ద్విజ ।

టీ॥ బ్రాహ్మణుండా! నీ సమస్తపాపములు నశించినవి. ప్రయాగస్నానము చేత తత్సంసర్గపాపముగూడ నశించెను.

శ్లో॥ ప్రయాగస్నానమాత్రేణ మాఘేమకరగేరవౌ । నశ్యంత్యత్యుగ్రపాపాని సద్య స్తవ నసంశయః ।

టీ॥ మాఘంబున మకరమందు రవియుండగా చేయబడిన ప్రయాగ స్నానము చేత అతిఘోరములయిన నీపాపములు అప్పుడే నశించెను.

శ్లో॥ బ్రహ్మాత్వేవ స్తవేదాపి యాధిక్యేన విరాజతే । ఇత్తోహం

శ్లో॥ జాబాలోపనిషత్ప్రోక్త త్రిపుండ్రోద్ధూళనంకురు । రుద్ర సూక్తేనమాలాంతు ధృత్వాకురు శివార్చనమ్ ॥

తా॥ జాబాలోపనిషదుక్తప్రకారము త్రిపుండ్రధారణము చేయుము. రుద్రసూక్తముచే కంఠమందు రుద్రాక్షమాలను ధరించి శివార్చన మాచరింపుము.

శ్లో॥ తులసీమణిమాలాంతు కంఠేత్వం ధారయన్విభో । తులస్యా బిల్వపత్రైశ్చ నారాయణ హరావుభౌ । ఏకకాలం ద్వికాలంవా త్రికాలంవార్చయన్విభో ॥

తా॥ కంఠమందు తులసీపూసలను ధరించుము తులసితోను, బిల్వపత్రములతోను లక్ష్మీనారాయణుని, గౌరిసహహరుని నిత్యము ఒకపూటగాని రెండుపూటలు గాని మూడుపూటలుగాని పూజించుము.

శ్లో॥ తులసీదళసంమిశ్రం హరేఃపాదోదకంపిబ । నైవేద్యాన్నం సదాభుంక్ష్వ విష్ణోరమితతేజసః । కురుత్వం వైశ్వదేవాఖ్యం బలిమన్న విశుద్ధయే ॥

తా॥ తులసీదళములతో గూడిన హరిపాదతీర్థమును స్వీకరించుము. నిత్యము విష్ణువుయొక్క నివేదితాన్నమును భుజించుము. అన్నశుద్ధికొఱకు వైశ్వదేవమును చేయుము.

శ్లో॥ యతీశ్వరాన్ బ్రహ్మనిష్ఠాన్ సంతర్పయ గృహాగతాన్ । వృద్ధానన్యాననాథాంశ్చ రోగిణో బ్రహ్మచారిణః ॥

తా॥ ఇంటికివచ్చిన బ్రహ్మనిష్ఠులైన యతీశ్వరులను, బ్రహ్మచారులను, వృద్ధులను, అనాథులను, రోగులను, అన్యులను తృప్తినిబొందించుము.

శ్లో॥ కురుత్వ పితృశుశ్రూషా మౌపాసనపరోభవ । పంచాక్షరం మనోమంత్రం ప్రణవేనసమన్వితమ్ ॥ తథైవాష్టాక్షరంమంత్రం మంత్రాణ్యన్యాన్యథాపివా । జప త్వం ప్రయతో భూత్వా ధ్యాయన్ మంత్రాధిదేవతాః ॥

తా॥ మాతాపితృసేవను చేయుము. నిత్యము ఔపాసన మాచరించుము. ప్రణవముతో గూడిన పంచాక్షరీమంత్రమును, నారాయణాష్టాక్షరీమంత్రమును, ఇంకా అన్య మంత్రములను, మంత్రాధిదేవతలను ధ్యానించుచు జపించుము.

శ్లో॥ త్యజత్వ మరిషడ్వర్గం హరతి వ్యసనవ్రజం। కురు స్నానం మాఘమాసే మకరస్థేచ భాస్కరే। ప్రయతః ప్రతివర్షంతు దీర్ఘోభవ సుఖం ప్రియ।

తా॥ పరలోకనివాసవాంఛకులగు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్స ర్యములను అంతశ్శత్రువర్గమును విడువుము. నియతుండవై ప్రతిసంవత్సరము మాఘ స్నానమాచరింపుము. దీర్ఘాయువుగలవాడవై సుఖమును పొందుము.

శ్లో॥ మాఘస్నానరతానాంచ భక్తానాం కేశవస్యచ। సాధూనాం సమచిత్తానాం సదాసత్సంగమాచర। త్వమర్చయవిధానేన మాఘే స్నాత్వా మురాంతకమ్।

తా॥ మాఘస్నానతత్పరాయణులును, మాధవభక్తులును, సమచిత్తులును నయిన సాధువులయొక్కయు సాంగత్యమును సర్వదా ఆచరింపుము. మాఘస్నానమాచరించి మాధవుని పూజింపుము.

శ్లో॥ మాఘే మకరగేసూర్యే యస్స్నాత్వా మాధవార్చనం। పౌర్ణమ్యాం రథసప్తమ్యాం ద్వాదశ్యాంచ దినత్రయే। కరోతి త్రిదినం ప్రీత్యా సపాపైర్ముచ్యతేఘనైః।

తా॥ మాఘ మకరమందు ప్రాతస్స్నానమాచరించి రథసప్తమియందును, ద్వాదశియందును, పౌర్ణమాసియందును మూడురోజులు మాధవపూజ గావించినవాడు మహాపాతకముక్తుడగును

శ్లో॥ జన్మాంతరకృతం పాపం హరతి వ్యసనప్రదం। తత్సర్వం మాఘమాసేతు స్నానమాత్రేణ నశ్యతి॥

తా॥ అనేకజన్మలయందు ఆచరింపబడినదియు, పరలోకదుఃఖము నిచ్చునదియు నయిన పాపము మాఘస్నానముచేత నశించును.

శ్లో॥ యేషాం యజ్ఞకర్మరక్తానాం వేదమార్గానువర్తినాం। హరిభక్తిపరాణాంచ చిత్తశుద్ధిర్విశిష్యతే।

తా॥ వేదోక్తమార్గావలంబులకును, హరిభక్తిపరాయణులకును, ఏదయినగాని కర్మలాచరించువారికిని చిత్తశుద్ధి అధికముగనున్నది. అనగా యుక్తాయుక్త సమస్త

విని సంతోషించి మీరు చెప్పినప్రకారమే నడచుకొనెదనని అనేకపర్యాయములు ముని పాదములయందు బడి దుర్గుణములతోఁ గూడినవాఁడై మునివరునకు భక్తితో అనేక నమస్కారములు గావించి అనేకవిధములుగా ఆమునీశ్వరుని స్తోత్రముచేసి ఆ మునివరుని వలన ఆజ్ఞనొంది తిరిగి కలుషనాశినియయిన కాశీపురిఁ జేరెను.

శ్లో॥ గార్హస్థ్యాశ్రమమాశ్రిత్య సర్వధర్మాంత్సమాచరేత్ ।

తా॥ వెళ్ళి భాగ్యమనిశ్చయించుకొని గృహస్థాశ్రమమును అవలంబించి సమస్త శాస్త్రోక్తములయిన సకల ధర్మములను ఆచరించుచుండెను.

శ్లో॥ మాఘే మకరగే విప్ర ప్రతివర్షం ప్రయత్నతః । ప్రయాగ మజ్జనం కృత్వా పుత్రపౌత్రసమన్వితః॥ భుక్త్వాభోగాననేకాంశ్చ దేహాంతే ప్రియయా హరిం । సుజ్ఞానమభవత్స్వర్గం తేననిర్వాణమాప్నుయాత్॥

తా॥ ఆ విశృంఖలుఁ డిట్లు ప్రతిసంవత్సరమందు మాఘమాసమున మకరమందు రవి యుండఁగా ప్రయాగస్నాన మాచరించి పుత్రపౌత్రవంతుఁడై అనేకభోగముల ననుభవించి దేహాంతంబున వైకుంఠమందు హరిని జేరి అచ్యుత విజ్ఞానమును బొంది ముక్తినొందెను. అనఁగా హరిభక్తిచేత హరినిబొంది హరివలన విజ్ఞానమును బొంది తద్ద్వారా ముక్తినొందెనని అర్థము. మహాపాతక చతుష్టయములో కిరాత స్వర్ణకార శూద్రులు ముగ్గురు పాతకిముక్తిని ముఖ్యముగా సంపాదించుకొనిరి. బ్రాహ్మణుఁడు పాతకిముక్తినిజేసికొని ధర్మోపదేశమును బొంది తదనుష్ఠానమాచరించి హరిభక్తిపరాయణుఁడై అనంతభోగముల ననుభవించి అంతమందు హరిలోకముఁజేరి హరివలనవిజ్ఞానమంది మోక్ష సామ్రాజ్యదీక్షితుఁడై నిత్యానందసుఖము ననుభవించుచుండెను. పాతకముక్తిమాత్రము గోరినందున వారిముగ్గురిచరిత్ర అంతటితోనే ముగిసెను. జన్మసాఫల్యము గోరినందున బ్రాహ్మణునిగురించి వీరవ్రతుఁ డింత శ్రమపడెనుగాన బ్రాహ్మణునిచరిత్ర మింతగా వర్ణింపబడెను. కాఁబట్టి పాతకులయినవారలు కొందఱినుంచియు అట్లు కానివారయిన వారలు ప్రాయశ్చిత్తానంతరకృత్యము బొందలేని విశృంఖలుని నడవడిప్రకారము నడుచుకొని మానవులు జన్మసాఫల్య మొందుదురు గాక.

ఇతి షడ్వింశోధ్యాయస్సమాప్తః.

---

—◆ అథ సప్తవింశోధ్యాయ ప్రారంభః ◆—

గృత్సమదః॥ శ్లో॥ అథాతః సంప్రవక్ష్యామి పునర్మాఘఫలాదికం । యచ్ఛ్రుత్వా ముచ్యతే జంతుః జన్మసంసారసాగరాత్ ।

తా॥ జహ్నూ ! ఇంకా మాఘమాహాత్మ్యమును చెప్పెదను వినుము. ఈ కథను వినినవాఁడు జన్మసంసారసముద్రమును తరించును.

శ్లో॥ ద్వాపరేతుపురాకశ్చి దంగదేశపతిర్నృపః। సులక్షణోనామ రాజా సూర్యవంశసముద్భవః । ధర్మాత్మా బలవాన్ సాధుర్వైరికారిః పురంజయః । ప్రశాసద్భువనం సర్వాన్ ప్రజాపాలనతత్పరః ।

తా॥ పూర్వంబున ద్వాపరయుగమందు అంగదేశమునకు పతియైన సులక్షణుఁడను నొక సూర్యవంశపురాజు గలఁడు. అతఁడు ధర్మాత్ముఁడును, బలవంతుఁడును, సాధువును, శత్రుమర్దనుఁడును, శత్రుపురములను జయించినవాఁడును. ఈ రాజు ప్రజలను చక్కఁగా పరిపాలించుచు భూమిని యేలుచుండెను.

శ్లో॥ తస్యభార్యాశతం విప్ర బభూవ పతిదైవతం । రక్షితుర్మేదినీం సర్వాం సాద్రిద్వీపసకాననామ్ ।

తా॥ ఆరాజునకు పతివ్రతలయినవారు నూఱుమంది భార్యలుండిరి. ఆరాజు పర్వతద్వీపములనున్న సమస్తభూమిని పాలించుచుండెను.

శ్లో॥ రాజానో బహవశ్చాన్యే కరదా నమ్రకంధరాః । సేవంతే హ్యనుగచ్ఛంతి సులక్షణమహీపతిమ్ ।

తా॥ అనేకమంది యితరరాజులు అతనికి మర్యాదలనిచ్చుచు, తల వంచుకున్నవారై అతనితోగూడా తిరుగుచు సేవించుచుండిరి.

శ్లో॥ భార్యా సుతా సుతనయం నావిందద్వంశవర్ధనం । సర్వధర్మాంశ్చకారాసౌ రాజా పుత్రప్రదాన్మునే ।

తా॥ ఈ నూఱుమంది భార్యలయందును వంశకర్తయగు కుమారుని బొందక పుత్రప్రాప్తికరములయిన అనేకధర్మముల నాచరించెను.

శ్లో॥ నచైవాపి భవేత్పుత్రో రాజ్ఞస్తస్య మహాత్మనః । తతో వ్యచింతయద్దుఃఖాత్పుత్రహీనో ముహుర్ముహుః ।

తా॥ ఎన్ని ధర్మములు సలిపినను రాజునకు పుత్రసంతానము లేకపోయెను. తరువాత రాజు పుత్రహీనుడై యిట్లని చింతించెను.

శ్లో॥ ఏకోపి గుణవాన్ పుత్రో రాజ్యలక్ష్మీధురంధరః । నభవేత్కర్మణా తేన పూర్వజన్మకృతేనచ ।

తా॥ నేను పూర్వజన్మయందు పుత్రప్రాప్తికరమయిన సుకృతము నాచరించలేదు. అందువలన నాకు రాజ్యలక్ష్మీభారమును ధరించగల గుణవంతుడయిన పుత్రుడొక్కడును గలుగలేదు.

శ్లో॥ నాపుత్రస్యచ లోకోస్తి త్యేవాసంకీర్త్యతే శ్రుతిః । అపుత్రిస్య దరిద్రస్య కృతఘ్నస్య శఠస్యచ । వేదహీనస్య విప్రస్య గతిర్నాస్తి నసంశయః । ఏవం వదంతి మునయో బహుశః శాస్త్రవేదినః ।

తా॥ పుత్రహీనునకు యేలోకము లేదని వేదము వచించుచున్నది. అపుత్రికునకును, దరిద్రునకును, కృతఘ్నునకును, శఠునకును, వేదహీనుడయిన బ్రాహ్మణునకును గతి లేదని శాస్త్రవేత్తలయిన మునులు బహుగా చెప్పుచున్నారు.

శ్లో॥ తస్మాన్మేపుత్రహీనస్య సుఖంనాస్తీహవాపరే । మునీనామాశ్రమంగత్వా మునిస్సర్వార్థవిత్తమాః । తానహం పరిపృచ్ఛామి యన్మేమనసి సంస్థితమ్ ।

తా॥ కనుక పుత్రహీనుడనయిన నాకు ఇహపరములయందు సుఖము లేదు గనుక నేను మునీశ్వరుల ఆశ్రమమునకు పోయి సర్వార్థకోవిదులయిన ఆమునులను నా మనోభీష్టమును అడిగెదను.

శ్లో॥ సర్వేతే మమ వచశ్శ్రుత్వా మునయో ధర్మవర్తినః । వదంతి మాం ప్రసన్నాత్మానః పుత్రప్రాప్త్యైర్వచోమమ ।

తా॥ వారు నా మాట విని ధర్మబుద్ధితో పుత్రోత్పత్త్యుపాయమును నాకు చెప్పెదరు.

శ్లో॥ శ్రుత్వా పుత్రోపాయంనాయం తైరహం ధర్మవర్తిభిః । తత్కరిష్యే నసందేహో సంప్రీతం సుఖదాయకమ్ ।

తా॥ ధర్మవర్తులయిన మునులవలన పుత్రోత్పత్త్యుపాయమును విని సుఖదాయకమయిన పుత్రోత్పత్త్యుపాయమును యత్నమున చేయుదును. ఇందుకు సందేహము లేదు.

శ్లో॥ ఇతిసఞ్చిన్త్యమనసి రాజా రాజకులేశ్వరః । నైమిశం సుమహారణ్యం సమస్తమునిసేవితమ్ ॥ విచిత్రరథమారుహ్య గజవాజిసమాకులైః॥ తమాశ్రమపదంప్రాప్య నత్వా తాన్ సకలాన్ మునీన్ । ప్రాంజలిఃపురతః స్థిత్వా స్వవృత్తాంతంన్యవేదయత్ ।

తా॥ ఆ రాజరాజోత్తముఁడైన రాజిట్లు మనస్సులో నిశ్చయించుకొని విచిత్ర రథమునెక్కి అనుచరులతోఁగూడా సమస్త ఋషిసంసేవితమైన నైమిశారణ్యమునకు వెళ్ళి అచ్చట నుండెడు మునీశ్వరులకు నమస్కరించి ప్రాంజలియై వారియెదుట నిలువఁబడి తన వృత్తాంతమును వారికి తెలియఁజేసెను.

శ్లో॥ తేఽపి శ్రుత్వా పునః ప్రోచుర్నృపతిం పుత్రకాంక్షిణం । పూర్వజన్మకృతంపాపం ప్రవక్ష్యామో నృప త్వయా ।

తా॥ వారు విని పుత్రకాంక్షియైన రాజుతో నిట్లనిరి. రాజా! నీవు పూర్వ జన్మమందు చేసిన పాపమును చెప్పెదము వినుము.

శ్లో॥ క్షత్రియస్త్వం పురా రాజన్ రాజా సౌరాష్ట్రసంభవః । సర్వైశ్వర్యసమాయుక్తో గజవాజిరథాన్వితః॥ అథ్యోటిసత్యయా మాఘే మకరస్థే దివాకరే । రాజన్నాచరితంస్నానం సప్తమ్యాం శుక్లపక్షకే । తస్యాం తథాచ కూశ్మాండ దానం నాచరితం త్వయా । తస్మాత్తేనైవ దోషేణ నజాతోఽపి భవేత్సుతః ।

తా॥ రాజా! వినుము. పూర్వజన్మమందు నీవు క్షత్రియుఁడవు. సౌరాష్ట్ర దేశాధిపతివి. నీవు గజ తురగ రథ బలాది సంపన్నుఁడవై, సర్వైశ్వర్యసంపన్నుఁ డవైయుండియు మాఘంబున మకరమందు రవియుండఁగా రథసప్తమినాఁడు ప్రాత స్స్నానమాచరించలేదు. ఆరథసప్తమియందు కూష్మాండదానమివ్వలేదు. ఆదోషము చేత నీకు ఒక్కఁడైనను పుత్రుఁడుఁగలుగలేదు.

శ్లో॥ మాఘేతు శుక్లసప్తమ్యాం యఃకూష్మాండంద్విజాతయే। ప్రయచ్ఛతి విధానేన సపుత్రపదవీం లభేత్ ।

తా॥ మాఘ శుక్ల సప్తమినాఁడు కూష్మాండదాన మాచరించువాఁడు పుత్రసౌఖ్య మును బొందును.

శ్లో॥ యోనయచ్ఛతి సప్తమ్యాం మాఘే శుక్లస్యపక్షకే । కూష్మాండంతిలగవ్యాక్త మపుత్రస్సభవేద్ధ్రువమ్ ।

తా॥ మాఘ శుక్ల సప్తమీదినమందు తిలలు, గోసంబంధమైన నెయ్యి, పెరుగు, పాలు మొదలగునవిచేర్చి కూష్మాండమును బ్రాహ్మణునకివ్వనివాఁడు పుత్రప్రాప్తి కర్హుఁడుగాఁడు.

శ్లో॥ తస్మాదదత్తదోషేణ తానుభార్యాసుతైర్నృప । నచైకోపి భవేత్పుత్రో వృత్తస్తవ నసంశయః ।

తా॥ కాఁబట్టి కూష్మాండదాన మాచరింపని దోషముచేత నీభార్యలయందు నీకు పుత్రుఁడుగలుగలేదు. ఇందుకు సందేహములేదు.

శ్లో॥ ఇతితేషాం వచశ్శ్రుత్వా తతోరాజా సులక్షణః । పుత్రకామ స్తతస్తేషాం పాదయోస్స వృశత్పృథక్ । నత్వా స్తుత్వా నృపశ్రేష్ఠః పుత్రోత్పత్తేర్వరంమమ । దీయతామితి తచ్ఛ్రుత్వా మునయో ధర్మతత్పరాః । మాతులుంగఫలంతస్మై దదుస్తేహ్యభిమంత్రితమ్ ।

తా॥ సులక్షణరాజట్లు వారి మాట విని పుత్రకాముఁడై వారి పాదములను వేఱువేఱుగా నమస్కరించి స్తోత్రముజేసి మునిపుంగవులారా! నాకు పుత్రోత్పత్తి వరము నివ్వుమని కోరెను. ఆమాటవిని ధర్మబద్ధులైన మునీశ్వరులు మాతులుంగ ఫలమును (మాదీఫలమును) అభిమంత్రించి రాజుకిచ్చిరి.

శ్లో॥ రాజన్నేతత్ఫలం స్త్రీణాం కృత్వా భాగశతం భవాన్ । దదస్వ తద్భక్షయంతి తతః పుత్రశతం తవ । భవంతి నాత్రసందేహో నృపగచ్ఛ త్వదాశ్రమమ్ ।

తా॥ రాజా! ఈ మాదీఫలమును నూఱుభాగములుగా జేసి నీ నూఱుమంది భార్యలకిమ్ము. వారు దీనిని భుజింతురు. తరువాత నీకు నూఱుమందికుమారులు గల్గుదురు. ఇందును సందేహించుటకెంతయును లేదు. నీయింటికిపొమ్ము.

శ్లో॥ ఇత్యుక్త్వా ప్రదదుస్తస్య మునయస్తే దయాళవః । తైర్దత్తశ్చతతోరాజా మాతులుంగఫలంజవాత్ । ప్రతిగృహ్య నమస్కృత్య పునస్స్వసదనం యయౌ ।

తా॥ దయావంతులయిన మునులిట్లుపలికి రాజునకు మాతులుంగఫలము నిచ్చిరి. రాజిట్లు పలుకబడి త్వరగా ఫలమును గ్రహించి మునులకు నమస్కరించి తిరిగి తన గృహమునకు చేరెను.

శ్లో॥ మాతులుంగ ఫలం పక్వం గృహీత్వా గృహమాగతం । శ్రుత్వా నార్యస్సహాగ్రేణ దాసీభిః పార్శ్వవర్తిభిః । తాస్సర్వాః ప్రియ మాయాంత మాయయుస్త్వభిసమ్ముఖమ్ ।

తా॥ రాజు భార్యలు తమ భర్త మాతులుంగఫలమును గ్రహించి యింటికి వచ్చినాడని తమవద్దనున్న దాసీలవలన విని సంతోషముతో వచ్చుచున్న భర్త కభిముఖముగా వెళ్ళిరి.

శ్లో॥ అవాకిరన్నథ మునే ప్రసూనైర్లాజతండులైః । సదీపావలిభిః ప్రీత్వా స్వగృహద్వారిమంగళైః ।

తా॥ ఇట్లు వెళ్ళి వారు స్వగృహద్వారమందు పుష్పములను, పేలాలను, అక్షతలను భర్తమీద జల్లి దీపావళులచేత నీరాజనమిచ్చి ప్రీతితో భర్తను జూచిరి.

శ్లో॥ శాంతి కృత్యా గృహం రాజా ప్రవివేశ ఫలాన్వితః । తత్ఫలం తత్రసంస్థాప్య భోక్తుమాగా ద్గృహాంతరమ్ ।

తా॥ రాజును ఆగౌరవమునొందినవాడై ఫలసహితుడై తనగృహముచేరి మాతులుంగఫలము నచ్చటయుంచి భోజనమునకు మరియొకగృహమునకు వెళ్లెను.

శ్లో॥ తామభార్యాకనిష్ఠా సా ఫలం తజ్జగృహేత్వరాత్ । ఏషా దాస్యన్వయా త్వరా త్వరస్వపుత్రేప్సయా ధియా । తత్రైవాంతర్దశే గోప్య మాతులుంగఫలం మునే । భక్షయామాస తం ప్రీత్యా తత్సర్వం స్వయమేవహి ।

తా॥ తరువాత ఆభార్యలలో కనిష్ఠభార్య మాత్సర్యమువలన తనకే పుత్రోదయము కావలయునని కోరి త్వరగా మాతులుంగఫలమును గ్రహించి యొక రహస్య స్థలమందు తానొక్కతెయే సంతోషముచేత ఆఫలమునంతయు భక్షించెను.

శ్లో॥ భుక్త్వా గతశ్రీమోరాజా ఫలం తత్సహసాగతః । తాసాం దాతుమథోద్యుక్తః ఫలం తదవలోకయత్ ॥

తా॥ ఇంతలో రాజుభుజించి క్రమదీర్ఘ్యకోని త్వరగా వచ్చి ఫలమును భార్యల కివ్వ నుద్యోగించి ఫలమును జూచెను.

శ్లో॥ తతోదృష్ట్వాఫలంరాజా విస్మయోభయకాతరః । అంతఃపుర చరా నార్యః సర్వాః పృథగపృచ్ఛతః ।

తా॥ రాజు తెచ్చుటను ఫలమునుగానక విస్మితుండై, భయకంపితుండై అంతఃపుర సంచారులైన స్త్రీలందరిని వేరువేరుగా నడిగెను.

శ్లో॥ మాతులుంగఫలం పక్వం నైవా స్మత్ప్రీ మతప్రదం । యే గృహ్ణంతిఫలంపక్వం యేభుంజంతి తథైవచ । గృహీత్వా తానహంత్వద్య కరిష్యే దండముత్కటమ్ ।

తా॥ నాకు సంతానప్రాప్తి కారణమైన పక్వమగు మాదీఫల మిచ్చుటలేదు. ఈ ఫలము నెవ్వరు హరించిరో, యెవ్వరు భుజించిరో వారందరినిబట్టి యిప్పుడు కఠినముగా దండింతును.

శ్లో॥ శ్రుత్వేత్థం భూపతేర్వాక్యం సర్వాంతఃపుర చారిణః । నజానీమోవయమితి ప్రత్యూచుర్నరపాలకమ్ ।

తా॥ ఇట్లు రాజుగారిమాటవిని అంతఃపుర పరిచారకులందరును ఫలమునుహరించుట మాకు తెలియదు. మేము హరించలేదనిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వాదుఃఖసంతప్తో మూర్ఛామాపన్నోయథా। ప్రాప్య సంజ్ఞాం ముహూర్తాంతే ప్రత్యుత్థితమువాచత । కనిష్ఠభార్యా విప్రేంద్ర తన్మయాభక్షితంఫలమ్ ।

తా॥ ఆమాటవిని రాజు దుఃఖించి మూర్ఛాగతుండై చచ్చినవాడువలె బడెను. తరువాత కొండిఘడియలకు తెలివివచ్చి లేచెను. అంతలో కనిష్ఠభార్య మాతులుంగ ఫలమును నేను భక్షించితినని చెప్పెను.

శ్లో॥ తచ్ఛ్రుత్వా గతశోకోభూ ద్గర్భవాసిభవేత్సుతః । తతస్తాం పాలయామాస ప్రియాంప్రీత్యా దినేదినే ।

తా॥ రాజామాటను విని ఒక పుత్రుండైనను గలుగునని సంతోషించి శోకమును మాని ప్రతిదినమందు జాగరూకతతో ఆ కనిష్ఠభార్యను పుత్రాపేక్షచేత పరిపాలించు చుండెను.

శ్లో॥ జ్యేష్ఠపత్న్యాదయ స్తాంతు తస్యాం వైషమ్యదాయుతాః । దద్యాస్తాగర్భనాశార్థం తస్యైస్త్రియః మహామతే । మాత్సర్యేణ సదు ష్టస్యా ఔషధం గర్భనాశనమ్ ।

తా॥ జ్యేష్ఠభార్య మొదలయిన భార్యలందు కనిష్ఠభార్య ప్రీతవతియై ఆధిక్యమును పొందునని మాత్సర్యముచేత ఆమెయందు వైషమ్యము గల్పించుకొని ఆగర్భము నశించుటకు గర్భనాశనకరమైన ఔషధమును కనిష్ఠభార్యకిచ్చిరి.

శ్లో॥ తేనౌషధేన తద్గర్భో మునిమంత్రైః సురక్షితః । నాశనం నయయౌవిప్ర పునరన్యం వ్యచింతయన్ ।

తా॥ ఆ యౌషధముచేత ముని మంత్రరక్షితమయిన గర్భము నశించలేదు, తరువాత వారు మరియొక యౌషధమును యిచ్చిరి.

శ్లో॥ తదౌషధప్రభావేన గర్భిణీసా మహామునే । జ్ఞానహీనా భవేచ్ఛీఘ్రం సాదన్యాక్ చిత్తవిభ్రమా ।

తా॥ ఆ యౌషధ మహిమచేత ఆ గర్భిణీస్త్రీ జ్ఞానరహితయై చిత్తచలనము గలిగినదాయెను.

శ్లో॥ తాంభార్యాం గర్భిణీంతాస్తు బాహ్యప్రీత్యానుపాలయన్ ।

తా॥ గర్భిణియైన కనిష్ఠభార్యను మిగిలిన భార్యలందరు రాజాజ్ఞను పొంది అంతస్సునందు ప్రీతిలేకపోయినను బాహ్యమందు ప్రీతియున్నట్లునటించి రక్షించుచుండెను.

శ్లో॥ వచస్యేకం మనస్యేకం కర్మణ్యేకం నృపస్త్రియాః । పాలయంతిముని శ్రేష్ఠ తాస్సర్వాః పూర్ణగర్భిణీమ్ ।

తా॥ వారు మనోవాక్కర్మలయందు భిన్నభిన్నస్వరూపులతో సంచరించుచు పూర్ణగర్భిణిమర్యాదలను పాలించిరి.

శ్లో॥ భాగధేయేన సా నారీ ప్రాప్తకాలే ప్రసూరా సుతే । చిత్త విభ్రమదోషేణ మహాఘోరాటవీం యయౌ ।

తా॥ ఇట్లుండగా దైవవశముచేత ఆగర్భిణీస్త్రీ చిత్తచలనముగలిగి అంతఃపురము నుండి అకాలమందు వెలువడి మహాఘోరమైన యరణ్యము చేరెను.

శ్లో॥ ప్రసూతతనయం తత్ర తతమేవాసిద్ధవశః ।

తా॥ దైవయోగమువలన అచ్చటనే ఆస్త్రీ దశమమాసమందు కుమారునిగనెను

శ్లో॥ మహాఘోరగుహాంతస్థః శార్దూలః కాలచోదితః । మానుష్యంగంధమాఘ్రాయ బహిర్గత్వా గుహాముఖాత్ । ఆలోక్యతాసినీం నారీం తరుమూలనివాసినీం । వ్యాఘ్రిస్తాం వరిజగ్రాహ సంతుష్ట స్స్వాలయం యయౌ । తత్ర తాం భక్షయామాస వ్యాఘ్రోయం ప్రాణిహింసకః ।

తా॥ ఇట్లుండగా మహారణ్యమందొకపర్వతగుహయందున్న పెద్దపులి మనుష్య గంధమును ఆఘ్రాణించి గుహనుండి బయటకువచ్చి చెట్టుక్రింద ఒంటరిగానున్న యీ స్త్రీనిజూచి పట్టుకొని సంతుష్టిచెంది తన కావునకు తీసుకొనిపోయి అచ్చట ఆమెను భక్షించెను.

శ్లో॥ సగర్తం శిశు మాలోక్య హంసః కశ్చిన్మనోహరం । స్వజాతిభిస్సమాగత్య సపక్షాభ్యాం ఖగేశ్వరః । తత్రైవ పాలయన్నిత్యం మధు శస్యఫలాదిభిః । సంవర్ధయామాస మునే బాలమాబ్దకం ఖగః ।

తా॥ చెట్టుక్రింద మావుతో కూడియున్న శిశువును సుందరముగానున్నవానిని ఒక హంసజూచి తనజాతివారితోసహా నచ్చటికివచ్చి రెక్కలచేత ఆశిశువును ఆకలి వలన బాధనొందనీయక కాపాడుచు తేనెయు, పండినఫలములు మొదలయినవాటిచేత ఒకసంవత్సరము పెంచెను.

శ్లో॥ తత్రైకస్మిన్సర స్తీరే బాలమాదిత్యవర్చసం । సమాధాయ న్యసీదంస స్వజాతిమనువర్తినమ్ ।

తా॥ హంస యిట్లు పెంచుచు అచ్చట ఒక సరోవర (కొలను) తీరమందు సూర్యునివలె ప్రకాశించుచున్న ఆబాలుని తనజాతి పక్షులతో కలిసియుండుమని సమాధానపఱచి వుంచెను.

శ్లో॥ సరోవరోదకే స్నాతుం మునయో విపినౌకసః । సభార్యాస్సపుత్రాస్సర్వే సమాలోక్యావసంమునే ।

తా॥ ఆసరస్సులో స్నానమాచరించుటకు వనవాసులయిన మునులు భార్యా పుత్రాదులతో నచ్చటికివచ్చిరి.

శ్లో॥ క్రీడంతం బాలమాలోక్య భార్యాద్వితయసంయుతః। పుత్రహీనస్తమాదాయ సహర్షాదతిలాలయత్ । చింతయామాస కాంతారే కోసౌ కస్య కుమారకః । కిముద్దిశ్యాటవీం ప్రాప్తా మాతా తాతవివర్జితా । కేనాసౌ రక్షితో బాలః కాంతారేస్మిన్ భయంకరే । విచింత్యైవం మునిర్విప్రః పునస్సిద్ధాంతమబ్రవీత్ ।

తా॥ అందులో యిద్దఱు భార్యలకు భర్తయు, పుత్రహీనుఁడును నగుచున్న కౌశ మునీశ్వరుఁడు సరోవరతీరమందు ఆడుకొనుచున్న బాలునిఁజూచి దగ్గరకు తీసికొని అతి సంతోషముతో నిట్లు ఆలోచించెను. ఈపిల్లవాఁ డెవ్వఁడు. ఎవ్వని కుమారుఁడు. ఇతనితల్లి భర్తనువిడిచి యెందుకరణ్యమునకువచ్చెను. భయంకరమైన యీ అరణ్యమందెవఁడు వీనిని రక్షించెను. ఇట్లనేకప్రకారములుగా చింతించి తుదకు సిద్ధాంతము చేసికొని యిట్లనెను.

శ్లో॥ వనేవాపి స్థలేవాపి గర్భేచైవపరత్రవా । పాలకో భగవాన్విష్ణుస్తం వినా న సుఖం నృణామ్ ।

తా॥ వనమందుగాని, స్థలమందుగాని, గర్భమందుగాని, యితరత్రగాని యున్నవానిని పరిపాలించువాఁడు విష్ణుదేవుఁడు. ఆవిష్ణువును విడిచి మనుష్యుఁడు సుఖమును పొందజాలఁడు.

శ్లో॥ బాలకస్త్వత్రవిపినే మహాక్రూరమృగాన్వితే । క్రీడన్నివ సతేదత్ర మనాథోపి సనాథవత్ ।

తా॥ భయంకర మృగసంయుతమైన యీ యరణ్యమందు యీ బాలకుఁడు అనాథయైనప్పటికి నాథునితో గూడినవానివలె క్రీడించుచున్నాఁడు. ఏమిచిత్రము.

శ్లో॥ ఇత్యుక్త్వార్భకమాదాయ ముదా మునివరార్చితః । సరోవరోదకేస్నాత్వా సపత్నీకో మునీశ్వరః । సర్వం కృత్వ నిత్యకర్మాణి తతస్స్వాశ్రమమాయయౌ ।

తా॥ మునీశ్వరుఁ డిట్లుపలికి బాలునిఁ గ్రహించి తానును, భార్యలును సరోవరమందు స్నానమాచరించి నిత్యకర్మల నిర్వర్తించి తమయొక్క స్వాశ్రమమునకు వెళ్ళిరి.

శ్లో॥ తం పాలయన్సపత్నీకో మధుపక్వఫలాదిభిః । సక్షీరసర్పిషా విప్ర శిశుం వర్షద్వయం ముదా ।

మునిభార్య యీపనిని చేసినది. బాలుని అరణ్యములపాలు చేసి ధరణిని దుఃఖార్ణవమందు ముంచినది. శిశువునకు ఒకనాటికిని కష్టములు తప్పలేదు.

శ్లో॥ వర్షత్రయాన్వితో బాలో రాత్రౌ జనవివర్జితే । జగామ తులసీ గుల్మం మనోహర గృహోపమమ్ । శనైస్తం దైవయోగేన గత్వా తత్ర సుఖంవ్యశేత్ ।

తా॥ మూడుసంవత్సరముల వయస్సుగల బాలుఁడిట్లు నిర్జనవనమందుంచబడి అర్ధరాత్రమందు దిక్కులేక దుఃఖించి మెల్లఁగా కొంతకాలమునకు దైవయోగముచేత మనోహరగృహ సమానమైన తులసీగుల్మమును చేరి అచ్చట సుఖించెను.

శ్లో॥ తులసీ దర్శన స్పర్శాత్సంగతస్తచ్ఛిశోరపి । నకించిదాసీ ద్విప్రేంద్ర రాత్రౌవా విపినేఘనే ।

తా॥ ఆబాలునకు తులసీదర్శన స్పర్శన సాంగత్యములవలన రాత్రియందు వనమున నేమియు కీడుఁగలుగలేదు.

శ్లో॥ శిశురేవం నిశాంనీత్వా జాతే సూర్యోదయే మునే । రురోదోచ్చైర్మునిశ్రేష్ఠ బాష్పపర్యాకులేక్షణః ।

తా॥ పిల్లవాఁడిట్లు రాత్రిని వెళ్ళబుచ్చి సూర్యోదయము కాఁగానే కన్నులవెంట నీళ్ళుగార్చుచు పెద్దగా నేడ్చెను.

శ్లో॥ బాలమేకాకినం దృష్ట్వా వ్యతిపేశోకలాలసం । ఖగాశ్చైవ మృగాశ్చైవ యేచాన్యే క్రూరజంతవః । రురుదుశ్శిశునాసార్థం మనుష్యాణాం వనే సుఖమి ।

తా॥ ఇట్లొంటరిగా నేడ్చుచున్న బాలునిఁజూచి అచ్చటనుండు పక్షులును, మృగములును, అచ్చటనుండు క్రూరమృగములన్నియును పిల్లవానితోగూడా నేడ్చుచుండెను. తిర్యగ్జాతులకే యిట్లు శోకముగలిగినప్పుడు మనుష్యులకెట్లు సుఖముగలుగును. క్రూరమృగములైనను బాలునిఁజూచి దయగలిగెనుగాని వీని నరణ్యములపాలు చేసిన స్త్రీలకు దయకలుగలేదుగదా.

శ్లో॥ క్షుత్తృట్భ్యాం పీడితం చక్రుస్తే దయయాంత ఖగా మృగాః । ఫలాంబుజీవనైర్దివ్యై రక్షాంచక్రుర్మహాదరాత్ ।

తా॥ ఖగ మృగాదులిట్లు శోకించి ఫలములనిచ్చెను. ఉదకములచేతను ఆకలిదప్పి కలను దీర్చి తమ రెక్కల నీడచేత అతివ భేదమును విచారించి శిశువున కుదుపుచాలమును గావించుచుండెను.

శ్లో॥ తతో౽గతశ్రమో బాలో స్వస్థో౽భూ త్స్వమహామతే । తులసీ దర్శన స్పర్శా త్సంగత స్తచ్ఛిశో౽రపి । బుద్ధిరాసీ త్తతో విప్ర తద్విష్ణో ర్నామకీర్తనే ।

తా॥ ఆ బాలుఁడా యుపచారములచేత శ్రమలేనివాఁడై స్వస్థచిత్తుఁడాయెను. తరువాత బాలునకు తులసీదర్శన స్పర్శన సాంగత్యములవలన విష్ణునామసంకీర్తనమందు బుద్ధిగలిగెను.

శ్లో॥ కృష్ణేతి వాసుదేవేతి గోవిందే త్యచ్యుతేతిచ । నారసింహే త్యనంతేతి కీర్తయ న్తద్వనం మునే ।

తా॥ మునీశ్వరా! బాలుఁడు వనమందు కృష్ణా, వాసుదేవా, గోవిందా, అచ్యుతా, నారసింహా, అనంతా యని భగవన్నామసంకీర్తనము గావించుచుండెను.

శ్లో॥ తులసీదర్శన స్పర్శ కర్తౄణా మఘనిష్కృతిః । వినశ్యతి మహాభీతి ర్విపినేవా గృహేపివా ।

తా॥ బ్రాహ్మణా! తులసీ దర్శన స్పర్శనముల నాచరించువానికి పాపనాశన మగును. మఱియు అరణ్యమందు గాని, గృహమందు గాని భయములు లేకయుండును.

ఇతి సప్తవింశో౽ధ్యాయ స్సమాప్తః.

---

## —। అథ అష్టావింశో౽ధ్యాయ ప్రారంభః ।—

గృత్సమదః॥ శ్లో॥ అథరాజా మునే గేహే చాదృష్ట్వాగర్భిణీం ప్రియాం । మహాశోకపరిక్రాంతో విస్మృతః పౌరవృత్తిభిః । వృథో౽మాత్యైశ్చ భృత్యైశ్చ గూఢచారై ర్మహేశ్వరః । సర్వత్ర మృగయామాస విశ్రాంతో విరరామహ ।

తా॥ రాజపుత్రచారిత్రమును యింతవఱకు చెప్పి పూర్వోక్త రాజచరిత్రమును చెప్పుచున్నాఁడు. బ్రాహ్మణా! యిక్కడ కథ యిట్లుండఁగా అచ్చట రాజు గృహమందు

శ్లో॥ శ్రుత్వా తద్విస్మయం భూప ప్రమోదాత్తు కుమారకం । మూర్ధన్యాఘ్రాయ స్పృష్ట్వాత్మా ముఖేన పరిమోదితే । తనయం జనకే దత్వా సునంద స్స్వాశ్రమంయయా ।

తా॥ రాజాగారు యీ మాటలను విని ఆశ్చర్యమొంది ఆ కుమారుని తీసికొని ముద్దాడి సంతుష్టాంతరంగుఁడై సుఖాసనుండెను. సునందుఁడును బాలుని తండ్రికిచ్చి తన యాశ్రమమునకు జేరెను.

శ్లో॥ తతో వృద్ధింగతే బాలే పాలితేతు ప్రాప్తయౌవనే । గజవాజిరథోపేతం రాజ్యం నిష్కంటకం మున ॥ కుమారాయదదౌ తస్మై సులక్షణమహీపతిః। సభార్యో జరతః పశ్చా ద్వానప్రస్థాశ్రమం యయా ।

తా॥ తరువాత బాలుఁడు వృద్ధిఁబొంది ప్రాప్తయౌవనుఁడు కాఁగానే తండ్రి యైన సులక్షణమహారాజు చతుర్విధబలోపేతమై నిష్కంటకమైన రాజ్యమును కుమారునకిచ్చి తానును భార్యలును ముసలివారైనందువలన వానప్రస్థాశ్రమమును స్వీకరించిరి. (అవిద్యమానాని కంటకాని శత్రుబాధాదిరూపాణి యస్యతత్ నిష్కంటకమితి విగ్రహేణ నిష్కంటకశబ్దస్య బాధాశూన్యస్య వార్థః) నిష్కంటకమనఁగా శత్రుబాధాదులు లేనిది.

శ్లో॥ సులక్షణసుతో రాజా సుధర్మోనామ భూమిపః । సమాన కులసంపన్నాం కన్యాముద్వాహ్య సుందరీమ్ । ధర్మేణ పృథివీంశాస్త్వాం ప్రజాపాలనతత్పరః ।

తా॥ ఆ సులక్షణరాజు కుమారుఁడు సుధర్మనామకుఁడు రాజై సమానకులో త్పన్నయైన సౌందర్యవతియగు నొకకన్యను వివాహముచేసికొని ధర్మముచేత ప్రజలను పాలించుచు సమస్తభూమిని పాలించుచుండెను.

శ్లో॥ తతో బహుతిథే కాలే గతే రాజా సులక్షణః । కాలధర్మం యయౌ తత్ర ధార్మికశ్చాంగమానసః । సతోష్వపి తస్య రాజ్ఞస్తే రను మమ్రుః పతింతథా ।

తా॥ తరువాత బహుకాలమునకు సులక్షణరాజు అచ్చట కాలధర్మమొందెను (స్వర్గస్థుఁడాయెను) అతని భార్యలును సహగమనమాచరించిరి.

శ్లో॥ పుత్ర స్సుధర్మనామాసౌ సంస్కృత్య పితరంతతః । అతరోచ్చాద్ధపర్యంత కర్మాణి శ్రద్ధయాన్వితః ।

తా॥ తరువాత సుధర్మరాజు తండ్రి మృతివార్తను విని శ్రద్ధాయుక్తుఁడై శ్రాద్ధకర్మల నాచరించెను.

శ్లో॥ రాజా సభార్యో వైకుంఠం ముదా తత్ర జగ్మివాన్ ।

తా॥ తరువాత అచ్చట మృతినొందిన రాజును, అతని భార్యయును వైకుంఠ లోకమునుగూర్చి వెళ్ళినవారైరి.

శ్లో॥ రాజా సుధర్మా హర్షేణ పుత్రపౌత్రసమన్వితః । కృత్వా మాఘవ్రతం ప్రీత్యా పూజయిత్వాచ మాధవం । భుక్త్వేహ సకలాన్ భోగా న్ప్రయయావంతే హరేః పదమ్ ।

తా॥ తరువాత సుధర్మమహారాజు సంతోషముతో పుత్రపౌత్రసమేతుఁడై మాఘవ్రతమాచరించి మాధవార్చనగావించి యీలోకమం దనేకభోగముల ననుభవించి దేహాంతమందు హరిలోకముచేరి సుఖించుచుండెను.

శ్లో॥ నాస్తి కించిద్భయం విప్ర ముకుందచరణైషిణాం । మాఘవ్రతరతానాంచ సదా సత్కర్మవర్తినామ్ ।

తా॥ బ్రాహ్మణోత్తమా! ముకుందపాదారవిందమరందపానేందిందిరాయమాన మానసారవిందులకును, మాధవప్రీతికర మాఘవ్రతానుష్ఠాన పరాయణులకును, సదా సత్కర్మశీలులకును యెక్కడను భయములేదని తాత్పర్యము.

శ్లో॥ తస్మాత్సర్వాణికర్మాణి సంకోచ్యేదంవ్రతంచరేత్ ।

తా॥ కాఁబట్టి సమస్తకర్మలను కొంచెము తగ్గించి యీ మాఘవ్రతమును సమాచరించవలెను.

శ్లో॥ యఇదం శృణుతేధ్యాయం భక్త్యా కేశవప్రియః । పరత్రేహ సుఖంప్రాప్య విష్ణునా సహమోదతే ॥

తా॥ ఎవ్వఁడు కేశవభక్తుఁడై యీ అధ్యాయమును వినునో వాఁడు ఇహపర సుఖముల ననుభవించి విష్ణువుతోసహ అనుమోదించుచుండును.

ఇతి అష్టావింశోధ్యాయస్సమాప్తః.

శ్లో॥ మత్పిత్రయావా మయావాపి చానవ్యాం యువయోఃకృతం। కారణం నసముద్దిశ్య కలహం కోపదూషితమ్ ।

తా॥ నేనుగాని, నా భార్యగాని మీకేమి యపకారము చేసితిమి ? కాఁబట్టి కోపదూషితమైన యీకలహమునకు కారణము కనబడలేదు.

శ్లో॥ కోపేనోద్ధత దీర్ఘేణ ఆయుర్విత్తం యశస్సుఖం । మానం గౌరవ పాండిత్యం నశ్యత్యాశు నసంశయః ।

తా॥ దీర్ఘకోపముచేత ఆయుస్సు, ధనము, మానము, యశస్సు, సుఖము, గౌరవము, పాండిత్యము శీఘ్రముగా నశించును. సంశయము లేదు.

శ్లో॥ మతం యువాభ్యాం మాం కస్మాచ్ఛలేనైవ రుషాన్వితం । కృపాంకురుతసర్వజ్ఞా క్షమాం సజ్జనసమ్మతామ్ ।

తా॥ మీకుమారుఁడనయిన నాయందు మీకింత కోపమెందుకు. మీరు సర్వమును దెలిసినవారు. నాయందుదయయుంచుడు. సజ్జనసమ్మతమైన క్షమను సేవించుడు.

శ్లో॥ ఏవం పుత్రోదితం శ్రుత్వా సాచండీ భర్తృసంయుతా । పునఃప్రహారసంకోపాత్ చలదోష్ఠావినిందయత్ ।

తా॥ ఆచండియు భర్తృయుక్తయై యీప్రకారముగా పుత్రునిమాట విని కోపముచేత చలించుచున్న పెదవులుగలదై తిట్టుచు తిరిగి కుమారునితో నిట్లనిరి.

శ్లో॥ గచ్ఛగచ్ఛవిమూఢోసి కింకరీసాధ వేల్లఘుః। అద్యైవత్వాం సవత్నీకం పితృభ్యాం శిక్షణంవరమ్ । మిథ్యామిథ్యకృతంవాపి నదోషస్తేనమే సకృత్ । ఏవంవదంతీ చండీతం దండేనాతాడయన్ముహుః ।

తా॥ మూఢుఁడా ! వెళ్ళు వెళ్ళు. నీభార్య నీకు లఘువైనదే యగుఁగాక. తల్లిదండ్రులకు శిక్షచేయుచున్న నిన్నును, నీభార్యనున్న శిక్షించిన నాకు దోషము లేదు. మాకు శిక్షచేయుచున్న నిన్ను దండించినయెడల మిథ్యామిథ్యకృత దోషము లేదు. మాకు శిక్షచేయుచున్న నిన్ను కొట్టునప్పుడు కారణమున్నను లేకపోయినను నాకు దోషములేదు. ఇట్లుపలికి ఆచండి కఱ్ఱతో మాటిమాటికి కొట్టెను.

శ్లో॥ సతాడిత స్తతఃపుత్రో జాతరోషాత్ప్రసఃపునః । క్షణేన విదితజ్ఞానా చ్ఛింతయామాసశూద్రజః ।

తా॥ ఇట్లు మాటిమాటికి తల్లిచేత కొట్టబడినవాఁడై పుత్రుఁడు కోపావిష్టుఁ డాయెను. తరువాత క్షణములో జ్ఞానోదయమై యిట్లు చింతించెను.

శ్లో॥ యోమాతా పితరా ద్వేష్టి యేశపంతి నరాధమాః ।
తేయాంతి నరకంఘోరం పునరావృత్తివర్జితమ్ ।

తా॥ మాతాపితరులతో విరోధించువాఁడును, మాతాపితరులను తిట్టువాఁడును పునరావృత్తిరహితమైన ఘోరనరకమును బొందును.

శ్లో॥ యోమాతాః పితరా మోహాత్ అవమానకరస్సుతః। నరౌర
వం మహాఘోరం యాతినాస్త్యత్రసంశయః ॥

తా॥ ఎవ్వఁడజ్ఞానమువలన మాతాపితరులను అవమానించునో వాఁడు మహాఘోరమైన రౌరవనరకమును బొందును. ఇందుకు సందేహములేదు.

శ్లో॥ మాతా పితృసమో దేవో నచాస్త్యన్యో జగత్రయే ।
స్త్రీణాం పతిసమో దేవో నాస్తిదేవోపరస్తథా ।

తా॥ మూఁడులోకములయందు తల్లిదండ్రులతో సమానమైన దేవుఁడులేఁడు. స్త్రీలకు భర్తతో సమానుఁడయిన మఱియొక దేవుఁడులేఁడు.

శ్లో॥ నవిష్ణుసదృశో దేవః నతీర్థం గంగయాసమం। ఏవంవిచింత్య
భార్యాంచ బోధయామాససూక్తిభిః ।

తా॥ విష్ణువుతో సమానుఁడయిన దేవుఁడు దేవతలలోలేఁడు. తీర్థములలో గంగతో సమానమైన తీర్థములేదు. స్త్రీలకు పతికంటె వేఱుదేవుఁడులేఁడు. అట్లే పుత్రునకు మాతాపితరులకంటె వేఱు దేవుఁడు లేఁడు. ఇట్లు విచారించి భార్యకు సూక్తులుపదేశించెను.

శ్లో॥ చండీ సుతప్రియాం దృష్ట్వా నిష్పీడ్య కరసంపుటం । తాడ
యిత్వాన్యగేహాంతాం సంస్థాప్యాంతిస్స్నుషాం మునే । కవాటం గాఢ
మాబధ్య స్వయమాసీన్నిరాకులా ।

తా॥ తరువాత చండి కోడలిని జూచి కోపించి కరసంపుటమును నిష్పీడించి (అనఁగా కోడలి రెండుచేతులను గట్టిగా నొక్కిపట్టినదని అర్థము) తన యిష్టమువచ్చి

తా॥ ఇట్లుండగా దైవయోగమువలన కృతార్థులును, సజ్జనసమ్మతులును నయిన ధీరశాంతధీరులను యిద్దరుసాధువులు అచ్చటికి వచ్చి చంపానదియందు మాఘస్నాన మాచరించి ఆరావిచెట్టుక్రింద మాధవపూజగావించి సంతోషముతో మాఘమాహాత్మ్యమును చెప్పుకొనుచుండిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వా కోటరస్థౌ తౌ ఫణిచటుకౌతథా। హిత్వా తద్దేహతస్తూర్ణం దివ్యదేహేన చాగతౌ । భూయస్సరిజ్జలే స్నాత్వా మాఘేస్మిన్నఘనాశకే । దివంజగ్మతురాదిత్య వర్చసా పుష్పకేణతౌ। మునే మాఘప్రభావేన శ్రవణస్యఫలేనచ ।

తా॥ ఇట్లు చెప్పుకొనుచుండఁగా ఆచెట్టు తొఱ్ఱలో నున్న సర్పద్వయము కేవల శ్రవణములచేత మాఘవైభవమును విని ఆసర్పదేహమును విడిచి దివ్యదేహమును ధరించి వచ్చి తిరిగి మాఘస్నాన మాచరించి సూర్యకాంతితో సమానమైన పుష్పకవిమాన మెక్కి స్వర్గమును చేరెను. మాఘమహిమ శ్రవణముచేతను, మాఘప్రభావముచేతను యిట్లు ముక్తినిపొందిరి.

శ్లో॥ కిమత్రబహునోక్తేన నమాఘసదృశంవ్రతం । కోవాస్తి భువి నాకేవా వినావిష్ణుం జగత్త్రయే ।

తా॥ ఇంక బహుగా చెప్పనేటికి. మాఘవ్రతముతో సమానమైన వ్రతము లేదు. ఈ మాఘమహిమను భూమియందుగాని, స్వర్గమందుగాని, జగత్త్రయమందుగాని విష్ణువుగాక యెవ్వఁడును తెలిసికొనజాలఁడు.

శ్లో॥ గురుద్రోహీవా పాపోవా స్త్రీగోఘాతకినః పరే । పుత్రఘ్నోవా కృతఘ్నోవా భ్రూణహాచాతిపాతకీ । మాఘవ్రతేన విప్రేంద్ర శుచిర్భూత్వా హరింవ్రజేత్ ।

తా॥ గురుద్రోహిగాని, పాపుఁడుగాని, స్త్రీహంతకుఁడుగాని, గోఘాతుకుఁడుగాని, పుత్రహత్యాపరాయణుఁడుగాని, కృతఘ్నుఁడుగాని, భ్రూణహత్యాకారకుఁడుగాని, మాఘవ్రతము నాచరించినయెడల ముక్తపాపుఁడై వాసికెక్కును.

ఇతి ఏకోనత్రింశోధ్యాయస్సమాప్తః.

తా॥ గౌరీ! ధర్మవేత్తయయిన గృత్స్నమదమహాముని జెప్పిన యిట్టి మాఘమాహాత్మ్యమును విని జహ్నుమహర్షి మాఘమాసమందు మాఘవ్రతమును నాచరించెను.

శ్లో॥ సమోమాఘవ్రతస్యేహ ధర్మో దేవినాస్తిజగత్త్రయే । ప్రియాయాః కథితం దేవి మయాగోప్యం సుఖప్రదమ్ ॥

తా॥ గౌరీ! ముల్లోకములందును మాఘవ్రతముతో సమానమైన ధర్మము లేదు. ఇది రహస్యమైనది అయినను నీవు నాకు ముఖ్యురాలవుగనుక నీకు జెప్పితిని.

శ్లో॥ యఇదం శృణుయాద్భక్త్యా యోవాపఠతి మానవః । ససర్వసుఖంప్రాప్య పశ్చాద్విష్ణుపదం వ్రజేత్ ॥

తా॥ ఎవ్వడు యీమాఘమహిమను భక్తితో వినుచున్నాడో యెవ్వడు వారికందర పురాణమును జెప్పుచున్నాడో వారిద్దరును సర్వత్రసుఖములనుబొంది దేహాంతమందు హరిలోకము జేరుదురు.

శ్రీసూతః॥ శ్లో॥ యుష్మాకం మునిశార్దూలాః పార్వత్యై శంకరోదితం । శ్రోతౄణాం భక్తియుక్తానాం పురాకైలాసపర్వతే । తన్మయా కథితం విప్రాః మాఘమాహాత్మ్యముత్తమమ్ ॥

తా॥ శౌనకాది మహామునులారా! పూర్వంబున కైలాసపర్వతమందు పార్వతికి పరమేశ్వరుడు చెప్పినప్రకారము మాఘమాహాత్మ్యంబును భక్తియుక్తులై వినగోరినందున మీకు నేను చెప్పితిని

శ్లో॥ సర్వపుణ్యప్రదం నౄణాం సర్వైశ్వర్యప్రదాయకం । యశస్యం ధర్మమాయుష్యం సర్వరోగవినాశనమ్ । విష్ణులోకప్రదం చైవ మనుష్యాణాంచ మోక్షదం । ఇంద్రలోకప్రదం సూర్య సోమానాం స్థానదాయకమ్ ॥

తా॥ మాఘవ్రతము సర్వపుణ్యప్రదమును, సర్వైశ్వర్యప్రదాయకమును, కీర్తిప్రదమైనదియును, ధర్మయుక్తమును, ఆయుష్కరమును, రోగనాశనకరమును, విష్ణులోకదాయకమును, మనుష్యులకు మోక్షప్రదమును, ఇంద్రలోకప్రదమును, సూర్యలోకప్రాపకమును, చంద్రలోకసుఖకరమును అయియున్నది.

శ్లో॥ యుగంయుగం తేషుయుతేషామిదం తత్ఫలమాప్నోత్యసంశయః ।

తా॥ ఎవ్వఁడు ఏయేకోరికను గోరునో వాఁడు ఆయాకోరికను పొందగలఁడు.

శ్లో॥ శిష్యాయశ్రద్ధధానాయ సుశీలాయార్థవేదినే। ఉపదేశం చరేద్ధీమాన్ సర్వదానాత్రసంశయః॥

తా॥ ఈ మాఘవ్రతమును సుశీలుఁడై, అర్థవేదియై, శ్రద్ధావంతుఁడైన శిష్యునకు చెప్పవలెనుగాని శ్రద్ధావిహీనునకు చెప్పగూడదు. బుద్ధిమంతుఁడీమాటను సర్వదా జ్ఞాపకముంచుకొని తగినవాఁడు లభించునప్పుడు చెప్పవలెను. ఇది నిశ్చయము.

## పురాణానంతరం పఠనీయం.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః। గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తునిత్యం లోకాస్సమస్తాస్సుఖినోభవంతు॥

టీ॥ ప్రజాభ్యః=ప్రజలకొఱకు, స్వస్తి=శోభనమగుగాక, మహీశాః=రాజులు న్యాయ్యేన=న్యాయయుక్తమయిన, మార్గేణ=మార్గముచేత, మహీం=భూమిని, పరిపాలయంతాం=పరిపాలించుదురుగాక. నిత్యం=యెల్లప్పుడును, గోబ్రాహ్మణేభ్యః=గోవులకును. బ్రాహ్మణులకును, శుభం=క్షేమము, అస్తు=అగుఁగాక. సమస్తాః=అన్నియు, లోకాః=లోకములు, సుఖినః=సుఖముగలిగినవి, భవంతు=అగుగాక.

శ్లో॥ కాలేవర్షతుపర్జన్యః పృథివీసస్యశాలినీ। దేశోయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతునిర్భయాః॥ స్వకాలేభవితావృష్టి ర్దేశోస్తు నిరుపద్రవః। సమృద్ధాబ్రాహ్మణాస్సంతు రాజాభవతుధార్మికః॥

టీ॥ పర్జన్యః=మేఘుఁడు, కాలే=సకాలమందు, వర్షతు=వృష్టినిచేయుగాక. పృథివీ=భూమి, సస్యశాలినీ; సస్య=పైరులచేత, శాలినీ=ప్రకాశించుచుండుగాక. అయం=ఈ, దేశః=దేశము, క్షోభరహితః=కష్టములు. పీడలు శూన్యమైనది అగుఁగాక. బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, నిర్భయాః=భయములేనివారు, సంతు=అగుదురుగాక స్వకాలే=వర్షాకాలమందు, వృష్టిః=వర్షము, భవితా=అగుఁగాక. దేశః=దేశము, నిరుపద్రవః=కొల్లలు బందులయిన యుపద్రవములులేనిది, అస్తు=అగుఁగాక. బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, సమృద్ధాః=సమృద్ధిని పొందినవారు, సంతు=అగుదురుగాక. రాజా=రాజు, ధార్మికః=ధార్మికయుక్తుఁడు, భవతు=అగుఁగాక.

శ్లో॥ సర్వేచ సుఖినస్సంతు సర్వేసంతు నిరామయాః । సర్వే భద్రాణిపశ్యంతు మాకశ్చిత్పాపమాప్నుయాత్ ॥

టీ॥ సర్వేచ=అందఱును, సుఖినః=సుఖవంతులు, సంతు=అగుదురుగాక. సర్వే=అందఱు, నిరామయాః=రోగహీనులు, సంతు=అగుదురుగాక. సర్వే=అందరు, భద్రాణి=మంగళములను, పశ్యంతు=చూచుదురుగాక. కశ్చిత్=ఒకానొకఁడును, పాపం=పాపమును, మాప్నుయాత్=పొందకుండుగాక.

శ్లో॥ అపుత్రాఃపుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః । అధనాస్సధనాస్సంతు జీవంతు శరదాంశతమ్ ॥

టీ॥ అపుత్రాః=పుత్రులులేనివారు, పుత్రిణః=పుత్రవంతులు, సంతు=అగుదురుగాక. పుత్రిణః=పుత్రవంతులు, పౌత్రిణః=మనుమలుగలవారు, సంతు=అగుదురుగాక. అధనాః=ధనములేనివారు, సధనాః=ధనవంతులు, సంతు=అగుదురుగాక. శరదాంశతం=నూఱుసంవత్సరములు, జీవంతు=జీవించుదురుగాక. స్వస్తి=క్షేమము, అస్తు=అగుగాక. మంగళాని=శుభమంగళములు, సంతు=కలుగుగాక.

ఇతి త్రింశోధ్యాయస్సమాప్తః

---

## — అథ మాఘస్నానమ్ —

(మాఘమాసము మకరసంక్రమణము మొదలు కుంభసంక్రమణమువఱకును, కొందఱు మాఘశు ౧ మొదలు ౩౦ వఱకును మాఘస్నానము ప్రాముఖ్యమందురు. అరుణోదయము మొదలుకొని స్నానయోగ్యము, సూర్యోదయమైనపిమ్మట స్నానయోగ్యముకాదు)

శ్లో॥ మాఘమాసేరటంత్యాపః కించిదభ్యుదితేరవౌ । బ్రహ్మఘ్నంవా సురాపంవా కంపతంతంపునీమహే ॥

తా॥ మాఘమాసమందు సూర్యోదయమున కాచోపువచ్చుచు జలములన్నియు బ్రహ్మహత్యాదోషమును, సురాపానదోషమునగూడ పోఁగొట్టి పవిత్రునిచేయఁగలవు.

శ్లో॥ తప్తేనవారిణాస్నానం యద్గృహే క్రియతేనరైః । షడబ్దః ఫలదంతద్ధి మకరస్థేదివాకరే ॥

తా॥ మాఘమకరమందు ఉష్ణోదకముచేనయినను గృహమందు స్నానము చేసిన వారికాఱుసంవత్సరముల స్నానఫలము. వాపి మొదలగువానియందు స్నానము చేసిన పండ్రెండుసంవత్సరముల ఫలము కలుగును. తటాకమందు చేసినవానిఫలము ద్విగుణము. నదియందు చేసిన చతుర్గుణము. మహానదియందు శతగుణము. గంగయందు సహస్రగుణము. గంగా యమునా సంగమమందు శతగుణము. ఎక్కడ స్నానము చేసినను ప్రయాగస్మరణము చేయవలెను. స్నానము సంకల్పపూర్వకముగా చేయుచుండవలెను.

శ్లో॥ దుఃఖ దారిద్ర్య నాశాయ శ్రీవిష్ణోస్తోషణాయచ । ప్రాతస్స్నానంకరోమ్యద్య మాఘే పాపవినాశనమ్ ॥ మకరస్థేరవౌమాఘే గోవిందాచ్యుతమాధవ । స్నానేనానేనమేదేవ యథోక్తఫలదోభవ ॥

తా॥ అనఁగా దుఃఖములను, దారిద్ర్యమును నశించుటకై పాపనాశనమయిన మాఘప్రాతస్స్నానము శ్రీవిష్ణుప్రీతిపూర్వకముగా చేయుచున్నాను. కనుక ఓగోవింద, ఓఅచ్యుత, ఓమాధవుఁడా, నాచేయు యీస్నానమునకు యథోక్తఫలమిమ్మనుచు ఈశ్లోకములు పఠించి మౌనముతో స్నానముచేయవలెను.

ప్రత్యహం చేయు సూర్యార్ఘ్యమంత్రము.

శ్లో॥ సవితేప్రసవితేచ పరంధామజలేమమ । త్వత్తేజసా పరిభ్రష్టం పాపంయాతు సహస్రధా ॥

(పిమ్మట బ్రాహ్మణ సమారాధనము చేయవలయును మాఘస్నానము బహుపుణ్యప్రదంబు.)

(కడమ విషయములు స్నానమహాసంకల్పమను గ్రంథమందు జూడఁదగును.)




గ్రంథం సంపూర్ణమ్.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B116 |
| పుస్తకం పేరు | మాఘ పురాణే |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 299 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, D, BcI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Triveni |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |